తెలుగు

# అథర్వవేదసంహిత

## మంత్ర పద పాఠ సహితం



అనువాదం.

కళాప్రపూర్ణ విద్వాన్ విశ్వం, డి. లిట్.

## మూడవ సంపుటం

(ఆరు, ఏడు కాండలు)




ప్రచురణ :

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి.

TELUGU
ATHARVA VEDA SAMHITA
By .
Kalāprapūrna VIDWĀN VISWAM, D LITT

T T D Religious Publications Series No. 332

Copies 2,000

Price

Cover Sri BAPU



Published by .

Sri Ch Venkatapathi Raju, I A S ,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 501

Printed at :

Tirumala Tirupati Devasthanams Press,
Tirupati

# ముందుమాట

**సిహెచ్. వేంకటపతిరాజు, ఐ. ఏ. ఎస్.,**

**కార్యనిర్వహణాధికారి,**

**తిరుమల తిరుపతి దేవస్థానములు.**

భారతీయులకు వేదవాఙ్మయం పెన్నిధి వంటిది. ప్రాచీన సంస్కృతభాషలో ఉన్న ఆ వాఙ్మయాన్ని తేట తెలుగులో తెలుగు వారి కందించే తిరుమల తిరుపతి దేవస్థానాల ప్రయత్నంలో ఒక భాగమే ఈ అథర్వవేదానికి తెలుగు అనువాదం

ఇప్పటికి రెండు సంపుటాలను తెలుగు వారికి అందించ గలిగినాము. ఇది మూడవ సంపుటం. ఇందులో అథర్వవేదం లోని ఆరు, ఏడు కాండ లున్నాయి. దీనిని అనువాదం చేసిన వారు కీ శే. విద్వాన్ విశ్వం గారు. వారు ఆకస్మికంగా దివంగతులు కావడం ఆంధ్ర దేశానికి తీరని లోటు. వారు అనువాదం చేసిన నాలుగవ సంపుటం కూడ ముద్రణలో నున్నది.

ఈ సంపుటానికి సముచితమైన "ప్రస్తావన" వ్రాసిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్యుల వారికి (కో-ఆర్డనేటర్ పబ్లికేషన్స్, టి టి డి) మా అభినందనల నందిస్తున్నాము. సహృదయు లైన పాఠకులు ఈ సంపుటాన్ని కూడా వెనుకటి లాగానే స్వాగతించగలరని విశ్వసిస్తున్నాము.

తిరుపతి, సిహెచ్. వేంకటపతిరాజు, ఐ.ఏ.ఎస్.

23-4-88

# ముందుమాట

**సిహెచ్. వేంకటపతిరాజు, ఐ. ఏ. ఎస్.,**
**కార్యనిర్వహణాధికారి,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు.**

భారతీయులకు వేదవాఙ్మయం పెన్నిధి వంటిది. ప్రాచీన సంస్కృతభాషలో ఉన్న ఆ వాఙ్మయాన్ని తేట తెలుగులో తెలుగు వారి కందించే తిరుమల తిరుపతి దేవస్థానాల ప్రయత్నంలో ఒక భాగమే ఈ అథర్వవేదానికి తెలుగు అనువాదం.

ఇప్పటికి రెండు సంపుటాలను తెలుగు వారికి అందించ గలిగినాము. ఇది మూడవ సంపుటం. ఇందులో అథర్వవేదం లోని ఆరు, ఏడు కాండ లున్నాయి. దీనిని అనువాదం చేసిన వారు కీ శే. విద్వాన్ విశ్వం గారు. వారు ఆకస్మికంగా దివంగతులు కావడం ఆంధ్ర దేశానికి తీరని లోటు. వారు అనువాదం చేసిన నాలుగవ సంపుటం కూడ ముద్రణలో నున్నది.

ఈ సంపుటానికి సముచితమైన "ప్రస్తావన" వ్రాసిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్యుల వారికి (కో-ఆర్డినేటర్ పబ్లికేషన్స్, టి టి డి) మా అభినందనల నందిస్తున్నాము. సహృదయు లైన పాఠకులు ఈ సంపుటాన్ని కూడా వెనుకటి లాగానే స్వాగతించగలరని విశ్వసిస్తున్నాము.

తిరుపతి, సిహెచ్. వేంకటపతిరాజు, ఐ.ఏ.ఎస్.
23-4-88

# ప్రస్తావన

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య,
సంస్కృత విభాగాధ్యక్షులు,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

భారతీయ సంస్కృతి మహా భవనానికి వేదవాఙ్మయం పునాది వంటిది సుప్రసిద్ధ మైన నాలుగు వేదాలలో దేని ప్రత్యేకతలు దాని కున్నాయి. యజ్ఞ నిర్వహణానికి బ్రహ్మ, అధ్వర్యుడు, హోత, ఉద్గాత అని నల్గురు ఋత్విక్కులు కావాలి ఈ నల్గురిలో బ్రహ్మకు గల స్థానం అద్వితీయం హోత ఋగ్వేదంలోను, అధ్వర్యుడు యజుర్వేదంలోను, ఉద్గాత సామవేదంలోను నిష్ణాతుడై ఉంటే చాలు కాని బ్రహ్మ ఈ మూడు వేదాలలోను, అధికంగా అథర్వవేదంలోను ప్రవీణుడై ఉండాలి అంతే గాక మిగతా ముగ్గురు ఋత్విక్కులు చేసిన పొరపాట్లను అప్పటి కప్పుడు బ్రహ్మ పరిహరిస్తూ యజ్ఞానికి విఘాతం లేకుండా చూసుకోవాలి [1] కనుక బ్రహ్మ పదవిని వరించే వాడికి అర్హతలు, అనుభవం హెచ్చుగా ఉండాలని తెలుస్తున్నది. అటువంటి బ్రహ్మకు ప్రధానవేదం అథర్వవేదం.

అథర్వ శబ్దానికి మంగళకర మైందని అర్థం. అథర్వవేదానికి అథర్వఋషి మూలభూతుడు ఈ వేదాన్ని లోకానికి ఆయనే చాటిచెప్పి నట్లు ఋగ్వేదం,[2] అథర్వవేదం[3] కూడా ప్రతిపాదిస్తున్నాయి

---

1. త్రయాణా మపరాధస్తు బ్రహ్మ పరిహరే త్సదా వే. ఛా. భూ. 63

2 యజ్ఞై రథర్వా ప్రథమ పథస్తతే. ఋ. స. 1. 83. 5

3. అథర్వాణం పితరం దేవబన్ధుం
మాతు ర్గర్భం పితు రసుం యువానమ్ ।
య ఇమం యజ్ఞం మనసా చికేత
ప్ర ణో వోచ స్త మిహేహ బ్రవః ॥ అ. సం. 7. 1. 2. 1

కీ శే. విద్వాన్ విశ్వంగారు అథర్వసంహితను కొంత వఱకు తెలుగులో అనువాదం చేశారు. వారి తెలుగు అనువాదంతో ఈ సంహితను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురిస్తున్నది ఆ ప్రచురణ మాలలో ఇప్పటికి రెండు సంపుటాలు వచ్చాయి. ఈ సంపుటం మూడవది ఇందులో అథర్వవేదంలోని ఆరు, ఏడు కాండ లున్నాయి ఈ రెండు కాండల్లోని విశేషాలను సంగ్రహంగా ఇక్కడ తెలుసుకొందాం.

## ఆరవ కాండ

ఆరవ కాండలో 454 మంత్రా లున్నాయి. ఇవి 142 సూక్తాలుగా, 13 అనువాకాలుగా విభజింపబడినాయి

### దేవతలు :

ఆరవ కాండలో గల సూక్తాలకు సుమారు 76 మంది దేవత లున్నారు. వారిలో ముఖ్యులు-సవిత, చంద్రుడు, ఇంద్రుడు, సోముడు, రుద్రుడు, మిత్రావరుణులు, బృహస్పతి. వైశ్వానరుడు, ఆదిత్యులు, ఇంద్రాగ్నులు

### సుఖప్రసవం కలగాలంటే....

ఇహలోకంలో సుఖజీవనానికి కావలసిన కొన్ని మార్గాలను అథర్వవేదం సూచిస్తున్నది ఈ కాండలో రెండో అనువాకంలో 17వ సూక్తం గర్భదృంహణ సూక్తం గర్భవతి యైన స్త్రీ ఆరోగ్యంగా గర్భాన్ని ధరించి, నెలలు నిండిన తరువాత సుఖంగా ప్రసవించడానికి ఈ సూక్తంతో అభిమంత్రించిన మట్టిని ఆమెకు ఇస్తారు. అలాగే ఈ మంత్రాలతో ఇసుకను అభిమంత్రించి ఆమె పక్క పైన చల్లుతారు మూలాన్ని, అనువాదాన్ని గమనించండి_

మంత్రము

**యథేయం పృథివీ మహీ భూతానాం గర్భ మాదధే ।**
**ఏవా తే ధ్రియతాం గర్భో అను సూతుం సవితవే 6-2.17**

అనువాదం

ఏ విధంగా గొప్ప దైన ఈ పృథివి
ప్రాణుల గర్భాన్ని ధరిస్తుందో,
ఆ విధంగా ఓ నారీ!
నీ గర్భం నీ గర్భాశయంలో స్థిరంగా ఉండు గాక!
పది నెల లుండడం వల్ల కనుప్రొద్దులు దగ్గర పడి
ఆ గర్భాన్ని ప్రసవించడానికి ప్రయత్నించు గాక!

మంత్రము,

యథేయం పృథివీ మహీ దాధార విష్టితం జగత్ ।
ఏవా తే ధ్రియతాం గర్భో అను సూతుం సవితవే ॥

అనువాదం

ఈ పృథివి చరాచరాత్మక మైన ఈ జగత్తును
ఏ విధంగా ధరిస్తున్నదో, అదే విధంగా నీ గర్భాన్ని
నీవు ప్రసవించు వఱకు ధరింతువు గాక!

## పండిన పంటల నెలా రక్షించుకోవాలి ?

పచ్చగా పండిన పంటలు నోటి దాకా రాకుండా ఎలుకలు, మిడతలు, పురుగులు నాశనం చేస్తున్నాయి ఇది ఒక ఈతి బాధ దీన్ని పోగొట్టుకోవడానికి ఈ కాండలో అయిదవ అనువాకంలో 51 వ సూక్తం అశ్వినీ దేవతలను ప్రార్థించే అభయకామ సూక్తం, చూడండి_

మంత్రము

తర్ద హై పతఙ్గ హై జభ్య హా ఉపక్వస ।
బ్రహ్మేవాసంస్థితం హవి రనద న్త
ఇమాన్ యవా నహింసన్తో అపోదిత ॥ 6-5-50

**అనువాదం**

ఓ హింసక మైన ఎలుకా! ఓ శలభమా!
మీరు ఉపద్రవకారులు గనుక
మిమ్ములను చంపుటకై హవిస్సును
బ్రహ్మ వలె సజ్జితం చేస్తున్నాము.
అందువల్ల ఈ హోమం నుంచి మొదటనే దగ్ధం కాని
మా యవాదులను వినష్టం చేయక మీరు
ఈ స్థానం నుంచి అపగతులు కండి

ఇలా ఈ కాండలో విష చికిత్స, శ్లేష్మ చికిత్స, నేత్రరోగ చికిత్స, స్త్రీ విషయకేర్ష్యానివృత్తి, దుఃస్వప్న దర్శన దోషనివారణ, వాపీ కూపతటాకాదులలో జల సమృద్ధి, సంగ్రామ జయం, ధాన్య రక్షణ, రాజయక్ష్మ-కుష్ఠవ్యాధి చికిత్సలు మొదలైన వాటికి సంబంధించిన ప్రక్రియలలో ఉపయోగించే మంత్రాల అక్కడక్కడా చెప్పబడినాయి

అంతమాత్రం చేత అథర్వవేదం కేవలం లౌకిక జీవనానికే పరిమిత మైందని అనుకోవడం పొరపాటు ఆధ్యాత్మిక జీవనంతో పాటు లౌకిక జీవనం కూడా ధార్మికంగా సుఖసంతోషాలతో గడప టానికి ఇవి దోహదం చేస్తాయి గనుక వీటిని పరిగ్రహించాలి

## ఏడవ కాండ

ఏడవ కాండలో 286 మంత్రా లున్నాయి. అవి 118 సూక్తా లుగా, 10 అనువాకాలుగా విభజించి ఇవ్వబడినాయి

**దేవతలు:**

ఈ కాండలోని సూక్తాలకు సుమారు 72 మంది దేవత లున్నారు వారిలో వాయువు, బృహస్పతి, పూష, ఇంద్రుడు, చంద్రుడు, అగ్ని, విష్ణువు, ప్రజాపతి, వరుణుడు, ద్యావాపృథువులు, మరుత్తులు, రుద్రుడు, ఇంద్రావరుణులు అశ్వినులు, సూర్యుడు, సవిత, అగ్నిషో ములు మొదలైన దేవతలు ముఖ్యులు

ఈ కాండలో కూడా సుఖజీవనానికి కావలసిన ప్రక్రియ లెన్నో ప్రతిపాదింపబడినాయి

## వంధ్యాత్వం పోవాలంటే....

సంతానం లేని జీవితం మోడువారిన చెట్టు లాంటిది. సంతానం కలిగితేనే పితౄణం తీరుతుంది స్త్రీల లోని వంధ్యాత్వం వల్ల సంతానం కలగకపోతే అది నశించి సత్సంతానం కలగడానికి చేసే ప్రక్రియలో ఈ కాండలో రెండో అనువాకంలో 20 వ సూక్తం ఉపయోగిస్తారు చూడండి -

మంత్రము

**ప్రజాపతి ర్జనయతి ప్రజా ఇమా**
**ధాతా దధాతు సుమనస్యమానః ।**
**సంజానానాః సంమనసః సయోనయో**
**మయి పుష్టం పుష్టపతి ర్దధాతు ॥** 7-2-20

అనువాదం

ప్రజాపతి ఈ ప్రజలను
సంతానం వలె ఉత్పన్నం చేయు గాక !
ధాత సుమనస్కుడై పోషించు గాక !
ఈ ప్రజలు సమాన జ్ఞానులు కార్యైక పరతంత్రులు.
సంగత మనస్కులు సమాన కారణులు
పుష్టపతి నా యందు ప్రజావిషయాన్ని సమకూర్చు గాక !

## భర్త ప్రేమను పొందాలంటే....

భర్త ప్రేమకు నోచుకోని భార్య జీవితానికి అర్థమే లేదు. అలాంటి పరిస్థితిలో భర్త ఆదరణకు, ఆప్యాయతకు ఆమె పాత్రురాలు కావాలంటే ఈ కాండలో రెండో అనువాకంలో వాసుదేవతాక మైన 37 వ సూక్తాన్ని ఉపయోగిస్తారు చూడండి -

మంత్రము

**అభి త్వా మనుజాతేన దధామి మమ వాససా ।**
**యథాఽసో మమ కేవలో నాన్యాసాం కీర్తయాశ్చన॥ 7-2-37**

**అనువాదం**

స్వ పతిని గూర్చి స్త్రీ అను మాట.
ఓ నాథా ! నిన్ను మనువు నుండి నిష్పన్న మైన
నా వస్త్రంతో బంధిస్తున్నాను
అందుతో నాకు అసాధారణుడ వగుదువు గాక !
ఇతర స్త్రీల పేర్లను ఉచ్చరింపకుందువు గాక!

ఇలా ఏడవ కాండలో సర్వ సంపత్సమృద్ధికి, సర్వ రోగ నివారణకు, ఈర్ష్యా వినాశనానికి, సామ్మనస్యానికి, మార్గ స్వస్త్యయనానికి, విష హరణానికి, అభిలషిత ప్రాప్తికి, ఇంటి లోని వారి ఐకమత్యానికి, జలోదర నివారణానికి, కాసరోగ నివారణానికి చేసే అనేక ప్రక్రియలలో ఉపయోగించే మంత్రా లెన్నో ఉన్నాయి.

ఇంతకు ముందు చెప్పినట్లే ధార్మిక జీవనాన్ని గడుపుతూ లౌకిక జీవనాన్ని సుఖసంతోషాలకు ఆలవాలం చేసుకోవాలనే అభిలాషతో వీటిని ఉపయోగించుకో వచ్చునే గాని, ఇతరులకు హాని చేయడానికో, అధర్మ మార్గంలో జీవనాన్ని గడపటానికో ఉపయోగించ కూడదు

ఇప్పటికి ప్రచురింపబడిన రెండు సంపుటాలను ఆదరించినట్లే ఈ మూడో సంపుటాన్ని కూడా పాఠకులు ఆదరించి అథర్వవేదంలో గల అర్థసందర్భాలను అర్థం చేసికోవడానికి ఉపయోగించు కుంటారని ఆశిస్తున్నాను.

సత్యమ్
23-4-1988

—రఘునాథాచార్య,

# విషయసూచిక

## ఆరవకాండ

# ఏ డ వ కాం డ

## అనువాకం : 1

### సూక్తం–1

ఋషి అథర్వుడు ॥ దేవత సవిత ॥ ఛందస్సు : 1 త్రిపదాపిపీలికామధ్యాసామ్నీ జగతీ 2,3 పిపీలికా మధ్యా పురఉష్ణిక్॥ మంత్రములు : ॥ 3 ॥

వినియోగం ,- నవశాలలో పుష్టికాముడు మధు మిశ్రమైన ఘృతంలో చేసే హోమంలో, అలాగే స్వస్త్యయని కాముడు కూడా ఆజ్య సమిత్పురోడాశాది శష్కుల్యంతములైన పదమూడు ద్రవ్యాలతో చేసే హోమంలో దీనికి వినియోగం అలాగే సోమయాగంలో బహిష్పవమాన స్తోత్రసమయంలో బ్రహ్మ "దోషోగాయ" అను మంత్రమును పఠిస్తూ ఉద్గాతను చూస్తాడు.

మంత్రము

దోషో గాయ బృహద్ గాయ ద్యుమద్ధేహి ।

ఆథర్వణ స్తుహి దేవం సవితారమ్ ॥ 1 ॥

పదము

దోషో ఇతి । గాయ । బృహత్ । గాయ । ద్యుఽమత్ । ధేహి ।

ఆథర్వణ । స్తుహి । దేవమ్ । సవితారమ్ ॥ 1 ॥

**అనువాదం:**

ఓ *అథర్వణ పుత్రుడా!

రాత్రింబవళ్ళు సామములను గానం చెయ్యి.

ఆ బృహత్సామాన్ని గానం చెయ్యి

దీప్తిమంతమైన ధనాన్ని మాకు ఇవ్వు.

దానాది గుణయుక్తుడైన సవితను స్తోత్రం చెయ్యి. ॥ 1 ॥

---

* అతని పేరు దధ్యన్నామ మహర్షి.

మంత్రము

తము ష్టుహి యో అన్తః సిన్ధౌ సూనుః ।

సత్యస్య యువానమద్రోఘవాచం సుశేవమ్ ॥ 2 ॥

పదము.

తమ్ । ఓంఇతి । స్తుహి । యః । అన్తః । సిన్ధౌ । సూనుః ।

సత్యస్య । యువానమ్ । అద్రోఘఽవాచమ్ । సుఽశేవమ్ ॥ 2 ॥

**అనువాదం:**

ఓ స్తోతా! ఆ దేవుని స్తుతితో సంప్రీతుని చెయ్యి.
ఆ సవిత పరబ్రహ్మ ప్రథమ పుత్రుడు.
ఈ సవిత సముద్రమధ్యంలో కనిపిస్తాడు
ఆ నిత్య తరుణుని, అహింసక
వాక్యయుక్తుని హాయిగా స్తుతించు ॥ 2 ॥

మంత్రము.

స ఘా నో దేవః సవితా సావిషదమృతాని భూరి ।

ఉభే సుష్టుతీ సుగాతవే ॥ 3 ॥

పదము.

సః । ఘ । నః । దేవః । సవితా । సావిషత్ । అమృతాని । భూరి ।

ఉభేఇతి । సుస్తుతీ ఇతి సుఽస్తుతీ । సుఽగాతవే ॥ 3 ॥

**అనువాదం:**

ఆ దేవుడైన సవిత మాలో అమృతత్వ
సాధనము లయిన కర్మలను ప్రేరేపించుగాక!

ఉభయ విధములైన, శోభనస్తుతి సాధనము లయిన
సామములను చక్కగా గానం చెయ్యి ॥ 3 ॥

ది మొదటి సూక్తం

## సూక్తం - 2

ఋషి అథర్వుడు॥ దేవత సోముడైన వనస్పతి॥ ఛందస్సు 1-3 పరోష్ణిక్॥
మంత్రములు ॥ 3 ॥

వినియోగం - ఈ సూక్తంతో సోమయాగంలో ద్రోణకలశస్థుడైన సోముని బ్రహ్మ అనుమంత్రిస్తాడు. "ఆ యం విశన్తి' అనే మంత్రంతో రాక్షసుల పీడా పరిహారార్థం పక్షిగూటి కాష్ఠ పక్వమైన క్షీరోదనాన్ని వేసి అభిమంత్రించి తింటాడు

మంత్రము

ఇన్ద్రా౧యు సోమమృత్విజః సునోతా చ ధావత ।

స్తోతుర్యో వచః శృణవద్ధవం చ మే ॥ 1 ॥

పదము

ఇన్ద్రా౧యు । సోమమ్ । ఋత్విజః । సునోత । ఆ । చ । ధావత ।

స్తోతుః । యః । వచః । శృణవత్ । హవమ్ । చ । మే ॥ 1 ॥

అనువాదం॥

ఓ ఋత్విక్కులారా!
ఇంద్రుని కోసమై సోమరసాన్ని తీయండి.
అలాగే దానిని శోధించండి.
ఇంద్రుడు, స్తోత్రం చేస్తున్న నామాటలను,
ఆహ్వానాన్ని ఆదరంతో విసుగాక! ॥ 1 ॥

మంత్రము :

ఆ యం విశన్త్విన్దవో వయో న వృక్షమన్ధసః ।

విరప్శిన్ వి మృధో జహి రక్షస్వినీః ॥ 2 ॥

పదము :

ఆ । యమ్ । విశన్తు । ఇన్దవః । వయః । న । వృక్షమ్ । అన్ధసః ।

విఽరప్శిన్ । వి । మృధః । జహి । రక్షస్వినీః ॥ 2 ॥

**అనువాదం**

సోముడు అన్నభూతుడై ఇంద్రునిలో ప్రవేశిస్తున్నాడు.
పక్షు లేవిధంగా తమనివాసమైన
వృక్షాలను చేరుకుంటాయో ఆ విధంగా చేరుకొనుగాక!
ఓ మహాత్ముడైన ఇంద్రుడా!
సోమపానంతో గర్వితుడవై
బాధకులతో కూడిన యుద్ధం చేసే
శత్రుసేనలను బాధించు. ॥ 2 ॥

మంత్రము

సునోతా సోమపావ్నే సోమమిన్ద్రాయ వజ్రిణే ।

యువా జేతేశానః స పురుష్టుతః ॥ 3 ॥

పదము :

సునోత । సోమఽపావ్నే । సోమమ్ । ఇన్ద్రాయ । వజ్రిణే ।

యువా । జేతా । ఈశానః । సః । పురుఽస్తుతః ॥ 3 ॥

**అనువాదం :**

ఓ అధ్వర్యులారా !
సోమపానం ఉత్సుకుడైన, వజ్రహస్తుడైన ఇంద్రునకై
సోమరసాన్ని పిండి ఇవ్వండి
ఆ ఇంద్రుడు నిత్యతరుణుడు,
జయశీలుడు, సర్వజగదీశ్వరుడు
ఆ యా యజమానులు తమ తమ అభిలాషల
సిద్ధికోసం ప్రశంసిస్తున్నారు. ॥ 3 ॥

ఇది రెండవ సూక్తం

## సూక్తం - 3

ఋషి: అథర్వుడు ॥ (స్వస్త్యయనకాముడు) దేవతలు ఇంద్రుడు, పూష మొదలగు వారు ॥ ఛందస్సు: 1 పథ్యాబృహతీ, 2,3 జగతీ ॥ మంత్రములు . ॥ 3 ॥

వినియోగం,- విజయ స్వస్త్యయన కర్మలోని అజ్యహోమంలో దీని వినియోగం అట్లే స్వస్త్యయన కాముడు రాత్రి శయనకాలంలో దీనిని పఠించాలి. అట్లే లేచినప్పుడు కూడా. అట్లే "పాతం నః" అను మంత్రము మొదలుకొని ఐదు ఋక్కులతో స్వస్త్యయనకాముడు అజ్యసమిత్పురోడాశాది శష్కుల్యంతాలైన పదమూడు ద్రవ్యాలతో హోమం చెయ్యాలి.

మంత్రము :

పాతం న ఇన్ద్రాపూషణాదితిః పాన్తు మరుతః ।
అపాం న పాత్ సిన్ధవః సప్త పాతన
పాతు నో విష్ణురుత ద్యౌః ॥ 1 ॥

పదము

పాతమ్ । నః । ఇన్ద్రాపూషణా । అదితిః । పాన్తు । మరుతః ।

అపామ్ । నపాత్ । సిన్ధవః । సప్త । పాతన ।

పాతు । నః । విష్ణుః । ఉత । ద్యౌః ॥ 1 ॥

అనువాదం :

ఓ ఇంద్రాపూషణులారా !
మమ్ము రక్షించండి
అదితి మమ్ము రక్షించుగాక !
మరుత్తులు మమ్ము రక్షింతురుగాక !
ఆ పేరుగల విద్యుదగ్ని, సప్త సముద్రాలు
మమ్ము రక్షింతురుగాక !
మఱియు విష్ణువు, ద్యులోకము మమ్ము రక్షింతురు గాక ! ॥1॥

మంత్రము.

పాతాం నో ద్యావా పృథివీ అభిష్టయే
పాతుగ్రావా పాతు సోమో నో అంహసః ।
పాతు నో దేవీ సుభగా సరస్వతీ
పాత్వగ్నిః శివా యే అస్య పాయవః ॥ 2 ॥

పదము

పాతామ్ । నః । ద్యావా పృథివీ ఇతి । అభిష్టయే ।

పాతు । గ్రావా । పాతు । సోమః । నః । అంహసః ।

పాతు । నః । దేవీ । సుఽభగా । సరస్వతీ ।

పాతు । అగ్నిః । శివాః । యే । అస్య । పాయవః ॥ 2 ॥

అనువాదం

ద్యావా పృథ్వ్యులు మమ్ములను రక్షింతురు గాక!
అభిమత ధనప్రాప్తికై అభిషవ హేతువైన శిల రక్షించుగాక!
సోముడు మమ్ములను పాపంనుంచి రక్షించుగాక!
సుభగ రాలైన దేవి సరస్వతి మమ్ములను రక్షించుగాక!
అగ్ని రక్షించుగాక!
ఈ అగ్నికి చెందిన, శుభకరములైన
కిరణములు మమ్ము రక్షించుగాక! ॥ 2 ॥

మంత్రము

పాతాం నో దేవాశ్వినా శుభస్పతీ

ఉషాసానక్తోత న ఉరుష్యతామ్ ।

అపాం నపాదభిహ్రుతీ గయస్య

చిద్ దేవ త్వష్టర్వర్ధయ సర్వతాతయే ॥ 3 ॥

పదము.

పాతామ్ । నః । దేవా । అశ్వినా । శుభః । పతీఇతి ।

ఉషసానక్తా । ఉత । నః । ఉరుష్యతామ్ ।

అపామ్ । నపాత్ । అభిహ్రుతీ ఇత్యభిఽహ్రుతీ । గయస్య ।

చిత్ । దేవ । త్వష్టః । వర్ధయ । సర్వఽతాతయే ॥ 3 ॥

**అనువాదం**

ఓ దేవతలారా!
అశ్వినులు మమ్ములను రక్షింతురు గాక!
ఉషస్సు, రాత్రి (అహోరాత్ర దేవతలు)
మమ్ములను రక్షింతురుగాక!
మేఘస్థానంలోని నీటిని పడవేసే అగ్ని
రాక్షసాదుల హింసనం చేసి మమ్ములను రక్షించుగాక!
ఓ త్వష్టదేవా! సర్వఫలములకై మమ్ములను వృద్ధిచెందించు.
॥ 3 ॥

ఇది మూడవ సూక్తం

## సూక్తం—4

**ఋషి,** అథర్వుడు (స్వస్త్యయన కాముడు)॥ దేవత త్వష్ట మొదలగువారు॥ ఛందస్సు 1 పథ్యాబృహతీ; 2 సంస్తార పంక్తి 3 త్రిపదా విరాడ్ గాయత్రీ! మంత్రములు ॥ 3 ॥

వినియోగం:- ఈ సూక్తంలో దాయాదవిభాగ కర్మలో పుష్టికొఱకు సరూప వత్సగల ఆవుపాలలో పక్వాన్నంవేసి అభిమంత్రించి తినవలెను. అదే కర్మలో ఈసూక్తంతో ధనుర్జ్యాను అభిమంత్రించి బంధించవలెను అట్లే కుమారునికిగానీ కుమార్తెకుగానీ తలపై రెండు సుడులు ఏర్పడినట్లయిన దాని శాంతికొఱకై ఈ మూడు మంత్రాలతో ఆజ్యం హోమం చేయాలి

మంత్రము

త్వష్టా మే దైవ్యం వచః పర్జన్యో బ్రహ్మణస్పతిః ।
పుత్రైర్భ్రాతృభి రదితిర్ను పాతు నో
దుష్టరం త్రాయమాణం సహః ॥ 1 ॥

పదము

త్వష్టా । మే । దైవ్యమ్ । వచః । పర్జన్యః । బ్రహ్మణః । పతిః ।
పుత్రైః । భ్రాతృఽభిః । అదితిః । ను । పాతు । నః ।
దుస్తరమ్ । త్రాయమాణమ్ । సహః ॥ 1 ॥

**అనువాదం.**

త్వష్టదేవుడు నా దేవార్హములైన
స్తుతిలక్షణ వాక్యములను వినుగాక!
పర్జన్యుడు, బ్రహ్మణస్పతి
నా స్తుతివచనములను విందురుగాక!
అదితి తన పుత్రులు, భ్రాతలతోపాటు
మాకు రక్షకమైన, అన్యులు అతిక్రమింపలేని
బలాన్ని వెంటనే రక్షింతురు గాక! ॥ 1 ॥

**మంత్రము:**

అంశో భగో వరుణో మిత్రో అర్యమాదితిః పాన్తు మరుతః ।
అప తస్య ద్వేషో గమేదభిహ్రుతో యావయచ్ఛత్రు
మన్తితమ్ ॥ 2 ॥

పదము.

అంశః । భగః । వరుణః । మిత్రః । అర్యమా । అదితిః । పాన్తు ।
మరుతః ।
అప । తస్య । ద్వేషః । గమేత్ । అభిఽహ్రుతః । యావయత్ ।
శత్రుమ్ । అన్తితమ్ ॥ 2 ॥

అనువాదం :

అదితి పుత్రులైన అంశాదులు,
మరుద్గణములు మమ్ము రక్షించుగాక!
వారి అనిష్టాచరణ అపగమించుగాక!
అంతటా హింసకమైన, మా నుండి
తొలగిన ద్వేషం ఆ శత్రువునే
మా సమీపం నుంచి వేరుపఱచు గాక! ॥ 2 ॥

మంత్రము :

ధియే సమశ్వినా ప్రావతం న ఉరుష్యా ణ
ఉరుజ్మన్న ప్రయుచ్ఛన్ ।
ద్యౌష్పితర్యావయ దుచ్ఛునా యా ॥ 3 ॥

పదము

ధియే । సమ్ । అశ్వినా । ప్ర । అవతమ్ । నః । ఉరుష్య । నః ।
ఉరుఽజ్మన్ । అప్రఽయుచ్ఛన్ ।
ద్యౌః । పితః । యవయ । దుచ్ఛునా । యా ॥ 3 ॥

అనువాదం

అశ్వినులు మా బుద్ధిని సత్కర్మకై రక్షింతురుగాక!
ఓ విస్తీర్ణగమనుడవైన వాయుదేవా!
అప్రమాద్యుడవైన నీవు మమ్ములను రక్షించు
ఓ ఆకాశమా! ద్యులోకమా!
అనిష్ట కారిణి అయిన దుష్ట శకునాన్ని
మా నుంచి అపగమింపజెయ్యి. ॥ 3 ॥

ఇది నాల్గవ సూక్తం

## సూక్తం - 5

ఋషి అథర్వుడు॥ దేవత 1,3 అగ్ని 2 ఇంద్రుడు॥ ఛందస్సు 1,3 అనుష్టుప్, 2 భురిగనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం - గ్రామకాముడు ఇంద్రుని గూర్చి చేసే హోమంలో, దర్శపౌర్ణమాసంలో చేసే హోమంలో, అగ్నిచయనంలో దీనికి వినియోగం. అద్భుత మహాశాంతిలో, ఇంద్రయజనంలో, "ఇన్ద్రేమం" అనే ఋక్కునకు వినియోగం

మంత్రము.

ఉదేనముత్తరం నయాగ్నే ఘృతేనాహుత ।

సమేనం వర్చసా సృజ ప్రజయా చ బహుం కృధి ॥ 1 ॥

పదము

ఉత్ । ఏనమ్ । ఉత్ఽతరమ్ । నయ । అగ్నే । ఘృతేన । ఆఽహుత ।

సమ్ । ఏనమ్ । వర్చసా । సృజ । ప్రఽజయా । చ । బహుమ్ । కృధి ॥ 1 ॥

అనువాదం.

ఓ ఆజ్యంతో ఆహూతుడా!
అగ్నీ! ఈ యజమానుని ఉత్కృష్టస్థానానికి కొనిపొమ్ము.
అలాగే ఇతనికి తేజస్సు నిమ్ము.
పుత్ర పౌత్రాది లక్షణమైన సంతానంతో వృద్ధిపొందించు. ॥1॥

మంత్రము

ఇన్ద్రేమం ప్రతరం కృధి సజాతానామసద్ వశీ ।

రాయస్పోషేణ సం సృజ జీవాతవే జరసే నయ ॥ 2 ॥

పదము

ఇన్ద్ర। ఇమమ్। ప్రఽతరమ్। కృధి। సఽజాతానామ్। అసత్। వశీ।

రాయః। పోషేణ। సమ్। సృజ। జీవాతవే। జరసే। నయ॥2॥

**అనువాదం.**

ఓ ఇంద్రుడా! ఈ యజమానుని
బాగా వృద్ధిచెందిన వానిసిగా చెయ్యి.
సమానధర్ములలో స్వతంత్రాధిష్ఠాతగా
నీ అనుగ్రహం వల్ల అగుగాక!
ఇతనిని ధన సమూహంతో సంయోగింపజెయ్యి.
జీవనౌషధ నిమిత్తమై వృద్ధాప్యం వఱకు
ఈ యజమానుని కొనిపొమ్ము. ॥ 2 ॥

**మంత్రము :**

యస్య కృణ్మో హవిర్గృహే తమగ్నే వర్ధయా త్వమ్।

తస్మై సోమో అధి బ్రవదయం చ బ్రహ్మణస్పతిః ॥ 3 ॥

పదము

యస్య। కృణ్మః। హవిః। గృహే। తమ్। అగ్నే। వర్ధయ। త్వమ్।

తస్మై। సోమః। అధి। బ్రవత్। అయమ్। చ। బ్రహ్మణః। పతిః ॥ 3 ॥

అనువాదం

ఏ యజమానుని ఇంటిలో చరుపురోడాశాది
లక్షణమైన హవిస్సును చేస్తున్నామో,
ఓ అగ్నీ! ఆ యజమానుని సమృద్ధుని చెయ్యి.
ఆ యజమానుని కోసమై సోమదేవుడు
అనుకూల వచనం చెప్పుగాక!
ఈ బ్రహ్మణస్పతి కూడా అనుకూల వచనం చెప్పుగాక! ॥3॥

ఇది ఐదవ సూక్తం

## సూక్తం-6

ఋషి. అథర్వుడు॥ దేవత 1 బ్రహ్మణస్పతి. 2,3 సోముడు॥ ఛందస్సు·
అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం - గ్రామకాముడు ఇంద్రుని గూర్చి చేసే హోమంలో, దర్శపౌర్ణ
మాసంలో చేసే హోమంలో, అగ్నిచయనంలో దీనికి వినియోగం.

మంత్రము 1

యోఽస్మాన్ బ్రహ్మణస్పతే దేవో అభిమన్యతే ।
సర్వం తం రన్ధయాసి మే యజమానాయ సున్వతే ॥ 1 ॥

పదము

యః । అస్మాన్ । బ్రహ్మణః । పతే । అదేవః । అభిఽమన్యతే ।
సర్వమ్ । తమ్ । రన్ధయాసి । మే । యజమానాయ । సున్వతే
॥ 1 ॥

అనువాదం.

ఓ బ్రహ్మణస్పతీ! నిర్దేవుడైన ఏ శత్రువు
మమ్ములను అభిహంతవ్యులనుగా భావిస్తాడో,

ఆ శత్రువును అలాంటి సర్వులను సోమాభిషవం చేస్తున్న
నాకుగాని, నాయజమానికి గానీ వశంచెయ్యి. ॥ 1 ॥

మంత్రము

యో నః సోమ సుశంసినో దుఃశంస ఆదిదేశతి ।
వజ్రేణాస్య ముఖే జహి స సంపిష్టో అపాయతి ॥ 2 ॥

పదము

యః । నః । సోమ । సుఽశంసినః । దుఃఽశంసః । ఆఽదిదేశతి ।
వజ్రేణ । అస్య । ముఖే । జహి । సః । సమ్ఽపిష్టః । అప ।
అయతి ॥ 2 ॥

అనువాదం :

ఓ సోముడా! ఏ దుష్టాశయుడైన శత్రువు
శోభనాశంసియై మమ్ములను పరుషభాషణములతో
ధిక్కరించునో, ఆ శత్రువు ముఖంపై
వజ్రాయుధంతో తాడనం చెయ్యి.
వాడు వజ్రాఘాతంతో చూర్ణీభూతుడై అపగమించుగాక! ॥2॥

మంత్రము :

యో నః సోమాభిదాసతి సనాభి ర్యశ్చ నిష్ట్యః ।
అప తస్య బలం తిర మహీవ ద్యౌ ర్వధత్మనా ॥ 3 ॥

పదము .

యః । నః । సోమ । అభిఽదాసతి । సఽనాభిః । యః । చ ।
నిష్ట్యః ।

అప । తస్య । బలమ్ । తిర । మహీఽఇవ । ద్యౌః । వధత్మనా

॥ 3 ॥

అనువాదం

ఓ సోముడా! ఏ శత్రువు, సమానజన్ముడైన దాయాది
మమ్ములను తక్కువగా చూస్తాడో,
ఏ నికృష్ట శత్రువు మమ్ములను బాధిస్తాడో,
అతని బలాన్ని తొలగించు.
విశాలమైన ద్యులోకం వర్ధమానమై
అశనిపాతాదులతో ఎలా జనవధకు పాత్ర మౌతుందో,
ఆ విధంగా వజ్రంతో వాని బలాన్ని నీవు తిరస్కృతం చెయ్యి.

॥ 3 ॥

ఇది అరవ సూక్తం

## సూక్తం — 7

ఋషి. అథర్వుడు ॥ దేవత 1,2 సోముడు 3 విశ్వేదేవులు ॥ ఛందస్సు 1 నిచృద్గాయత్రీ. 2,3 గాయత్రీ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం.— యాగవిఘ్నశమనార్థమై దూడగల ఆవుపాలను పక్వంచేసి అభిమంత్రించి తినవలెను అలాగే అయాజ్య యాజనదోష శమనార్థం యాగసమాప్తి తరువాత చరువుతో సోముని యజ్ఞం చేయాలి.

మంత్రము:

యేన సోమాదితిః పథా మిత్రా వా యన్త్యద్రుహః ।
తేనా నోఽవసా గహి ॥ 1 ॥

పదము

యేన । సోమ । అదితిః । పథా । మిత్రాః । వా । యన్తి ।
అద్రుహః ।

తేన । నః । అవసా । ఆ । గహి ॥ 1 ॥

అనువాదం.

ఓ సోముడా! అదితి ఆమె పుత్రులు
అనుగ్రహశీలురై, లోకానుగ్రహార్థం
ఏ మార్గంతో తిరుగుతున్నారో ఆ మార్గంతో
మమ్ములను రక్షణతో ఆగమించు ॥ 1 ॥

మంత్రము

యేన సోమ సాహన్త్యాసురాన్ రన్ధయాసి నః ।

తేనా నో అధి వోచత ॥ 2 ॥

పదము.

యేన । సోమ । సాహన్త్య । అసురాన్ । రన్ధయాసి । నః ।

తేన । నః । అధి । వోచత ॥ 2 ॥

అనువాదం

ఓ సోముడా! సాహన్త్య! (అభిభవితా!)
ఏ బలంతో మా కోసమై అసురులను వశీకరిస్తున్నావో,
ఆ బలంతో మాకై ప్రశంసావాక్యములను పలుకు ॥ 2 ॥

మంత్రము.

యేన దేవా అసురాణా మోజాం స్యవృణీధ్వమ్ ।

తేనా నః శర్మ యచ్ఛత ॥ 3 ॥

పదము.

యేన । దేవాః । అసురాణామ్ । ఓజాంసి । అవృణీధ్వమ్ ।

తేన । నః । శర్మ । యచ్ఛత ॥ 3 ॥

**అనువాదం**

ఓ దేవతలారా! ఏ ఆత్మీయబలంతో
అసురుల ఓజస్సులను వేరుం స్తున్నారో,
ఆ బలంతో మాకు సుఖాన్ని ఇత్తురుగాక! ॥ 3 ॥

ఇది ఏడవ సూక్తం

## సూక్తం - 8

**ఋషి. జమదగ్ని॥ దేవత కామాత్మ॥ ఛందస్సు. 1-3 పథ్యాపంక్తి॥ మంత్రములు.** ॥ 3 ॥

**వినియోగం - స్త్రీ వశీకరణ కర్మలో దీనికి వినియోగం.**

**మంత్రము,**

యథా వృక్షం లిబుజా సమన్తం పరిషస్వజే ।
ఏవా పరి ష్వజస్వ మాం యథా మాం
కామిన్యసో యథా మన్నాపగా అసః ॥ 1 ॥

**పదము**

యథా । వృక్షమ్ । లిబుజా । సమన్తమ్ । పరిఽసస్వజే ।
ఏవ । పరి । స్వజస్వ । మామ్ । యథా । మామ్ ।
కామినీ । అసః । యథా । మత్ । న । అపఽగాః । అసః ॥ 1 ॥

**అనువాదం॥**

తాంబూలాది లత తానాశ్రయించిన వృక్షాన్ని
సర్వత్ర ఏ విధంగా ఆలింగనం చేసుకుంటుందో,



ఓ భార్యా!! అలాగే నీవు నన్ను ఆశ్లేషించు.
ఏ విధంగా నన్ను కామించు దానివవుతావో,
ఏ విధంగా నా నుంచి వెడలి పోవో,
ఆ విధంగా ఈ ప్రయోగంతో నిన్ను
వశీకరింప జేసుకుంటున్నాను ॥ 1 ॥

మంత్రము.

యథా సుపర్ణః ప్రపతన్ పక్షౌ నిహన్తి భూమ్యామ్ ।
ఏవా ని హన్మి తే మనో యథా మాం
కామిన్యసో యథా మన్నాపగా అసః ॥ 2 ॥

పదము.

యథా । సుఽపర్ణః । ప్రఽపతన్ । పక్షౌ । నిఽహన్తి । భూమ్యామ్
ఏవ । ని । హన్మి । తే । మనః । యథా । మామ్ । కామినీ ।
అసః । యథా ।
మత్ । న । అపఽగాః । అసః ॥ 2 ॥

అనువాదం

ఏ విధంగా గరుత్మంతుడు తన స్థానం నుంచి పైకి లేస్తూ
భూమిపై తన రెక్కలను గట్టిగా తాడనం చేస్తాడో,
ఓ నారీ! అలాగే నీ మనస్సును పూర్తిగా
నా వశం చేసుకుంటున్నాను
ఏ విధంగా నన్ను కామించుదాని వవుతావో,
ఏ విధంగా నా నుంచి వెడలిపోవో,
ఆ విధంగా ఈ ప్రయోగంతో నిన్ను
వశీకరింప జేసుకుంటున్నాను. ॥ 2 ॥

మంత్రము

యథేమే ద్యావాపృథివీ సద్యః పర్యేతి సూర్యః ।

ఏవా పర్యేమి తే మనో యథా మాం

కామిన్యసో యథా మన్నాపగా అసః ॥ 3 ॥

పదము

యథా । ఇమేఇతి । ద్యావాపృథివీఇతి । సద్యః । పరిఽఏతి ।
సూర్యః ।

ఏవ । పరి । ఏమి । తే । మనః । యథా । మామ్ । కామినీ । అసః

యథా । మత్ । న । అపఽగాః । అసః ॥ 3 ॥

అనువాదం.

ఏ విధంగా ద్యావా పృథువులను
సూర్యుడు శీఘ్రంగా తిరిగి వస్తున్నాడో,
అలాగే ఓ స్త్రీ! నీ మనస్సును నేను
పరిపూర్తిగా ఆక్రమిస్తున్నాను.
ఏ విధంగా నన్ను కామించు దాని వవుతావో,
ఏ విధంగా నానుంచి వెడలి పోవో,
ఆ విధంగా ఈ ప్రయోగంతో నిన్ను
వశీకరింప జేసుకుంటున్నాను. ॥ 3 ॥

ఇది ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 9

ఋషి. జమదగ్ని ॥ దేవత ః కామాత్మ ॥ ఛందస్సు. అనుష్టప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం :- స్త్రీ వశీకరణ కర్మలో దీనికి వినియోగం

మంత్రము

వాఞ్ఛ మే తన్వం1 పాదౌ వాఞ్ఛాక్ష్యౌ3 వాఞ్ఛ సక్థ్యౌ2 ।
అక్ష్యౌ2వృషణ్యన్త్యాః కేశా మాం తే కామేన శుష్యన్తు ॥ 1 ॥

పదము.

వాఞ్ఛ । మే । తన్వ2మ్ । పాదౌ । వాఞ్ఛ । అక్ష్యౌ2 । వాఞ్ఛ । సక్థ్యౌ2 ।
అక్ష్యౌ2 । వృషణ్యన్త్యాః । కేశాః । మామ్ । తే । కామేన । శుష్యన్తు ॥ 1 ॥

అనువాదం.

ఓ కామినీ! నా శరీరాన్ని కామించు
నా పాదాలను కామించు
నా కళ్ళను, తొడలను కామించు
సమర్థుడైన యువకుని కోసం చూస్తున్న
నీ కనులు, కేశములు నన్ను
చిత్తవికారంతో శోషింప జేస్తున్నవి. ॥ 1 ॥

మంత్రము.

మమ త్వా దోషణిశ్రిషం కృణోమి హృదయశ్రిషమ్ ।
యథా మమ క్రతావసో మమ చిత్తముపాయసి ॥ 2 ॥

పదము

మమ । త్వా । దోషణి2శ్రిషమ్ । కృణోమి । హృదయ2శ్రిషమ్ ।

యథా । మమ । క్రతౌ । అసః । మమ । చిత్తమ్ । ఉపఆయసి
॥ 2 ॥

అనువాదం:

ఓ కామినీ! నన్ను నా బాహువులయందు
ఆసక్తి కలదానిగా, హృదయాసక్తను గా చేస్తున్నాను
ఏ విధంగా నా సంకల్పంలో ఉన్నావో
ఆ విధంగా నా మనసులో ప్రవేశిస్తున్నావు. ॥ 2 ॥

మంత్రము

యాసాం నాభి రారేహణం హృది సంవననం కృతమ్ ।

గావో ఘృతస్య మాతరోమూం సం వానయన్తు మే ॥ 3 ॥

పదము

యాసామ్ । నాభిః । ఆఽరేహణమ్ । హృది । సమ్ఽవననమ్ ।
కృతమ్ ।

గావః । ఘృతస్య । మాతరః । అమూమ్ । సమ్ । వనయన్తు । మే
॥ 3 ॥

అనువాదం.

ఏ స్త్రీల నాభి ఉపలక్షితమైన అంగం
ఆస్వాదనీయమౌతుందో,
ఎవరి హృదయం సంభజన యుక్తం వశీకృతమౌతుందో,
ఆ స్త్రీని ఘృతోపలక్షితమైన స్నేహాదన్యాలకి
మాతృతులైన ఆవులు నాకు వశీకరించునుగాక! ॥ 3 ॥

పదిలొమ్మిదవ సూక్తం

# సూక్తం - 10

ఋషి: శన్తాతి॥ దేవత : 1 అగ్ని. 2 వాయువు 3 సూర్యుడు॥ ఛందస్సు -
1 సామ్నీత్రిష్టుప్, 2 ప్రాజాపత్యాబృహతీ, 2 సామ్నీబృహతీ॥
మంత్రములు. ॥ 3 ॥

వినియోగం :- సర్వ సంపత్కర్మలలో చేసే ఆజ్యహోమంలో దీనికి వినియోగం.

మంత్రము :

పృథివ్యై శ్రోత్రాయ వనస్పతిభ్యోఽగ్నయేఽధిపతయే స్వాహా
॥ 1 ॥

పదము :

పృథివ్యై । శ్రోత్రాయ । వనస్పతిఽభ్యః । అగ్నయే । అధి
ఽపతయే । స్వాహా ॥ 1 ॥

అనువాదం

పృథివికి, శ్రోత్రమునకు, వనస్పతులకు,
ఏ అగ్ని అధిపతో, ఆయనకు
ఈ హవిస్సు స్వాహుతమగు గాక! ॥ 1 ॥

మంత్రము

ప్రాణాయాన్తరిక్షాయ వయోభ్యో వాయవేఽధిపతయే స్వాహా
॥ 2 ॥

పదము

ప్రాణాయ । అన్తరిక్షాయ । వయఃఽభ్యః । వాయవే । అధిఽ
పతయే । స్వాహా ॥ 2 ॥

అనువాదం.

ప్రాణమునకు, తత్సంబంధమైన అంతరిక్షమునకు,
అక్కడ తిరుగు తున్న పక్షులకు,
అంతరిక్షాధిపతి అయిన వాయువునకు
ఈ హవిస్సు స్వాహుతమగుగాక! ॥ 2 ॥

మంత్రము

దివే చక్షుషే నక్షత్రేభ్యః సూర్యాయాఽధిపతయే స్వాహా ॥3॥

పదము

దివే। చక్షుషే। నక్షత్రేభ్యః। సూర్యాయ। అధిఽపతయే। స్వాహా ॥ 3 ॥

అనువాదం.

ద్యులోకమునకు, నేత్రమునకు, నక్షత్రములకు,
దివోధిపతి అయిన సూర్యునకు
ఈ హవిస్సు స్వాహుతమగుగాక! ॥ 3 ॥

ఇది పదవ సూక్తం

ఇది మొదటి అనువాకం

## అనువాకం: 2

### సూక్తం-11

ఋషి ప్రజాపతి॥ దేవత: 1,2 రేతస్సు 3 మంత్రములలో పేర్కొన్నవారు॥
ఛందస్సు అనుష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం - పుంసవన కర్మలో దీనికి వినియోగం.

మంత్రము

శమీ మశ్వత్థ ఆరూఢ స్తత్ర పుంసువనం కృతమ్।

తద్ వై పుత్రస్య వేదనం తత్ స్త్రీష్వా భరామసి ॥ 1 ॥

పదము

శమీమ్ । అశ్వత్థః । ఆఽరూఢః । తత్ర । పుమ్ఽసువనమ్ ।
కృతమ్ ।

తత్ । వై । పుత్రస్య । వేదనమ్ । తత్ । స్త్రీషు । ఆ । భరామసి
॥ 1 ॥

అనువాదం

శమీవృక్షాన్ని ( జమ్మిచెట్టును )
*అశ్వత్థం ( రావిచెట్టు ) అధిరోహించినది.
అలాంటి అశ్వత్థంలో పుంసవనం అనుష్ఠితమైనది.
అదే పుత్రవేదనము.
ఆ కర్మ స్త్రీలలో సముపార్జిస్తున్నాము ॥ 1 ॥

మంత్రము

పుంసి వై రేతో భవతి తత్ స్త్రియామను షిచ్యతే ।
తద్ వై పుత్రస్య వేదనం తత్ ప్రజాపతి రబ్రవీత్ ॥ 2 ॥

పదము

పుంసి । వై । రేతః । భవతి । తత్ । స్త్రియామ్ । అను । సిచ్యతే ।
తత్ । వై । పుత్రస్య । వేదనమ్ । తత్ । ప్రజాఽపతిః । అబ్రవీత్
॥ 2 ॥

---

* అగ్ని అశ్వరూపంలో పూర్వం ఏ వృక్షంలో ఒకసంవత్సరం ఉండెనో అది అశ్వత్థము

అనువాదం :

పురుషునిలో మొదట బీజభూతమై రేతస్సు ఉంటుంది
అది గర్భాధానకర్మలో స్త్రీ గర్భాశయంలో ప్రక్షిప్తమౌతుంది.
అది పుత్రుని వేదనకు కారణం.
ఈ పుంసవన కర్మను ప్రజాపతి ప్రకటించినాడు ॥ 2 ॥

మంత్రము

ప్రజాపతి రనుమతిః సినీవాల్యఽచీక్లృపత్ ।
స్త్రైషూయ మన్యత్ర దధ త్పుమాంసము దధ దిహ ॥ 3 ॥

పదము :

ప్రజాఽపతిః । అనుఽమతిః । సినీవాలీ । అచీక్లృపత్ ।
స్త్రైసూయమ్ । అన్యత్ర । దధత్ । పుమాంసమ్ । ఓం ఇతి ।
దధత్ । ఇహ ॥ 3 ॥

అనువాదం

ప్రజాపతి, పౌర్ణమాసీ దేవత అయిన అనుమతి,
అమావాస్య దేవత సినీవాలి గర్భాశయంలో ఉంచిన
రేతస్సును హస్తపాదాద్యవయవ కల్పనతో
పరిపుష్టం చేస్తారు స్త్రీ ప్రసవం కోసం ఇందుకు
వ్యతిరేకమైన స్థానంలో స్థాపిస్తూ,
ఇక్కడ మగబిడ్డనే రూపొందిస్తారు.

ఇది పదకొండవ సూక్తం

## సూక్తం - 12

ఋషి గరుత్మంతుడు ॥ దేవత విషనివారణం ॥ ఛందస్సు అనుష్టుప్ ॥
మంత్రములు ॥ 3 ॥

వినియోగం సర్వ విషచికిత్సలో దీనికి వినియోగం.

మంత్రము

పరి ద్యామివ సూర్యోఽహీనాం జని మాగమమ్ ।

రాత్రీ జగదివాన్యద్ధంసా త్తేనా తే వారయే విషమ్ ॥ 1 ॥

పదము

పరి । ద్యామ్ఽఇవ । సూర్యః । అహీనామ్ । జనిమ । అగమమ్ ।

రాత్రీ । జగత్ఽఇవ । అన్యత్ । హంసాత్ । తేన । తే । వారయే ।
విషమ్ ॥ 1 ॥

అనువాదం.

సూర్యుడు అంతరిక్షాన్ని వలె
సర్పకులాన్ని నేను పరిప్రాప్తి చెందితిని
రాత్రి చీకటితో సర్వజగత్తును వ్యాపించినట్లు
ఆత్మనుంచి వేరైన శరీరాన్నింటిని వ్యాపిస్తున్న
ఆ విషాన్ని ఓ విషగ్రస్తుడా!
ఆ ప్రసిద్ధవైద్యంతో నేను నివారిస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము.

యద్ బ్రహ్మభి ర్యదృషిభి ర్యద్ దేవై ర్విదితం పురా ।

యద్ భూతం భవ్య మాసన్వత్ తేనా తే వారయే విషమ్ ॥2॥

పదము

యత్ । బ్రహ్మఽభిః । యత్ । ఋషిఽభిః । యత్ । దేవైః ।
విదితమ్ । పురా ।

యత్ । భూతమ్ । భవ్యమ్ । అసన్ఽవత్ । తేన । తే । వారయే।
విషమ్ ॥ 2 ॥

అనువాదం

ఏ చికిత్స మంత్రములతో సాధ్యమో,
ఏది ఋషులచే పరిజ్ఞాతమో,
ఏది పురాతనకాలంలో ఇంద్రాదులకు విదితమైనదో,
భూతకాలావచ్ఛిన్నము, భవిష్యత్కాలావచ్ఛిన్నము
అయి ఏదైతే ఉన్నదో, ఈ చికిత్స అంతటితోనూ
నీ శరీరంలోని విషాన్ని నివారిస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము :

మధ్వా పృశ్చే నద్యః పర్వతా గిరయో మధు ।
మధు పరుష్ణీ శీపాలా శమాస్నే అస్తు శం హృదే ॥ 3 ॥

పదము

మధ్వా । పృశ్చే । నద్యఽః । పర్వతాః । గిరయః । మధు ।
మధు । పరుష్ణీ । శీపాలా । శమ్ । ఆస్నే । అస్తు । శమ్ । హృదే
॥ 3 ॥

అనువాదం :

విషహారమైన అమృతాన్ని నీ శరీరమంతటా సంపృక్తం
చేస్తున్నాను నదులు, పర్వతాలు, గిరులు విషహారమైన
మధువును మీ శరీరంపై ఆసేచనం చేయుదురు గాక!
శైవాలయుక్తమైన పరుష్ణినది మధువును
ఆసేచనం చేయుగాక!

ఈ విషహారమైన మధువు తి॰ టకు సుఖకరిగునుగాక
హృదయమునకు సుఖమిచ్చు గాక! ॥ 3 ॥

ఇది పన్నెండవ సూక్తం

## సూక్తం - 13

**ఋషి - అథర్వుడు (స్వస్త్యయన కాముడు) దేవత - మృత్యువు॥ ఛందస్సు — అనుష్టుప్॥ మంత్రములు 3॥**

వినియోగం జయకాముడు ఈ మూడు మంత్రాలతో తన సేనచుట్టూ ఉపస్థానం చెయ్యాలి. అలాగే వైశ్యుని సంగ్రామజయార్థమై ప్రహరణోద్యుక్తులైన శత్రువులను చూచి దీనిని జపించాలి. అలాగే ఆజ్యహోమం సక్తుహోమం మొదలగు వానితో అభిమంత్రించి ధనుఃప్రదానం చెయ్యాలి సర్ప, వృశ్చికాది భయనివృత్తికాముడు చేసే ప్రక్రియలోను, ఆజ్యహోమంలోను దీనికి వినియోగం. అద్భుతదర్శనంలో వాని శాంత్యర్థమై దీనితో ఆజ్యహోమం చెయ్యాలి అలాగే యజ్ఞంలో పశాపురోడాశాది హవిస్సులు కాకోలూకాదులతో మైలపడినప్పుడు ఆ ప్రాయిశ్చిత్తార్థం దీనితో ఆజ్యహోమం చెయ్యాలి

మంత్రము

**నమో దేవవధేభ్యో నమో రాజవధేభ్యః ।**

**అథో యే విశ్యానాం వధాస్తేభ్యో మృత్యో నమోఽస్తుతే ॥1॥**

పదము

**నమః । దేవఽవధేభ్యః । నమః । రాజఽవధేభ్యః ।**

**అథో ఇతి । యే । విశ్యానామ్ । వధాః । తేభ్యః । మృత్యో ఇతి ।**

**నమః । అస్తు । తే ॥ 1 ॥**

**అనువాదం :**

దేవతల మారణాయుధాలకు నమస్కారం.
రాజు ఆయుధాలకు నమస్కారం.
మరిన్ని వైశ్యజాతీయుల ఆయుధాలను నమస్కారం.
ఓ మృత్యూ! నీకు కూడా నమస్కారం ॥ 1 ॥

**మంత్రము**

నమస్తే అధివాకాయ పరావాకాయ తే నమః ।
సుమత్యై మృత్యో తే నమో దుర్మత్యై త ఇదం నమః ॥2॥

**పదము.**

నమః । తే । అధిఽవాకాయ । పరాఽవాకాయ । తే । నమః ।
సుఽమత్యై । మృత్యో ఇతి । తే । నమః । దుఃఽమత్యై । తే ।
ఇదమ్ । నమః ॥ 2 ॥

**అనువాదం:**

ఓ మృత్యూ! నీకు సంబంధించిన
శోభనవచనం పలికే దూతకు నమస్కారం.
అలాగే నీ పరాభవ వచనాలను పలికే వానికి నమస్కారం.
ఓ మృత్యూ! నీ ప్రేరణం కోసం నీ సుమతికి నమస్కారం.
అలాగే నీకు సంబంధించిన
నిగ్రహబుద్ధులకు ఇదే నమస్కారం. ॥ 2 ॥

**మంత్రము.**

నమస్తే యాతుధానేభ్యో నమస్తే భేషజేభ్యః ।
నమస్తే మృత్యో మూలేభ్యో బ్రాహ్మణేభ్య ఇదం నమః॥3॥

పదము

నమః । తే । యాతుఽధానేభ్యః । నమః । తే । భేషజేభ్యః ।

నమః । తే । మృత్యో ఇతి । మూలేభ్యః । బ్రాహ్మణేభ్యః । ఇదమ్।

నమః ॥ 3 ॥

అనువాదం :

ఓ మృత్యూ! నీకు సంబంధించిన
యాతుధానులకు నమస్కారం.
నీకు సంబంధించిన రక్షాకరులకు నమస్కారం.
ఓ మృత్యూ! నీకు సంబంధించిన
మూలబలభూతులైన పురుషులకు నమస్కారం.
అలాగే బ్రాహ్మణులకు ఇదే నమస్కారం. ॥ 3 ॥

ఇది పదమూడవ సూక్తం

## సూక్తం-14

ఋషి బభ్రుపింగళుడు॥ దేవత: బలాసుడు॥ ఛందస్సు. అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం - శ్లేష్మ చికిత్సలో దీనికి వినియోగం.

మంత్రము

అస్థిస్రంసం పరుస్రంసమాస్థితం హృదయామయమ్ ।

బలాసం సర్వం నాశయాఙ్గేష్ఠా యశ్చ పర్వసు ॥ 1 ॥

పదము

అస్థిఽస్రంసమ్ । పరుఃఽస్రంసమ్ । ఆఽస్థితమ్ । హృదయ

ఽఆమయమ్ ।

బలాసమ్ । సర్వమ్ । నాశయ । అఙ్గేఽస్థాః । యః । చ । పర్వ ఽసు ॥ 1 ॥

అనువాదం:

ఎముక తొలగుటు, కీలుతొలగటు,
శరీరమంతా వ్యాపించి ఉన్న
హృదయమయమైన హృద్రోగం,
—ఇలాంటి వాటిని, కాసశ్వాసాత్మకమైన
శ్లేష్మరోగాన్ని నశింపజెయ్యి.
హస్తపాదాద్యవయవములలో నన్న,
అలాగే కీళ్ళలో నున్న మాశ్లేష్మరోగాన్ని నశింపజెయ్యి ॥ 1 ॥

మంత్రము

నిర్బలాసం బలాసినః క్షిణోమి ముష్కరం యథా ।
ఛినద్మ్యస్య బన్ధనం మూలముర్వార్వా ఇవ ॥ 2 ॥

పదము.

నిః । బలాసమ్ । బలాసినః । క్షిణోమి । ముష్కరమ్ । యథా ।
ఛినద్మి । అస్య । బన్ధనమ్ । మూలమ్ । ఉర్వార్వాః ఽఇవ ॥ 2 ॥

అనువాదం:

శ్లేష్మరోగి అయిన పురుషుని శ్లేష్మరోగాన్ని
నిశ్శేషంగా క్షయింప జేస్తున్నాను.
పెద్ద మడుగులో పుట్టిన పుష్కరాన్ని
ఏ విధంగా సమూలంగా తొలగించి వేస్తామో,
ఆ విధంగా వ్యాధిత శరీరం నుంచి
ఆ రోగాన్ని సమూలంగా నిర్మూలనం చేస్తాను.

ఈ శరీర సంశ్లేషణ నిమిత్తం మూలాన్ని విచ్ఛినం చేస్తున్నాను.
పరిపక్వమైన దోసపండు తనంతటే తానే వేరుపడునట్లు
ఈ రోగాన్ని వేరుపడ జేస్తాను. ॥ 2 ॥

మంత్రము.

నిర్బలాసేతః ప్ర పతాశుంగః శిశుకో యథా ।
అథో ఇట ఇవ హాయనోప ద్రాహ్యవీరహా ॥ 3 ॥

పదము

నిః । బలాస । ఇతః । ప్ర । పత । ఆశుంగః । శిశుకః । యథా ।
అథో ఇతి । ఇటఃఽఇవ । హాయనః । అప । ద్రాహి । అవీరఽహా
॥ 3 ॥

అనువాదం

ఓ బలాసా! ఈ శరీరం నుంచి నిష్క్రమించి దూరంగా పో.
ఆశుగామి అయిన శిశుకము వలె అతి వేగంగా వెళ్ళు
మటిన్ని ఇక్కడే సంవత్సరమైనది.
నీవు తిరిగి రాకుండా, మా వీరులకు
అహంతవై కుత్సిత గతిని పొందు. ॥ 3 ॥

ఇది పదునాల్గవ సూక్తం

## సూక్తం-15

ఋషి ఉద్దాలకుడు॥ దేవత, వనస్పతి॥ ఛందస్సు, అనుష్టుప్॥ మంత్రములు:
॥ 3 ॥

వినియోగం - పుష్టికాముడు పలాశమణిని కట్టుకునే ప్రక్రియలో దీనికి వినియోగం

మంత్రము :

ఉత్తమో అస్యోషధీనాం తవ వృక్షా ఉపస్తయః ॥

ఉపస్తిరస్తు సో౽౩స్మాకం యో అస్మాం అభిదాసతి ॥ 1 ॥

పదము

ఉత్౽తమః । అసి । ఓషధీనామ్ । తవ । వృక్షాః । ఉప౽స్తయః ।

ఉప౽స్తిః । అస్తు । సః । అస్మాకమ్ । యః । అస్మాన్ । అభి

౽దాసతి ॥ 1 ॥

అనువాదం.

ఓ పలాశమా! పలాశవృక్షమణినిచ్చే నీవు
ఓషధులలో ఉత్తమమైన దానవు.
స్థావరములైన ఒషధి, వనస్పతులలో ఉత్కృష్టమైన దానవు.
ఓ పలాశ వృక్షమా! ఇతర వృక్షములు నీ ఉపాసకులు
నీ అనుగ్రహం వల్ల మాకు అలాంటి శత్రువు ఉపక్షీణుడగుగాక!
అతడు మమ్ములను కించ పరుస్తున్నాడు ॥ 1 ॥

మంత్రము

సబన్ధుశ్చాసబన్ధుశ్చ యో అస్మాం అభిదాసతి ।

తేషాం సా వృక్షాణామివాహం భూయాసముత్తమః ॥ 2 ॥

పదము :

స౽బన్ధుః । చ । అసబన్ధుః । చ । యః । అస్మాన్ । అభి౽దాసతి ।

తేషామ్ । సా । వృక్షాణామ్౽ఇవ । అహమ్ । భూయాసమ్ ।

ఉత్౽తమః ॥ 2 ॥

అనువాదం.

సమాన జన్ములు, అసమాన జన్ములు అయిన శత్రువులు
మమ్ములను కించ పరుస్తున్నారు.

వారి మధ్యలో నేను ఉత్కృష్టతముడను అగుదునుగాక!
ఆ పలాశ ఓషధి వృక్షములలో కెల్లా
ఎలా ఉత్తమమైనదో, ఆ విధంగా నేను
శత్రువులలో కెల్ల ఉత్తముడ నగుదును గాక! ॥ 2 ॥

మంత్రము

యథా సోమ ఓషధీనాముత్తమో హవిషాం కృతః ।
పలాశో వృక్షాణామివాహం భూయాసముత్తమః ॥ 3 ॥

పదము :

యథా । సోమః । ఓషధీనామ్ । ఉత్ఽతమః । హవిషామ్ । కృతః
పలాశః । వృక్షాణామ్ఽఇవ । అహమ్ । భూయాసమ్ । ఉద్
ఽతమః ॥ 3 ॥

అనువాదం.

ఏ విధంగా ఓషధులలో సోమలత ఉత్తమమైనదో,
చరుపురోడాశాదులలో విధాతచే నిర్మించబడినదో,
ఆ విధంగా వృక్షములలో పలాశం వలె
నేను సజాతులలో ఉత్తముడ నగుచున్నాను. ॥ 3 ॥

ఇది పదునైదవ సూక్తం

## సూక్తం – 16

ఋషి శౌనకుడు॥ దేవత. మంత్రములందు పేర్కొన్నవారు॥ ఛందస్సు 1 నిచృత్ త్రిపదాగాయత్రీ 2 అనుష్టుప్ 3 బృహతీగర్భా కకుమ్మత్యను ష్టుప్: 4 త్రిపదా ప్రతిష్ఠాగాయత్రీ॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం అక్షిరోగ చికిత్సలో అవనూనెలో వేసి అవచెట్టుమణిని కట్టుకునే ప్రక్రియలోను, అందులోని అజ్యహోమంలోను, సర్షప (అవ)

తైలం నుంచి బయటపడిన సర్షపపత్రశాఖాన్ని నేత్రరోగగ్రస్తునికి ఇవ్వడంలోను దీనికి వినియోగం.

మంత్రము.

ఆబయో అనాబయో రసస్త ఉగ్ర ఆబయో ।

ఆ తే కరమ్భమద్మసి ॥ 1 ॥

పదము

ఆబయో ఇతి । అనాబయో ఇతి । రసః । తే । ఉగ్రః । ఆబయో ఇతి

ఆ । తే । కరమ్భమ్ । అద్మసి ॥ 1 ॥

అనువాదం:

రోగనివృత్త్యర్థమై తినుటలో
తినకూడని ఓ సర్షపకాండమా!
నీ రసం వ్యాధి నివర్తనక్షమమై నీ మిశ్రభక్షమైన
పత్రశాకాన్ని మంత్రాభి మంత్రితం చేసి తింటున్నాము. ॥1॥

మంత్రము:

విహహ్లో నామ తే పితా మదావతీ నామ తే మాతా ।

స హిన త్వమసి యస్త్వమాత్మానమావయః ॥ 2 ॥

పదము

వి౽హహ్లః । నామ । తే । పితా । మద౽వతీ । నామ । తే ।
మాతా ।

సః । హిన । త్వమ్ । అసి । యః । త్వమ్ । ఆత్మానమ్ । అవయః
॥ 2 ॥

అనువాదం.

ఓ సర్షపశాకమా! నీ తండ్రి విహహ్లాఖ్యుడు.
'మదావతి' అను పేరుగలామె నీ తల్లి. నీవు అవి కావు.
నీవు ఆత్మీయ పత్రాదికాన్ని రోగిచే తినిపించితివి. ॥ 2 ॥

మంత్రము.

తౌవిలికేఽవేలయావాయమైలబ ఐలయీత్ ।
బభ్రుశ్చ బభ్రుకర్ణశ్చాపేహి నిరాల ॥ 3 ॥

పదము.

తౌవిలికే । అవ । ఇలయ । అవ । అయమ్ । ఐలబః । ఐలయీత్ ।
బభ్రుః । చ । బభ్రుఽకర్ణః । చ । అప । ఇహి । నిః । ఆల ॥ 3 ॥

అనువాదం:

ఓ తౌవలికమనే రోగనిదాన భూతమైన పిశాచమా!
మా రోగాన్ని దిగముఖం పట్టించు.
ఐలబ మనే కంటిరోగము దూరంగా వెళ్ళుగాక!
బభ్రు, బభ్రుకర్ణములనే రోగహేతువులు
అతని నుంచి తొలగి పోవుగాక!
నిరాలమనే రోగమా! నీవు కూడా తొలగిపో. ॥ 3 ॥

మంత్రము.

అలసాలాసి పూర్వా సిలాఞ్జాలాస్యుత్తరా నీలాగలసాలా ॥4॥

పదము

అలసాలా । అసి । పూర్వా । సిలాఞ్జాలా । అసి । ఉత్తరా । నీలా
గలసాలా ॥ 4 ॥

అనువాదం

అలసాల, సిలాంజల, నీలాగలసాల అనునవి
మూడు సస్యవల్లీ నామములు.
అలసాల మొదటిది సిలాంజలి రెండవది.
నీలాగలసాల మూడవది ॥ 4 ॥

ఇది పదునారవ సూక్తం

## సూక్తం - 17

ఋషిః అథర్వుడు ॥ దేవత . గర్భదృంహణం ॥ ఛందస్సు . అనుష్టుప్ ॥ మంత్ర
ములు ॥ 4 ॥

వినియోగం - గర్భదృంహణ కర్మలో దీనికి వినియోగం. ఈ మూడు ఋక్కు-
లతో క్షేత్రమృత్తికను అభిమంత్రించి గర్భిణితో తినిపించవలెను
ఇసుకను అభిమంత్రించి ఆమె పడకపై చల్లవలెను.

మంత్రము .

యథేయం పృథివీ మహీ భూతానాం గర్భమాదధే ।
ఏవా తే ధ్రియతాం గర్భో అను సూతుం సవితవే ॥ 1 ॥

పదము ,

యథా । ఇయమ్ । పృథివీ । మహీ । భూతానామ్ । గర్భమ్ ।
ఆ౨దధే ।
ఏవ । తే । ధ్రియతామ్ । గర్భః । అను । సూతుమ్ । సవితవే ॥1॥

అనువాదం

ఏ విధంగా గొప్పదైన ఈ పృథివి
ప్రాణుల గర్భాన్ని ధరిస్తుందో,
ఆ విధంగా, ఓ నారీ!

నీ గర్భం నీ గర్భాశయంలో స్థిరంగా ఉండుగాక!
పదినెల లుండడం వల్ల కన్నుపొద్దులు దగ్గరపడి
ఆ గర్భాన్ని ప్రసవించడానికి ప్రయత్నించుగాక। ॥ 1 ॥

మంత్రము

యథేయం పృథివీ మహీ దాధారేమాన్ వనస్పతీన్ ।
ఏవా తే ధ్రియతాం గర్భో అను సూతుం సవితవే ॥ 2 ॥

పదము

యథా । ఇమమ్ । పృథివీ । మహీ । దాధార । ఇమాన్ । వన
స్పతీన్ ।
ఏవ । తే । ధ్రియతామ్ । గర్భః । అను । సూతుమ్ । సవితవే॥2॥

మంత్రము :

యథేయం పృథివీ మహీ దాధార పర్వతాన్ గిరీన్ ।
ఏవా తే ధ్రియతాం గర్భో అను సూతుం సవితవే ॥ 3 ॥

పదము

యథా । ఇయమ్ । పృథివీ । మహీ । దాధార । పర్వతాన్ । గిరీన్
ఏవ । తే । ధ్రియతామ్ । గర్భః । అను । సూతుమ్ । సవితవే॥3॥

అనువాదం.

ఈ భూమి కనబడుతున్న ఈ వనస్పతులను
అన్నిటినీ స్థిరంగా ధరిస్తున్నది.
అలాగే పర్వతములను, గిరులను ధరిస్తున్నది.

ఏ విధంగా పృథివి సర్వాన్ని స్థిరంగా ధరిస్తున్నదో,
ఆ విధంగా ఓ నారీ! నీవు గర్భాన్ని స్థిరంగా ధరింతువుగాక!
॥ 2, 3 ॥

మంత్రము.

యథేయం పృథివీ మహీ దాధార విష్ఠితం జగత్ ।
ఏవా తే ధ్రియతాం గర్భో అను సూతుం సవితవే ॥ 4 ॥

పదము.

యథా । ఇయమ్ । పృథివీ । మహీ । దాధార । విఽస్థితమ్ ।
జగత్ ।
ఏవ । తే । ధ్రియతామ్ । గర్భః । అను । సూతుమ్ । సవితవే॥4॥

అనువాదం.

ఈ పృథివి చరాచరాత్మకమైన ఈ జగత్తును
ఏ విధంగా ధరిస్తున్నదో, అదే విధంగానే నీ గర్భాన్ని
నీవు ప్రసవించువఱకు ధరింతువుగాక! ॥ 4 ॥

ఇది పదునేడవ సూక్తం

## సూక్తం-18

ఋషి! అథర్వుడు ॥ దేవత ఈర్ష్యావినాశనమ్ ॥ ఛందస్సు. అనుష్టుప్ ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం,- స్త్రీ విషయ ఈర్ష్యా నివృత్తికొఱకు ఈర్ష్యకల వ్యక్తినిచూచి ఈ సూక్తమును జపించవలెను అతనికి భిక్షను పెట్టవలెను. లేదా అతనిని స్పృశించి ఈ సూక్తమును జపించవలెనుర్

మంత్రము :

ఈర్ష్యాయా ధ్రాజిం ప్రథమాం ప్రథమస్యా ఉతాపరామ్ ।
అగ్నిం హృదయ్యం శోకం తం తే నిర్వాపయామసి ॥1॥

పదము

ఈర్ష్యాయాః । ధ్రాజిమ్ । ప్రథమామ్ । ప్రథమస్యాః । ఉత । అపరామ్ ।
అగ్నిమ్ । హృదయ్యమ్ । శోకమ్ । తమ్ । తే । నిః । వాపయామసి ॥ 1 ॥

అనువాదం.

ఈర్ష్యతో వేదయుక్తమైన గతిని ప్రథమోత్పన్నమైన దానిని
నిర్వాపనం చేస్తున్నాము.
ఆ మొదటి దానిని, తరువాతిదానిని
కూడా శమింప జేస్తున్నాము.
హృదయ దాహకమైన కోపాగ్నిని, శోకాన్ని,
దానివల్ల కలిగిన ఈ విధమైన ఈర్ష్యాయుక్తుడైన పురుషుడా!
నీ దగ్గఱ నుంచి శమింప జేస్తున్నాము ॥ 1 ॥

మంత్రము :

యథా భూమిర్మృత మనా మృతాన్మృతామన స్తరా ।
యథోత మమ్రుషో మన ఏవేర్ష్యోర్మృతం మనః ॥ 2 ॥

పదము.

యథా । భూమిః । మృతऽమనాః । మృతాత్ । మృతమనః ऽతరా ।

యథా । ఉత । మృతముషః । మనః । ఏవ । ఈర్ష్యోః । మృతమ్ ।
మనః ॥ 2 ॥

అనువాదం.

భూమి అపగతమనస్కయై ఏ విధంగా ఈర్ష్యను చూపదో,
శవశరీరం నుంచి మృతమనస్కయై పృథివి ఎలా ఉంటుందో,
మఱి మరణించే పురుషుని మనస్సు అతని శరీరం నుంచి
అపగతమై ఎలా ఈర్ష్యాజనకం కాదో,
అలాగే ఈర్ష్యాయుక్తుడైన పురుషుని మనస్సు వినష్ట మగుగాక !
॥ 2 ॥

మంత్రము

అదో యత్ తే హృది శ్రితం మనస్కం పతయిష్ణుకమ్ ।
తతస్త ఈర్ష్యాం ముఞ్చామి నిరూష్మాణం దృతేరివ ॥ 3 ॥

పదము.

అదః । యత్ । తే । హృది । శ్రితమ్ । మనఃఽకమ్ । పతయిష్ణు
కమ్ ।
తతః । తే । ఈర్ష్యామ్ । ముఞ్చామి । నిః । ఊష్మాణమ్ । దృతేః
ఽఇవ ॥ 3 ॥

అనువాదం :

ఓ ఈర్ష్యాయుక్తుడా !
నీ హృదయంలో ఉన్న ప్రసిద్ధమైన, పతనశీలమైన
నీ మనస్సునుంచి నీ ఈర్ష్యను
నిశ్శేషంగా నిర్మూలిస్తున్నాను.

తోలుతిత్తిలోని గాలిని దానిముఖంనుంచి
వదలి వేసినట్టు వదలివేస్తున్నాను ॥ 3 ॥

ఇది పదునెనిమిదవ సూక్తం

## సూక్తం–19

ఋషి. శన్తాతి॥ దేవతలు మంత్రములందు పేర్కొన్నవారు॥ ఛందస్సు. 1
అనుష్టుప్: 2,3 గాయత్రీ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం.– ఇది బృహద్గణం లోనిది గనుక శాంత్యుదకాదులలో దీనికి వినియోగం. నిధులను త్రవ్వుటలో విఘ్నశమన కాముడు చేసే కర్మలో దీనికి వినియోగం. సపయజ్ఞములలో యజమానుని పత్ని పుత్రులపై ఈ మంత్రాలతో జలప్రోక్షణం చేయాలి. అలాగే పవిత్ర సవనంలో కొన్ని కర్మలకు దీని వినియోగం.

మంత్రము

పునన్తు మా దేవజనాః పునన్తు మనవో ధియా ।
పునన్తు విశ్వా భూతాని పవమానః పునాతు మా ॥ 1 ॥

పదము.

పునన్తు । మా । దేవఽజనాః । పునన్తు । మనవః । ధియా ।
పునన్తు । విశ్వా । భూతాని । పవమానః । పునాతు । మా । ॥ 1 ॥

అనువాదం

దేవజాతీయులైన జనులు నన్ను పవిత్రుని చేయుదురుగాక!
అలాగే మనుష్యజాతీయులు బుద్ధితో నన్ను పునీకరింతురుగాక!
సర్వభూతములు నన్ను పవిత్రం చేయుగాక!
అంతరిక్షంలో వెడుతున్న వాయువు కూడా
నన్ను పవిత్రుని చేయుగాక! ॥ 1 ॥

మంత్రము

పవమానః పునాతు మా క్రత్వే దక్షాయ జీవసే ।

అథో అరిష్టఽతాతయే ॥ 2 ॥

పదము

పవమానః । పునాతు । మా । క్రత్వే । దక్షాయ । జీవసే ।

అథో ఇతి । అరిష్టతాతయే ॥ 2 ॥

అనువాదం :

సోముడు నన్ను పాప విముక్తుని చేయుగాక!
క్రతువు కొఱకై, బలం కొఱకై,
ప్రాణాపానములు శరీరములో ఉండుటకై,
ఆజీవనార్థమై పవిత్రం చేయుగాక!
మఱియు అహింసా కరణం కోసం
నన్ను పవిత్రుని చేయుగాక! ॥ 2 ॥

మంత్రము

ఉభాభ్యాం దేవ సవితః పవిత్రేణ సవేన చ ।

అస్మాన్ పునీహి చక్షసే ॥ 3 ॥

పదము :

ఉభాభ్యామ్ । దేవ । సవితః । పవిత్రేణ । సవేన । చ ।

అస్మాన్ । పునీహి । చక్షసే ॥ 3 ॥

అనువాదం.

ఓ సవితా! పవిత్రమైన నీ తేజస్సుతో,
నీ ప్రేరణతో మమ్ములను పరిశుద్ధులను చెయ్యి.
దర్శనార్థమై, ఐహికాముష్మిక సకల సుఖ
సాక్షాత్కారార్థమై వా ఇరువురను పరిశుద్ధులను చెయ్యి ॥3॥

ఇది పందొమ్మిదవ సూక్తం

## సూక్తం—20

ఋషిః భృగ్వంగిరసులు॥ దేవత. యక్ష్మనాశనం॥ ఛందస్సు. 1 అతిజగతీ.
2 కకుమ్మతీ ప్రస్తార పంక్తి 3 సతః పంక్తి॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం :- పితృజ్వర చికిత్సలో, దావాగ్నిలో దీనికి వినియోగం.

మంత్రము :

అగ్నేరివాస్య దహత ఏతి శుష్మిణ
ఉతేవ మత్తో విలపన్నపాయతి ।
అన్యమస్మదిచ్ఛతు కం చిదవ్రత స్తపుర్వధాయ
నమో అస్తు తక్మనే ॥ 1 ॥

పదము

అగ్నేఃఽఇవ । అస్య । దహతః । ఏతి । శుష్మిణః । ఉతఽఇవ ।
మత్తః । విఽలపన్ । అప । అయతి ।
అన్యమ్ । అస్మత్ । ఇచ్ఛతు । కమ్ । చిత్ । అవ్రతః ।
తపుఃఽవధాయ । నమః । అస్తు । తక్మనే ॥ 1 ॥

**అనువాదం.**

అర్ద్రము, అనార్ద్రము అయిన సర్వాన్ని
దహింప జేస్తున్న దావాగ్ని వలె
శరీర మంతటిని శోషింపజేస్తున్న
ఈ జ్వరదాహం శరీర మంతా వ్యాపిస్తున్నది.
మఱిన్ని నా నుంచి ఉన్మత్తుని వలె
తన్ను మఱచి పోయి, వివిధ ప్రలాపాలను చేస్తూ
ఆ జ్వరంతో ఈ లోకం నుంచి వెళ్ళిపోతున్నది.
ఈ ప్రబలమైన పిత్తజ్వరం మా నుండి
మఱొక సదాచారహీనుని పట్టుకొనుగాక!
తాపం కల్పించే ఈ జ్వరానికి నమస్కారం. ॥ 1 ॥

**మంత్రము :**

నమో రుద్రాయ నమో అస్తు తక్మనే
నమో రాజ్ఞే వరుణాయ త్విషీమతే ।
నమో దివే నమః పృథివ్యై నమ ఓషధీభ్యః ॥ 2 ॥

**పదము :**

నమః । రుద్రాయ । నమః । అస్తు । తక్మనే ।
నమః । రాజ్ఞే । వరుణాయ । త్విషిఽమతే ।
నమః । దివే । నమః । పృథివ్యై । నమః । ఓషధీభ్యః ॥ 2 ॥

**అనువాదం :**

రుద్రునకు నమస్కారం. జ్వరానికి నమస్కారం.
దీప్తిమంతుడైన వరుణునకు నమస్కారం.

అలాగే ద్యులోకమునకు నమస్కారం.
పృథివికి నమస్కారం. ఓషధులకు నమస్కారం. ॥ 2 ॥

మంత్రము:

అయం యో అభిశోచయిష్ణు ర్విశ్వా
రూపాణి హరితా కృణోషి ।
తస్మై తేఽరుణాయ బభ్రవే నమః
కృణోమి వన్యాయ తక్మనే ॥ 3 ॥

పదము.

అయమ్ । యః । అభిఽశోచయిష్ణుః । విశ్వా ।
రూపాణి । హరితా । కృణోషి ।
తస్మై । తే । అరుణాయ । బభ్రవే । నమః ।
కృణోమి । వన్యాయ । తక్మనే ॥ 3 ॥

అనువాదం:

ఈ అనుభూయమాన మవుతున్న,
సర్వాంగములకు శోకాన్ని ఆపాదిస్తున్న,
ఈ పిత్తజ్వరం సర్వములను హరితములుగా చేయుగాక !
ఆ అరుణవర్ణునకు, జ్వరమునకు నమస్కరిస్తున్నాను. ॥ 3 ॥

ఇది ఇరవైయవ సూక్తం

ఇది రెండవ అనువాకం

## అనువాకం: 3



### సూక్తం - 21

ఋషిః శన్తాతి॥ దేవత : చంద్రుడు॥ ఛందస్సు : అనుష్టుప్॥ మంత్రములు : ॥౪॥
వినియోగం.- కేశవృద్ధి కాముడు చేసే ప్రక్రియలో దీనికి వినియోగం.

మంత్రము

ఇమా యాస్తిస్రః పృథివీ స్తాసాం హ భూమీ రుత్తమా ।
తాసా మధి త్వచో అహం భేషజం సము జగ్రభమ్ ॥ 1 ॥

పదము.

ఇమాః । యాః । తిస్రః । పృథివీః । తాసామ్ । హ । భూమిః ।
ఉత్ఽతమా ।
తాసామ్ । అధి । త్వచః । అహమ్ । భేషజమ్ । సమ్ । ఓంఇతి ।
జగ్రభమ్ ॥ 1 ॥

అనువాదం.

ఈ పరిదృశ్యమానములైన త్రి సంఖ్యాకములైన
పృథువులలో మనం నివసిస్తున్న భూమి ఉత్తమమైనది.
ఆ భూములతో చర్మం వలె పైన ఉన్న ఏ భూమి కలదో
దానికి కూడా పైన ప్రరూఢమైన వ్యాధి
నివర్తకమైన ఔషధం నేను సంగ్రహిస్తున్నాను ॥ 1 ॥

మంత్రము

శ్రేష్ఠ మసి భేషజానాం వసిష్ఠం వీరుధానామ్ ।
సోమో భగ ఇవ యామేషు దేవేషు వరుణో యథా ॥ 2 ॥

పదము

శ్రేష్ఠమ్ । అసి । భేషజానామ్ । వసిష్ఠమ్ । వీరుధానామ్ ।

సోమః । భగఃఽఇవ । యామేషు । దేవేషు । వరుణః । యథా ॥2॥

అనువాదం :

హరిద్రాది రూపమైన ఓ ఔషధమా!
ఇతర భేషజముల కంటె శ్రేష్ఠమైన దానవు
ఇతర ఓషధులలో ఉత్తమమైన దానవు.
అహోరాత్ర భాగములలో ఏ విధంగా చంద్రుడు,
సూర్యుడు కాలావచ్ఛేద హేతువులై ప్రశస్తులో
ఆ విధంగా నీవు కూడా ప్రశస్తమైన దానవు.
దేవతలలో వరుణుని వలె ఉత్తమమైన దానవు. ॥ 2 ॥

మంత్రము :

రేవతీ రనాధృషః సిషాసవః సిషాసథ ।

ఉత స్థ కేశదృంహణీరథో హ కేశవర్ధనీః ॥ 3 ॥

పదము

రేవతీః । అనాధృషః । సిసాసవః । సిసాసథ ।

ఉత । స్థ । కేశఽదృంహణీః । అథో ఇతి । హ । కేశఽవర్ధనీః ॥3॥

అనువాదం .

ఓ భాగ్యవంతము లైన ఓషధులారా!
ఎవరితోనూ హింసింప బడక
ఆరోగ్యము లివ్వడానికి మీరు సిద్ధంగా ఉంటారు.

అంతే కాక వెంట్రుకలను గట్టి పరుస్తాను.
మఱిన్ని కేశ సమృద్ధికారులు. ॥ 3 ॥

ఇది ఇరవై ఒకటవ సూక్తం

## సూక్తం–22

ఋషిః శన్తాతి॥ దేవత. 1 ఆదిత్యరశ్మి. 2,3 మరుత్తులు॥ ఛందస్సు: 1,3 త్రిష్టుప్. 2 చతుష్పదా భురిగ్జగతీ॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం:– ఉదర తుందాది చికిత్సార్థం దీనికి వినియోగం.

మంత్రము.

కృష్ణం నియానం హరయః సువర్ణా
అపో వసానా దివముత్ పతన్తి।
త ఆవవృత్రన్త్సదనాదృతస్యాదిద్
ఘృతేన పృథివీం వ్యూ౭దుః ॥ 1 ॥

పదము:

కృష్ణమ్। ని౭యానమ్। హరయః। సు౭వర్ణాః।
అపః। వసానాః। దివమ్। ఉత్। పతన్తి।
తే। ఆ। అవవృత్రన్। సదనాత్। ఋతస్య। ఆత్। ఇత్।
ఘృతేన। పృథివీమ్। వి। ఊదుః ॥ 1 ॥

అనువాదం:

కృష్ణ వర్ణమైన అంతరిక్షంలో హరణ శీలములైన
సమస్తమైన రసము హరించే ఆదిత్య కిరణాలు

ఉదకములను ఆచ్ఛాదించుకొని
ఆదిత్య మండలానికి ఎదిగిపోతాయి.
ఆ సూర్యరశ్ములు ఉదకమునకు
ఆదిత్యమండలం నుంచి పృష్ట్యర్థమై తిరిగి వస్తాయి.
అనంతరమే ఉదకంతో అ సూర్యరశ్ములు
పృథివిని ఆర్ద్రీకరిస్తాయి. ॥ 1 ॥

మంత్రము:

పయస్వతీః కృణుథాప ఓషధీః శివా
యదేజథా మరుతో రుక్మవక్షసః ।
ఊర్జం చ తత్ర సుమతిం చ పిన్వత
యత్రా నరో మరుతః సిఞ్చథా మధు ॥ 2 ॥

పదము.

పయస్వతీః । కృణుథ । అపః । ఓషధీః । శివాః ।
యత్ । ఏజథ । మరుతః । రుక్మఽవక్షసః ।
ఊర్జమ్ । చ । తత్ర । సుఽమతిమ్ । చ । పిన్వత ।
యత్ర । నరః । మరుతః । సిఞ్చథ । మధు ॥ 2 ॥

అనువాదం.

ఓ మరుత్తులారా! స్వర్ణమయమైన ఆభరణంతో
వక్షః స్థలాన్ని ఆచ్ఛాదింపజేసుకొని మీరు
ఎప్పుడు తిరుగుతుంటారో, అప్పుడు

రసవతులైన ఉదకములను, ఓషధులను
సుఖకరములను చేస్తారు.
నాయకులైన ఓ మరుత్తులారా!
మీరు ఎక్కడైతే మధురసాన్ని ( వృష్ట్యుదకాన్ని )
సేచనం చేస్తారో, అక్కడ బలకరమైన
అన్నం సుబుద్ధి ఇచ్చి ప్రజలను పోషిస్తారు. ॥ 2 ॥

మంత్రము:

ఉద్ప్రుతో మరుతస్తాం ఇయర్త
వృష్టిర్యా విశ్వా నివతస్పృణాతి।
ఏజాతి గ్లహా కన్యేఽవ తున్నైరుం
తున్దానా పత్యేవ జాయా ॥ 3 ॥

పదము:

ఉదఽప్రుతః। మరుతః। తాన్। ఇయర్త।
వృష్టిః। యా। విశ్వాః నిఽవతః। పృణాతి।
ఏజాతి। గ్లహా। కన్యాఽఇవ। తున్నా। ఏరుమ్।
తున్దానా। పత్యాఽఇవ। జాయా ॥ 3 ॥

అనువాదం:

ఓ మరుత్తులారా! ఉదక ప్రేరకములైన
మేఘాలను ప్రేరేపించండి.
ఏ మేఘాలకు సంబంధించిన వృష్టి

వ్రీహి, యవాది సస్యములను తృప్తిపరుస్తుందో,
ఆ వృష్టిని ప్రేరేపించండి
దారిద్ర్యాదులతో పీడితురాలైన కన్య
మాతాపితరులను కంపింపజేసినట్లుగా
భయోత్పాదకమైన వృష్ట్యర్థమై
మేఘాలను కంపింప జేయండి.
వెళ్ళుతున్న మేఘాన్ని పొంది ధ్వనిస్తూ
గమనశీలమైన ఉదకాన్ని క్షరిపిస్తూ
పతి సహితయైన సతివలె అది ప్రవర్తిస్తుంది. ॥ 3 ॥

ఇది ఇరవై రెండవ సూక్తం

## సూక్తం - 23

ఋషి. శన్తాతి॥ దేవత : అపస్సు॥ ఛందస్సు 1 అనుష్టుప్: 2 త్రిపదా గాయత్రీ: 3 పరోష్ణిక్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం :- ఇది బృహద్గణం లోనిది గనుక శాంత్యుదకాదులలో దీనికి వినియోగం జలసూక్తాదులలో పాఠంవల్ల అప్లావనాదులలో దీనికి వినియోగం. ఉత్థాపన, విఘ్నశమన కాముడు వీటిలో క్షీరోదన హవనాది కర్మలు చేయాలి. ఉదరతుందాది చికిత్సలలో కూడా దీనికి వినియోగం.

మంత్రము :

సస్రుషీ స్తదపసో దివా నక్తం చ సస్రుషీః ।
వరేణ్యక్రతు రహ మపో దేవీ రుప హ్వయే ॥ 1 ॥

పదము .

సస్రుషీః । తత్ । అపసః । దివా । నక్తమ్ । చ । సస్రుషీః ।

వరేణ్యఽక్రతుః । అహమ్ । అపః । దేవీః । ఉప । హ్వయే ॥ 1 ॥

**అనువాదం :**

ప్రసిద్ధరూపాన్ని పొందిన, అపస్స్వాంతములైన,
అహోరాత్రోపలక్షితమైన సర్వకాల అవిచ్ఛేదంతో
సరణశీలములైన ఈ జలములను ప్రశస్తకర్ముడనైన
నేను నా సమీపానికి ఆహ్వానిస్తున్నాను. ॥ 1 ॥

**మంత్రము :**

ఓతా ఆపః కర్మణ్యా ముఞ్చన్త్వితః ప్రణీతయే ।
సద్యః కృణ్వన్త్వేతవే ॥ 2 ॥

**పదము :**

ఆఽఉతాః । ఆపః । కర్మణ్యాఽః । ముఞ్చన్తు । ఇతః । ప్రఽ
నీతయే ।
సద్యః । కృణ్వన్తు । ఏతవే ॥ 2 ॥

**అనువాదం :**

అవిచ్ఛిన్నములుగా ప్రవహిస్తున్న,
లౌకిక, వైదిక కర్మలలో సాధువులైన
ఇలాంటి జన్మలు ఇక్కడి నుంచి
సర్వానర్థ మూలకారణమైన పాపం నుంచి
మమ్ములను విమోచనం చెందింతురు గాక!
ప్రకృష్ట ఫలప్రాప్తిని వెంటనే పొందుటకు
జలదేవతలు మమ్ములను అర్హులను చేయుదురుగాక! ॥ 2 ॥

మంత్రము :

దేవస్య సవితుః సవే కర్మ కృణ్వన్తు మానుషాః ।
శం నో భవన్త్వప ఓషధీః శివాః ॥ 3 ॥

పదము :

దేవస్య । సవితుః । సవే । కర్మ । కృణ్వన్తు । మానుషాః ।
శమ్ । నః । భవన్తు । అపః । ఓషధీః । శివాః ॥ 3 ॥

అనువాదం :

వెలుగొందుచున్న సూర్యుని ప్రేరణకాగా
మనుష్యుల లౌకిక వైదికాది కర్మలలో ప్రవృత్తు లగుదురుగాక!
మంగళకరములైన ఓషధులు, వాటినే వృద్ధిపొందించే
జలములు మాకు పాపహరణ హేతువులగు గాక! ॥ 3 ॥

ఇది ఇరవై మూడవ సూక్తం

## సూక్తం—24

ఋషి. శన్తాతి॥ దేవత : అపస్సు ॥ ఛందస్సు : అనుష్టుప్ ॥ మంత్రములు : ॥3॥

వినియోగం :- ఇది బృహద్గణం లోనిది గనుక శాంత్యుదకాదులలో దీనికి వినియోగం. జలసూక్తాదులలో పారంవల్ల అప్లావనాదులలో దీనికి వినియోగం. ఉత్థాపన విఘ్నశమనకాముడు వీటితో క్షీరోదనహవనాది కర్మలు చేయాలి. హృదయదోష, జలోదర, కామల (కామెర్లు) రోగ శాంత్యర్థం చేసే ప్రక్రియలో దీనికి వినియోగం.

మంత్రము

హిమవతః ప్ర స్రవన్తి సిన్ధౌ సమహ సఙ్గమః ।
ఆపో హ మహ్యం తద్ దేవీ ర్దదన్ హృద్ద్యోతభేషజమ్ ॥1॥

పదము

హిమఽవతః । ప్ర । స్రవన్తి । సిన్ధౌ । సమహ । సమ్ఽగమః ।

ఆపః । హ । మహ్యమ్ । తత్ । దేవీః । దదన్ । హృద్ద్యోత

ఽభేషజమ్ ॥ 1 ॥

అనువాదం :

పాపక్షయ హేతువులైన జలములు
హిమవంతం నుంచి ప్రవహిస్తున్నవి.
అవన్నీ సముద్రంలో సమానంగా సంసర్గం చెందుతున్నవి.
ఇలాంటి జలదేవతలు ఆ ప్రసిద్ధమైన
హృదయదాహనివర్తకమైన ఔషధమును
నాకు ప్రదానం చేతురు గాక ! ॥ 1 ॥

మంత్రము :

యన్మే అక్ష్యోరాదిద్యోత పార్ష్ణ్యోః ప్రపదోశ్చ యత్ ।

ఆపస్తత్ సర్వం నిష్కరన్ భిషజాం సుభిషక్తమాః ॥ 2 ॥

పదము ,

యత్ । మే । అక్ష్యోః । ఆఽదిద్యోత । పార్ష్ణ్యోః । ప్రఽపదోః । చ

యత్ ।

ఆపః । తత్ । సర్వమ్ । నిః । కరన్ । భిషజామ్ । సుభిషక్

ఽతమాః ॥ 2 ॥

అనువాదం

ఏ రోగ జాతి నా కనులను బాధపెడుతున్నదో,
అట్లే ఇరువైపుల పాదములను ఆశ్రయించి ఉన్నదో,

ఆ రోగజాతం సర్వమునూ వ్యాధినివర్తకములలో
అతిశయ చికిత్సా కుశలములు దేవతారూపములు
నయిన జలములు నిర్గతం చేయుగాక ! ॥ 2 ॥

మంత్రము :

సిన్ధుపత్నీః సిన్ధురాజ్ఞీః సర్వా యా నద్య1 స్థన ।
దత్త నస్తస్య భేషజం తేనా వో భునజామహై ॥ 3 ॥

పదము

సిన్ధుఽపత్నీః । సిన్ధుఽరాజ్ఞీః । సర్వాః । యాః । నద్యఽః । స్థన ।
దత్త । నః । తస్య । భేషజమ్ । తేన । వః । భునజామహై ॥ 3 ॥

అనువాదం :

సింధు పత్నులు, సింధు రాణులు అయిన నదీరూప జలములు
మా రోగములకు ఔషధాన్ని ఇత్తురుగాక !
ఆ ఔషధంతో మీ వారమైన మేము
ఆరోగ్యవంతుల మగుదుముగాక !
నీరోగులమై అన్నపానాది బలకరమైన
వస్తుజాతాన్ని సేవింతుము గాక ! ॥ 3 ॥

ఇది ఇరవై నాల్గవ సూక్తం

## సూక్తం - 25

ఋషి శునశ్శేపుడు॥ దేవత: మన్యావినాశనమ్॥ ఛందస్సు: అనుష్టుప్॥
మంత్రములు. ॥ 3 ॥

వినియోగం :- గండమాలా నివృత్తికి ఈ మూడు మంత్రాలతో చేసే క్రియలో
దీనికి వినియోగం.

మంత్రము :

పఞ్చ చ యాః పఞ్చాశచ్చ సంయన్తి మన్యా అభి ।

ఇతస్తాః సర్వా నశ్యన్తు వాకా అపచితామివ ॥ 1 ॥

పదము.

పఞ్చ । చ । యాః । పఞ్చాశత్ । చ । సమ్ఽయన్తి । మన్యాః । అభి ।

ఇతః । తాః । సర్వాః । నశ్యన్తు । వాకాః । అపచితామ్ఽఇవ ॥1॥

అనువాదం.

ఐదు, యాభై, యాభైఐదు సంఖ్యగల
ఏ గండమాలలు గొంతుక మీద ఉన్నవో,
అవి వరుసగా అల్లుకుపోతాయి
ఇందుతో ఆ మొత్తం గండమాల లన్నీ నశించుగాక!
పతివ్రతను తిట్టిన తిట్లు
ఏ విధంగా పరాహతములై నశిస్తాయో
ఆ విధంగా ఇవి నశించుగాక! ॥ 1 ॥

మంత్రము

సప్త చ యాః సప్తతిశ్చ సంయన్తి గ్రైవ్యా అభి ।

ఇతస్తాః సర్వా నశ్యన్తు వాకా అపచితామివ ॥ 2 ॥

పదము.

సప్త । చ । యాః । సప్తతిః । చ । సమ్ఽయన్తి । గ్రైవ్యాః । అభి ।

ఇతః । తాః । సర్వాః । నశ్యన్తు । వాకాః । అపచిత్ామ్ఽఇవ ॥2॥

**అనువాదం :**

ఏడు, డెబ్బై, డెబ్బై ఏడు సంఖ్యగల
ఏ గండమాలలు గొంతుక మీద మొలిచి ఉన్నవో
అవి అన్ని నాడులకు వ్యాపిస్తాయి.
ఇందుతో ఆ మొత్తం గండమాల లన్నీ నశించుగాక !
పతివ్రతను తిట్టిన తిట్లు ఏ విధంగా
పరాహతములై నశిస్తాయో
ఆ విధంగా ఇవి నశించుగాక ! ॥ 2 ॥

**మంత్రము**

నవ చ యా నవతి శ్చ సంయన్తి స్కన్ధ్యా అభి ।
ఇతస్తాః సర్వా నశ్యన్తు వాకా అపచితామివ ॥ 3 ॥

**పదము :**

నవ । చ । యాః । నవతిః । చ । సమ్ఽయన్తి । స్కన్ధ్యాః । అభి
ఇతః । తాః । సర్వాః । నశ్యన్తు । వాకాః । అపచితామ్ఽఇవ ॥3॥

**అనువాదం .**

తొమ్మిది, తొంభైతొమ్మిది సంఖ్యగల గండమాలలు
గొంతు క్రింద పుట్టి నాడులకు వ్యాపిస్తాయి.
అవన్నీ ఈ మంత్ర ప్రయోగంతో
పతివ్రతను తిట్టిన తిట్లు
పరాహతములై నశించునట్లు నశించుగాక ! ॥ 3 ॥

ఇదిఇరవై ఐదవ సూక్తం

## సూ_క్తం – 26

ఋషిః బ్రహ్మ ॥ దేవత : పాప్మా ॥ ఛందస్సు . అనుష్టుప్ ॥ మంత్రములు : ॥3॥

వినియోగం :- సర్వరోగచికిత్స కర్మలో ఈ సూ_క్తమునకు వినియోగం. మహా శాంతిలో చేసే నైర్ఋత కర్మలో దీనికి వినియోగం.

మంత్రము .

అవ మా పాప్మ_న్త్సృజ వశీ సన్ మృడయాసి నః ।

ఆ మా భద్రస్య లోకే పాప్మన్ ధేహ్యవిహ్రుతమ్ ॥ 1 ॥

పదము .

అవ । మా । పాప్మన్ । సృజ । వశీ । సన్ । మృడయాసి । నః ।

ఆ । మా । భద్రస్య । లోకే । పాప్మన్ । ధేహి । అవిఽహ్రుతమ్ ॥ 1 ॥

అనువాదం :

ఓ పాపదేవా! నన్ను నీ సమ్ముఖం నుంచి విము_క్తి పొందించు.
సర్వవశయితవయిన నీవు మమ్ములను చక్కబెట్టు.
ఓ పాపి! పీడితుని కాని నన్ను భద్ర లోకములలో నిలుపు. ॥ 1 ॥

మంత్రము :

యో నః పాప్మన్ న జహాసి తము త్వా జహిమో వయమ్ ।

పథా మను వ్యావర్తనేఽన్యం పాప్మాను పద్యతామ్ ॥ 2 ॥

పదము :

యః । నః । పాప్మన్ । న । జహాసి । తమ్ । ఓంఇతి । త్వా ।
జహిమః । వయమ్ ।

పథామ్ । అను । వి౽అవర్తనే । అన్యమ్ । పాప్మా । అను ।
పద్యతామ్ ॥ 2 ॥

అనువాదం.

ఓ పాపదేవా! నీవు మమ్ములను వదలిపెట్టకపోతే
మేము నిన్ను నాలుగు దిక్కుల నుంచి వచ్చే
మార్గాలు కలిసే కూడలిలో వదలి పెడతాము.
అక్కడ వదలిపెట్టబడిన పాపం
మా ద్వేషిని ఆవహించుగాక! ॥ 2 ॥

మంత్రము.

అన్యత్రాస్మన్న్యుచ్యతు సహస్రాక్షో అమర్త్యః ।
యం ద్వేషామ తమృచ్ఛతు యము ద్విష్మ స్తమిజ్జహి ॥ 3 ॥

పదము.

అన్యత్ర । అస్మత్ । ని । ఉచ్యతు । సహస్ర౽అక్షః । అమర్త్యః ।
యమ్ । ద్వేషామ । తమ్ । ఋచ్ఛతు । యమ్ । ఓంఇతి ।
ద్విష్మః । తమ్ । ఇత్ । జహి ॥ 3 ॥

అనువాదం.

మా నుండి ఇంద్రుని వలె అమరణ ధర్మదేవ రూపమైన
పాప్మ పూర్తిగా తొలగిపోవుగాక!
ఏ శత్రువును మేము ద్వేషిస్తామో
అతనికి ఆ పాపం అంటుకొనుగాక!
తిరిగి ఎవరినైతే మేము ద్వేషిస్తామో
వానినే నశింపజెయ్యి. ॥ 3 ॥

ఇది ఇరవై ఆరవ సూక్తం

## సూక్తం - 27

ఋషిః భృగువు॥ దేవత యముడుః నిర్ ఋతి॥ ఛందస్సుః 1,3 జగతీ॥
2 త్రిష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం:- ఇళ్ళలో పావురాలు, గుడ్లగూబలు ప్రవేశిస్తే వాటి శాంత్యర్థం చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము

దేవాః కపోత ఇషితో యదిచ్ఛన్
దూతో నిర్ ఋత్యా ఇదమాజగామ ।
తస్మా అర్చామ కృణవామ నిష్కృతిం
శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే ॥ 1 ॥

పదము:

దేవాః । కపోతః । ఇషితః । యత్ । ఇచ్ఛన్ ।
దూతః । నిఃఽఋత్యాః । ఇదమ్ । అఽజగామ ।
తస్మై । అర్చామ । కృణవామ । నిఃఽకృతిమ్ ।
శమ్ । నః । అస్తు । ద్విఽపదే । శమ్ । చతుఃఽపదే ॥ 1 ॥

అనువాదం:

ఓ దేవతలారా! పాపదేవతకు దూతగా పంపబడిన కపోతమనెడి పక్షి ( పావురం ) ఎలా బాధించవలెనని మా ఇంటికి వచ్చినదో, దాని నివారణార్థం మిమ్ములను హవిస్సుతో పూజిస్తున్నాము.

ఆ దోషశాంతిని చేస్తున్నాము.
పాద ద్వయాలు గల మా పుత్ర భృత్యాదులకు
ఆ దోషశాంతిని చేస్తున్నాము
నాలుగు కాళ్ళుగల గవాశ్వాదులకు కూడ
రోగాదిశాంతి, కపోత ప్రవేశజనిత దోషశాంతి కలుగుగాక ‖ 1 ‖

మంత్రము

శివః కపోత ఇషితో నో అస్త్వనాగా
దేవాః శకునో గృహం నః ।
అగ్నిర్హి విప్రో జుషతాం హవి ర్నః
పరి హేతిః పక్షిణీ నో వృణక్తు ‖ 2 ‖

పదము

శివః । కపోతః । ఇషితః । నః । అస్తు । అనాగాః ।
దేవాః । శకునః । గృహమ్ । నః ।
అగ్నిః । హి । విప్రః । జుషతామ్ । హవిః । నః ।
పరి । హేతిః । పక్షిణీ । నః । వృణక్తు ‖ 2 ‖

అనువాదం.

ఓ దేవతలారా! నిర్ ఋతి దేవత పంపిన
కపోతం మాకు సుఖకర మగుగాక!
అపరాధం చేయని పక్షి మా ఇంటిని పీడింపకుండుగాక!
మేధావి అయిన అగ్ని మా హవిస్సును సేవించుగాక!
తదనుగ్రహం వల్ల రెక్కలు గల ఖడ్గం
మమ్ములను పరివర్జించుగాక! ‖ 2 ‖

మంత్రము

హేతిః పక్షిణీ న దభాత్యస్మా నాష్ట్రీ

పదం కృణుతే అగ్నిధానే ।

శివో గోభ్య ఉత పురుషేభ్యో నో

అస్తు మా నో దేవా ఇహ హింసీత్ కపోతః ॥ 3 ॥

పదము

హేతిః । పక్షిణీ । న । దభాతి । అస్మాన్ । ఆష్ట్రీ ఇతి ।

పదమ్ । కృణుతే । అగ్నిఽధానే ।

శివః । గోభ్యః । ఉత । పురుషేభ్యః । నః ।

అస్తు । మా । నః । దేవాః ఇహ । హింసీత్ । కపోతః ॥ 3 ॥

అనువాదం

పక్షయుక్తమైన హేతి మమ్ములను హింసింపకుండుగాక !
వ్యాపించిన అరణ్యంలో, దావాగ్ని
సంచారస్థానంలో పాదప్రసాదం చేయుగాక !
గోవులకు, మాకు సంబంధించిన
పురుషులకు శుభకరమగుగాక !
ఓ దేవతలారా ! ఈ ఇంటిలో మీ అనుగ్రహంవల్ల
ఈ కపోతం మమ్ములను బాధింపకుండుగాక ! ॥ 3 ॥

ఇది ఇరవై ఏడవ సూక్తం.

## సూక్తం - 28

ఋషిః భృగువు ॥ దేవత ॥ యముడు. నిర్ ఋతి ॥ ఛందస్సు. 1 త్రిష్టుప్ 2 అనుష్టుప్ : 3 జగతీ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం:- ఇళ్ళలో పావురాలు, గుడ్లగూబలు ప్రవేశిస్తే వాటి శాంత్యర్థం చేసే ప్రక్రియలో దీనికి వినియోగం

మంత్రము

ఋచా కపోతం నుదత ప్రణోద మిషం

మదన్తః పరి గాం నయామః ।

సంలోభయన్తో దురితా పదాని

హిత్వా న ఊర్జం ప్ర పదాత్ పథిష్ఠః ॥ 1 ॥

పదము

ఋచా । కపోతమ్ । నుదత । ప్రఽనోదమ్ । ఇషమ్ ।

మదన్తః । పరి । గామ్ । నయామః ।

సమ్ఽలోభయన్తః । దుఃఽఇతా । పదాని ।

హిత్వా । నః । ఊర్జమ్ । ప్ర । పదాత్ । పథిష్ఠః ॥ 1 ॥

అనువాదం

ఓ దేవతలారా ! ఈ మంత్రంతో కపోతాన్ని

ప్రణోదనీయంగా మా ఇంటి నుంచి ప్రేరేపించండి.

మేము కూడా అన్నంతో సంతృప్తులమై

అంతటా తిరుగుదుముగాక !

దుర్గతి నిమిత్తములైన పదములను పూర్తిగా తుడిచివేస్తూ,

పుష్టికరమైన-వంటశాలలోని అన్నాన్ని
వదలిపెట్టి వెళ్ళిపోవుగాక! ॥ 1 ॥

మంత్రము :

పరీమేఽగ్నిమర్షత పరీమే గామనేషత ।
దేవే ష్వక్రత శ్రవః క ఇమాం ఆ దధర్షతి ॥ 2 ॥

పదము :

పరి । ఇమే । అగ్నిమ్ । అర్షత । పరి । ఇమే । గామ్ । అనేషత ।
దేవేషు । అక్రత । శ్రవః । కః । ఇమాన్ । ఆ । దధర్షతి ॥ 2 ॥

అనువాదం

ఈ ఋత్విక్కులు కపోత ప్రవేశశాంత్యర్థం
అగ్నిని హోమార్థమై తెత్తురుగాక!
అలాగే ఈ గోవును ఇంటి చుట్టూ
ప్రదక్షిణం చేయించుదురు గాక!
అట్లే అగ్న్యాదులలో హవిర్లక్షణమైన
అన్నాన్ని వేయుదురుగాక!
ఈ విధంగా శాంతి చేసిన తరువాత
మా ఈ పురుషులను ఏ హింసకుడు బాధింపగలడు? ॥ 2 ॥

మంత్రము

యః ప్రథమః ప్రవత మాససాద
బహుభ్యః పన్థా మనుపస్పశానః ।
యోఽస్యేశే ద్విపదో య శ్చతుష్పద స్తస్మై

యమాయ నమో అస్తు మృత్యవే ॥ 3 ॥

పదము .

యః । ప్రథమః । ప్రఽవతమ్ । ఆఽససాద ।

బహుఽభ్యః । పన్థామ్ । అనుఽపస్పశానః ।

యః । అస్య । ఈశే । ద్విఽపదః । యః ।

చతుఃఽపదః । తస్మై । యమాయ । నమః । అస్తు । మృత్యవే
॥ 3 ॥

అనువాదం:

ఏ యముడు ఇతరదేవతల కంటె ప్రథముడై,
క్రమంగా ప్రాణు లందరిని స్పృశిస్తూ
ప్రవణవంతమైన మార్గాన్ని పొందెనో,
ఏ యముడు ఈ పాదద్వయము గల
మనుష్యాది ప్రాణిజాతానికి ఇష్టుడో,
చతుష్పాదులైన గవాదులకు ఇష్టుడో,
ఆ మృత్యుకారి అయిన దేవతకు నమస్కారం. ॥ 3 ॥

ఇది ఇరవై ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 29

ఋషి: భృగువు ॥ దేవత , యముడు , నిర్ ఋతి ॥ ఛందస్సు : 1,2 త్రిపదా విరాడ్నామ గాయత్రీ 3 సప్తపదా విరాడష్టిః ॥ మంత్రములు : ॥ 3 ॥

వినియోగం :- పూర్వసూక్తం వలెనే దీనికి కూడా వినియోగం

మంత్రము

అమూన్ హేతిః పతత్రిణీ న్యేఽతు యదులూకో వదతి
మోఘ మేతత్ ।

యద్ వా కపోతః పద మగ్నౌ కృణోతి ॥ 1 ॥

పదము

అమూన్ । హేతిః । పతత్రిణీ । ని । ఏతు । యత్ । ఉలూకః ।
వదతి । మోఘమ్ । ఏతత్ ।
యత్ । వా । కపోతః । పదమ్ । అగ్నౌ । కృణోతి ॥ 1 ॥

అనువాదం .

దూరంగా కనబడుతున్న మా శత్రువుల పైనికి
పక్ష్యాత్మికమైన ఖడ్గము వెళ్ళుగాక!
ఏ గుడ్లగూబ అమంగళంగా అరుస్తుందో
అది నిర్వీర్య మగు గాక!
కపోతపక్షి అశుభసూచనార్థం ఏ పదాన్ని పచనాగ్ని
సమీపంలో చేస్తుందో అది కూడా నిర్వీర్యమగుగాక! ॥ 1 ॥

మంత్రము

యౌ తే దూతౌ నిర్ ఋత ఇదమేతోఽప్రహితౌ ప్రహితౌ వా
గృహం నః ।
కపోతోలూకాభ్యా మపదం తదస్తు ॥ 2 ॥

పదము :

యౌ । తే । దూతౌ । నిఃఽఋతే । ఇదమ్ । ఆఽఇతః । అప్ర
ఽహితౌ । ప్రఽహితౌ । వా । గృహమ్ । నః ।
కపోతఽఉలూకాభ్యామ్ । అపదమ్ । తత్ । అస్తు ॥ 2 ॥

**అనువాదం**

ఓ నిర్ ఋతీ! నీ కపోత, ఉలూకాత్మకములైన
దూతలను నీవు పంపినా ఎంపకపోయినా
మా ఈ ఇల్లు, ఈ కపోత ఉలూకములకు
ఆశ్రయం కాకుండు గాక! ॥ 2 ॥

**మంత్రము**

అవైరహత్యాయేదమా పపత్యాత్ సువీరతాయా ఇద మా
ససద్యాత్ ।
పరాఙేవ పరా వద పరాచీ మను సంవతమ్ ।
యథా యమస్య త్వా గృహేఽరసం
ప్రతిచాకశానాభూకం ప్రతిచాకశాన్ ॥ 3 ॥

**పదము :**

అవైరఽహత్యాయ । ఇదమ్ । ఆ । పపత్యాత్ । సుఽవీరతాయై ।
ఇదమ్ । ఆ । ససద్యాత్ ।
పరాఙ్ । ఏవ । పరా । వద । పరాచీమ్ । అను । సమ్ఽవతమ్ ।
యథా । యమస్య । త్వా । గృహే । అరసమ్ ।
ప్రతిఽచాకశాన్ । ఆభూకమ్ । ప్రతిఽచాకశాన్ ॥ 3 ॥

**అనువాదం**

కపోత ఉలూక జనితమైన దుర్నిమిత్తం
మా వీరులను చంపకుండుటకై అగుగాక!

అలాగే శోభన వీరసద్భావం కోసం
ఈ దుర్నిమిత్తం పరాఙ్ముఖమై
దూరంగా వెళ్ళి ఉండుగాక !
ఓ కపోతాత్మకమైన దూతా !
నీ యజమాని గృహంలో నిన్ను
ఏ విధంగా నిస్సారంగా చూస్తారో,
కేవలం నీవు వచ్చుటతోనే అదే విధంగా చూస్తారు ॥ 3 ॥

ఇది ఇరవై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 30

**ఋషి. ఉపరిబభ్రువులు॥ దేవత శమీ॥ ఛందస్సు· 1 జగతి 2 త్రిష్టుప్ ; 3 చతుష్పదా శంకుమత్యనుష్టుప్· మంత్రములు. ॥ 3 ॥**

వినియోగం - పౌనసిర సవంలో చేసే మన్థాభిమర్శనాది కర్మలలో దీనికి వినియోగం

మంత్రము :

**దేవా ఇమం మధునా సంయుతం యవం**
**సరస్వత్యామధి మాణవచర్కృషుః ।**
**ఇన్ద్ర ఆసీత్ సీరపతిః శతక్రతుః**
**కీనాశా ఆసన్ మరుతః సుదానవః ॥ 1 ॥**

పదము.

**దేవాః । ఇమమ్ । మధునా । సమ్ఽయుతమ్ । యవమ్ ।**
**సరస్వత్యామ్ । అధి । మణౌ । అచర్కృషుః ।**

ఇన్ద్రః । ఆసీత్ । సీరఽపతిః । శతఽక్రతుః ।
కీనాశాః । ఆసన్ । మరుతః । సుఽదానవః ॥ 1 ॥

**అనువాదం**

మధు రసంతో సంప్రాప్తమైన యవధాన్యవిశేషాన్ని
సరస్వతీ నదీ సమీపంలో మనుష్యజాతిలో
దేవతలు ప్రసాదించినారు.
అప్పుడు సేద్యం చేసి ఆ ధాన్యాన్ని పండించుటకు
శతక్రతువు, ఇంద్రుడు సీరపతి ( హలాధిష్ఠాత ) అయినాడు
శోభన దానశీలురైన మరుత్తులు కర్షకులైనారు. ॥ 1 ॥

**మంత్రము**

యస్తే మదోఽవకేశో వికేశో యేనాభిహస్యం పురుషం కృణోషి
ఆరాత్ త్వదన్యా వనాని వృక్షి త్వం శమి శతవల్శా వి
రోహ ॥ 2 ॥

**పదము**

యః । తే । మదః । అవఽకేశః । విఽకేశః । యేన । అభిఽ
హస్యమ్ । పురుషమ్ । కృణోషి ।
ఆరాత్ । త్వత్ । అన్యా । వనాని । వృక్షి । త్వమ్ । శమి । శత
ఽవల్శా । వి । రోహ ॥ 2 ॥

**అనువాదం**

ఓ శమీ ! నీకు సంబంధించిన ఏ హర్షముతో
అంతటా పురుషుని హసనుని చేస్తున్నావో,

అహర్షం అవకేశము వికేశము అవుతున్నది
నేను కూడా నీనుంచి త్వద్వ్యతిరేకములైన,
దూరవర్తినులైన వనములను ఛేదిస్తున్నాను
ఓ శమీ! నీవు శతశాఖవై విరివిగా పెరుగు ॥ 2 ॥

మంత్రము

బృహత్పలాశే సుభగే వర్షవృద్ధ ఋతావరి ।
మాతేవ పుత్రేభ్యో మృడ కేశేభ్యః శమి ॥ 3 ॥

పదము.

బృహత్ఽపలాశే । సుఽభగే । వర్షఽవృద్ధే । ఋతఽవరి ।
మాతాఽఇవ । పుత్రేభ్యః । మృడ । కేశేభ్యః । శమి ॥ 3 ॥

అనువాదం :

ఓ బృహత్పలాశమా! ఓ సుభగా!
వర్షంతోనే వృద్ధిచెందుదానా!
ఓ ఋతావరీ! ఇలాంటి నీవు ఓ శమీ!
పుత్రులను తల్లివలె వెంట్రుకలను పోషించు ॥ 3 ॥

ఇది ఋష్యైప్రియపు సూక్తం.

## సూక్తం - 31

ఋషి, ఉపరి బభ్రువులు ॥ దేవత. ఎద్దు ॥ ఛందస్సు గాయత్రీ ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం :- వృశ్ని సవంలో చేసే గోరభిమర్శన సంపాతాది కర్మలలో దీనికి వినియోగం. అలాగే ఆధానంలో ఆహితుడైన ఆహవనీయాగ్నిని ఈ సూక్తంతో ఉపస్థానం చేయాలి పన్నెండవ రోజు అవివాక్యదినంలో మానస స్తోత్రాన్ని దీనితో అనుమంత్రించాలి.

మంత్రము

**అయం గౌః పృశ్ని రక్రమీదస దన్మాతరం పురః ।**

**పితరం చ ప్రయ న్త్స్వ౨ః ॥ 1 ॥**

పదము

**ఆ । అయమ్ । గౌః । పృశ్నిః । అక్రమీత్ । అసదత్ । మాతరమ్ పురః ।**

**పితరమ్ । చ । ప్ర౨యన్ । స్వ౨ః ॥ 1 ॥**

**అనువాదం.**

గమనశీలుడు, వ్యాప్తతేజుడు అయిన ఈ సూర్యుడు
ఉదయాద్రిని ఆక్రమించినాడు.
తన ముందు దిక్కున కనబడుతున్న
సర్వ భూతజాత అయిన భూమిని
తన కిరణములతో వ్యాపించినాడు
తరువాత వృష్టిలక్షణమైన రేతోనిషేకంతో
సర్వజగత్తునకు ఉత్పాదకమైన స్వర్లోకాన్ని,
అంతరిక్షాన్ని వ్యాపిస్తున్నాడు ॥ 1 ॥

మంత్రము

**అన్త శ్చరతి రోచనా అస్య ప్రాణా దపానతః ।**

**వ్య౨ఖ్యన్మహిషః । స్వ౨ః ॥ 2 ॥**

పదము

**అన్తః । చరతి । రోచనా । అస్య । ప్రాణాత్ । అపానతః ।**

**వి। అఖ్యత్। మహిషః। స్వ౭ః** ॥ 2 ॥

**అనువాదం.**

ప్రాణనవ్యాపారం తరువాత అపానన వ్యాపారం చేస్తున్న
ప్రాణిజాతం మధ్యలోని ముఖ్యప్రాణాత్మకమైన
సూర్యప్రభ మధ్యలో తిరుగుతున్నది
గొప్పదైన స్వర్గోపలక్షితమైన సర్వలోకాన్ని
ప్రకాశింపజేస్తున్నది ॥ 2 ॥

మంత్రము

**త్రింశద్ధామా వి రాజతి వాక్ పతఙ్గో అశిశ్రియత్।**
**ప్రతి వస్తోరహ ద్యుభిః** ॥ 3 ॥

పదము

**త్రింశత్। ధామ। వి। రాజతి। వాక్। పతఙ్గః। అశిశ్రియత్।**
**ప్రతి। వస్తోః। అహః। ద్యు౭భిః** ॥ 3 ॥

**అనువాదం:**

అహోరాత్రుల అవయవ భూతములైన
ముప్పై ముహూర్తాలు ఆయన స్థానాలు.
ఆ సూర్యుని కాంతుల చేతనే అవి ప్రకాశిస్తున్నవి
వేదరూపమైన వాక్కు శీఘ్రగామి
అయిన సూర్యుని ఆశ్రయించి ఉన్నది. ॥ 3 ॥

ఇది ముప్పై ఒకటవ సూక్తం

ఇది మూడవ అనువాకం

# అనువాకం - 4

## సూక్తం - 32

ఋషి: 1,2 చాతనుడు 3 అథర్వుడు ॥ దేవతలు: 1 అగ్ని 2 రుద్రుడు.
3 మిత్రావరుణులు ॥ ఛందస్సు 1, 3 త్రిష్టుప్, 2 ప్రస్తారపంక్తి ॥
మంత్రములు. ॥ 3 ॥

వినియోగం - పిశాచ రక్షోజనిత భయ నివృత్తికి ఈ సూక్తోక్తి ప్రకారం అగ్నికి మూడు సార్లు ప్రదక్షిణం చేసి పురోడాశాన్ని అహుతి చేయాలి.

మంత్రము:

అన్తర్దావే జుహుతా స్వేతద్ యాతుధానక్షయణం ఘృతేన।
ఆరా ద్రక్షాంసి ప్రతి దహ త్వమగ్నే నర్నో గృహాణాముప
తీతపాసి ॥ 1 ॥

పదము

అన్తఃఽదావే । జుహుత । సు । ఏతత్ । యాతుధానఽక్షయణమ్
ఘృతేన ।
ఆరాత్ । రక్షాంసి । ప్రతి । దహ । త్వమ్ । అగ్నే । న । నః ।
గృహాణామ్ । ఉప । తీతపాసి ॥ 1 ॥

అనువాదం

ఓ ఋత్విక్కులారా! రక్షోనిబర్హణమైన ఈ హవిస్సును
ఘృతంతో పాటు దావాగ్ని మధ్యలో హోమం చేయాలి.
ఓ అగ్ని! ఆహుత్యాధారంభూతుడ వైన నీవు
మాకు ఉపద్రవం చేసే రాక్షసులను
దూరం లోనే భస్మం చెయ్యి.
మా ఇళ్ళకు ఉపతాపకరుడవు కావద్దు. ॥ 1 ॥

మంత్రము

రుద్రో వో గ్రీవా అశరైత్ పిశాచాః

పృష్టీ ర్వోపి శృణాతు యాతుధానాః ।

వీరుద్ వో విశ్వతోవీర్యా యమేన సమజీగమత్ ॥ 2 ॥

పదము

రుద్రః । వః । గ్రీవాః । అశరైత్ । పిశాచాః ।

పృష్టీః । వః । అపి । శృణాతు । యాతుఽధానాః ।

వీరుత్ । వః । విశ్వతఃఽవీర్యా । యమేన । సమ్ । అజీగమత్ ॥ 2 ॥

అనువాదం

ఓ పిశాచములారా !
రుద్రుడు మీ గొంతుకలను కోసివేయుగాక !
ఓ యాతుధానులారా ! మీ ప్రక్క ఎముకలను
ఆ రుద్రుడే విచ్ఛిన్నం చేయుగాక !
విస్తృత వీర్యములైన ఓషధులు మిమ్ములను
మృత్యువుతో సంగమింపజేయుగాక ! ॥ 2 ॥

మంత్రము.

అభయం మిత్రావరుణా విహాస్తు నోఽర్చిషాత్త్రిణో నుదతం ప్రతీచః।

మా జ్ఞాతారం మా ప్రతిష్ఠాం విదన్త మిథో విఘ్నానా ఉప యన్తు మృత్యుమ్ ॥ 3 ॥

పదము

అభయమ్ । మిత్రావరుణౌ । ఇహ । అస్తు । నః । అర్చిషా ।
అత్త్రిణః । నుదతమ్ । ప్రతీచః ।
మా జ్ఞాతరమ్ । మా । ప్రతిఽస్థామ్ । విదన్త । మిథః ।
విఽఘ్నానాః । ఉప । యన్తు । మృత్యుమ్ ॥ 3 ॥

**అనువాదం.**

ఓ మిత్రావరుణులారా !
మాకు ఈ దేశంలో భయరాహిత్యం కలుగుగాక !
తిండిపోతులైన రాక్షసులను తేజస్సుతో
మా నుండి ప్రత్యఙ్ముఖులను చేయుదురుగాక !
వారు జ్ఞాత అయిన లెజమానిని పట్టుకొనకుందురుగాక !
అట్లే వారికి నివాసస్థానం దొరకకుండుగాక !
వారు తమలో తాము కొట్టుకొని మృత్యువుపాలగుదురుగాక !
॥ 3 ॥

ఇది ముప్పై రెండవ సూక్తం

## సూక్తం - 33

**ఋషి, జాటికాయనుడు** ॥ దేవత ఇంద్రుడు ॥ 1,3 గాయత్రి 2 **అనుష్టుప్** ॥
మంత్రములు ॥ 3 ॥

**వినియోగం** - కృషికర్మలో, క్షేత్రానికి వెళ్ళి నాగలిని కట్టి చేసే తరువాతి కర్మ కాండలో దీనికి వినియోగం. సర్వఫలకాముడు ఈ సూక్తంతో ఇంద్రుని యజనం చేస్తాడు

**మంత్రము :**

**యస్యేదమా రజో యుజస్తుజే జనా వనం స్వః ।**

ఇన్ద్రస్య ర_న్త్యం బృహత్ ॥ 1 ॥

పదము

యస్య । ఇదమ్ । ఆ । రజః । యుజః । తుజే । జనాః । వనమ్।
స్వ౨ః ।

ఇన్ద్రస్య । ర_న్త్యమ్ । బృహత్ ॥ 1 ॥

అనువాదం

ఏ ఇంద్రుని జ్యోతి శత్రుహింసకై నన్నద్ధం చేస్తుందో,
ఆ ఇంద్రుని రమణీయము, గొప్పనిరతిశయ సుఖసాధన
భూతమునైన తేజస్సును ఓ జనులారా!
మీరు భజించండి ॥ 1 ॥

మంత్రము

నాధృష ఆ దధృషతే ధృషాణో ధృషితః శవః ।

పురా యథా వ్యథిః శ్రవ ఇన్ద్రస్య నాధృషే శవః ॥ 2 ॥

పదము

న । ఆ౨ధృషే । ఆ । దధృషతే । ధృషాణః । ధృషితః । శవః ।

పురా । యథా । వ్యథిః । శ్రవః । ఇన్ద్రస్య । న । ఆ౨ధృషే ।
శవః ॥ 2 ॥

అనువాదం

ఆ ఇంద్రుడు ఇతరులతో అభిభూతుడు కాడు.
అతడు ధృషితుడై బలాన్ని అభిభవిస్తాడు.

పూర్వం ( వృత్రాసుర వధకాలములో ) వినబడే
ఇంద్రుని బలం ఇతరులచే అభిభూతం కాలేదు ॥ 2 ॥

మంత్రము

స నో దదాతు తాం రయిమురుం పిశఙ్గసందృశమ్ ।

ఇన్ద్రః పతిస్తువిష్టమో జనేష్వా ॥ 3 ॥

పదము.

సః । నః । దదాతు । తామ్ । రయిమ్ । ఉరుమ్ । పిశఙ్గऽసం
దృశమ్ ।

ఇన్ద్రః । పతిః । తువిऽతమః । జనేషు । ఆ ॥ 3 ॥

అనువాదం

ఆ ఇంద్రుడు మాకు ధనాన్ని ఇచ్చుగాక !
ఉత్కృష్ట కాంచనాన్ని ఇచ్చుగాక !
ఆ ఇంద్రుడు సర్వదేవ మానవులకు అధిపతి
సర్వప్రకారాల ఉత్కృష్టుడు. ॥ 3 ॥

ఇది ముప్పై మూడవ సూక్తం

## సూక్తం-34

ఋషి: చాతనుడు ॥ దేవత . అగ్ని ॥ ఛందస్సు . గాయత్రి ॥ మంత్రములు : ॥5॥

వినియోగం.- రాహుగ్రహ జనిత పీడా నివృత్త్యర్థం ఈ సూక్తంతో సమిధాజ్య శష్కుల్యంతములైన పదమూడు ద్రవ్యాలను హోమం చేస్తారు.

మంత్రము

ప్రాగ్నయే వాచమీరయ వృషభాయ క్షితీనామ్ ।

స నః పర్షదతి ద్విషః ॥ 1 ॥

పదము

ప్ర । అగ్నయే । వాచమ్ । ఈరయ । వృషభాయ । క్షితీనామ్ ।

సః । నః । పర్షత్ । అతి । ద్విషః ॥ 1 ॥

అనువాదం

ఓ స్తోతా ! రక్షోహంతకుడైన దేవునకు
స్తుతివిలక్షణమైన వాక్కును ప్రేరేపించు.
మనుష్యులలో కామాభిమర్షకు డతను
ఆ అగ్ని మా శత్రువులను పారిపోజేయుగాక ! ॥ 1 ॥

మంత్రము ।

యో రక్షాంసి నిజూర్వత్యగ్నిస్తిగ్మేన శోచిషా ।

స నః పర్షదతి ద్విషః ॥ 2 ॥

పదము

యః । రక్షాంసి । నిఽజూర్వతి । అగ్నిః । తిగ్మేన । శోచిషా ।

సః । నః । పర్షత్ । అతి । ద్విషః ॥ 2 ॥

అనువాదం.

ఏ అగ్ని తీక్ష్ణ తేజస్సుతో రాక్షసులను నశింపజేస్తాడో
ఆయన మా శత్రువులను నశింపజేయుగాక ! ॥ 2 ॥

మంత్రము.

యః పరస్యాః పరావతస్తిరో ధన్వాతిరోచతే ।

స నః పర్షదతి ద్విషః ॥ 3 ॥

పదము

యః । పరస్యాః । పరాఽవతః । తిరః । ధన్వ । అతిఽరోచతే ।
సః । నః । పర్షత్ । అతి । ద్విషః ॥ 3 ॥

అనువాదం

ఏ అగ్ని అత్యంత దూరదేశం నుంచి మరుభూమిని చేరి
అంతర్ధానమై అతిశయించి ప్రకాశిస్తాడో
ఆయన మా శత్రువులను నశింపజేయుగాక! ॥ 3 ॥

మంత్రము

యో విశ్వాభి విపశ్యతి భువనా సం చ పశ్యతి ।
స నః పర్షదతి ద్విషః ॥ 4 ॥

పదము

యః । విశ్వా । అభి । విఽపశ్యతి । భువనా । సమ్ । చ । పశ్యతి ।
సః । నః । పర్షత్ । అతి । ద్విషః ॥ 4 ॥

అనువాదం.

ఏ అగ్ని విశ్వభువనములను సర్వతః చూస్తాడో,
ఏక రూపమైన సూర్యాత్మతో ప్రకాశిస్తాడో
ఆ అగ్ని మా శత్రువులను నశింపజేయుగాక! ॥ 4 ॥

మంత్రము

యో అస్య పారే రజసః శుక్రో అగ్నిరజాయత ।
స నః పర్షదతి ద్విషః ॥ 5 ॥

పదము

యః । అస్య । పారే । రజసః । శుక్రః । అగ్నిః । అజాయత ।

సః । నః । పర్షత్ । అతి । ద్విషః ॥ 5 ॥

అనువాదం :

పార్థివలోకానికి చెందిన ఈ రజస్సు అంతంలో
ఏ శుక్రుడు నిర్మలుడై ఉదయిస్తున్నాడో,
అతడు మా శత్రువులను నశింప జేయుగాక ! ॥ 5 ॥

ఇది ముప్పై నాల్గవ సూక్తం

## సూక్తం-35

ఋషి. కౌశికుడు ॥ దేవత . వైశ్వానరుడు ॥ ఛందస్సు . గాయత్రి ॥ మంత్రములు.
॥ 3 ॥

వినియోగం – ఈ సూక్తంతో సర్వచికిత్సలతో ఉదకహారిద్రా సర్పిరాది ద్రవ్యాలను అభిమంత్రించి హోమం చెయ్యాలి. అగ్నిచయనంలో పురీషాచ్ఛన్నమైన చితిని బ్రహ్మ ఈ సూక్తంతో అను మంత్రించవలెను.

మంత్రము

వైశ్వానరో న ఊతయ ఆ ప్ర యాతు పరావతః ।

అగ్నిర్నః సుష్టుతీరుప ॥ 1 ॥

పదము

వైశ్వానరః । నః । ఊతయే । ఆ । ప్ర । యాతు । పరాఽవతః ।

అగ్నిః । నః । సుఽస్తుతీః । ఉప ॥ 1 ॥

అనువాదం.

విశ్వనరులకు హితుడైన అగ్ని మా రక్షణకోసమై
దూరదేశం నుంచి ఎదురు వచ్చుగాక!
ఆ అగ్ని మా శోభన స్తుతులను పొందుగాక! ॥ 1 ॥

మంత్రము:

వైశ్వానరో న ఆగమదిమం యజ్ఞం సజూరుప ।
అగ్నిరుక్థే ష్వంహఃసు ॥ 2 ॥

పదము:

వైశ్వానరః । నః । ఆ । అగమత్ । ఇమమ్ । యజ్ఞమ్ । సఽజూః
ఉప ।
అగ్నిః । ఉక్థేషు । అంహఽసు ॥ 2 ॥

అనువాదం:

వైశ్వానరుడైన అగ్ని మాకు ఎదురు వచ్చుగాక!
వచ్చి మా స్తోత్ర శస్త్రములలో సమానప్రీతిగలవాడై
మా ఈ యజ్ఞానికి వచ్చుగాక! ॥ 2 ॥

మంత్రము.

వైశ్వానరోఽఙ్గిరసాం స్తోమముక్థం చ చాక్లపత్ ।
ఐషు ద్యుమ్నం స్వఽర్యమత్ ॥ 3 ॥

పదము.

వైశ్వానరః । అఙ్గిరసామ్ । స్తోమమ్ । ఉక్థమ్ । చ । చక్లపత్ ।
ఆ । ఏషు । ద్యుమ్నమ్ । స్వఽః । యమత్ ॥ 3 ॥

**అనువాదం**

వైశ్వానరుడైన అగ్ని అంగిరో మహర్షుల స్తోత్రాన్ని
శాస్త్రాన్ని సమర్థంగా చేసినాడు.
ఈ అంగిర స్సూక్తాలలో ద్యోతమానుడైన అగ్నిని
సుగతునిగా ఆగమింపజేసినాడు.
దీని ఫలితాన్ని పొందునట్లుగా చేసినాడు ॥ 3 ॥

ఇది ముప్పై ఐదవ సూక్తం

## సూక్తం — 36

**ఋషిః అథర్వుడు॥ ( స్వస్త్యయనకాముడు ) దేవత : అగ్ని॥ ఛందస్సు : గాయత్రీ॥ మంత్రములు ॥ 3 ॥**

**వినియోగం :–** ఈ సూక్తంతో సర్వచికిత్సలలో ఉదకహరిద్రా సర్పిరాది ద్రవ్యాలను అభిమంత్రించి హోమం చెయ్యాలి.

మంత్రము,

**ఋతావానం వైశ్వానరమృతస్య జ్యోతిషస్పతిమ్ ।**
**అజస్రం ఘర్మమీమహే ॥ 1 ॥**

పదము

**ఋతఽవానమ్ । వైశ్వానరమ్ । ఋతస్య । జ్యోతిషః । పతిమ్ ।**
**అజస్రమ్ । ఘర్మమ్ । ఈమహే ॥ 1 ॥**

**అనువాదం**

సత్యవంతుడు, ఉదకవంతుడు,
యజ్ఞవంతుడు, యజ్ఞాత్మకమైన తేజస్సుకు పతి,
ఎల్లప్పుడు ప్రకాశించువాడు అయిన
వైశ్వానరుని ఉపాసిస్తున్నాము ॥ 1 ॥

మంత్రము.

స విశ్వా ప్రతి చాక్లృప ఋతూంరుత్సృజతే వశీ ।

యజ్ఞస్య వయ ఉత్తిరన్ ॥ 2 ॥

పదము .

సః । విశ్వా । ప్రతి । చక్లృపే । ఋతూన్ । ఉత్ । సృజతే । వశీ।

యజ్ఞస్య । వయః । ఉత్ఽతిరన్ ॥ 2 ॥

అనువాదం

ఆ వైశ్వానరుడు సర్వ ప్రజలకు
ఆయా ఫలముల నిచ్చుటకు సమర్థుడు
ఆయన వశయిత.
ఆయన యజ్ఞానికి సంబంధించిన అన్నాన్ని
పైనున్న దేవతలకు కొనిపోతూ
సూర్యాత్ముడై వసంతాది కాలములను నిర్మిస్తున్నాడు ॥ 2 ॥

మంత్రము :

అగ్నిః పరేషు ధామసు కామో భూతస్య భవ్యస్య ।

సమ్రాడేకో వి రాజతి ॥ 3 ॥

పదము

అగ్నిః । పరేషు । ధామఽసు । కామః । భూతస్య । భవ్యస్య ।

సమ్ఽరాట్ । ఏకః । వి । రాజతి ॥ 3 ॥

అనువాదం .

ఉత్కృష్ట స్థానములలో అగ్ని ఒక్కడే సమ్రాట్టు.

ఆయన ఉత్పన్నమైన, ఉత్పన్నం కానున్న
వానిని కోరుతూ విరాజిల్లు తున్నాడు. ॥ 3 ॥

ఇది ముప్పై ఆరవ సూక్తం

## సూక్తం – 37

**ఋషిః అథర్వుడు ( స్వస్త్యయన కాముడు) ॥ దేవత చంద్రుడు ॥ ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 3 ॥**

**వినియోగం – అభిచారజనిత దోషనివృత్తికై అభిమంత్రించిన తెల్ల మట్టిని ఇవ్వడం మొదలైన ప్రక్రియలలో దీనికి వినియోగం. 'యో నః శపాత్' అనే మంత్రంతో అభిచార కర్మలో పిడుగుపడి పడిపోయిన చెట్టునుండి 11 సమిధలను ఆధానం చెయ్యాలి.**

మంత్రము

ఉప ప్రాగాత్ సహస్రాక్షో యుక్త్వా శపథో రథమ్ ।
శప్తారమన్విచ్ఛన్ మమ వృక ఇవావిమతో గృహమ్ ॥ 1 ॥

పదము

ఉప । ప్ర । అగాత్ । సహస్రఽఅక్షః । యుక్త్వా । శపథః । రథమ్ ।
శప్తారమ్ । అనుఽఇచ్ఛన్ । మమ । వృకఃఽఇవ । అవిఽమతః । గృహమ్ ॥ 1 ॥

**అనువాదం**

సహస్రాక్షుడు శాపక్రియా సమర్థుడై
బండి కట్టు కొని మా సమీపమునకు వచ్చుగాక!
వచ్చి, మమ్ములను శపించిన వానిని చంపుగాక!

గొఱ్ఱెపిల్లల యజమాని ఇంటిని తోడేలు వలె
మా శత్రువులను చంపుగాక! ॥ 1 ॥

మంత్రము.

పరి ణో వృఙ్గ్ధి శపథ హ్రదమగ్నిరివా దహన్ ।
శప్తారమత్ర నో జహి దివో వృక్షమివాశనిః ॥ 2 ॥

పదము

పరి । నః । వృఙ్గ్ధి । శపథ । హ్రదమ్ । అగ్నిఃఽఇవ । దహన్ ।
శప్తారమ్ । అత్ర । నః । జహి । దివః । వృక్షమ్ఽఇవ । అశనిః ॥ 2 ॥

అనువాదం :

ఓ శపథమా! మమ్ములను బాధించకు
ఈ శత్రుకులాన్ని అగ్నివలె భస్మసాత్కరించి
ఈ దేశంలో మాకు శాపమిచ్చే శత్రువులు
లేకుండా నశింపజెయ్యి
ఆకాశం నుంచి పడే పిడుగు చెట్టునెలా
ధ్వంసం చేస్తుందో అలా ధ్వంసం చెయ్యి. ॥ 2 ॥

మంత్రము

యో నః శపాదశపతః శపతో యశ్చ నః శపాత్ ।
శునే పేష్ట్రమివావక్షామం తం ప్రత్యస్యామి మృత్యవే ॥ 3 ॥

పదము

యః । నః । శపాత్ । అశపతః । శపతః । యః । చ । నః ।
శపాత్ ।

శునే। పేష్ట్రమ్ఽఇవ। అవఽక్షామమ్। తమ్। ప్రతి। అస్యామి।
మృత్యవే ॥ 3 ॥

**అనువాదం**

ఏ శత్రువు శాపమివ్వని మమ్ము శాపంతో శపిస్తాడో,
శాపకారులైన మమ్ములను శపిస్తాడో
ఆ ఉభయవిధ శత్రువును కౌళేయకానికి (శునకమునకు)
పిష్టమును (పిండిని) వలె దగ్ధంచేసి
మృత్యువునకు ప్రతిక్షేపం చేస్తున్నాను ॥ 3 ॥

ఇది ముప్పై ఏడవ సూక్తం

## సూక్తం - 38

ఋషి అథర్వుడు (వర్చస్కాముడు)॥ దేవతలు: త్విషి, బృహస్పతి॥ ఛంద స్సు: త్రిష్టుప్॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం – వర్చస్కాముడు ఈ చెప్పబోవురెండు సూక్తములతో, సూత్రములలో పేర్కొన్న స్నాతక, సింహ వ్యాఘ్రాదులు ఏడునుకాక వేలగు దానికి నాభిలోమ మణిని లక్కతోను, బంగారుతోను కట్టి అభిమంత్రించి బంధించాలి. ఈ రెండు సూక్తములతో పలాశాది చళశాంతవృక్షశకల నిర్మిత మణిని లాక్షాహేమములతో తావడంచేసి కట్టుకొనవలెను ఉత్సర్జన కర్మలో వీటితో ఆజ్యమును హోమం చేయాలి

**మంత్రము**

సింహే వ్యాఘ్ర ఉత యా పృదాకౌ
త్విషిరగ్నౌ బ్రాహ్మణే సూర్యే యా।
ఇన్ద్రం యా దేవీ సుభగా జజాన
సా న ఐతు వర్చసా సంవిదానా ॥ 1 ॥

పదము

సింహే । వ్యాఘ్రే । ఉత । యా । పృదాకౌ ।

త్విషిః । అగ్నౌ । బ్రాహ్మణే । సూర్యే । యా ।

ఇన్ద్రమ్ । యా । దేవీ । సుఽభగా । జజాన ।

సా । నః । ఆ । ఏతు । వర్చసా । సమ్ఽవిదానా ॥ 1 ॥

అనువాదం :

సింహమునందు, బెబ్బులి యందు ఏ దీప్తికలదో,
సర్పములో, అగ్నిలో, బ్రాహ్మణునిలో,
సూర్యునిలో ఏ దీప్తి కలదో,
సౌభాగ్యయుక్త అయిన ఆ త్విషాత్మిక
దేవి ఇంద్రుని పుట్టించినది
ఆ దేవి మా అభీప్సిత తేజస్సుతో
కలియున్నదై మాలో ప్రవేశించు గాక ! ॥ 1 ॥

మంత్రము

యా హస్తిని ద్వీపిని యా హిరణ్యే

త్విషిరప్సు గోషు యా పురుషేషు ।

ఇన్ద్రం యా దేవీ సుభగా జజాన

సా న ఐతు వర్చసా సంవిదానా ॥ 2 ॥

పదము,

యా । హస్తిని । ద్వీపిని । యా । హిరణ్యే ।

త్విషిః । అప్‌ఽసు । గోషు । యా । పురుషేషు ।

ఇన్ద్రమ్ । యా । దేవీ । సుఽభగా । జజాన ।

సా । నః । ఆ । ఏతు । వర్చసా । సమ్‌ఽవిదానా ॥ 2 ॥

**అనువాదం**

ఏ కాంతి గజేంద్రునిలో, హిరణ్యంలో ఉన్నదో,
ఉదకంలో, గోవులలో, పురుషులలో
ఆ అసాధారణశక్తి ఏదైతే ఉన్నదో,
ఆ సుభగయుక్త అయిన త్విష్యాత్మిక దేవి
ఇంద్రుని పుట్టించినది.
ఆ దేవి మా అభీప్సిత తేజస్సుతో
కలియునదై మాలో ప్రవేశించుగాక! ॥ 2 ॥

మంత్రము

రథే అక్షేష్వృషభస్య వాజే వాతే పర్జన్యే వరుణస్య శుష్మే।
ఇన్ద్రం యా దేవీ సుభగా జజాన సాన ఐతు వర్చసా
సంవిదానా ॥ 3 ॥

పదము

రథే । అక్షేషు । ఋషభస్య । వాజే । వాతే । పర్జన్యే । వరుణస్య ।
శుష్మే ।

ఇన్ద్రమ్ । యా । దేవీ । సుఽభగా । జజాన । సా । నః । ఆ ।
ఏతు । వర్చసా । సమ్‌ఽవిదానా ॥ 3 ॥

**అనువాదం**

గమనసాధనమైన రథంలో, బండి కన్నులలో
సేచనసమర్థమైన వృషభవేగ గమనంలో,
వాయువులో, పర్జన్యునిలో, (వృష్టిప్రదమేఘంలో)
దాని అధిష్ఠాత అయిన వరుణ దేవుని శోషక బలంలో
ఏ దీప్తి ఉన్నదో ఆ త్విష్యాత్మక దేవి,
సుభగ ఇంద్రుని పుట్టించినది
ఆమె మా అభీప్సిత తేజస్సుతో కలియునదై
మాలో ప్రవేశించు గాక! ॥ 3 ॥

**మంత్రము.**

రాజన్యేఽదున్దుభావాయతాయామశ్వస్య వాజే పురుషస్య
మాయౌ ।
ఇన్ద్రిం యా దేవీ సుభగా జజాన సా నఐతు వర్చసా
సంవిదానా ॥ 4 ॥

**పదము:**

రాజన్యేఽ । దున్దుభౌ । ఆఽయతాయామ్ । అశ్వస్య । వాజే ।
పురుషస్య । మాయౌ ।
ఇన్ద్రిమ్ । యా । దేవీ । సుఽభగా । జజాన । సా । నః । ఆ ।
ఏతు । వర్చసా । సమ్ఽవిదానా ॥ 4 ॥

**అనువాదం:**

రాజకుమారునిలో, మ్రోగించే దుందుభిలో ఏకాంతి ఉన్నదో,
అశ్వవేగంలో, పురుషుని కేకలో ఏ దీప్తి ఉన్నదో,

ఏ త్విష్యాత్మిక దేవి సుభగ ఇంద్రుని జనింపజేసెనో,
ఆమె మా అభీప్సిత తేజస్సుతో కలియునదై
మాలో ప్రవేశించు గాక! ॥ 4 ॥

ఇది ముప్పై ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 39

ఋషిః అథర్వుడు (వర్చస్కాముడు)॥ దేవత బృహస్పతి॥ ఛందస్సు: 1 జగతీ, 2 త్రిష్టుప్ 3 అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం:- పూర్వ సూక్తమునకు వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము

యశో హవిర్వర్ధతామిన్ద్రజూతం సహస్రవీర్యం సుభృతం సహస్కృతమ్ ।
ప్రసర్స్రాణమను దీర్ఘాయ చక్షసే హవిష్మన్తం మా వర్ధయ జ్యేష్ఠతాతయే ॥ 1 ॥

పదము

యశః । హవిః । వర్ధతామ్ । ఇన్ద్రఽజూతమ్ । సహస్రఽవీర్యమ్ । సుఽభృతమ్ । సహఃఽకృతమ్ ।
ప్రసర్స్రాణమ్ । అను । దీర్ఘాయ । చక్షసే । హవిష్మన్తమ్ । మా । వర్ధయ । జ్యేష్ఠఽతాతయే ॥ 1 ॥

అనువాదం:

యశస్సు వృద్ధిపొందుగాక!
ఇంద్రుని ఉద్దేశించి మేము ప్రేరేపించినది,

అపరిమిత సామర్థ్యయుక్తమైనది,
సరిగా పరివర్తమానం చెందునది
పరాభిభవనక్షమమైన బలానికి కారకమైనది,
ప్రసరణ శీలమైనది అయిన హవిస్సు వృద్ధి పొందుగాక !
ఆ హవిస్సుతో కూడిన యజమాని అయిన నన్ను
చిరకాల దర్శనార్థమై, సర్వశ్రేష్ఠత్వం కొఱకు
ఓ ఇంద్రా! సమృద్ధిపొందించు. ॥ 1 ॥

మంత్రము

అచ్ఛా న ఇన్ద్రం యశసం యశోభిర్యశస్వినం నమసానా విధేమ ।
స నో రాస్వ రాష్ట్రమిన్ద్రజూతం తస్య తే రాతౌ యశసః స్యామ ॥ 2 ॥

పదము

అచ్ఛ । నః । ఇన్ద్రమ్ । యశసమ్ । యశఃఽభిః । యశస్వినమ్ । నమసానాః । విధేమ ।
సః । నః । రాస్వ । రాష్ట్రమ్ । ఇన్ద్రఽజూతమ్ । తస్య । తే । రాతౌ । యశసః । స్యామ ॥ 2 ॥

అనువాదం

మాకు అభిముఖంగా నున్న ఇంద్రుని,
యశోరూపుని, యశస్సు నిచ్చువానిని,
యశస్సులతో యశస్వి అయిన ఇంద్రుని
నమస్కారాదులతో పూజిస్తూ మేము పరిచరిస్తున్నాము.

అనువాదం :

ఓ ఇంద్రా! నీవు మాకై నీచే ప్రేరితమైన రాజ్యాన్ని ఇవ్వు.
ఆ నీ దానంతో మేము యశస్వుల మగుదుముగాక!

మంత్రము

యశా ఇన్ద్రో యశా అగ్నిర్యశాః సోమో అజాయత ।

యశా విశ్వస్య భూతస్యాహమస్మి యశస్తమః ॥ 3 ॥

పదము :

యశాః । ఇన్ద్రః । యశాః । అగ్నిః । యశాః। సోమః । అజాయత।

యశాః । విశ్వస్య । భూతస్య । అహమ్ । అస్మి । యశఃఽతమః

॥ 3 ॥

అనువాదం.

ఇంద్రుడు యశః కాంక్షియై ఉన్నాడు.
అలాగే అగ్ని కూడా యశస్కాముడుగా ఉన్నాడు.
అలాగే సోముడు కూడా యశస్కాముడై ఉన్నాడు.
యశస్కాముడనైన నేను కూడా
సర్వభూతజాత సకాశంలో గొప్ప యశస్వినౌతాను ॥ 3 ॥

ఇది ము పైన తొమ్మిదవ సూక్తం

## సూక్తం–40

ఋషి 1,2 అథర్వుడు ( అభయకాముడు ) : 3 అథర్వుడు (స్వస్త్యయనకాముడు॥
దేవతలు 1,2 మంత్రములందు పేర్కొన్నవారు : 3 ఇంద్రుడు)
ఛందస్సు : 1,2 జగతి . 3 అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 3 ॥

వినియోగం – గ్రామాభ్యుదయ కాముడు అందుకై ప్రతిదిక్కులోను సప్తర్షులను ఉపాసిస్తాడు. సేనాభయ నివృత్త్యర్థం ప్రతిదిశలోను సప్తర్షులకు

**ఉపస్థానం చేస్తాడు. అలాగే ఈ మూడు మంత్రాలతో ఉపాకర్మలో ఆజ్యహోమం చేస్తారు.**

మంత్రము

అభయం ద్యావాపృథివీ ఇహాస్తు నోఽభయం సోమః సవితా
నః కృణోతు ।
అభయం నోఽస్తూర్వ1న్తరిక్షం సప్తఋషీణాం చ హవిషా
భయం నో అస్తు ॥ 1 ॥

పదము :

అభయమ్ । ద్యావాపృథివీ ఇతి । ఇహ । అస్తు । నః । అభయమ్
సోమః । సవితా । నః । కృణోతు ।
అభయమ్ । నః । అస్తు । ఉరు । అన్తరిక్షమ్ । సప్తఽఋషీణామ్
చ । హవిషా । అభయం । నః । అస్తు ॥ 1 ॥

**అనువాదం.**

ఓ ద్యావా పృథువులారా! మీ అనుగ్రహం వల్ల
ఈ దేశంలో మాకు భయం లేకుండు గాక!
అలాగే సోముడు, చంద్రుడు, సవిత
మాకు అభయ మిత్తురుగాక!
అట్లే ద్యావా పృథువుల మధ్యనున్న
విశాలమైన అంతరిక్షం మాకు అభయ మిచ్చుగాక!
*సప్తర్షులకు సంబంధించిన హవిస్సుతో
మాకు అభయం కలుగుగాక! ॥ 1 ॥

---

* విశ్వామిత్రో జమదగ్ని ర్భరద్వాజోఽథ గౌతమః ।
అత్రిర్వసిష్ఠః కశ్యప ఇత్యేతే సప్తఋషయః ॥ ॥ అత్రైవ 1 ॥

మంత్రము

అస్మై గ్రామాయ ప్రదిశశ్చతస్ర ఊర్జం

సుభూతం స్వస్తి సవితా నః కృణోతు ।

అశత్ర్వింద్రో అభయం నః కృణోత్వన్యత్ర

రాజ్ఞామభి యాతు మన్యుః ॥ 2 ॥

పదము

అస్మై । గ్రామాయ । ప్రఽదిశః । చతస్రః । ఊర్జమ్ ।

సుఽభూతమ్ । స్వస్తి । సవితా । నః । కృణోతు ।

అశత్రుః । ఇంద్రః । అభయమ్ । నః । కృణోతు ।

అన్యత్ర । రాజ్ఞామ్ । అభి । యాతు । మన్యుః ॥ 2 ॥

అనువాదం.

మా గ్రామమునకు నాలుగు దిక్కు లున్నవి.
సర్వదిక్కులలోను అన్నం కావలసినంత ఉత్పన్న మగుగాక!
ఈ క్షేమాన్ని మాకు సవిత చేకూర్చుగాక!
అలాగే అజాతశత్రువైన ఇంద్రుడు మాకు అభయ మిచ్చుగాక!
ఆయన అనుగ్రహం వల్ల రాజుల క్రోధం
మా నుండి మఱొకరి పైకి పోవుగాక! ॥ 2 ॥

మంత్రము.

అనమిత్రం నో అధరాదనమిత్రం న ఉత్తరాత్ ।

ఇంద్రానమిత్రం నః పశ్చాదనమిత్రం పురస్కృధి ॥ 3 ॥

పదము,

అనమిత్రమ్ । నః । అధరాత్ । అనమిత్రమ్ । నః । ఉత్తరాత్ ।

ఇన్ద్ర । అనమిత్రమ్ । నః । పశ్చాత్ । అనమిత్రమ్ । పురః ।

కృధి ॥ 3 ॥

అనువాదం :

ఓ ఇంద్రుడా! మాకు దక్షిణదిశలో శత్రువులు లేకుండాచెయ్యి.
అలాగే ఉత్తర దిశలోను శత్రురాహిత్యాన్ని కల్పించు.
ఓ ఇంద్రా! మాకు పశ్చిమ దిక్కున శత్రువులులేకుండా చూడు
పూర్వదిక్కును కూడా శత్రురహితం చెయ్యి. ॥ 3 ॥

ఇది నలభైయవ సూక్తం.

## సూక్తం - 41

ఋషి బ్రహ్మ॥ దేవతలు. మనస్సు మొదలగు దివ్యఋషులు॥ ఛందస్సు:
1 భురిగనుష్టుప్ 2 అనుష్టుప్. 3 త్రిష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం - ఈ సూక్తంతో గోదావ సంస్కార కర్మలో మహావ్రీహిమయమైన స్థాలీపాకాన్ని శాంత్యుదకంతో అభిమంత్రించి ఆయుష్కాముడైన వటువుచేత తినిపిస్తారు.

మంత్రము.

మనసే చేతసే ధియ ఆకూతయ ఉత చిత్తయే ।

మత్యై శ్రుతాయ చక్షసే విధేమ హవిషా వయమ్ ॥ 1 ॥

పదము:

మనసే । చేతసే । ధియే । ఆ౽కూతయే । ఉత । చిత్తయే ।

మత్యై । శ్రుతాయ । చక్షసే । విధేమ । హవిషా । వయమ్ ॥ 1 ॥

**అనువాదం :**

మనన సాధనమైన చేతస్సునకై,
ధ్యాన సాధనమునకై, సంకల్పమునకై,
చిత్తమునకై, మతికై, శ్రుతికై,
దర్శనమునకై మేము హవిస్సుతో
పరిచర్యలు చేస్తున్నాము ॥ 1 ॥

**మంత్రము :**

అపానాయ వ్యానాయ ప్రాణాయ భూరిధాయసే ।
సరస్వత్యా ఉరువ్యచే విధేమ హవిషా వయమ్ ॥ 2 ॥

**పదము :**

అపానాయ । విఽఆనాయ । ప్రాణాయ । భూరిఽధాయసే ।
సరస్వత్యై । ఉరుఽవ్యచే । విధేమ । హవిషా । వయమ్ ॥ 2 ॥

**అనువాదం :**

అపానానికై, వ్యానమునకై, ప్రాణమునకై,
ఈ విధంగా ప్రాణాపాన వ్యాన వృత్తి భేదముతో
ఉన్న ముఖ్య ప్రాణమునకై,
బహుళధారకమైన, బహుళవ్యాపకమైన
సరస్వతికై హవిస్సుతో పరిచర్యలు చేస్తున్నాము. ॥ 2 ॥

**మంత్రము**

మా నో హాసిషుర్ ఋషయో దైవ్యా
యే తనూపా యే నస్తన్వఽస్తనూజాః ।

అమర్త్యా మర్త్యాం అభి నః సచధ్వ-
మాయుర్ధత్త ప్రతరం జీవసే నః ॥ 3 ॥

పదము.

మా । నః । హాసిషుః । ఋషయః । దైవ్యాః ।
యే । తనూఽపాః । యే । నః । తన్వఽః । తనూఽజాః ।
అమర్త్యాః । మర్త్యాన్ । అభి । నః । సచధ్వమ్ ।
ఆయుః । ధత్త । ప్రఽతరమ్ । జీవసే । నః ॥ 3 ॥

అనువాదం.

దేవతల లోను ఋషులు మమ్ములను వదలిపెట్ట కుందురుగాక!
ఏ ఋషులు శరీర రక్షకులో, ఎవరు మా శరీరాల నుంచి
ఇంద్రియాత్మకులై జన్మించినారో,
ఆ ఋషులు మమ్ములను వదలిపెట్ట కుందురు గాక!
ఓ అమరులారా!
మరణధర్ములమైన మమ్ము చుట్టు ముట్టుదురుగాక!
మా జీవనార్థం ప్రకృష్టతరమైన ఆయుస్సును ఇత్తురు గాక! ॥ 3 ॥

ఇది నలభై ఒకటవ సూక్తం

ఇది నాల్గవ అనువాకం

# అనువాకం: 5

## సూక్తం – 42

ఋషులు భృగ్వంగిరసులు (పరస్పరం చిత్తైకీకరణకాములు)॥ దేవత. మన్యువు॥ ఛందస్సు 1,2 భురిగనుష్టుప్. 3 అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం :- స్త్రీ పురుషులకు పరస్పర కోపవినాశార్థం చేసే ప్రక్రియలో దీనికి వినియోగం. దీక్షలో ఉన్న యజమాని తనకు కోపం వచ్చినపుడు ఈ మంత్ర త్రయాన్ని జపించాలి.

మంత్రము :

అవ జ్యామివ ధన్వనో మన్యుం తనోమి తే హృదః ।

యథా సంమనసౌ భూత్వా సఖాయావివ సచావహై ॥ 1 ॥

పదము :

అవ । జ్యామ్ఽఇవ । ధన్వనః । మన్యుమ్ । తనోమి । తే । హృదః

యథా । సమ్ఽమనసౌ । భూత్వా । సఖాయౌఽఇవ । సచావహై ॥ 1 ॥

అనువాదం :

ధనుర్దండం నుంచి ఎక్కిడిన అల్లెత్రాడును
తొలగించినట్లు ఓ పురుషుడా!
నీహృదయం నుంచి క్రోధాన్ని తొలగిస్తున్నాను
మనమిద్దరం పరస్పరానురక్తులమై
స్నేహితుల వలె కలిసి పనిచేస్తున్నట్లు
ఈ క్రోధాన్ని అపనయింప జేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము

సఖాయావివ సచావహా అవ మన్యుం తనోమి తే ।

అధస్తే అశ్మనో మన్యుముపాస్యామసి యో గురుః ॥ 2 ॥

పదము :

సఖాయౌఽఇవ । సచావహై । అవ । మన్యుమ్ । తనోమి । తే ।

అధః । తే । అశ్మనః । మన్యుమ్ । ఉప । అస్యామసి । యః ।
గురుః ॥ 2 ॥

అనువాదం

ఓ క్రుద్ధుడైన మానవుడా!
మనం కలిసి పనిచేయుటకై నీ కోపాన్ని కదలింపరాని
ఆ రాతి అడుగున పడవేస్తున్నాము.
మేము స్నేహితుల వలె సంగతులమై
నిన్ను క్రోధదూరుని చేస్తున్నాము. ॥ 2 ॥

మంత్రము :

అభి తిష్ఠామి తే మన్యుం పార్ష్ణ్యా ప్రపదేన చ ।
యథావశో న వాదిషో మమ చిత్తముపాయసి ॥ 3 ॥

పదము :

అభి । తిష్ఠామి । తే । మన్యుమ్ । పార్ష్ణ్యా । ప్రఽపదేన । చ ।
యథా । అవశః । న । వాదిషః । మమ । చిత్తమ్ । ఉపఽఆయసి
॥ 3 ॥

అనువాదం

ఓ క్రుద్ధ పురుషుడా!
నీ కోపాన్ని పాదాగ్రంతో అణచి నిలబడుతున్నాను.
పరవశుడవై వాదించకుండా నీవు
నా మనస్సుకు సమీపించునట్లు నిలుచున్నాను. ॥ 3 ॥

ఇది నలభై రెండవ సూక్తం

## సూక్తం–43

ఋషులు: భృగ్వంగిరసులు (పరస్పరం చిత్తైకీకరణకాములు)॥ దేవత: మన్యుశమనమ్॥ ఛందస్సు: అనుష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం:- సర్వవిషయ మన్యు వినాశార్థం ఈ సూక్తంతో దర్భమూలాన్ని ఓషధివలె పూడ్చిపెట్టి అభిమంత్రించి బంధించాలి.

మంత్రము

అయం దర్భో విమన్యుకః స్వాయ చారణాయ చ ।
మన్యోర్విమన్యుకస్యాయం మన్యుశమన ఉచ్యతే ॥ 1 ॥

పదము:

అయమ్ । దర్భః । వి౽మన్యుకః । స్వాయ । చ । అరణాయ । చ
మన్యోః । వి౽మన్యుకస్య । అయమ్ । మన్యు౽శమనః ।
ఉచ్యతే ॥ 1 ॥

అనువాదం

నే విసరిగా ఈ దర్భ జ్ఞాతి అయిన అరాతి కోసం
జ్ఞాతికాని అరాతి కోసం ఉద్దిష్టమైనది
కోపించిన శత్రువునకు, కోపరహితుడైన
వానికి ఈ ప్రయోగం కోపనివారణార్థమై
విధానజ్ఞులు నిర్దేశించినది. ॥ 1 ॥

మంత్రము

అయం యో భూరిమూలః సముద్రమవతిష్ఠతి ।
దర్భః పృథివ్యా ఉత్థితో మన్యుశమన ఉచ్యతే ॥ 2 ॥

పదము

అయమ్ । యః । భూరి౽మూలః । సముద్రమ్ । అవ౽తిష్ఠతి ।

దర్భః । పృథివ్యాః । ఉత్థితః । మన్యు౽శమనః । ఉచ్యతే ॥ 2 ॥

అనువాదం :

నా ముందున్న అనేక వేళ్ళుగల దర్భ
ఉదకభూయిష్ఠమైన ప్రదేశంలో మొలిచినది
పృథివీ సకాశం నుంచి ఉత్పన్నమైన ఈ దర్భ
కాశకుశాద్యాత్మకమైన మన్యుశమని అని చెప్తారు. ॥ 2 ॥

మంత్రము

వి తే హనవ్యాం౽ శరణిం వి తే ముఖ్యాం నయామసి ।

యథావశో న వాదిషో మమ చిత్తముపాయసి ॥ 3 ॥

పదము

వి । తే । హనవ్యా౽మ్ । శరణిమ్ । వి । తే । ముఖ్యామ్ ।
నయామసి ।

యథా । అవశః । న । వాదిషః । మమ । చిత్తమ్ । ఉప౽ఆయసి
॥ 3 ॥

అనువాదం

ఓ క్రోధావిష్ట పురుషుడా!
నీ కోపజనకమైన ధమనిని అణచిపెడుతున్నాము
అలాగే నీముఖంలో కనిపించే ఇంకొక
క్రోధ వశోత్పన్నమైన ధమనిని కూడా అణచివేస్తున్నాము

నీవు జవాబు చెప్పకుండా నా మనస్సుకు
దగ్గఱకు వచ్చునట్లుగా చేస్తున్నాను ॥ 3 ॥

ఇది నలభై మూడవ సూక్తం

## సూక్తం - 44

**ఋషి విశ్వామిత్రుడు॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్నవారు॥ ఛందస్సు: 1,2 అనుష్టుప్. 3 త్రిపదా మహాబృహతీ॥ మంత్రములు. ॥ 3 ॥**

**వినియోగం :- అపవాత చికిత్సలో స్వయంపతితమైన ఆవు కొమ్మును నీళ్ళలో వేసి అభిమంత్రించి, ఆ నీళ్ళను ఆచమింపజేసి, ప్రోక్షించుటలో దీనికి వినియోగం.**

మంత్రము:

**అస్థాద్ ద్యౌరస్థాత్ పృథివ్యస్థాద్ విశ్వమిదం జగత్ ।**
**అస్థుర్వృక్షా ఊర్ధ్వస్వప్నాస్తిష్ఠాద్ రోగో అయం తవ ॥ 1 ॥**

పదము:

**అస్థాత్ । ద్యౌః । అస్థాత్ । పృథివీ । అస్థాత్ । విశ్వమ్ । ఇదమ్ । జగత్ ।**
**అస్థుః । వృక్షాః । ఊర్ధ్వ౽స్వప్నాః । తిష్ఠాత్ । రోగః । అయమ్। తవ ॥ 1 ॥**

అనువాదం

ద్యులోకం ఎలా క్రిందపడక నిలిచి ఉన్నదో,
పృథివి సర్వాధార భూతమై ఎలా ఉన్నదో,
వాని మధ్య పరిదృశ్యమానమైన సర్వజగత్తూ ఎలా ఉన్నదో,
చెట్లన్నీ పైకే ఎలా వెళ్ళుచున్నవో,

ఓ వ్యాధితుడా! నీరోగం రక్తం
స్రవించకుండా నిలిచి పోవుగాక! ॥ 1 ॥

మంత్రము:

శతం యా భేషజాని తే సహస్రం సంగతాని చ ।
శ్రేష్ఠమాస్రావభేషజం వసిష్ఠం రోగనాశనమ్ ॥ 2 ॥

పదము.

శతమ్ । యా । భేషఽజాని । తే । సహస్రమ్ । సమ్ఽగతాని । చ
శ్రేష్ఠమ్ । ఆస్రావఽభేషజమ్ । వసిష్ఠమ్ । రోగఽనాశనమ్ ॥ 2 ॥

అనువాదం:

నీ రోగానికి ఓ వ్యాధితుడా!
శతాధిక ఔషధము లున్నవి
దొరికిన చికిత్సలు వేయి ఉన్నవి.
వానిలో ప్రశస్తతమమైన ఈ చికిత్స
రక్తస్రావాన్ని ఆపి రోగనాశకమై తిరుతుంది. ॥ 2 ॥

మంత్రము:

రుద్రస్య మూత్రమస్యమృతస్య నాభిః ।
విషాణకా నామ వా అసి పితౄణాం
మూలాదుత్థితా వాతీకృతనాశనీ ॥ 3 ॥

పదము.

రుద్రస్య । మూత్రమ్ । అసి । అమృతస్య । నాభిః ।

వి2సానకా । నామ । వై । అసి । పితౄణామ్ ।

మూలాత్ । ఉత్థితా । వాతీకృత2నాశనీ ॥ 3 ॥

**అనువాదం**

ఓ గోశృంగోదకమా ! నీవు *రుద్రుని మూత్రమవు.
అలాగే చిరకాల జీవనునకు నాభివి.
ఓ గోశృంగమా ! నీకు విషాణకమనే పేరు గలదు.
అనగా విశేషించి రోగనివర్తకమని పేరు వచ్చినది.
పితృదేవతలకు ఉపాదాన కారణంగా ఉత్పన్నమై
అస్రావ రోగాన్ని సమూలంగా శోషింపజేయగల దానవు ॥3॥

ఇది నలభై నాల్గవ సూక్తం

## సూక్తం - 45

**ఋషులు:** అంగిరసుడు, ప్రచేతసుడు, యముడు ॥ **దేవత:** దుస్స్వప్ననాశనమ్ ॥ ఛందస్సు. 1 పథ్యాపంక్తి: 2 భురిక్ త్రిష్టుప్: 3 అనుష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥

**వినియోగం:-** దుస్స్వప్న దర్శన దోషనివారణార్థం, అతిఘోర దుస్స్వప్న దర్శన దోష నివారణార్థం చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం,

**మంత్రము.**

పరోపేహి మనస్పాప కిమశస్తాని శంససి ।

పరేహి న త్వా కామయే వృక్షాం వనాని

సం చర గృహేషు గోషు మే మనః ॥ 1 ॥

---

*రస శాస్త్రంలో చెప్పినట్లు ఈశ్వర వీర్యమైన రసాన్ని సేవించి సిద్ధులు అజరామరత్వాన్ని పొందుతారన్న భావంతో చెప్పినది.

పదము

పరః । అప । ఇహి । మనః౽పాప । కిమ్ । అశస్తాని । శంససి ।
పరా । ఇహి । న । త్వా । కామయే । వృక్షాన్ । వనాని ।
సమ్ । చర । గృహేషు । గోషు । మే । మనః ॥ 1 ॥

అనువాదం

పాపాసక్తమైన ఓ మనస్సా!
మా నుంచి నీవు దూరంగా వెళ్ళు.
దుస్స్వప్నాలను చూపించ వద్దు.
అందుకనే నిన్ను నేను వాంఛింపను
వెళ్ళి అడవులలో ప్రవేశించి అక్కడే తిరుగుతూ ఉండు.
ఓ నా శుభకరమైన చిత్తమా!
ఇంటిలో నున్న స్త్రీ పుత్రాదుల యందును,
ఆవుల యందును సంచరించు. ॥ 1 ॥

మంత్రము

అవశసా నిఃశసా యత్ పరాశసోపారిమ
జాగ్రతో యత్ స్వపన్తః ।
అగ్నిర్విశ్వాన్యప దుష్కృతాన్యజుష్టాన్యారే
అస్మద్ దధాతు ॥ 2 ॥

పదము.

అవ౽శసా । నిః౽శసా । యత్ । పరా౽శసా । ఉప౽ఆరిమ ।

జాగ్రతః । యత్ । స్వపన్తః ।

అగ్నిః । విశ్వాని । అప । దుఃఽకృతాని । అజుష్టాని । ఆరే ।

అస్మత్ । దధాతు ॥ ౨ ॥

**అనువాదం :**

హింసనంతో కాని, నిశ్శేష హింసనంతోగాని,
పరాఙ్ముఖ హింసనంతోగాని, మేల్కొన్న మేము
ఏ దుస్స్వప్నంతో పీడితుల మగుదుమో
ఆ విధంగా నిద్రావస్థను పొందిన మేము
ఈ వివిధ దుస్స్వప్న దర్శనంతో పీడితుల మగుదుము
ఆ సర్వ అశుభములను, దుస్స్వప్న
నిమిత్తములైన పాపములను అగ్ని దేవుడు
మా నుండి దూరంగా ఉంచుగాక! ॥ 2 ॥

**మంత్రము :**

యదిన్ద్ర బ్రహ్మణస్పతేఽపి మృషా చరామసి ।

ప్రచేతా న ఆఙ్గిరసో దురితాత్ పాత్వంహసః ॥ 3 ॥

**పదము**

యత్ । ఇన్ద్ర । బ్రహ్మణః । పతే । అపి । మృషా । చరామసి ।

ప్రఽచేతాః । నః । ఆఙ్గిరసః । దుఃఽఇతాత్ । పాతు । అంహసః
॥ 3 ॥

**అనువాదం :**

ఓ ఇంద్రుడా! ఏ దుస్స్వప్న నిమిత్తంతో
మేము ఊరకే తిరుగుతున్నామో,

దుఃఖ ప్రాపకమైన అ పాపం నుంచి
అంగిరస మంత్ర సంబంధమైన
ప్రకృష్ట జ్ఞానోపేతుడైన ప్రచేతసు డనే
పేరుగల వరుణుడు మమ్ములను కాపాడుగాక! ॥ 3 ॥

ఇది నలభై ఐదవ సూక్తం

## సూక్తం – 46

**ఋషులు.** అంగిరసుడు, ప్రచేతసుడు, యముడు॥ దేవత : దుస్స్వప్ననాశనమ్॥ ఛందస్సు. 1 విరాట్‌పంక్తిః 2 శక్వరీగర్భా పంచపదా జగతీ 3 అనుష్టుప్॥ మంత్రములు 3 ॥ 3 ॥

**వినియోగం –** దుస్స్వప్న జనితదోష నివృత్తికాముడు చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం. 2,3 మంత్రాలతో ఘోరదుస్స్వప్న దర్శనమైనప్పుడు ముఖప్రక్షాళనాది కర్మలను చేయవలెను.

**మంత్రము**

యో న జీవోఽసి న మృతో దేవానామమృతగర్భోఽసి స్వప్న।
వరుణానీ తే మాతా యమః పితాఽరరుర్నామాసి ॥ 1 ॥

**పదము**

యః। న। జీవః। అసి। న। మృతః। దేవానామ్। అమృతఽగర్భః। అసి। స్వప్న।
వరుణానీ। తే। మాతా। యమః। పితా। అరరుః। నామ। అసి ॥ 1 ॥

**అనువాదం.**

ఓ స్వప్నమా! నీవు ప్రాణాధారకమవు కావు
మృతుడవు కావు

దేవతల అమృత గర్భమువు.
ఓ స్వప్నమా! వరుణాని ( వరుణుని పత్ని ) నీ తల్లి.
వరుణుడు నీ తండ్రి.
ఓ స్వప్నమా! 'అరరు' అను పేరుగల అసురుడవు. ॥ 1 ॥

మంత్రము

విద్మ తే స్వప్న జనిత్రం దేవజామీనాం పుత్రోఽసి యమస్య కరణః ।
అన్తకోఽసి మృత్యురసి ।
తం త్వా స్వప్న తథా సం విద్మ స నః స్వప్న దుష్వప్న్యాత్ పాహి ॥ 2 ॥

పదము

విద్మ । తే । స్వప్న । జనిత్రమ్ । దేవఽజామీనామ్ । పుత్రః । అసి । యమస్య । కరణః ।
అన్తకః । అసి । మృత్యుః । అసి ।
తమ్ । త్వా । స్వప్న । తథా । సమ్ । విద్మ । సః । నః । స్వప్న । దుఃఽస్వప్న్యాత్ । పాహి ॥ 2 ॥

అనువాదం :

ఓ స్వప్నాభిమాన దేవుడా!
నీ జన్మ మే మెరుగుదుము

వరుణాని మొదలైన *దేవస్త్రీల తనయుడవు.
నీవు అంతకుడవు, మృత్యువవు
ఓ స్వప్నమా! అలాంటి నిన్ను పూర్వం చెప్పినట్టు
మేము బాగా ఎరుగుదుము.
అలాంటి నీవు మమ్ములను భయం నుంచి రక్షించు ॥ 2 ॥

మంత్రము.

యథా కలాం యథా శఫం యథర్ణం సంనయన్తి ।
ఏవా దుష్వప్న్యం సర్వం ద్విషతే సం నయామసి ॥ 3 ॥

పదము

యథా । కలామ్ । యథా । శఫమ్ । యథా । ఋణమ్ । సమ్ఽనయన్తి ।
ఏవ । దుఃఽస్వప్న్యమ్ । సర్వమ్ । ద్విషతే । సమ్ । నయామసి ॥ 3 ॥

అనువాదం.

చెడిపోయిన గోవునకు చెందిన కళ, గిట్ట
దోషదూషితమైనప్పుడు ఏ విధంగా ఛేదించి
దానిని తొలగిస్తారో, ఏ విధంగా అప్పు తీసుకున్న వారు
దానిని తిరిగి ఇచ్చి తీర్చి వేస్తారో
ఆ విధంగా దుస్స్వప్న జనిత భయాన్ని
మా ద్వేషులకు చక్కగా చేరుస్తున్నాము. ॥ 3 ॥

ఇది నలభై ఆరవ సూక్తం

---

* దేవస్త్రీలు మాయారూపులు గనుక పురుషుల
శుభాశుభాత్మకమైన భావిఫలాన్ని సూచించే
స్వప్నాన్ని కల్పిస్తారని ప్రసిద్ధి.

# సూక్తం-47

ఋషులు, అంగిరసుడు, ప్రచేతసుడు; యముడు॥ దేవత. 1 అగ్ని. 2 విశ్వే దేవులు. 3 సుధన్వుడు॥ ఛందస్సు: త్రిష్టుప్॥ మంత్రములు, ॥ 3 ॥

వినియోగం - ఈ సూక్తంలోని మూడు మంత్రాలతో క్రమంగా ప్రాతరాది మూడు సవనములలో సవన సమాప్తి హోమములను చేయాలి.

మంత్రము

అగ్నిః ప్రాతఃసవనే పాత్వస్మాన్ వైశ్వానరో విశ్వకృద్ విశ్వశంభూః ।
స నః పావకో ద్రవిణే దధాత్వాయుష్మన్తః సహభక్షాః స్యామ ॥ 1 ॥

పదము.

అగ్నిః । ప్రాతఃऽసవనే । పాతు । అస్మాన్ । వైశ్వానరః । విశ్వఽకృత్ । విశ్వఽశంభూః ।
సః । నః । పావకః । ద్రవిణే । దధాతు । ఆయుష్మన్తః । సహఽభక్షాః । స్యామ ॥ 1 ॥

అనువాదం

అగ్ని సవన త్రయాత్మకమైన సోమయాగంలో
ప్రాతస్సవనానికి అధిదేవత అగ్ని.
ఆ ప్రాతస్సవన కర్మలో ఋత్విక్కులను,
యజమానిని అగ్ని రక్షించుగాక!
ఆ అగ్ని సర్వప్రాణి హితకరుడు.
అందువల్లనే విశ్వకర్త.

సర్వజగత్తుకు దుఃఖశమనంతో సుఖాన్ని కల్పించేవాడు
అలాంటి అగ్ని యాగఫలాత్మకమైన
ధనాన్ని మాకు చేకూర్చుగాక!
మేము కూడా ఆయుష్మంతులమై,
సమాన సోమపాయులయిన పుత్రపౌత్రాదులతో
సహభోక్తల మగుదుము గాక! ॥ 1 ॥

మంత్రము.

విశ్వే దేవా మరుత ఇన్ద్రో అస్మానస్మిన్ ద్వితీయే సవనే న జహ్యుః ।
ఆయుష్మన్తః ప్రియమేషాం వదన్తో వయం దేవానాం సుమతౌ స్యామ ॥ 2 ॥

పదము

విశ్వే । దేవాః । మరుతః । ఇన్ద్రః । అస్మాన్ । అస్మిన్ । ద్వితీయే । సవనే । న । జహ్యుః ।
ఆయుష్మన్తః । ప్రియమ్ । ఏషామ్ । వదన్తః । వయమ్ । దేవానామ్ । సుఽమతౌ । స్యామ ॥ 2 ॥

అనువాదం.

విశ్వేదేవులైన మరుత్తులు,
వారి అధిపతి అయిన ఇంద్రుడు—
వీరు మధ్యాహ్న సవనానికి అధిపతులు.
ఈ ద్వితీయ సవనంలో మమ్ములను విడువకుందురు గాక!

ఈ దేవతలకు ప్రియమైన నుతశాస్త్రాత్మకమైన వాక్యాన్ని
ఉచ్చరిస్తూ మేము వారి అనుగ్రహంవల్ల
ఆయుష్మంతులమై ఆ దేవతల
అనుగ్రహాత్మకమైన బుద్ధికి పాత్రుల మగుదుముగాక! ॥ 2 ॥

మంత్రము.

**ఇదం తృతీయం సవనం కవీనామృతేన యే చమసమైరయన్త।**
**తే సౌధన్వనాః స్వ౨రానశానాః స్విష్టిం నో అభి వస్యో నయన్తు ॥ 3 ॥**

పదము

**ఇదమ్। తృతీయమ్। సవనమ్। కవీనామ్। ఋతేన। యే। చమసమ్। ఐరయన్త।**
**తే। సౌధన్వనాః। స్వ౨ః। ఆనశానాః। సు౨ఇష్టిమ్। నః। అభి। వస్యః। నయన్తు ॥ 3 ॥**

అనువాదం:

ఈ తృతీయ సవనం క్రాంతదర్శులైన
ఋభువులకు స్వభూతమైనది
ఇంద్రాదులతో పాటు ఆ సవనానికి వారే అధిదేవతలు.
ఏ దేవతలు సత్యంతో, సోమభక్షణ పాత్రను ప్రేరేపించినారో,
ఆ మహానుభావులు అంగిరస పుత్రులు.
వారూ మనుష్యులే అయి,
రథ నిర్మాణాది శిల్పకారులై, దేవతలను సంతోషపెట్టి
వారి అనుగ్రహంతో దేవతలైన వారు.

రథ చమసాది నిర్మాణంతో స్వర్గ వాసోపలక్షితమైన
దేవత్వాన్ని పొంది, ద్వితీయ సవనాధిపతు లయిన ఋభువులు
వస్యులై మమ్ము అభిలక్షించి
మంగళకరమైన ఇష్టిని అవిఘ్నంగా నెరవేర్తురు గాక ! ॥ 5 ॥

ఇది నలభై ఏడవ సూక్తం

## సూక్తం - 48

**ఋషులు** అంగిరసుడు, ప్రచేతసుడు, యముడు॥ **దేవతలు** మంత్రములలో పేర్కొన్న వారు॥ **ఛందస్సు**. ఉష్ణిక్ ॥ **మంత్రములు** ॥ 3 ॥

**వినియోగం** - ఉపనీతుడైన వటువునకు ఆచార్యుడు దండాన్ని ఈ సూక్తంతో అభిమంత్రించి ఇస్తాడు. వటువు కూడా దీనిని జపిస్తూ తీసుకుంటాడు. అభయకాముడు దీనితో సప్తర్షులను యజనం చేస్తాడు, సవనత్రయంలో బ్రహ్మ యజమానునితో దీనిని పఠింపజేస్తాడు. అలాగే సవనసమాప్తిహోమాలను చేయాలి

మంత్రము

శ్యేనోఽఽసి గాయత్రచ్ఛన్దా అను త్వాఽఽరభే ।
స్వస్తి మా సం వహాస్య యజ్ఞస్యోదృచి స్వాహా ॥ 1 ॥

పదము.

శ్యేనః । అసి । గాయత్రఽఛన్దాః । అను । త్వా । ఆ । రభే ।
స్వస్తి । మా । సమ్ । వహ । అస్య । యజ్ఞస్య । ఉత్ఽఋచి ।
స్వాహా ॥ 1 ॥

అనువాదం.

ఓ ప్రాతస్సవనాత్మక యజ్ఞమా !
నీవు డేగవలె వేగంగా పోవుదానవు.

నీవు గాయత్రీ ఛందస్సువు.
ఇలాంటి నిన్ను చేతికఱ్ఱవలె ఆధారంగా పరిగ్రహిస్తున్నాను.
ఈ యజ్ఞం కడపటి ఋక్కుతో నన్ను క్షేమంగా కాపాడు.
ఈ హవిస్సు స్వాహుత మగుగాక! ॥ 1 ॥

మంత్రము

ఋభురసి జగచ్ఛన్దా అను త్వాఽఽరభే ।
స్వస్తి మా సం వహాస్య యజ్ఞస్యోదృచి స్వాహా ॥ 2 ॥

పదము

ఋభుః । అసి । జగత్ఽఛన్దాః । అను । త్వా । ఆ । రభే ।
స్వస్తి । మా । సమ్ । వహ । అస్య । యజ్ఞస్య । ఉత్ఽఋచి ।
స్వాహా ॥ 2 ॥

అనువాదం

ఓ మూడవ సవనాత్మకమైన యజ్ఞమా!
నీవు జగతీ ఛందస్సువు. నీవు ఋభువువు.
ఇలాంటి నిన్ను చేతికఱ్ఱవలె ఆధారంగా పరిగ్రహిస్తున్నాను.
ఈ యజ్ఞం కడపటి ఋక్కుతో
నన్ను క్షేమంగా కాపాడు.
ఈ హవిస్సు స్వాహుత మగుగాక! ॥ 2 ॥

మంత్రము

వృషాసి త్రిష్టుప్ఛన్దా అను త్వాఽఽరభే ।
స్వస్తి మా సం వహాస్య యజ్ఞస్యోదృచి స్వాహా ॥ 3 ॥

పదము

**వృషా । అసి । త్రిస్తుప్ఽఛన్దాః । అను । త్వా । ఆ । రభే ।**

**స్వస్తి । మా । సమ్ । వహ । అస్య । యజ్ఞస్య । ఉత్ఽఋచి ।**

**స్వాహా ॥ 3 ॥**

**అనువాదం.**

మాధ్యందన సవనమైన నీవు
సేచన సమర్థుడవైన ఇంద్రుడవు
అలాంటి నీవు త్రిష్టుప్ ఛందస్సువు
ఇలాంటి నిన్ను చేతికఱ్ఱవలె ఆధారంగా పరిగ్రహిస్తున్నాను.
ఈ యజ్ఞం కడపటి ఋక్కుతో నన్ను క్షేమంగా కాపాడు
ఈ హవిస్సు స్వాహుతమగుగాక! ॥ 3 ॥

ఇది నలభై ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 49

**ఋషి: గార్గ్యుడు॥ దేవత. అగ్ని॥ ఛందస్సు. 1 అనుష్టుప్: 2 జగతీ:
3 నిచృజ్జగతీ॥ మంత్రములు ॥ 3 ॥**

**వినియోగం - ఈ సూక్తంతో మృతాచార్య దహనాగ్నిలో శ్రేయస్కాముడైన బ్రహ్మచారి సూత్రోక్తప్రకారంగా పురోడాశాన్ని హోమం చేయాలి.**

మంత్రము

**నహి తే అగ్నే తన్వఽః క్రూరమానంశ మర్త్యః ।**

**కపిర్బభస్తి తేజనం స్వం జరాయు గౌరివ ॥ 1 ॥**

పదము।

**నహి । తే । అగ్నే । తన్వఽః । క్రూరమ్ । ఆనంశ । మర్త్యః ।**

కపిః । బభస్తి । తేజనమ్ । స్వమ్ । జరాయు । గౌఃఽఇవ ॥ 1 ॥

అనువాదం

ఒ అగ్నీ ! జ్వాలాత్మకమైన నీ శరీరతీక్ష్ణతను
మర్త్యుడు పొంద శక్తిమంతుడు కాడు
ఈనిన గోవు తన మాయను భక్షించునట్లుగా
నీజ్వాలాసమూహం నిస్సారమైన,
వేణువు వలె ఉన్న శరీరాన్ని భస్మీకరిస్తుంది. ॥ 1 ॥

మంత్రము

మేష ఇవ వై సం చ వి చోర్వ్యఽచ్యసే యదుత్తరద్రావుప
రశ్చ ఖాదతః ।
శీర్ష్ణా శిరోప్ససాప్సో అర్దయన్నంశూన్ బభస్తి హరితేభిరాసభిః ॥ 2 ॥

పదము :

మేషఃఽఇవ । వై । సమ్ । చ । వి । చ । ఉరు । అచ్యసే । యత్
ఉత్తరఽద్రౌ । ఉపరః । చ । ఖాదతః ।
శీర్ష్ణా । శిరః । అప్ససా । అప్సః । అర్దయన్ । అంశూన్ । బభస్తి ।
హరితేభిః । ఆసఽభిః ॥ 2 ॥

అనువాదం

ఓ అగ్నీ ! పురుష శరీరాన్ని పొంది
ఆయా అవయవాల ద్వారా శరీరమంతటా వ్యాపిస్తావు.
మేషం తృణభూయిష్ఠమైన ప్రదేశానికి వెళ్ళి

సర్వమూ భక్షించు నట్టుగా
శరీరాన్నంతటిని భక్షించి వెళ్ళిపోతావు
ఎప్పుడు పైనున్న దాహ్యా శరీరము నందు,
పూర్వమున్న శరీరమునందు,
రెండు వైపులా అగ్ని భక్షిస్తుందో,
అప్పుడు జ్వాలాగ్రంతో అక్కడి
వృక్షాదుల శరీరాన్ని హింసిస్తుంది
స్వకీయ భాస్వర రూపంతో
దాహ్యాశరీరాన్ని హింసిస్తూ ఈ అగ్ని
హరిత వర్ణములు గల సోమ లతాదులను భక్షిస్తుంది ॥ 2 ॥

**మంత్రము**

సుపర్ణా వాచమక్రతోప ద్యవ్యాఖరే కృష్ణా ఇషిరా అనర్తిషుః।
ని యన్నియన్త్యుపరస్య నిష్కృతిం పురూ రేతో దధిరే
సూర్యశ్రితః ॥ 3 ॥

**పదము :**

సుఽపర్ణాః । వాచమ్ । అక్రత । ఉప । ద్యవి । ఆఽఖరే । కృష్ణాః
ఇషిరాః । అనర్తిషుః ।
ని । యత్ । నిఽయన్తి । ఉపరస్య । నిఃఽకృతిమ్ । పురు । రేతః
దధిరే । సూర్యఽశ్రితః ॥ 3 ॥

**అనువాదం**

ఓ అగ్ని ! డేగల వలె శీఘ్ర వ్యాపన
శీలములైన నీ జ్వాలలు శబ్దం చేస్తాయి

ఆవాసస్థానంలో కృష్ణమృగాల వంటి ఆకాశంలో
గమన శీలాలైన దీప్తులు సమీపించి నృత్యం చేస్తుంటాయి.
బహుళ ధూమోత్పాదనంతో
మేఘానికి నిర్మాణాన్ని కల్పిస్తాయి
అందువల్ల ఓ అగ్ని! నీ దీప్తులే ఆదిత్యమండలాన్ని పొంది,
బహుళమైన రేతస్సును జగదుత్పాదనార్థమై ధరిస్తాయి ॥ 3 ॥

ఇది నలభై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 50

ఋషి అథర్వుడు (అభయకాముడు)॥ దేవతలు అశ్వినులు॥ ఛందస్సు:
1 విరాడ్ జగతి 2,3 పథ్యాపంక్తి॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం - ఎలుకలు, మిడతలు, పక్షులు, పురుగులు మొదలైన సస్యభక్షకముల నివృత్త్యర్థం చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం. అష్ట్లే అపుపాలతో చేసిన చరువును ఈ సూక్తంతో అశ్వినీ దేవతలకు హోమం చేయాలి.

మంత్రము॥

హతం తర్దం సమఙ్కమాఖుమశ్వినాఛిన్తం శిరో అపి పృష్టీః శృణీతమ్ ।
యవాన్నేదదానపి నహ్యతం ముఖమథాభయం కృణుతం ధాన్యాऽయ ॥ 1 ॥

పదము

హతమ్ । తర్దమ్ । సమ్ऽఅఙ్కమ్ । ఆఖుమ్ । అశ్వినా । ఛిన్తమ్ శిరః । అపి । పృష్టీః । శృణీతమ్ ।

యవాన్। న। ఇత్। అదాన్। అపి। నహ్యతమ్। ముఖమ్। అథ।
అభయమ్। కృణుతమ్। ధాన్యా౨య ॥ 1 ॥

**అనువాదం.**

ఓ అశ్వినీ దేవతలారా! హింసకమైన బిలంలో
ప్రవేశించి పోతున్న ఎలుకను నశింపజేయండి
ఆ ఎలుక శిరస్సును రెండుగా వక్కలు చేయండి
దాని ప్రక్క ఎముకలను కూడా చూర్ణం చేయండి.
ఆ ఎలుక మా ధాన్యాదులను తినకుండునట్లు చేసి
ఓ అశ్వినులారా! దానిముఖాన్ని కట్టివేయండి
తరువాత మా ధాన్యాదులకు అభయ మివ్వండి ॥ 1 ॥

మంత్రము

తర్ద హై పతఙ్గ హై జభ్య హా ఉపక్వస।
బ్రహ్మేవాసం స్థితం హవిరనదన్త ఇమాన్ యవానహింసన్తో
అపోదిత ॥ 2 ॥

పదము

తర్ద। హై। పతఙ్గ। హై। జభ్య। హై। ఉప౨క్వస।
బ్రహ్మ౨ఇవ। అసమ్౨స్థితమ్। హవిః। అనదన్తః। ఇమాన్।
యవాన్। అహింసన్తః। అప౨ఉదిత ॥ 2 ॥

**అనువాదం.**

ఓ హింసకమైన ఎలుకా! ఓ శలభమా!
మీరు ఉపద్రవ కారులు గనుక

మిమ్ములను చంపుటకై హవిస్సును
బ్రహ్మవలె సజ్జితం చేస్తున్నాము.
అందువల్ల ఈ హోమం నుంచి మొదటనే దగ్ధం కాని
మా యవాదులను వినష్టం చేయక మీరు
ఈ స్థానం నుంచి అపగతులు కండి. ॥ 2 ॥

మంత్రము:

తర్దాపతే వధాపతే తృష్టజమ్భా ఆ శృణోత మే ।
య అరణ్యా వ్యద్వరా యే కే చ స్థ
వ్యద్వరాస్తాన్త్సర్వాన్ జమ్భయామసి ॥ 3 ॥

పదము

తర్దఽపతే । వధాఽపతే । తృష్టఽజమ్భాః । ఆ । శృణోత । మే ।
యే । అరణ్యాః । విఽఅద్వరాః । యే । కే । చ । స్థ ।
విఽఅద్వరాః । తాన్ । సర్వాన్ । జమ్భయామసి ॥ 3 ॥

అనువాదం.

ఓ ఎలుక రాజా! ఓ పతంగాదులకు అధిపతి అయిన వాడా!
పదునైన పండ్లుగల మీరు మా మాటను శ్రద్ధగా వినండి.
మీరు అరణ్యంలో పుట్టిన వారు.
సర్వ భక్షకులు కండి.
ఇతర గ్రామవర్తులైన మీ లోనివి కూడా
భక్షణ శీలము లగు గాక!
ఈ మీ అందరిని ఈ కర్మతో నశింపజేస్తున్నాము. ॥ 3 ॥

ఇది యాభై యవ సూక్తం.

## సూక్తం - 51

ఋషి శక్త్రాతి॥ దేవత. 1 సోముడు. 2 అపస్సు (ఆపోదేవత) 3 వరుణుడు॥
ఛందస్సు. 1 గాయత్రీ. 2 త్రిష్టుప్, జగతీ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం - శాంత్యుదకాదులలో, సర్వరోగ చికిత్సలో, సోమవమన పానాది నిమిత్త వ్యాధిశమనార్థం చేసే ప్రక్రియలో, అర్థోత్థాపన విఘ్నశమన కర్మలో, అప్లావ నాదులలో, సురానుమంత్రణంలో దీనికి వినియోగం.

మంత్రము

వాయోః పూతః పవిత్రేణ ప్రత్యఙ్ సోమో అతి ద్రుతః।
ఇన్ద్రస్య యుజ్యః సఖా ॥ 1 ॥

పదము

వాయోః। పూతః। పవిత్రేణ। ప్రత్యఙ్। సోమః। అతి। ద్రుతః
ఇన్ద్రస్య। యుజ్యః। సఖా ॥ 1 ॥

అనువాదం

వాయుసంబంధమైన పవిత్రంతో శోధించిన సోమరసాన్ని,
ఇలాంటి ప్రతిముఖములైన నాభిదేశాన్ని
అతిక్రమించి వెళ్ళిన మంత్ర ఏర్దం
ఇంద్రునకు యోగ్యమైన మిత్రము ॥ 1 ॥

మంత్రము

ఆపో అస్మాన్ మాతరః సూదయన్తు ఘృతేన నో ఘృతప్వః
పునన్తు।
విశ్వం హి రిప్రం ప్రవహన్తి దేవీరుదిదాభ్యః శుచిరా పూత
ఏమి ॥ 2 ॥

పదము,

అపః । అస్మాన్ । మాతరః । సూదయన్తు । ఘృతేన । నః ।
ఘృతఽప్వఽః । పునన్తు ।

విశ్వమ్ । హి । రిప్రమ్ । ప్రఽవహన్తి । దేవీః । ఉత్ । ఇత్ ।
ఆభ్యః । శుచిః । ఆ । పూతః । ఏమి ॥ 2 ॥

అనువాదం.

జగజ్జననులైన ఉదకదేవతలు
మమ్ము పరిశుద్ధులను చేతురు గాక!
చరణ శీలములు, జగత్తును పవిత్రం చేసే జలములు
ఘృతంతో మమ్ములను పరిశుద్ధులను చేయుగాక!
దేవతారూపములైన జలములు
సర్వవిశ్వమునకు చెందిన పాపాన్ని ప్రక్షాళనం చేస్తాయి.
ఇలాంటి జలంలో స్నానం చేసిన నేను
పరిశుద్ధుడనై, వాటితో కర్మయోగ్యుడనై వస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము

యత్ కిం చేదం వరుణ దైవ్యే జనేఽభిద్రోహం మనుష్యాశ్
శ్చరన్తి ।
అచిత్తీ యచ్చ తవ ధర్మా యుయోపిమ మా నస్తస్మా
దేనసో దేవరీరిషః ॥ 3 ॥

పదము,

యత్ । కిమ్ । చ । ఇదమ్ । వరుణ । దైవ్యే । జనే । అభిఽ

ద్రోహమ్ । మనుష్యాః । చరన్తి

అచిత్త్యా । చ । ఇత్ । తవ । ధర్మ । యుయోపిమ । మా । నః ।

తస్మాత్ । ఏనసః । దేవ । రీరిషః ॥ 3 ॥

**అనువాదం.**

ఓ వరుణా! దేవసంబంధమైన
ప్రాణిజాతం విషయంలో ఏ కొంచెం
అపరాధజనితమైన పాపమును మనుష్యులు చేస్తారో,
ఆ పాపం నుంచి మేము కూడా
అజ్ఞానంతో ఏదైనా చేసి ఉంటే,
ఓ వరుణా! నీ సంబంధమైన ధర్మములను, కర్మములను
విపర్యస్తముగా చేస్తున్నాము
ఆ అజ్ఞాన జనితమైన పాపం వల్ల
ఓ దేవా! మమ్ములను హింసించవద్దు ॥ 3 ॥

ఇది యాభై ఒకటవ సూక్తం

ఇది ఐదవ అనువాకం

# అనువాకం – 6

## సూక్తం 52

**ఋషి. భాగలి ॥ దేవతలు: 1 సూర్యుడు: 2 ఎద్దులు. 3 భేషజమ్ ॥ ఛందస్సు: అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 3 ॥**

**వినియోగం.— రక్షోగ్రహ చికిత్సార్థం చేసే ప్రక్రియలో దీనికి వినియోగం.**

**మంత్రము**

**ఉత్ సూర్యో దివ ఏతి పురో రక్షాంసి నిజూర్వన్ ।**

**ఆదిత్యః పర్వతేభ్యో విశ్వదృష్టో అదృష్టహా ॥ 1 ॥**

పదము .

ఉత్ । సూర్యః । దివః । ఏతి । పురః । రక్షాంసి । నిఽజూర్వన్ ।

ఆదిత్యః । పర్వతేభ్యః । విశ్వఽదృష్టః । అదృష్టఽహా ॥ 1 ॥

అనువాదం :

సూర్యుడు తూర్పున రాక్షసులను హింసించి
అంతరిక్ష ప్రదేశం నుంచి ఉదయిస్తున్నాడు.
ఆ ఆదిత్యుడు సర్వప్రాణులను సాక్షాత్కరించువాడు.
మనకు కనబడని యక్షఃపిశాచాదులను
కూడా హింసించువాడు.
ఉదయాచల ప్రదేశం నుంచి ఉదయిస్తున్నాడు. ॥ 1 ॥

మంత్రము

ని గావో గోష్ఠే అసదన్ ని మృగాసో అవిక్షత ।

న్యూర్మయో నదీనాం న్యదృష్టా అలిప్సత ॥ 2 ॥

పదము :

ని । గావః । గోఽస్థే । అసదన్ । ని । మృగాసః । అవిక్షత ।

ని । ఊర్మయః । నదీనామ్ । ని । అదృష్టాః । అలిప్సత ॥ 2 ॥

అనువాదం

గోవులు గోష్ఠంలో భయరహితములై ఉన్నవి.
అలాగే అరణ్యమృగాలు వాని వాని
స్థానాలలో నిర్భయంగా ఉన్నవి.
నదుల తరంగాలు సుఖంగా సవిష్టములై ఉన్నవి.

కనబడని వాని నన్నిటిని సర్వజనులు
సూర్యప్రకాశంతో చూడగలుగుతున్నారు. ॥ 2 ॥

మంత్రము :

**ఆయుర్దదం విపశ్చితం శ్రుతాం కణ్వస్య వీరుధమ్ ।**
**ఆభారిషం విశ్వభేషజీమస్యాదృష్టాన్ ని శమయత్ ॥ 3 ॥**

పదము

**ఆయుః౽దదమ్ । విపః౽చితమ్ । శ్రుతామ్ । కణ్వస్య । వీరుధమ్**
**ఆ । అభారిషమ్ । విశ్వ౽భేషజీమ్ । అస్య । అదృష్టాన్ । ని ।**
**శమయత్ ॥ 3 ॥**

అనువాదం .

నూరేళ్ళ ఆయుస్సునిచ్చే రోగశమనోపాయాన్ని తెలిసిన
కణ్వమహర్షికి సంబంధించిన సర్వరోగనివారిణి అయిన
శమీవృక్షాన్ని ఈ వ్యాధితుని రోగనివృత్తికై కొనివస్తున్నాను
అది రోగిలోపల కన్పించకుండా
ఉన్న రోగములను ఉపశమింప జేయుగాక ! ॥ 3 ॥

ఇది యాభై రెండవ సూక్తం

## సూక్తం – 53

**ఋషి: బృహచ్ఛుక్రుడు ॥** దేవతలు. మంత్రాలలో పేర్కొన్న పృథివ్యాదులు ॥
**ఛందస్సు ॥ 1 జగతీ . 2, 3, త్రిష్టుప్ ॥** మంత్రములు ॥ 3 ॥

**వినియోగం :–** ద్రవ్యాదుల వినాశం ఏర్పడినప్పుడు దాని నివృత్త్యర్థం ద్యావా పృథువులను గూర్చి చేసే యజనంలోను, నవయజ్ఞాలలోను, మేధాజనన కర్మలోను, గోదాన కర్మలోను, ఉపనయన కర్మ లోను దీనికి వినియోగం.

మంత్రము .

ద్యౌశ్చ మ ఇదం పృథివీ చ ప్రచేతసౌ

శుక్రో బృహన్ దక్షిణయా పివర్తు ।

అను స్వధా చికితాం సోమో

అగ్నిర్వాయుర్నః పాతు సవితా భగశ్చ ॥ 1 ॥

పదము.

ద్యౌః । చ । మే । ఇదమ్ । పృథివీ । చ । ప్రఽచేతసౌ ।

శుక్రః । బృహన్ । దక్షిణయా । పివర్తు ।

అను । స్వధా । చికితామ్ । సోమః ।

అగ్నిః । వాయుః । నః । పాతు । సవితా । భగః । చ ॥ 1 ॥

అనువాదం :

ద్యావాపృథ్వులు నాకు ప్రకృష్టజ్ఞానవంతములై
నేను కోరిన ఫలాన్ని ఇత్తురు గాక !
అలాగే గొప్పగా వెలుగుతున్న సూర్యుడు
దక్షిణ దిక్కును పాలించుగాక !
పితృదేవతలకు సంబంధించిన స్వధాదేవత అనుమతించుగాక!
సోముడు, అగ్ని కూడా అనుమతింతురుగాక !
మమ్ములను వాయువు రక్షించు గాక ! ॥ 1 ॥

మంత్రము .

పునః ప్రాణః పునరాత్మా న ఐతు

పునశ్చక్షుః పునరసుర్న ఐతు ।
వైశ్వానరో నో అదబ్ధస్తనూపా
అన్తస్తిష్ఠాతి దురితాని విశ్వా ॥ 2 ॥

పదము

పునః । ప్రాణః । పునః । ఆత్మా । నః । ఆ । ఏతు ।
పునః । చక్షుః । పునః । అసుః । నః । ఆ । ఏతు ।
వైశ్వానరః । నః । అదబ్ధః । తనూఽపాః ।
అన్తః । తిష్ఠాతి । దుఃఽఇతాని । విశ్వా ॥ 2 ॥

అనువాదం.

ప్రాణము మమ్ములను తిరిగి చేరుకొనుగాక !
అలాగే ఆత్మ తిరగి వచ్చుగాక !
చక్షురింద్రియం తిరిగి వచ్చుగాంక !
ప్రాణము తిరిగి వచ్చుగాక !
వైశ్వానరుడు రోగాదులకు లోబడక
శరీర పాలకుడై మా శరీరమధ్యంలో ఉండుగాక !
సర్వరోగ నిదాన భూతములైన పాపములను
వినాశం చెందించు గాక ! ॥ 2 ॥

మంత్రము।

సం వర్చసా పయసా సం తనూభి-
రగన్మహి మనసా సం శివేన ।

త్వష్టా నో అత్ర వరీయః కృణోత్వను
నో మార్ష్టు తన్వో౩యద్ విరిష్టమ్ ॥ 3 ॥

పదము

సమ్ । వర్చసా । పయసా । సమ్ । తనూభిః ।
అగన్మహి । మనసా । సమ్ । శివేన ।
త్వష్టా । నః । అత్ర । వరీయః । కృణోతు । అను ।
నః । మార్ష్టు । తన్వః । యత్ । వి౽రిష్టమ్ ॥ 3 ॥

అనువాదం

వర్చస్సుతో పాలతోవలె సంగతుల మగుదుము గాక!
శరీరావయవములతో సంగతుల మగుదుముగాక!
మంగళకరమైన అంతఃకరణంతో సంగతుల మగుదుము గాక!
త్వష్ట మా అతిప్రభూతమైన ఈ శరీరంలో సంగతం చేయుగాక!
మా శరీరంలోని రోగార్తమైన అంగాన్ని
హస్తంతో స్పృశించుగాక! ॥ 3 ॥

ఇది యాభై మూడవ సూక్తం

## సూక్తం-54

ఋషి బ్రహ్మ॥ దేవతలు: అగ్ని, సోములు॥ ఛందస్సు. అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం :- అభిచార కర్మలో చేసే హోమంలో దీనికి వినియోగం 'అస్మై క్షత్రమ'నే మంత్రానికి పౌర్ణమాసయాగంలో చేసే చరుహోమంలో వినియోగం

మంత్రము .

ఇదం తద్ యుజ ఉత్తరమిన్ద్రం శుమ్భామ్యష్టయే ।

అస్య క్షత్రం శ్రియం మహీం వృష్టిరివ వర్ధయా తృణమ్ ॥ 1 ॥

పదము :

ఇదమ్ । తత్ । యుజే । ఉత్ఽతరమ్ । ఇన్ద్రమ్ । శుమ్భామి ।
అష్టయే ।

అస్య । క్షత్రమ్ । శ్రియమ్ । మహీమ్ । వృష్టిఃఽఇవ । వర్ధయ ।
తృణమ్ ॥ 1 ॥

అనువాదం:

అభిచారదోష నిర్హరణశమమైన
ఈ ఉత్తమ కర్మతో నియోజనం చేస్తున్నాను
అభిమత ఫలప్రాప్తికై ఇంద్రుని
స్తుత్యాదులతో సంతోషపెడుతున్నాను
పెద్దవాన సస్యజాతాన్ని వృద్ధిపొందించునట్లు
ఓ ఇంద్రుడా! నీవు ఈ పురుషుని బలాన్ని
గొప్ప సంపదను వృద్ధిపొందించు ॥ 1 ॥

మంత్రము :

అస్మై క్షత్రమగ్నీషోమావస్మై ధారయతం రయిమ్ ।

ఇమం రాష్ట్రస్యాభీవర్గే కృణుతం యుజ ఉత్తరమ్ ॥ 2 ॥

పదము

అస్మై । క్షత్రమ్ । అగ్నీషోమౌ । అస్మై । ధారయతమ్ ।
రయిమ్ ।

ఇమమ్ । రాష్ట్రస్య । అభిఽవర్గే । కృణుతమ్ । యుజే । ఉత్ఽతరమ్ ॥ 2 ॥

అనువాదం:

ఓ అగ్నీ సోములారా! ఈ యజమానునకు బలాన్నివ్వండి.
అలాగే ఇతనికి ధనాన్ని అనుగ్రహించండి.
ఈ యజమానుని జనపద సమ్ముఖుని చేయండి.
నేను కూడా ఉక్తఫలసిద్ధ్యర్థం
ఉత్తమ కర్మను చేస్తున్నాను. ॥ 2

మంత్రము:

సబన్ధుశ్చాసబన్ధుశ్చ యో అస్మాం అభిదాసతి ।
సర్వం తం రన్ధయాసి మే యజమానాయ సున్వతే ॥ 3 ॥

పదము:

సఽబన్ధుః । చ । అసబన్ధుః । చ । యః । అస్మాన్ । అభిఽదాసతి
సర్వమ్ । తమ్ । రన్ధయాసి । మే । యజమానాయ । సున్వతే ॥ 3 ॥

అనువాదం

సమాన గోత్రుడైన శత్రువు,
సమాన గోత్రుడు కాని శత్రువు
మమ్ములను బాధిస్తున్నాడు.
ఆ ఉభయ విధ శత్రువులను సోమాభిషవం చేసే నాకు,
యజమానునకు ఓ ఇంద్రా!
నీవు వశీకరింప జెయ్యి. ॥ 3 ॥

ఇది యాభై నాల్గవ సూక్తం

# సూక్తం-55

ఋషిః బ్రహ్మ॥ దేవతలః 1 విశ్వేదేవులు: 2,3 రుద్రుడు॥ ఛందస్సు. 1,3 జగతి· 2 త్రిష్టుప్॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం - దేశాంతరం వెళ్ళేపురుషుని స్వస్త్యయన కాముడు చేసే త్రయోదశ ద్రవ్యహోమంలో దీనికి వినియోగం స్వస్త్యయనార్థం కూడా దీనికి వినియోగం. 'ఇదా వత్సరాయ' అనే మంత్రానికి అభిచారకర్మలో చేసె ఆజ్యహోమంలో వినియోగం

మంత్రము:

యే పన్థానో బహవో దేవయానా

అన్తరా ద్యావాపృథివీ సంచరన్తి ।

తేషామజ్యానిం యతమో వహాతి

తస్మై మా దేవాః పరి ధత్తేహ సర్వే ॥ 1 ॥

పదము:

యే । పన్థానః । బహవః । దేవయానాః ।

అన్తరా । ద్యావాపృథివీ ఇతి । సమ్ చరన్తి ।

తేషామ్ । అజ్యానిమ్ । యతమః । వహాతి ।

తస్మై । మా । దేవాః । పరి । ధత్త । ఇహ । సర్వే ॥ 1 ॥

అనువాదం.

దేవ మార్గాలు నానా విధములుగా
ద్యావా పృథువుల మధ్యలో వ్యాపించి ఉన్నవి
వాటిలో ఏ మార్గము సమృద్ధిని కలిగిస్తుందో

ఆ వర్గాగ్నాసిక్తై ఓ దేవతలారా! మీరందరూ
ఈ దేశంలో నన్ను రక్షణార్థం అప్పగించండి ॥ 1 ॥

మంత్రము

గ్రీష్మో హేమన్తః శిశిరో వసన్తః
శరద్ వర్షాః స్వితే నో దధాత ।
ఆ నో గోషు భజతా ప్రజాయాం
నివాత ఇద్ వః శరణే స్యామ ॥ 2 ॥

పదము

గ్రీష్మః । హేమన్తః । శిశిరః । వసన్తః ।
శరత్ । వర్షాః । సుఽఇతే । నః । దధాత ।
ఆ । నః । గోషు । భజత । ఆ । ప్రఽజాయామ్ ।
నిఽవాతే । ఇత్ । వః । శరణే । స్యామ ॥ 2 ॥

అనువాదం:

గ్రీష్మ, హేమన్త, శిశిర, వసంత,
శరద్వర్ష ఋతువుల అభిమాన దేవతలు
మాకు రావలసిన ధనాన్ని అందింతురు గాక!
ఋతువులారా! మీరు మమ్ములను
గోవులలో భాగస్వాములను చెయ్యండి
పుత్ర పౌత్రాదులలో కూడా మాకు భాగముప్పించండి
వాయువు స్పర్శ కూడా లేని మీకు సంబంధించిన
గృహంలో మేము ఉందుము గాక! ॥ 2 ॥

మంత్రము

ఇదావత్సరాయ పరివత్సరాయ
సంవత్సరాయ కృణుతా బృహన్నమః ।
తేషాం వయం సుమతౌ యజ్ఞియానామపి
భద్రే సౌమనసే స్యామ ॥ 3 ॥

పదము

ఇదావత్సరాయ । పరిऽవత్సరాయ ।
సమ్ऽవత్సరాయ । కృణుత । బృహత్ । నమః ।
తేషామ్ । వయమ్ । సుऽమతౌ । యజ్ఞియానామ్ । అపి ।
భద్రే । సౌమనసే । స్యామ ॥ 3 ॥

అనువాదం.

ఓ జనులారా! ఈ *ఇదావత్సరానికి,
పరివత్సరానికి, సంవత్సరానికి
సంతోషం కలిగించేటట్టు నమస్కరించండి
యజ్ఞార్హములైన వానికి అనుగ్రహాత్మక
బుద్ధితో మేము ఉందుము గాక!
మంగళకర ఫలితంలో కూడా మే ముందుముగాక! ॥ 3 ॥

ఇది యాభై ఐదవ సూక్తం

* ప్రభవ మొదలు ఐదైదు సంవత్సరాలకు, మొదటి దానికి సంవత్సరము, ద్వితీయాదులకు వరుసగా పరివత్సరము, ఇదావత్సరము, అనువత్సరము ఇద్వత్సరము అనే సంజ్ఞలు కలవు వాని అభిమాన దేవతలు అగ్ని, ఆదిత్య చంద్ర, వాయువులని తైత్తరీయం చెబుతుంది

# సూక్తం - 56

ఋషి. శన్తాతి॥ దేవతలు 1,2 రుద్రుడు; 3 [భేషజమ్]॥ ఛందస్సు. 1,2 అనుష్టుప్ 3 పథ్యా బృహతీ॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం.- సర్పవృశ్చికాది భయనివారణకై చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం. ఉపాకర్మలో చేసే ఆజ్యహోమాదులను దీనితో నిర్వర్తించాలి

మంత్రము:

మా నో దేవా అహిర్వధీత్ సతోకాన్త్సహపూరుషాన్ ।

సంయతం న వి ష్పరద్ వ్యాత్తం న సం యమన్నమో

దేవజనేభ్యః ॥ 1 ॥

పదము

మా । నః । దేవాః । అహిః । వధీత్ । సఽతోకాన్ । సహఽపూరుషాన్ ।

సఽమ్యతమ్ । న । వి । స్పరత్ । విఽఆత్తమ్ । న । సమ్ ।

యమత్ । నమః । దేవఽజనేభ్యః ॥ 1 ॥

అనువాదం

ఓ దేవతలారా! సర్పం మమ్ములను హింసింప కుండుగాక!
పుత్రపౌత్రాది సహితులను, భృత్యాది పురుషసహితులను
కఱచుటకు విశ్లిష్టం కాకుండు గాక!
తెఱచిన నోరు మూతబడకుండు గాక!
దేవతలకు నమస్కారం ॥ 1 ॥

మంత్రము

నమోఽస్త్వసితాయ నమస్తిరంశ్చిరాజయే ।

స్వజాయ బభ్రవే నమో నమో దేవజనేభ్యః ॥ ౨ ॥

పదము

నమః । అస్తు । అసితాయ । నమః । తిరశ్చిఽరాజయే ।

స్వజాయ । బభ్రవే । నమః । నమః । దేవఽజనేభ్యః ॥ 2 ॥

అనువాదం

కృష్ణవర్ణ సర్పానికి నమస్కారం.
'తిరశ్చిరాజి' అనే పేరుగల సర్పానికి నమస్కారం.
బభ్రువర్ణమైన 'స్వజ' అనే సర్పానికి నమస్కారం
వీటిని నియమనం చేసే దేవజనులకు నమస్కారం. ॥ 2 ॥

మంత్రము

సం తే హన్మి దతా దతః సము తే హన్వా హనూ ।

సం తే జిహ్వయా జిహ్వాం సమ్వాస్నాహ ఆస్యఽమ్ ॥ 3 ॥

పదము.

సమ్ । తే । హన్మి । దతా । దతః । సమ్ । ఓంఇతి । తే । హన్వా ।
హనూఇతి ।

సమ్ । తే । జిహ్వయా । జిహ్వామ్ । సమ్ । ఓంఇతి । ఆస్నా ।
అహే । అస్యఽమ్ । ॥ 3 ॥

అనువాదం :

ఓ సర్పమా ! నీ పై పళ్ళతోనూ
క్రింది పళ్ళతోనూ కలుపుతున్నాను

అలాగే నీదవడలు రెండింటినీ కలుపుతున్నాను.
నీ జిహ్వతో జిహ్వను కలుపుతున్నాను
నీ ముఖాన్ని ముఖంతో సంహతం చేస్తున్నాను ॥ 3 ॥

ఇది యాభై ఆరవ సూక్తం

## సూక్తం - 57

ఋషి శన్తాతి॥ దేవతలు. 1,2 రుద్రుడు; 3 [భేషజమ్]॥ ఛందస్సు 1,2 అనుష్టుప్ 3 పథ్యాబృహతీ ॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం - మొనలేని వ్రణచికిత్సలో చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం 'శం చ నోమయశ్చ' అనే మంత్రం బృహద్గణంలోనిది గనుక శాంత్యుదకాదులలో దీనికి వినియోగం అర్థోత్థాపన విఘ్నశమనార్థం చేసే హోమాదులలో దీనికి వినియోగం.

మంత్రము:

ఇదమిద్ వా ఉ భేషజమిదం రుద్రస్య భేషజమ్ ।
యేనేషుమేకతేజనాం శతశల్యామపబ్రవత్ ॥ 1 ॥

పదము

ఇదమ్ । ఇత్ । వై । ఓంఇతి । భేషజమ్ । ఇదమ్ । రుద్రస్య । భేషజమ్ ।
యేన । ఇషుమ్ । ఏకఽతేజనామ్ । శతఽశల్యామ్ । అపఽబ్రవత్ ॥ 1 ॥

అనువాదం

ఇదే వ్రణరోగ నివర్తకమైన ఔషధం.
ఇదే రుద్రుని ఔషధం.
ఈ చికిత్సతో త్రిపురసంహార సమయంలో

మహాదేవుడు ఒక వేణుకాండం గల దానిని,
శత శల్యములు కల బాణాన్ని
వేధ్య సమీపానికి చేరునట్లు ప్రయోగించినాడు ॥ 1 ॥

మంత్రము.

**జాలాషేణాభి షిఞ్చత జాలాషేణోప సిఞ్చత ।**
**జాలాషముగ్రం భేషజం తేన నో మృడ జీవసే ॥ 2 ॥**

పదము

**జాలాషేణ । అభి । సిఞ్చత । జాలాషేణ । ఉప । సిఞ్చత ।**
**జాలాషమ్ । ఉగ్రమ్ । భేషజమ్ । తేన । నః । మృడ । జీవసే**
**॥ 2 ॥**

అనువాదం :

ఓ పరిచారకులారా! గోమూత్రము నురుగతో
వ్రణాన్ని చుట్టూ కడగండి
దానితోనే వ్రణాన్ని కడగండి
ఇది తీక్ష్ణమైన ఔషధం,
ఓ రుద్రుడా! దీనితో మమ్ములను
సుఖపెట్టు జీవింప చెయ్యి. ॥ 2 ॥

మంత్రము

**శం చ నో మయశ్చ నో మా చ నః కిం చనామమత్ ।**
**క్షమా రపో విశ్వం నో అస్తు భేషజం సర్వం నో అస్తు**
**భేషజమ్ ॥ 3 ॥**

పదము

శమ్ । చ । నః । మయః । చ । నః । మా । చ । నః । కిమ్ ।
చన । అమమత్ ।

క్షమా । రపః । విశ్వమ్ । నః । అస్తు । భేషజమ్ । సర్వమ్ । నః ।
అస్తు । భేషజమ్ ॥ 3 ॥

అనువాదం:

ఓ దేవా! మా రోగం శమించుగాక! సుఖం కలుగుగాక!
మా ప్రజాపశ్వాదికములు రోగగ్రస్తములు కాకుండుగాక!
రోగ నిదానభూతమై పాపం ఉపశమించు గాక!
సమస్తము మాకు ఔషధ మగుగాక!
సర్వ కర్మలు మాకు ఔషధ మగుగాక! ॥ 3 ॥

ఇది యాభై ఏడవ సూక్తం

## సూక్తం – 58

ఋషి. అథర్వుడు ( యశస్కాముడు )॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్న ఇంద్రాదులు॥ ఛందస్సు. 1 జగతీ. 2 ప్రస్తార పంక్తి. 3 అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం .– యశస్కాముడు ఇంద్రుని గూర్చి చేసే యజనంలో దీనికి వినియోగం. అలాగే ఉత్సర్జన కర్మలో చేసే ఆజ్యహోమంలో దీనికి వినియోగం.

మంత్రము .

యశసం మేన్ద్రో మఘవాన్ కృణోతు యశసం ద్యావా
పృథివీ ఉభే ఇమే ।

యశసం మా దేవః సవితా కృణోతు ప్రియో దాతుర్దక్షిణాయా
ఇహ స్యామ్ ॥ 1 ॥

పదము

యశసమ్ । మా । ఇన్ద్రః । మఘఽవాన్ । కృణోతు । యశసమ్ ।
ద్యావాపృథివీఇతి । ఉభేఇతి । ఇమేఇతి ।
యశసమ్ । మా । దేవః । సవితా । కృణోతు । ప్రియః । దాతుః ।
దక్షిణాయాః । ఇహ । స్యామ్ ॥ 1 ॥

**అనువాదం.**

ఇంద్రుడు నన్ను యశస్విని చేయుగాక!
ఈ కనిపించే ద్యావాపృథ్వులు నన్ను
యశస్వంతుని చేతురుగాక!
దేవుడు సవిత నన్ను యశస్వుని చేయుగాక!
ఈ విధంగా యశస్వినై దక్షిణలను
ఇక్కడ ఇచ్చువానికి ప్రియుడను అగుదును గాక! ॥ 1 ॥

మంత్రము

యథేన్ద్రో ద్యావా పృథివ్యోర్యశస్వాన్ యథాప ఓషధీషు
యశస్వతీః ।
ఏవా విశ్వేషు దేవేషు వయం సర్వేషు యశసః స్యామ
॥ 2 ॥

పదము

యథా । ఇన్ద్రః । ద్యావాపృథివ్యోః । యశస్వాన్ । యథా ।
ఆపః । ఓషధీషు । యశస్వతీః ।
ఏవ । విశ్వేషు । దేవేషు । వయమ్ । సర్వేషు । యశసః । స్యామ
॥ 2 ॥

అనువాదం

ద్యావా పృథ్వుల మధ్య ఇంద్రుడు యశస్వంతుడు.
అలాగే జలదేవతలు ఓషధులలో యశస్వతులు,
ఈ విధంగా సర్వదేవతలలో, మనుష్యులలో
మేము యశస్వంతుల మగుదుము గాక! ॥ 2 ॥

మంత్రము

యశా ఇన్ద్రో యశా అగ్నిర్యశాః సోమో అజాయత ।
యశా విశ్వస్య భూతస్యాహమస్మి యశస్తమః ॥ 3 ॥

పదము

యశాః । ఇన్ద్రః । యశాః । అగ్నిః । యశాః । సోమః ।
అజాయత ।
యశాః । విశ్వస్య । భూతస్య । అహమ్ । అస్మి । యశఃఽతమః
॥ 3 ॥

అనువాదం

ఇంద్రుడు యశస్వి అగ్ని యశస్వి. సోముడు యశస్వి.
సర్వ భూతములు యశస్వాంతములు.
నేను వానిలో యశస్తముడను. ॥ 3 ॥

ఇది యాభై ఎనిమిదవ సూక్తం

అథర్వ III 10

## సూక్తం - 59

ఋషిః అథర్వుడు ॥ దేవతలు ; 1 అరుస్థతిమొదలుగాగల మంత్రాలలో పేర్కొన్న దేవతలు ॥ ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం :- ఈ సూక్తం బృహద్గణంలోనిది గనుక శాంత్యుదకాదులలో దీనికి వినియోగం. అర్థోత్థాపన విఘ్నశమన కర్మలోను, స్వస్త్యయన కర్మలో ఆజ్య సమి త్పురోడాశాది శష్కుల్యంతములైన 13 ద్రవ్యాలతో చేసే హోమంలోను దీనికి వినియోగం

మంత్రము :

అనడుద్భ్యస్త్వం ప్రథమం ధేనుభ్యస్త్వ మరుస్ధతి ।
అధేనవే వయసే శర్మ యచ్ఛ చతుష్పదే ॥ 1 ॥

పదము.

అనడుత్ఽభ్యః । త్వమ్ । ప్రథమమ్ । ధేనుఽభ్యః । త్వమ్ । అరుస్ధతి ।
అధేనవే । వయసే । శర్మ । యచ్ఛ । చతుఃఽపదే ॥ 1 ॥

అనువాదం॥

ఓ * అరుంధతీ ! నీవు మొదట
బండిని లాగే ఎద్దుల వల్ల సుఖ మివ్వు
అలాగే ధేనువుల వల్ల సుఖాన్నివ్వు.
ధేనువ్యతిరిక్తములైన, ఐదేళ్ళకంటె చిన్నవైన
గవాశ్వాది జాతీయములైన చతుష్పాత్తులనుండి సుఖాన్నివ్వు. ॥ 1 ॥

మంత్రము :

శర్మ యచ్ఛత్వోషధిః సహ దేవీ రరుస్ధతీ ।

కరత్ పయస్వన్తం గోష్ఠమయక్ష్మం ఉత పూరుషాన్ ॥ 2 ॥

పదము

శర్మ । యచ్ఛతు । ఓషధిః । సహ । దేవీః । అరున్ధతీ ।

కరత్ । పయస్వన్తమ్ । గోఽస్థమ్ । అయక్ష్మాన్ । ఉత ।

పురుషాన్ ॥ 2 ॥

అనువాదం

'సహదేవి' అనే అరుంధతి ఓషధి సుఖాన్నిచ్చుగాక!
మా గోష్ఠాన్ని క్షీరసంభరితం చేయుగాక!
మా జనులను ఆరోగ్యవంతులను చేయుగాక! ॥ 2 ॥

మంత్రము

విశ్వరూపాం సుభగా మచ్ఛావదామి జీవలామ్ ।

సా నో రుద్రస్యాస్తాం హేతిం దూరం నయతు గోభ్యః ॥3॥

పదము

విశ్వఽరూపామ్ । సుఽభగామ్ । అచ్ఛఽఆవదామి । జీవలామ్ ।

సా । నః । రుద్రస్య । అస్తామ్ । హేతిమ్ । దూరమ్ । నయతు ।

గోభ్యః ॥ 3 ॥

అనువాదం :

విశ్వరూపమైన, సుభగమైన, జీవనదాత్రి అయిన
ఈ 'సహదేవి' అనే ఓషధిని అభిముఖం చేసుకొని
ఇష్ట ఫలప్రాప్తికై ప్రార్థిస్తున్నాను.

రుద్రుడు మా వేపు వేసిన ఆయుధాన్ని
మాకు సంబంధించిన గోవుల నుంచి
దూర దేశానికి కొనిపోవుగాక ! ॥ 3 ॥

ఇది యాభై తొమ్మిదవ సూక్తం

## సూక్తం – 60

ఋషి అథర్వుడు ॥ దేవత : అర్యముడు ॥ ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం :– పతిలాభ కర్మలో కాకిసంచారానికి ముందు చేసే ఆజ్యహోమంలో దీనికి వినియోగం.

మంత్రము

అయమా యాత్యర్యమా పురస్తాద్ విషితస్తుపః ।
అస్యా ఇచ్ఛన్నగ్రువై పతి ముత జాయా మజానయే ॥1॥

పదము :

అయమ్ । ఆ । యాతి । అర్యమా । పురస్తాత్ । విసితఽస్తుపః ।
అస్యై । ఇచ్ఛన్ । అగ్రువై । పతిమ్ । ఉత । జాయామ్ ।
అజానయే ॥ 1 ॥

అనువాదం

పూర్వదిక్కున తెల్లటి వెలుగులను
రశిపోసుకున్న ఈ ఆదిత్యుడు పైకి వస్తున్నాడు
ఈ కన్యకు పతిని కోరుతూ, అలాగే భార్యారహితునకు
భార్య నివ్వనెంచి ఈ ఆదిత్యుడు పైకి వస్తున్నాడు. ॥ 1 ॥

మంత్రము .

అశ్రమ దియ మర్యమ న్నన్యాసాం సమనం యతీ ।

అఙ్గో న్వఽర్యమన్నస్యా అన్యాః సమన మాయతి ॥ 2 ॥

పదము .

అశ్రమత్ । ఇయమ్ । అర్యమన్ । అన్యాసామ్ । సమనమ్ ।
యతీ ।

అఙ్గో ఇతి । ను । అర్యమన్ । అస్యాః । అన్యాః । సమనమ్ ।
ఆఽఅయతి ॥ 2 ॥

**అనువాదం :**

ఓ అర్యమా! ఈ పతిలాభార్థియైన కన్య
అభిలషితార్థం సిద్ధింపక ఖిన్నురాలైనది.
ఇతర పతివ్రతల శాంతిని పొంది దలచినది.
ఓ అర్యమా!
ఇతర స్త్రీలు ఈమె వెనుక శాంతిని పొందుతున్నారు. ॥ 2 ॥

మంత్రము

ధాతా దాధార పృథివీం ధాతా ద్యా ముత సూర్యమ్ ।

ధాతాస్యా అగ్రువై పతిం దధాతు ప్రతికామ్యఽమ్ ॥ 3 ॥

పదము .

ధాతా । దాధార । పృథివీమ్ । ధాతా । ద్యామ్ । ఉత । సూర్యమ్

ధాతా । అస్యై । అగ్రువై । పతిమ్ । దధాతు । ప్రతిఽకామ్యఽమ్
॥ 3 ॥

**అనువాదం :**

విధాత పృథివిని స్వస్థానంలో నిలిపి ఉన్నాడు.
అలాగే ఆ ధాత ద్యులోకాన్ని, సూర్యుని
ఆయా స్థానాలలో నిలిపి ఉన్నాడు.
ఇలాంటి ధాత ఈ సంకామురైన
కన్యకు భర్తను ప్రసాదించు గాక! ॥ 3 ॥

[illegible]

## సూక్తం – 61

**ఋషి: అథర్వుడు॥ దేవత - రుద్రుడు॥ ఛందస్సు 1 త్రిష్టుప్, 2,3, భురిక్ త్రిష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥**

**వినియోగం:–** ఈ సూక్తం బృహద్గణం లోనిది గనుక శాంత్యుదకాదులలో దీనికి వినియోగం. ఉత్పాత విమ్నశమన కర్మలో చేసే క్షీరోదన హవనాది కర్మలో దీని వినియోగం వాపీ కూప తటాకాదులలో నీరు పడాలను కొనే వారు దీనితో ఇంద్రుని గూర్చి యజనం చేయాలి.

**మంత్రము :**

మహ్య మాపో మధుమ దేరయన్తాం
మహ్యం సూరో అభరజ్జ్యోతిషే కమ్ ।
మహ్యం దేవా ఉత విశ్వే తపోజా
మహ్యం దేవః సవితా వ్యచో ధాత్ ॥ 1 ॥

**పదము :**

మహ్యమ్ । అపః । మధు[illegible]త్ । ఆ । ఈరయన్తామ్ ।

మహ్యమ్ । సూరః । అభరత్ । జ్యోతిషే । కమ్ ।

మహ్యమ్ । దేవాః । ఉత । విశ్వే । తపఃఽజాః ।

మహ్యమ్ । దేవః । సవితా । వ్యచః । ధాత్ ॥ 1 ॥

అనువాదం.

ఉదకములు మాధుర్యోపేతములై నా వేపు వచ్చుగాక!
అలాగే సూర్యుడు నాకై సుఖకరమైన ఆత్మతేజస్సును
విషయప్రకాశనార్థమై గ్రహించినాడు.
మరిన్ని, బ్రాహ్మణులు, విశ్వేదేవులు
నాకు ఇష్టఫలాన్ని ఇత్తురుగాక!
సవిత ఇష్టఫల ప్రాప్తిని నాకు చేకూర్చుగాక! ॥ 1 ॥

మంత్రము.

అహం వివేచ పృథివీముత ద్యా-

మహ మృతూం రజనయం సప్త సాకమ్ ।

అహం సత్య మనృతం యద్ వదామ్యహం

దైవీం పరి వాచం విశశ్చ ॥ 2 ॥

పదము.

అహమ్ । వివేచ । పృథివీమ్ । ఉత । ద్యామ్ ।

అహమ్ । ఋతూన్ । అజనయమ్ । సప్త । సాకమ్ ।

అహమ్ । సత్యమ్ । అనృతమ్ । యత్ । వదామి ।

అహమ్ । దైవీమ్ । పరి । వాచమ్ । విశః । చ ॥ 2 ॥

అనువాదం :

పృథివిని, ద్యులోకాన్ని నేనే [illegible] ాను
అలాగే *ఏడు ఋతువు[illegible]తో [illegible]
పరస్పరం అసంహితము[illegible] చేశాను
సత్యాసత్యములనే [illegible] ॥
ఏదైతే ప్రసిద్ధమై ఉన్నదో
దానిని నేనే ఉచ్చరిస్తున్నాను
ఇలాగే దేవసంబంధమైన [illegible]
నేనే పొంది ఉన్నాను ॥ 2 ॥

మంత్రము.

అహం జజాన పృథివీ ముత ద్యా-
మహ మృతూం రజనయం సప్త సిన్ధూన్ ।
అహం సత్య మనృతం యద్ వదామి
యో అగ్నిషోమా వజుషే సఖాయా ॥ 3 ॥

పదము

అహమ్ । జజాన । పృథివీమ్ । ఉత । ద్యామ్ ।
అహమ్ । ఋతూన్ । అజనయమ్ । సప్త । సిన్ధూన్ ।
అహమ్ । సత్యమ్ । అనృతమ్ । యత్ । వదామి ।
యః । అగ్నిషోమౌ । అజుషే । సఖాయా ॥ 3 ॥

* సంసర్పః, అహస్పతిః అనే అధికమాసాలతో కూడి ఏడు ఋతువులు

అనువాదం :

నేనే పృథివిని ఉత్పన్నం చేసినాను
గంగాది నదులను, సముద్రములను
నేనే ఉత్పన్నం చసినాను
అగ్ని సోమ రూపమైన సర్వజగత్తును,
దానికి కారణభూతులైన అగ్నిసోములను
నేను బ్రహ్మోత్కృష్టభావంతో జగన్నిర్మాణంలో
సహాయభూతులనుగా సేవించి ఉన్నాను
( అందువల్లనే ద్యావాపృథివ్యాది సృష్టి ఉపపన్నమైనది ) ॥3॥

ఇది అరవై ఒకటవ సూక్తం

ఇది ఆరవ అనువాకం

# అనువాకం: 7

## సూక్తం - 62

ఋషి. అథర్వుడు ॥ దేవతలు. మంత్రములలో పేర్కొన్న వైశ్వానరాదులు ॥
ఛందస్సు. త్రిష్టుప్ : మంత్రములు. ॥ 3 ॥

వినియోగం - ఈ సూక్తం బృహద్గణం లోనిది గనుక శాంత్యుదకాభిమంత్రణంలో దీనికి వినియోగం. అర్థోత్థాపన విఘ్నశమన కర్మలో చేసే క్షీరోదన హవనాదులలో దీనికి వినియోగం ఇది పవిత్రగణంలోనిది కూడా గనుక నవయజ్ఞాదులలో చేసే ప్రోక్షణలో దీనికి వినియోగం

మంత్రము

వైశ్వానరో రశ్మిభి ర్నః పునాతు
వాతః ప్రాణే నేషిరో నభోభిః ।
ద్యావాపృథివీ పయసా పయస్వతీ

ఋతావరీ యజ్ఞియే నః పునీతామ్ ॥ 1 ॥

పదము

వైశ్వానరః । రశ్మిఽభిః । నః । పునాతు ।
వాతః । ప్రాణేన । ఇషిరః । నభఃఽభిః ।
ద్యావాపృథివీఇతి । పయసా । పయస్వతీ ఇతి ।
ఋతువరీ ఇత్యృతఽవరీ । యజ్ఞియేఇతి । నః । పునీతామ్ ॥ 1 ॥

అనువాదం

వైశ్వానరుడు తన కిరణాలతో
మమ్ములను పునీతులను చేయుగాక !
వాయువు శ్వాసోచ్ఛ్వాసరూపమైన ప్రాణాలతో
మమ్ములను పునీతులను చేయుగాక !
అంతరిక్షంలో గమనశీలమైన ఆయనే నభః ప్రదేశములలో
మమ్ములను పరిశుద్ధం చేయుగాక !
సారభూతమైన రసంతో పయస్వతులైనవి,
ఉదక సంభరితములైనవి యజ్ఞనిష్పాదన
సమర్థములైనవి అయిన ద్యావా పృథ్వులు
మమ్ములను పునీతులను చేయుగాక ! ॥ 1 ॥

మంత్రము

వైశ్వానరీం సూనృతా మా రభధ్వం
యస్యా ఆశాస్తన్వో౨ వీతపృష్ఠాః ।

తయా గృణన్తః సధమాదేషు

వయం స్యామ పతయో రయీణామ్ ॥ 2 ॥

పదము

వైశ్వానరీమ్ । సూనృతామ్ । ఆ । రభధ్వమ్ ।

యస్యాః । ఆశాః । తన్వః । వీతఽపృష్ఠాః ।

తయా । గృణన్తః । సధఽమాదేషు ।

వయమ్ । స్యామ । పతయః । రయీణామ్ ॥ 2 ॥

అనువాదం

(జనులారా!) వైశ్వానర స్తుతిరూపమైన
వాక్యములను ఆరంభించండి
విస్తీర్ణమైన ఉపరిభాగము గల దిక్కులు
వైశ్వానర వాక్కునకు శరీరభూతములైనవి
ఆ వాక్కుతో అగ్నిని స్తుతిస్తూ మేము
సంగ్రామములలో ధనపతులము అగుదుము గాక! ॥ 2 ॥

మంత్రము.

వైశ్వానరీం వర్చస ఆ రభధ్వం

శుద్ధా భవన్తః శుచయః పావకాః ।

ఇహేడయా సధమాదం మదన్తో

జ్యోక్ పశ్యేమ సూర్యముచ్చరన్తమ్ ॥ 3 ॥

పదము

వైశ్వానరీమ్, । వర్చసే । ఆ । రభధ్వమ్ ।

శుద్ధాః । భవన్తః । శుచయః । పావకాః ।

ఇహ । ఇడయా । సధ౽మాదమ్ । మదన్తః ।

జ్యోక్ । పశ్యేమ । సూర్యమ్ । ఉత్౽చరన్తమ్ ॥ 3 ॥

అనువాదం

వైశ్వానరాగ్ని స్తుతిని తేజస్సుకై ఆరంభించండి.
నిష్కల్మషులమై బ్రహ్మవర్చస్సుతో
వెలిగిపోతూ కర్మార్హులమై, ఇతరులను కూడా
శుద్ధిపరచే అన్నంతో మత్తిల్లి ఈ భూలోకంలో ఉండి,
పైన పోయే సూర్యుని చిరకాలం చూతుముగాక! ॥ 3 ॥

ఇది అరవైరెండవ సూక్తం

## సూక్తం – 63

ఋషి. ద్రుహ్వణుడు (1–3 ఆయుర్వర్చోబలకాముడు) దేవతలు. 1 నిర్ఋతి 2 యముడు; 3 మృత్యువు. 4 అగ్ని॥ ఛందస్సు 1–3 జగతీ (త్రిష్టుప్) 4 అనుష్టుప్॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం – అవకీర్ణప్రాయశ్చిత్తార్థం బ్రహ్మచారికి సంబంధించి చేసే హోమంలో దీనికి వినియోగం. అగ్నిచయనంలో కూడా దీనికి వినియోగం.

మంత్రము.

యత్ తే దేవీ నిర్ఋతి రాబబన్ధ

దామ గ్రీవాస్వవిమోక్యం యత్ ।

తత్ తే వి ష్యామ్యాయుషే వర్చసే
బలాయాదోమద మన్న మద్ధి ప్రసూతః ॥ 1 ॥

పదము

యత్ । తే । దేవీ । నిఃఋతిః । ఆబబన్ధ ।
దామ । గ్రీవాసు । అవిమోర్క్యమ్ । యత్ ।
తత్ । తే । వి । స్యామి । ఆయుషే । వర్చసే ।
బలాయ । అదోమదమ్ । అన్నమ్ । అద్ధి । ప్రసూతః ॥ 1 ॥

అనువాదం.

ద్యోతమానమై అనిష్టకారిణి అయిన నిర్ ఋతి దేవత
ఓ పురుషుడా! నీ సర్వాంగములయందు
పాపపాశంతో బంధించినది.
కంఠగతమైన ధమనులలో విడదీయరాని
విధంగా పాపపాశాన్ని కట్టినది
దీనిని నీ శరీరమంతటి నుంచి విడిపిస్తున్నాను
చిరకాల జీవనార్థమై, తేజస్సు కోసమై, బలం కోసమై
ఈ పాశం నుంచి విముక్తుడవైన నీవు
మా అనుజ్ఞతో మదకరమైన అన్నాన్ని భక్షించు. ॥ 1 ॥

మంత్రము.

నమోఽస్తు తే నిర్ ఋతే తిగ్మతేజోఽయస్మయాన్ వి చృతా
బన్ధపాశాన్ ।

యమో మహ్యం పునరిత్ త్వాం దదాతి
తస్మై యమాయ నమో అస్తు మృత్యవే ॥ 2 ॥

పదము

నమః । అస్తు । తే । నిఃఽఋతే । తిగ్మఽతేజః । అయస్మయాన్ ।
వి । చృత । బన్ధఽపాశాన్ ।
యమః । మహ్యమ్ । పునః । ఇత్ । త్వామ్ । దదాతి ।
తస్మై । యమాయ । నమః । అస్తు । మృత్యవే ॥ 2 ॥

అనువాదం :

ఓ తీక్ష్ణదీప్తిగల నిర్ ఋతీ! నీకు నమస్కారం.
ఇందుతో సంతృప్తి చెంది, ఈ దృఢమైన
బంధ పాశములను విడిపించు.
ఓ సాధకుడా! నిన్ను యముడు తిరిగి నాకు అప్పగిస్తాడు
ఆ యమునకు, మృత్యువునకు నమస్కరిస్తున్నాను ॥ 2 ॥

మంత్రము

అయస్మయే ద్రుపదే బేధిష ఇహాభిహితో మృత్యుభిర్యే
సహస్రమ్ ।
యమేన త్వం పితృభిః సంవిదాన
ఉత్తమం నాక మధి రోహ యేమమ్ ॥ 3 ॥

పదము.

అయస్మయే । ద్రుఽపదే । బేధిషే । ఇహ । అభిఽహితః ।
మృత్యుఽభిః । యే । సహస్రమ్ ।
యమేన । త్వమ్ । పితృఽభిః । సమ్ఽవిదానః ।
ఉత్ఽతమమ్ । నాకమ్ । అధి । రోహయ । ఇమమ్ ॥ 3 ॥

అనువాదం

ఇనుప సంకెళ్ళతోను, కఱ్ఱతో చేసిన పాదబంధనం తోను
ఓ నిర్ఋతీ! నీవు పురుషుని బంధించినప్పుడు
ఈ లోకంలో అతడు మృత్యుపాశ బద్ధు డవుతాడు.
జరాదులు, రక్షః పిశాచాదులు మొదలైన
వేలకొలది మరణహేతుభూతములైన వానికి లోబడతాడు.
ఓ నిర్ఋతీ! నీవు యమునితో పితృదేవతలతో
ఐకమత్యంచెంది ఉతమ నాకానికి
ఈ పురుషుని అధిరోహింపజెయ్యి. ॥ 3 ॥

మంత్రము.

సం సమిద్ యువసే వృషన్నగ్నే విశ్వాన్యర్య ఆ ।
ఇడస్పదే సమిధ్యసే స నో వసూన్యా భర ॥ 4 ॥

పదము

సమ్ఽసమ్ । ఇత్ । యువసే । వృషన్ । అగ్నే । విశ్వాని ।
అర్యః । ఆ ।
ఇడః । పదే । సమ్ । ఇధ్యసే । సః । నః । వసూని । ఆ । భర
॥ 4 ॥

**అనువాదం**

కామవర్షి అయిన అగ్నీ! అర్యమా!
నీవు సర్వధనములను ప్రాపింప జేస్తావు
భూస్థానాన్ని సందీపింప జేస్తావు
అలాంటి నీవు మాకు ధనములను ప్రసాదించు ॥ 4 ॥

ఇది అరవై మూడవ సూక్తం

## సూక్తం-64

**ఋషి అథర్వుడు॥ దేవత సాంమనస్యమ్॥ ఛందస్సు 1,3 అనుష్టుప్; 2 త్రిష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥**

**వినియోగం!-** సాంమనస్య కర్మలో దీనికి వినియోగం

**మంత్రము**

సం జానీధ్వం సం పృచ్యధ్వం సం వో మనాంసి జానతామ్।
దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥ 1 ॥

**పదము**

సమ్। జానీధ్వమ్। సమ్। పృచ్యధ్వమ్। సమ్। వః। మనాంసి జానతామ్।
దేవాః। భాగమ్। యథా। పూర్వే। సమ్ఽజానానాః। ఉపఽఆసతే ॥ 1 ॥

**అనువాదం**

సాంమనస్య కాములైన జనులారా!
మీరు సమానజ్ఞానవంతులు కండు,
మీరు కలిసి పనిచెయ్యండి.

మీ మనసులు, జ్ఞానోత్పత్తి నిమిత్తము లయిన
అంతఃకరణములు ఒకే విధమైన
అర్థాన్ని గ్రహించును గాక!
పూర్వం దేవతలు సమాన జ్ఞానులై
అసురుల నుంచి యజమానుడు పరికల్పించిన
హవిర్భాగాన్ని పొందినారు ॥ 1 ॥

మంత్రము

సమానో మన్త్రః సమితిః సమానీ
సమానం వ్రతం సహ చిత్తమేషామ్ ।
సమానేన వో హవిషా జుహోమి
సమానం చేతో అభిసంవిశధ్వమ్ ॥ 2 ॥

పదము

సమానః । మన్త్రః । సమ్ఽఇతిః । సమానీ ।
సమానమ్ । వ్రతమ్ । సహ । చిత్తమ్ । ఏషామ్ ।
సమానేన । వః । హవిషా । జుహోమి ।
సమానమ్ । చేతః । అభిఽసంవిశధ్వమ్ ॥ 2 ॥

అనువాదం.

కార్యా కార్య పర్యాలోచనాత్మకమైన
రహస్య సంభాషణ ఒకటే అగుగాక!
కార్య ప్రవృత్తి కూడా ఏకరూప మగుగాక!
కర్మలు కూడా సమాన మగుగాక!

అంతఃకరణం కూడా వీటితో పాటు ఒకటే అగుగాక!
ఈ ఫలసిద్ధికై ఐక్యజనకమైన
మీ హవిస్సుతో హోమం చేస్తున్నాను.
అందువల్ల సమానరూపమైన
చిత్తంతో అభిముఖులు కండు. ॥ 2 ॥

మంత్రము

సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।
సమాన మస్తు వో మనో యథా వః సుసహాసతి ॥ 3 ॥

పదము

సమానీ । వః । ఆఽకూతిః । సమానా । హృదయాని । వః ।
సమానమ్ । అస్తు । వః । మనః । యథా । వః । సుఽసహ ।
అసతి ॥ 3 ॥

అనువాదం :

ఓ సమాన సాంమనస్య కాములారా!
మీ సంకల్పం ఏకరూప మగుగాక!
మీ అంతఃకరణాలు ఏకరూప మగుగాక!
మీ మనసులు సమాన మగుగాక!
మీ సర్వకర్మలు ఒకటి అగునట్లు
సాంమనస్య కర్మను చేస్తున్నాను ॥ 3 ॥

ఇది అరవై నాల్గవ సూక్తం

## సూక్తం - 65

ఋషి. అథర్వుడు॥ దేవతలు. పరాశరుడు, ఇంద్రుడు॥ ఛందస్సు. పథ్యాపంక్తి
2,3 అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

**వినియోగం:-** సంగ్రామ కర్మలో దీనికి వినియోగం, ఇది అపరాజితగణంలో నిది గనుక ఆ గణప్రయోగా లన్నిటా దీనికి వినియోగం.

మంత్రము

**అవ మన్యురవాయతావ బాహూ మనోయుజా ।**

**పరాశర త్వం తేషాం పరాఞ్చం**

**శుష్మమర్దయాథా నో రయిమా కృధి ॥ 1 ॥**

పదము

**అవ । మన్యుః । అవ । ఆఽయతా । అవ । బాహూ ఇతి । మనః ఽయుజా ।**

**పరాఽశర । త్వమ్ । తేషామ్ । పరాఞ్చమ్ । శుష్మమ్ । అర్దయ ।**

**అథ । నః । రయిమ్ । ఆ । కృధి ॥ 1 ॥**

**అనువాదం.**

శత్రు సంబంధమైన క్రోధం తిరస్కృత మగుగాక!
అలాగే ఆయతములైన ధనుస్సు మొదలైనవి
స్వకార్య సమర్థము లగుగాక!
శత్రుసంబంధములైన బాహువులు, మనసులతోపాటు
ఆయుధోద్యమన అశక్తము లగుగాక!
ఓ పరాశరా! (ఇంద్రా!) నీవా శత్రువుల బలమును
పరాఙ్ముఖం అగునట్లు చెయ్యి
తర్వాత ధనం శత్రువుల నుంచి
మాకు లభించునట్లు చెయ్యి ॥ 1 ॥

మంత్రము

నిర్హస్తేభ్యో నైర్హస్తం యం దేవాః శరు మస్యథ ।

వృశ్చామి శత్రూణాం బాహూ ననేన హవిషాఽహమ్ ॥ 2 ॥

పదము.

నిఃఽహస్తేభ్యః । నైఃఽహస్తమ్ । యమ్ । దేవాః । శరుమ్ ।

అస్యథ ।

వృశ్చామి । శత్రూణామ్ । బాహూన్ । అనేన । హవిషా । అహమ్

॥ 2 ॥

అనువాదం

ఓ దేవతలారా! హస్తసామర్థ్యం పోయిన వారికై
నిర్హస్తత్వ ప్రాపకమైన ఏ బాణాద్యాయుధాలను వేస్తామో,
ఆ శరాది రూపమైన హవిస్సుతో
శత్రువుల బాహువులను నేను ఛిన్నం చేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము.

ఇన్ద్రశ్చకార ప్రథమం నైర్హస్త మసురేభ్యః ।

జయన్తు సత్వానో మమ స్థిరే ణేన్ద్రేణ మేదినా ॥ 3 ॥

పదము ॥

ఇన్ద్రః । చకార । ప్రథమమ్ । నైఃఽహస్తమ్ । అసురేభ్యః ।

జయన్తు । సత్వానః । మమ । స్థిరేణ । ఇన్ద్రేణ । మేదినా ॥ 3 ॥

**అనువాదం**

ఇంద్రుడు మొదట శత్రువులకు
హస్త సామర్థ్య విహీనతను కల్పించినాడు.
ఆ ఇంద్రునితో యుద్ధకర్మలో సహాయభూతుడనైన
నా యోధులైన జనులు
శత్రువులను జయింతురు గాక! ॥ 3 ॥

ఇది అరవై ఐదవ సూక్తం

## సూక్తం - 66

**ఋషి: అథర్వుడు ॥ దేవత . ఇంద్రుడు ॥ ఛందస్సు : 1 త్రిష్టుప్ : 2,3 అనుష్టుప్**
**మంత్రములు : ॥ 3 ॥**

**వినియోగం :-** సంగ్రామ జయ కర్మలో దీనికి వినియోగం. ఈ సూక్తం అపరాజితగణంలోనిది గనుక ఆ గణప్రయుక్త వినియోగం అనుసంధేయము.

మంత్రము .

నిర్హస్తః శత్రు రభిదాసన్నస్తు యే సేనాభి ర్యుధ మాయన్త్యస్మాన్ ।
సమర్పయేన్ద్ర మహతా వధేన ద్రాత్వేషా మఘహారో వివిద్ధః ॥ 1 ॥

పదము .

నిఃఽహస్తః । శత్రుః । అభిఽదాసన్ । అస్తు । యే । సేనాభిః । యుధమ్ । ఆఽయన్తి । అస్మాన్ ।
సమ్ । అర్పయ । ఇన్ద్ర । మహతా । వధేన । ద్రాతు । ఏషామ్ । అఘఽహారః । విఽవిద్ధః ॥ 1 ॥

అనువాదం

మమ్ములను పీడించే శత్రువు నిర్హస్తు డగుగాక!
ఏ శత్రువులు తమ సేనలలో యుద్ధానికై మా మీదికి వస్తారో,
ఓ ఇంద్రా! నీవు వారిని ప్రౌఢహనన సామర్థ్యమైన
వజ్రంతో దెబ్బకొట్టు
ఈ శత్రువుల మధ్యలో శూరుడు అఘహారుడు
బాగా దెబ్బతిని దుర్గతి నొందుగాక! ॥ 1 ॥

మంత్రము

ఆతన్వానా ఆయచ్ఛన్తోఽస్యన్తో యే చ ధావథ।
నిర్హస్తాః శత్రవః స్థనేన్ద్రో వోఽద్య పరాశరీత్ ॥ 2 ॥

పదము:

ఆఽతన్వానాః। ఆఽయచ్ఛన్తః। అస్యన్తః। యే। చ। ధావథ।
నిఃఽహస్తాః। శత్రవః। స్థన। ఇన్ద్రః। వః। అద్య। పరా।
అశరీత్ ॥ 2 ॥

అనువాదం.

విండ్ల నెక్కుపెట్టి వస్తున్న శత్రువులారా! త్వరగా రండి
మీ శత్రువులు నిర్వీర్యహస్తు లైనారు.
ఇప్పుడు మిమ్ములను ఇంద్రుడు
పరాహతులను చేసినాడు ॥ 2 ॥

మంత్రము.

నిర్హస్తాః సన్తు శత్రవోఽఙ్గైషాం మ్లాపయామసి।
అథైషామిన్ద్ర వేదాంసి శతశో వి భజామహై ॥ 3 ॥

**పదము:**

**ని:ఽహస్తాః । సన్తు । శత్రవః । అఙ్గా । ఏషామ్ । మ్లాపయామసి ।**

**అథ । ఏషామ్ । ఇన్ద్ర । వేదాంసి । శతఽశః । వి । భజామహై ॥3॥**

**అనువాదం.**

మా శత్రువులు నిర్హస్తు లగుదురు గాక!
వీరి అంగములను బలహీనాలను చేస్తున్నాను.
తరువాత ఓ ఇంద్రా! మీ అనుగ్రహం వల్ల
శత్రువుల ధనాన్ని బహువిధాలుగా పంచుకుంటున్నాము. ॥3॥

ఇది అరవై ఆరవ సూక్తం

## సూక్తం-67

**ఋషి: అథర్వుడు॥ దేవత: ఇంద్రుడు॥ ఛందస్సు: అనుష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥**

**వినియోగం - సంగ్రామజయ కర్మలో దీనికి వినియోగం. ఈ సూక్తం అపరాజిత గణంలోనిది గనుక ఆ గణప్రయుక్త వినియోగం అనుసందేయము.**

మంత్రము·

**పరి వర్త్మాని సర్వత ఇన్ద్రః పూషా చ సస్రతుః ।**

**ముహ్యన్త్వద్యాఽమూః సేనా అమిత్రాణాం పరస్తరామ్॥1॥**

పదము

**పరి । వర్త్మాని । సర్వతః । ఇన్ద్రః । పూషా । చ । సస్రతుః ।**

**ముహ్యన్తు । అద్య । అమూః । సేనాః । అమిత్రాణామ్ । పరః ఽతరామ్ ॥ 1 ॥**

**అనువాదం.**

ఇంద్రుడు, పూష లనే ఈ దేవతలు
సర్వత్ర మా దారులను అడ్డగింతురు గాక !
ఇప్పుడు దూరంగా కనిపించే శత్రుసేనలు
పరిపూర్తిగా సమ్మోహితము లగుగాక ! ॥ 1 ॥

**మంత్రము :**

**మూఢా అమిత్రాశ్చరతాశీర్షాణ ఇవాహయః ।**
**తేషాం వో అగ్నిమూఢానా మిన్ద్రో హన్తు వరంవరమ్ ॥ 2 ॥**

**పదము :**

**మూఢాః । అమిత్రాః । చరత । అశీర్షాణఃఽఇవ । అహయః ।**
**తేషామ్ । వః । అగ్నిఽమూఢానామ్ । ఇన్ద్రః । హన్తు । వరమ్ ఽవరమ్ ॥ 2 ॥**

**అనువాదం :**

ఓ శత్రువులారా ! తలలు తెగిపోయిన పాములవలె
మూఢులై యుద్ధభూమిలో సంచరిస్తూ ఉండండి.
అగ్నిచే వ్యామోహితులైన అలాంటి మీ మధ్యలో
ఉత్తమోత్తములైన వారిని ఇంద్రుడు చంపుగాక ! ॥ 2 ॥

**మంత్రము :**

**ఐషు నహ్య వృషాజినం హరిణస్యా భియం కృధి ।**
**పరా జమిత్ర ఏషత్వర్వాచీ గౌరుపేషతు ॥ 3 ॥**

పదము.

ఆ। ఏషు। సహ్య। వృషా। అజినమ్। హరిణస్య। భియమ్। కృధి।

పరాజ్। అమిత్రః। ఏషతు। అర్వాచీ। గౌః। ఉప। ఏషతు ॥3॥

అనువాదం

ఓ ఇంద్రుడా! కోరికల నిచ్చువాడా!
నీవు కృష్ణమృగాజినాన్ని, సోమమణివేష్టితమైన దానిని
ఈ మా భటులకు ఆబద్ధంచెయ్యి
శత్రువులకు భయం కల్పించు.
అతడు యుద్ధ పరాఙ్ముఖుడై పారిపోవుగాక!
అతనికి సంబంధించిన ఆవు మా వద్దకు వచ్చుగాక! ॥ 3 ॥

ఇది అరవై ఏడవ సూక్తం

## సూక్తం - 68

ఋషిః అథర్వుడు ॥ దేవతలు. మంత్రములలో పేర్కొన్న సవిత్రాదులు ॥ ఛందస్సు 1 పురోవిరాడతిశక్వరీ గర్భా చతుష్పదా జగతీ. 2 అనుష్టుప్ః 3 అతిజగతీగర్భాత్రిష్టుప్ ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం :- గోదాన, చూడాకరణ కర్మలలో దీనికి వినియోగం. అలాగే ఉపనయన కర్మలో దీనికి వినియోగం.

మంత్రము

ఆయమగన్త్సవితా క్షురేణోష్ణేన వాయ ఉదకేనేహి।
ఆదిత్యా రుద్రా వసవ ఉన్దన్తు సచేతసః
సోమస్య రాజ్ఞో వపత ప్రచేతసః ॥ 1 ॥

పదము :

ఆ । అయమ్ । అగన్ । సవితా । క్షురేణ । ఉష్ణేన । వాయో ఇతి ।
ఉదకేన । ఆ । ఇహి ।

ఆదిత్యాః । రుద్రాః । వసవః । ఉన్దన్తు । సఽచేతసః ।
సోమస్య । రాజ్ఞః । వపత । ప్రఽచేతసః ॥ 1 ॥

అనువాదం

ఈ సూర్యుడు వపన సాధనమైన
కత్తితో పాటు వచ్చినాడు.
ఓ వాయూ ! నీవు వేడినీళ్ళు తీసుకొని రా !
ద్వాదశాదిత్యులు, ఏకాదశ రుద్రులు, అష్ట వసువులు
సమానజ్ఞాన సంపన్నులై ఆ ఉదకంతో
వటుని శిరస్సును తడపుదురు గాక !
ఓ పరిచారకులారా ! కత్తితో
ఆ తడిసిన వెంట్రుకలను వపనం చేయుండి ॥ 1 ॥

మంత్రము :

అదితిః శ్మశ్రు వపత్వాప ఉన్దన్తు వర్చసా ।
చికిత్సతు ప్రజాపతి ర్దీర్ఘాయుత్వాయ చక్షసే ॥ 2 ॥

పదము :

అదితిః । శ్మశ్రు । వపతు । ఆపః । ఉన్దన్తు । వర్చసా ।
చికిత్సతు । ప్రజాఽపతిః । దీర్ఘాయుఽత్వాయ । చక్షసే ॥ 2 ॥

**అనువాదం:**

అదితి ఈ పురుషుని మీసములను వపనం చేయుగాక!
అద్దేవత తేజస్సుతో తడుపుగాక!
దీర్ఘాయువు కోసమై, దర్శనార్థమై,
సర్వశ్రేయస్సు కోసం ప్రజాపతి చికిత్స చేయుగాక! ॥ 2 ॥

మంత్రము

యేనావపత్ సవితా క్షురేణ
సోమస్య రాజ్ఞో వరుణస్య విద్వాన్ ।
తేన బ్రహ్మణో వపతేద మస్య
గోమా నశ్వవా నయ మస్తు ప్రజావాన్ ॥ 3 ॥

పదము

యేన । అవపత్ । సవితా । క్షురేణ । సోమస్య । రాజ్ఞః । వరుణస్య
విద్వాన్ ।
తేన । బ్రహ్మణః । వపత । ఇదమ్ । అస్య । గోఽమాన్ । అశ్వ
ఽవాన్ । అయమ్ । అస్తు । ప్రజాఽవాన్ ॥ 3 ॥

**అనువాదం.**

విద్వాంసుడైన సవిత, సోమునకు రాజైన వరుణునకు
సంబంధించిన ఏ కత్తితో వపనం చేసెనో
ఓ బ్రాహ్మణులారా! అలాంటి కత్తితో ఈ పురుషుని
కేశములను, మీసములను వపనం చేయుదురు గాక!

ఈ పురుషుడు అధిక గో సంపన్నుడై,
అశ్వసంపన్నుడై సంతానవంతుడగుగాక ! ॥ 3 ॥

ఇది అరవై ఎనిమిదవ సూక్తం

## సూక్తం – 69

ఋషి. అథర్వుడు (వర్చస్కాముడు, యశస్కాముడును)॥ దేవతలు బృహస్పతి, అశ్వినులు ॥ ఛందస్సు • అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 3 ॥

వినియోగం.– మేధాజననకాముడు నిద్రలేచి చేసే ముఖప్రక్షాళన క్రియలో, కుమారీ వర్చస్య కర్మలో, క్షత్రియ వర్చస్య కర్మలో, వైశ్య, శూద్రాది వర్చస్య కర్మలలో, ఉత్సర్జనాఖ్య కర్మలో, అగ్నిచయనంలో, స్వర్గౌదన, బ్రహ్మౌదన తంత్ర సన్నిపాతంలో దీనికి వినియోగం.

మంత్రము .

గిరావరగరాటేషు హిరణ్యే గోషు యద్ యశః ।
సురాయాం సిచ్యమానాయాం కీలాలే మధు తన్మయి ॥1॥

పదము :

గిరౌ । అరగరాటేషు । హిరణ్యే । గోషు । యత్ । యశః ।
సురాయామ్ । సిచ్యమానాయామ్ । కీలాలే । మధు । తత్ ।
మయి ॥ 1 ॥

అనువాదం

హిమవంతము మొదలైన పర్వతములందు
ఏ కీర్తి అయితే ఉన్నదో, యశస్వులైన
రాజులు ఎక్కడ తిరుగుతారో, కాంచనమునందు,
గోవులయందు ఏ యశస్సైతే ఉన్నదో,
అది నాకు సంక్రమించు గాక !

మఱిన్ని సిచ్యమానములైన పాత్రలలోను,
అసిచ్యమానమైన సురయందు, అన్నములోను,
ఏ మాధుర్యోపేతమైన రసం కలదో
అది నాకు లభించుగాక! ॥ 1 ॥

మంత్రము:

అశ్వినా సారఘేణ మా మధునాఙ్క్తం శుభస్పతీ ।
యథా భర్గస్వతీం వాచ మావదాని జనాం అను ॥ 2 ॥

పదము

అశ్వినా । సారఘేణ । మా । మధునా । అఙ్క్తమ్ । శుభః । పతీఇతి ।
యథా । భర్గస్వతీమ్ । వాచమ్ । ఆఽవదాని । జనాన్ । అను ॥2॥

అనువాదం.

ఓ అశ్వినీ దేవతలారా! శోభాయమానమైన భర్తలు
నన్ను తేనెటీగలు సంపాదించిన తేనెతో
సంయోగింప జేయుదురు గాక!
దీప్తిమతి అయిన మధురమైన వాక్కును
జనుల నభిలక్షించి ఉచ్చరించునట్లు
మధుసేచనం చేయుదురు గాక! ॥ 2 ॥

మంత్రము

మయి వర్చో అథో యశోఽథో యజ్ఞస్య యత్ పయః ।
తన్మయి ప్రజాపతి ర్దివి ద్యామివ దృంహతు ॥ 3 ॥

పదము .

మయి । వర్చః । అథో ఇతి । యశః । అథో ఇతి । యజ్ఞస్య ।
యత్ । పయః ।
తత్ । మయి । ప్రజాఽపతిః । దివి । ద్యామ్ఽఇవ । దృంహతు ।
॥ 3 ॥

అనువాదం :

నాలో ఏ తేజస్సైతే ఉన్నదో, యశస్సైతే ఉన్నదో,
చేయనున్న యజ్ఞఫలం ఏదైతే ఉన్నదో,
ఆ సర్వమూ నాలో ప్రజాపతి దృఢీకరించు గాక !
ఆయన అంతరిక్షంలో దీప్యమానమైన
జ్యోతిర్మండలాన్ని దృఢీకరించినవాడు గదా ! ॥ 3 ॥

ఇది అరవై తొమ్మిదవ సూక్తం

## సూక్తం—70

ఋషి కాజ్కాయనుడు॥ అఘ్న్యా॥ ఛందస్సు - జగతీ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం .— గోవత్ససాంమనస్య కర్మలో చేసే ప్రక్రియలో దీనికి వినియోగం

మంత్రము .

యథా మాంసం యథా సురా యథాక్షా అధిదేవనే ।
యథా పుంసో వృషణ్యత స్త్రియాం నిహన్యతే మనః ।
ఏవా తే అఘ్న్యే మనోఽధి వత్సే ని హన్యతామ్ ॥ 1 ॥

పదము ,

యథా । మాంసమ్ । యథా । సురా । యథా । అక్షాః । అధి
ఽదేవనే ।

యథా । పుంసః । వృషణ్యతః । స్త్రియామ్ । నిఽహన్యతే । మనః

ఏవ । తే । అఘ్న్యే । మనః । అధి । వత్సే । ని । హన్యతామ్॥1॥

**అనువాదం :**

ఎలా మాంసం పురుషునికి ప్రేమాస్పదమో,
మదిర ఏ విధంగా ప్రియతమమో,
ఎలా పాచికలు ద్యూతశాలలో ప్రియతమములో,
ఏ విధంగా పురుషునికి సురతార్థమై
మనస్సు స్త్రీయందు ప్రహ్వీభవించునో,
ఆ విధంగా ఓ ధేనూ నీ మనస్సు
వత్సంపై ప్రహ్వీభూత మగుగాక! ॥ 1 ॥

**మంత్రము :**

యథా హస్తీ హస్తిన్యాః పదేన పదముద్యుజే ।

యథా । పుంసో వృషణ్యత స్త్రియాం నిహన్యతే మనః ।

ఏవా తే అఘ్న్యే మనోఽధి వత్సే ని హన్యతామ్ ॥ 2 ॥

**పదము :**

యథా । హస్తీ । హస్తిన్యాః । పదేన । పదమ్ । ఉత్ఽయుజే ।

యథా । పుంసః । వృషణ్యతః । స్త్రియామ్ । నిఽహన్యతే । మనః

ఏవ । తే । అఘ్న్యే । మనః । అధి । వత్సే । ని । హన్యతామ్॥2॥

**అనువాదం .**

ఏ విధంగా ఏనుగు స్వకీయపాదంతో
ఆడ ఏనుగు పాదాన్ని ప్రేమతో ఎత్తునో,

ఏ విధంగా పురుషునికి సురతార్థమై మనస్సు
స్త్రీయందు ప్రహ్వీభవించునో,
ఆ విధంగా ఓ ధేనూ! నీ మనస్సు
వత్సంపై ప్రహ్వీభూత మౌగాక! ॥ 2 ॥

మంత్రము

యథా ప్రధిర్యథోపధిర్యథా నభ్యం ప్రధావధి ।
యథా పుంసో వృషణ్యత స్త్రియాం నిహన్యతే మనః ।
ఏవా తే అఘ్న్యే మనోఽధి వత్సే ని హన్యతామ్ ॥ 3 ॥

పదము

యథా । ప్రఽధిః । యథా । ఉపఽధిః । యథా । నభ్యమ్ ।
ప్రఽధౌ । అధి ।
యథా । పుంసః । వృషణ్యతః । స్త్రియామ్ । నిఽహన్యతే । మనః
ఏవ । తే । అఘ్న్యే । మనః । అధి । వత్సే । ని । హన్యతామ్ ॥ 3 ॥

అనువాదం.

ఏ విధంగా నైతే బండి కమ్మితొ సంబద్ధ మౌతుందో,
అలాగే మిగతా బండిచక్రం దానితో సంబంధిస్తుందో,
ఏ విధంగా ఉక్తరూపమైన రథచక్రం అవయవాలు
దృఢ సంబంధు లైనవో, ఓధేనూ!
కాముకుడైన పురుషుని మనస్సు కామునియం దెలా
సంబద్ధమవుతుందో, నీ మనస్సు ఆ విధంగా నీ వత్సంపై
దృఢ సంబంధం కలది అగుగాక! ॥ 3 ॥

ఇది డెబ్బైయవ సూక్తం

# సూక్తం - 71

ఋషి. బ్రహ్మ ॥ దేవతలు:-1,2 అగ్ని: 3 విశ్వేదేవులు ॥ ఛందస్సు:-1, 2 జగతీ; 3 త్రిష్టుప్ ॥ మంత్రములు. 3 ॥

వినియోగం —అగ్నికార్యంలో బ్రహ్మచారి భిక్షను హోమం చేయుటలో దీనికి వినియోగం.

మంత్రము.

యదన్నమద్మి బహుధా విరూపం హిరణ్యమశ్వముత

గామజామవిమ్ ।

యదేవ కిం చ ప్రతిజగ్రహాహ మగ్నిష్ట ద్ధోతా సుహుతం

కృణోతు ॥ 1 ॥

పదము

యత్ । అన్నమ్ । అద్మి । బహుఽధా । విఽరూపమ్ । హిరణ్యమ్ ।

అశ్వమ్ । ఉత । గామ్ । అజామ్ ।

అవిమ్ । యత్ । ఏవ । కిమ్ । చ । ప్రతిఽజగ్రహ । అహమ్ ।

అగ్నిః । తత్ । హోతా । సుఽహుతమ్ । కృణోతు ॥ 1 ॥

అనువాదం.

వివిధరూపమైన అన్నాన్ని బహుప్రకారములతో భక్షిస్తున్నాను
ఏదో ద్రవ్యజాతాన్ని దారిద్ర్య వశంవల్ల ప్రతిగ్రహించినాను
అదంతా హోమనిష్పాదకుడైన
ఈ అగ్ని స్వాహుతం చేయుగాక! ॥ 1 ॥

మంత్రము :

యస్మా హుత మహుత మాజగామ దత్తం

పితృభి రనుమతం మనుష్యైః ।

యస్మా న్మే మన ఉదివ రారజీ

త్యగ్నిష్టద్ధోతా సుహుతం కృణోతు ॥ 2 ॥

పదము

యత్ । మా । హుతమ్ । అహుతమ్ । ఆ౽జగామ । దత్తమ్ ।

పితృ౽భిః । అను౽మతమ్ । మనుష్యైః ।

యస్మాత్ । మే । మనః । ఉత్౽ఇవ । రారజీతి ।

అగ్నిః । తత్ । హోతా । సు౽హుతమ్ । కృణోతు ॥ 2 ॥

అనువాదం :

హోమంతో సంస్కరింపబడినది, కానిది
ఏ ద్రవ్యమున్నదో, దానిని నేను ప్రతిగ్రహించినాను
పితృదేవతలచే మా అనుభవార్థమై దత్తమైన,
మనుష్యులచేత అనజ్ఞాతమైన దేనినైతే
నేను పరిగ్రహించి నా మనసు
హర్షాతిశయంతో ఉద్దీప్యమాన మైనదో
దానిని అగ్ని స్వాహుతం చేయుగాక ! ॥ 2 ॥

మంత్రము

య దన్న మద్మ్యనృతేన దేవా

దాస్యన్నదాస్య న్నుత సంగృణామి ।
వైశ్వానరస్య మహతో మహిమ్నా
శివం మహ్యం మధుమ దస్త్వన్నమ్ ॥ 3 ॥

పదము

యత్ । అన్నమ్ । అద్మి । అనృతేన । దేవాః ।
దాస్యన్ । అదాస్యన్ । ఉత । సమ్ఽగృణామి ।
వైశ్వానరస్య । మహతః । మహిమ్నా ।
శివమ్ । మహ్యమ్ । మధుఽమత్ । అస్తు । అన్నమ్ ॥ 3 ॥

**అనువాదం.**

ఓ దేవతలారా! అసత్య-ధనంతో అపహరించి
ఏ అన్నాన్ని తింటున్నానో,
ఇస్తూ, తీసుకుంటూ ఉన్నానో,
ఆ సర్వరూపమైన అన్నమూ
వైశ్వానరుని మాహాత్మ్యంతో నాకు
సుఖకరము, మాధుర్యవంతము అగుగాక! ॥ 3 ॥

ఇది డెబ్బై ఒకటవ సూక్తం

## సూక్తం – 72

**ఋషులు.–** అథర్వాంగిరసులు ॥ దేవత : శేపోఽర్కుడు ॥ ఛందస్సు : 1 జగతీ 2 అనుష్టుప్ · 3 భురిగనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 3 ॥

**వినియోగం.–** వాజీకరణకాముడు చేసే వాజీకరణ కర్మలో దీనికి వినియోగం.

మంత్రము

యథాసితః ప్రథయతే వశాం అను
వపూంషి కృణ్వ న్నసురస్య మాయయా ।
ఏవా తే శేపః సహసాయ మర్కో౽జ్గేనాజ్గం
సంసమకం కృణోతు ॥ 1 ॥

పదము

యథా । అసితః । ప్రథయతే । వశాన్ । అను ।
వపూంషి । కృణ్వన్ । అసురస్య । మాయయా ।
ఏవ । తే । శేపః । సహసా । అయమ్ । అర్కః ।
అజ్గేన । అజ్గమ్ । సమ్౽సమకమ్ । కృణోతు ॥ 1 ॥

అనువాదం.

ఏ విధంగా బద్ధుడైన పురుషుడు
తన పురుషులను అనులక్షించి
అసురమాయతో శరీరములను చేస్తున్నాడో,
అలాగే ఈ అర్కమణి ( జిల్లేడు ) శీఘ్రంగా
నీ శేఫమును ఇతర అంగాలతో
సమానమైన దానినిగా చేయుగాక! ॥ 1 ॥

మంత్రము

యథా పసస్తాయాదరం వాతేన స్థూలభం కృతమ్ ।
యావత్పరస్వతః పసస్తావత్ తే వర్ధతాం పసః ॥ 2 ॥

పదము

యథా । పసః । తాయాదరమ్ । వాతేన । స్థూలభమ్ । కృతమ్ ।
యావత్ । పరస్వతః । పసః । తావత్ । తే । వర్ధతామ్ । పసః ॥2॥

అనువాదం

తాయాదరానికి చెందిన మగగుఱ్ఱి
వాయువుతో ఎలా స్థూలం చేయబడుతుందో,
పరస్వత శేఫ సమానం చేయబడుతుందో,
ఓ సాధకుడా! నీ శేఫం కూడా
అంతవఱకు పెరుగుగాక! ॥ 2 ॥

మంత్రము:

యావదఙ్గీనం పారస్వతం హాస్తినం గార్ధభం చ యత్ ।
యావ దశ్వస్య వాజిన స్తావత్ తే వర్ధతాం పసః ॥ 3 ॥

పదము,

యావత్ఽఅఙ్గీనమ్ । పారస్వతమ్ । హాస్తినమ్ । గార్ధభమ్ । చ ।
యత్ ।
యావత్ । అశ్వస్య । వాజినః । తావత్ । తే । వర్ధతామ్ । పసః
॥ 3 ॥

అనువాదం:

అంగముల నుంచి సముద్భూతమైన
పారస్వతం ఏ పరిమాణం కలదో,
అలాగే హస్తి శేఫం ఏ పరిమాణం గలదో,
గార్ధభ శేఫ మేపరిమాణం గలదో,

యౌవనంలో నున్న అశ్వశిశ్నం సంభోగావస్థలో
ఎంత పరిమాణంతో వృద్ధి చెందునో
అంతవఱకు నీ శేఫం కూడా పెరుగు గాక ! ॥ 8 ॥

ఇది డెబ్బై రెండవ సూక్తం

ఇది ఏడవ అనువాకం

# అనువాకం: 8

## సూక్తం - 73

ఋషి: అథర్వుడు॥ దేవతలు: మంత్రములలో పేరొన్న వరుణాదులు॥
ఛందస్సు 1,3 భురిక్, 2 త్రిష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం :- సాంమనస్య కర్మలో దీనికి వినియోగం ఈ సూక్తం వాస్తోష్పత్య గణంలోనిది గనుక శాంత్యుదకాభిమంత్రణాదులలో గణప్రయుక్త వినియోగం అనుసంధేయం. దీనిలో మూడవ మంత్రాన్ని నవ శాలాప్రవేశంలో యజమానుడు పఠించాలి

మంత్రము

ఏహ యాతు వరుణః సోమో
అగ్నిర్బృహస్పతి ర్వసుభిరేహ యాతు ।
అస్య శ్రియ ముపసంయాత సర్వ
ఉగ్రస్య చేత్తుః సంమనసః సజాతాః ॥ 1 ॥

పదము :

ఆ । ఇహ । యాతు । వరుణః । సోమః ।
అగ్నిః । బృహస్పతిః । వసుఽభిః । ఆ । ఇహ । యాతు ।

అస్య । శ్రియమ్ । ఉపఽసంయాత । సర్వే ।

ఉగ్రస్య । చేత్తుః । సమ్ఽమనసః । సఽజాతాః ॥ 1 ॥

**అనువాదం :**

ఇక్కడికి వరుణుడు, సోముడు, అగ్ని
సాంమనస్య కరణార్థమై వత్తురుగాక!
బృహస్పతి వసువులతోపాటు వచ్చుగాక!
ఓ సమాన జన్ములారా! మీరు సమాన మనస్కులై
ఉగ్రుడైన యజమానునికి సంపదను సమకూర్తురుగాక! ॥ 1 ॥

మంత్రము

యో వః శుష్మో హృదయేష్వన్తరాకూతిర్యా వో మనసి ప్రవిష్టా।
తాన్త్సీవయామి హవిషా ఘృతేన మయి సజాతా రమ
తిర్వో అస్తు ॥ 2 ॥

పదము

యః । వః । శుష్మః । హృదయేషు । అన్తః । ఆఽకూతిః । యా ।
వః । మనసి । ప్రఽవిష్టా ।
తాన్ । సీవయామి । హవిషా । ఘృతేన । మయి । సఽజాతాః ।
రమతిః । వః । అస్తు ॥ 2 ॥

**అనువాదం :**

ఓ సజాతులారా! మీ హృదయాలలో
శోషకమైన బలం ఉన్నది.

మీ అంతఃకరణంలో 'ఇది నా దగుగాక '
అన్న భావం ప్రవేశించినది.
దానిని హోమం చేస్తున్న ఘృతంతో
పరస్పర సంబద్ధం చేస్తున్నాను.
ఓ సజాతులారా! మీకు అనుకూల ప్రవృత్తి
మా పురుషులలో కలుగుగాక! ॥ 2 ॥

మంత్రము ।

ఇహైవ స్త మాప యాతాధ్యస్మత్ పూషా పరస్తాదపథం వః
కృణోతు ।
వాస్తోష్పతిరను వో జోహవీతు మయి సజాతా రమతిర్వో అస్తు
॥ 3 ॥

పదము.

ఇహ । ఏవ । స్త । మా । అప । యాత । అధి । అస్మత్ । పూషా ।
పరస్తాత్ । అపథమ్ । వః । కృణోతు ।
వాస్తోః । పతిః । అను । వః । జోహవీతు । మయి । సఽజాతాః ।
రమతిః । వః । అస్తు ॥ 3 ॥

అనువాదం.

ఓ సజాతులారా! మా ఇంటిలోనే ఉండండి.
నన్ను వదలి పోకండి.
నా కంటె ప్రతికూలురైన మీకు [illegible] ఆవ్యకుండు గాక!
వాస్తోష్పతి మిమ్ముల ననుసరించి
మరీమరీ నాకై ఆహూతు డగుగాక! ॥ 3 ॥

ఇది షష్ఠ మూడవ సూక్తం

## సూక్తం-74

ఋషి, అథర్వుడు॥ దేవతలు. మంత్రములలో పేర్కొన్న బ్రహ్మణస్పత్యాదులు॥ ఛందస్సు. 1,2 అనుష్టుప్. 3 త్రిష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం — సాంమనస్య కర్మలో (34 వ సూక్తమునకు వలెనే) దీనికి వినియోగం.

మంత్రము

సం వః పృచ్యన్తాం తన్వ1ః సం మనాంసి సము వ్రతా।

సం వోఽయం బ్రహ్మణస్పతిర్భగః సం వో అజీగమత్ ॥ 1 ॥

పదము

సమ్। వః। పృచ్యన్తామ్। తన్వఃః। సమ్। మనాంసి। సమ్।

ఓంఇతి। వ్రతా।

సమ్। వః। అయమ్। బ్రహ్మణః। పతిః। భగః। సమ్। వః।

అజీగమత్ ॥ 1 ॥

అనువాదం

ఓ సాంమనస్య కర్ములారా!

మీ శరీరాలు పరస్పరానురక్తాలై కలియుగాక!

అలాగే వ్రతాలు కలియుగాక!

బ్రాహ్మణస్పతి మిమ్ములను సంగతమనస్కులను చేయుగాక!

అలాగే భగుడు మిమ్ములను సంగత మనస్కులను చేయుగాక!

॥ 1 ॥

మంత్రము:

సంజ్ఞపనం వో మనసోఽథో సంజ్ఞపనం హృదః।

అథో భగస్య యచ్ఛ్రాన్తం తేన సంజ్ఞపయామి వః ॥ 2 ॥

పదము

సమ్ఽజ్ఞపనమ్ । వః । మనసః । అథో ఇతి । సమ్ఽజ్ఞపనమ్ ।
హృదః ।
అథో ఇతి । భగస్య । యత్ । శ్రాన్తమ్ । తేన । సమ్ఽజ్ఞప
యామి । వః ॥ 2 ॥

అనువాదం :

ఓ సాంమనస్య కర్ములారా !
మీ మనసులో ఏ కర్మతో సంజ్ఞాపనం కలుగుతుందో,
అలాగే మీ హృదయానికి, మనసునకు ఆధారభూతమైన
సమానజ్ఞాన జననాన్ని కల్పిస్తున్నాను
భగునకు ఏ శ్రమకారకమైన తపస్సు కలదో,
దానితో మిమ్ములను సాంమనస్య కాములను చేస్తున్నాను
॥ 2 ॥

మంత్రము

యథాదిత్యా వసుభిః సంబభూవు ర్మరుద్భిరుగ్రా
అహృణీయమానాః ।
ఏవా త్రిణామ న్నహృణీయమాన ఇమాన్ జనా న్త్సంమనస
స్కృధీహ ॥ 3 ॥

పదము

యథా । ఆదిత్యాః । వసుఽభిః । సమ్ఽబభూవుః । మరుత్ఽభిః ।
ఉగ్రాః । అహృణీయమానాః ।

ఏవ । త్రిఽనామన్ । అహృణీయమానః । ఇమాన్ । జనాన్ ।

సమ్ఽమనసః । కృధి । ఇహ ॥ 3 ॥

అనువాదం

ఆదిత్యులు ఏ ప్రకారంగా
అష్టవసువులతో కలిసి సమానజ్ఞాను లగుదురో
అలాగే మరుత్తులతో కలిసి
ఉగ్రులైన సమానజ్ఞానులు కండి.
ఈ విధంగా భూమి, అంతరిక్ష, ద్యులోకాలలో
పార్థివ, వైద్యుత, సూర్యాత్ములైన అందరకూ
ఓ అగ్నీ ! అహూయమానుడవై
ఈ గ్రామనగరాదులలో వీరిని సాంమనస్య
కాములను, సమానమనస్కులను చెయ్యి ॥ 3 ॥

ఇది డెబ్బై నాల్గవ సూక్తం.

## సూక్తం - 75

ఋషిః కబన్ధుడు ( సపత్నక్షయకాముడు ) ॥ దేవత. ఇంద్రుడు ॥ ఛందస్సు॥
1,2 అనుష్టుప్ : 3 షట్పదా జగతీ ॥ మంత్రములు : ॥ 3 ॥

వినియోగం :- అభిచారిక తంత్రంలో దర్భాస్తరణ కరణంలో దీనికి వినియోగం అదే కర్మలో దీనితో అభ్యాతానాంతంలో *'ఇంగిడావిష్ట' హోమం చేయాలి. అదే తంత్రంలో సంస్థిత హోమాలను చేయాలి.

మంత్రము.

నిరముం నుద ఓకసః సపత్నో యః పృతన్యతి ।

నైర్బాధ్యేఽన హవిషేన్ద్ర ఏనం పరాశరీత్ ॥ 1 ॥

పదము

నిః । అముమ్ । నుదే । ఓకసః । సఽపత్నః । యః । పృతన్యతి ।

నైఃఽబాధ్యేఽన । హవిషా । ఇన్ద్రః । ఏనమ్ । పరా । అశరీత్

॥ 1 ॥

అనువాదం

ఈ శత్రువును తన నివాసస్థానం నుంచి తరిమివేస్తున్నాను.
ఆ శత్రువు మమ్ములను బాధించుటకై
సైన్యాన్ని చేకూర్చదలచుకున్నాడు.
ఎక్కువ బాధను కలిగించే హవిస్సుతో
ఆహూయమానుడైన ఇంద్రుడు
ఈ శత్రువును తిరిగి రాకుండా చేయుగాక ! ॥ 1 ॥

మంత్రము .

పరమాం తం పరావత మిన్ద్రో నుదతు వృత్రహా ।

యతో న పునరాయతి శశ్వతీభ్యః సమాభ్యః ॥ 2 ॥

పదము :

పరమామ్ । తమ్ । పరాఽవతమ్ । ఇన్ద్రః । నుదతు । వృత్రఽహా

యతః । న । పునః । ఆఽఅయతి । శశ్వతీభ్యః । సమాభ్యః ॥2॥

అనువాదం

వృత్రుని సంహరించిన ఇంద్రుడు
ఆ శత్రువును చాలాదూరం కొనిపోవుగాక !

---

* Terminalla Catappa
బాదము ఇంగుడి, నాటు బాదము, తపసతరువు. I M P
గారచెట్టు - సూర్యరాయాంధ్రనిఘంటువు, సంస్కృతాంధ్ర పదార్ణవము

అక్కడ నుంచి అతడు చాలా సంవత్సరాలు
తిరిగి రాకుండు గాక! ॥ 2 ॥

**మంత్రము**

ఏతు తిస్రః పరావత ఏతు పఞ్చ జనాం అతి ।
ఏతు తిస్రోతి రోచనా యతో న పునరాయతి ।
శశ్వతీభ్యః సమాభ్యో యావత్ సూర్యో అసద్ దివి ॥ 3 ॥

పదము .

ఏతు । తిస్రః । పరాऽవతః । ఏతు । పఞ్చ । జనాన్ । అతి ।
ఏతు । తిస్రః । అతి । రోచనా । యతః । న । పునః । ఆऽఅయతి
శశ్వతీభ్యః । సమాభ్యః । యావత్ । సూర్యః । అసత్ । దివి ॥3॥

**అనువాదం:**

ఇంద్రునితో తరిమివేయబడిన మా శత్రువు
దూరవర్తులైన భూములు మూడింటిని దాటి వెళ్ళుగాక!
అలాగే పంచజనులను దాటిపోవుగాక!
అలాగే సూర్యచంద్రాగ్నుల వెలుగుతున్న
ప్రభలను అతిక్రమించి పోవుగాక!
అక్కడ నుంచి ఎంతవఱకు సూర్యుడు అంతరిక్షంలో
ఉంటాడో, అంతకాలం తిరిగి రాకుండు గాక! ॥ 3 ॥

ఇది డెబ్బై ఐదవ సూక్తం

## సూక్తం— 76

ఋషి కబన్ధుడు దేవత . సాన్తపనాగ్ని॥ ఛందస్సు· 1,2,4 అనుష్టుప్. 3
కకుమ్మత్యనుష్టుప్॥ మంత్రములు . ॥ 4 ॥

వినియోగం .- విజయ స్వస్త్యయన కాముడు దీనిని పరిస్తూ ఆయుధాన్ని ధరించాలి. రాత్రి స్వస్త్యయన కాముడు నిద్రపోయేముందు దీనిని పఠించాలి. దేశాంతరం పోవువాడు స్వప్రయోజన సిద్ధ్యర్థం నిద్రలేవగానే దీనిని పఠించాలి.

మంత్రము

య ఏనం పరిషీదన్తి సమాదధతి చక్షసే ।

సంప్రేద్ధో అగ్నిర్జిహ్వాభిరుదేతు హృదయాదధి ॥ 1 ॥

పదము

యే । ఏనమ్ । పరిऽసీదన్తి । సమ్ऽఆదధతి । చక్షసే ।

సమ్ऽప్రేద్ధః । అగ్నిః । జిహ్వాభిః । ఉత్ । ఏతు । హృదయాత్ ।
అధి ॥ 1 ॥

అనువాదం ।

ఈ స్వస్త్యయన కాముని చుట్టూ కూర్చొని
హింసించుటకై హింసకులు సన్నద్ధులై ఉన్నారు
ప్రదీప్తుడైన అగ్ని తన జ్వాలలతో
మాహృదయాల నుంచి ఉత్పన్న మగుగాక ! ॥ 1 ॥

మంత్రము

అగ్నేః సాంతపనస్యాహమాయుషే పదమా రభే ।

అద్ధాతిర్యస్య పశ్యతి ధూమముద్యన్తం మాస్యతః ॥ 2 ॥

పదము .

అగ్నేః । సామ్ऽతపనస్య । అహమ్ । ఆయుషే । పదమ్ । ఆ ।
రభే ।

అద్ధాతిః । యస్య । పశ్యతి । ధూమమ్ । ఉత్ఽయన్తమ్ ।
ఆస్యతః ॥ 2 ॥

అనువాదం :

ఎక్కువ సంతాపం కల్పించే అగ్నిస్థానం
ఆయుస్సు కోసమై నేను అరంభిస్తున్నాను.
అగ్ని ముఖం నుంచి వస్తున్న ధూమాన్ని
'అద్ధాతి' అనే మహర్షి సాక్షాత్కరించు కొన్నాడు ॥ 2 ॥

మంత్రము

యో అస్య సమిధం వేద క్షత్రియేణ సమాహితామ్ ।
నాభిహ్వారే పదం ని దధాతి స మృత్యవే ॥ 3 ॥

పదము

యః । అస్య । సమ్ఽఇధమ్ । వేద । క్షత్రియేణ । సమ్ఽఆహి
తామ్ ।
న । అభిఽహ్వారే । పదమ్ । ని । దధాతి । సః । మృత్యవే ॥3॥

అనువాదం

విజయకాములైన క్షత్రియునిచే
నిక్షిప్తమైన ఈ అగ్నిలో వేసిన సమిధలు
ఎవరికి తెలియునో ఆయన మృత్యువునకై
కుటిల మార్గాలలో కాలు పెట్టడు. ॥ 3 ॥

మంత్రము

నైనం ఘ్నన్తి పర్యాయిణో న సన్నాం అవ గచ్ఛతి ।

అగ్నేర్యః క్షత్రియో విద్వాన్నామ గృహ్ణాత్యాయుషే ॥ 4 ॥

పదము

న । ఏనమ్ । ఘ్నన్తి । పరిఽఆయినః । న । సన్నాన్ । అవ । గచ్ఛతి ।

అగ్నేః । యః । క్షత్రియః । విద్వాన్ । నామ । గృహ్ణాతి । ఆయుషే ॥ 4 ॥

అనువాదం

ఈ స్వస్త్యయన కాముని
చుట్టు ముట్టిన శత్రువులు చంపలేరు
సమీపస్థానాలలోని వారికి కూడా
ఇతను కనుపించడు
అగ్ని మాహాత్మ్యం తెలిసిన
'స్థావక' నామధేయుడైన క్షత్రియుడు
చిరకాల జీవనార్థమై అగ్ని పేరును ఉచ్చరిస్తాడు. ॥ 4 ॥

ఇది డెబ్భై ఆరవ సూక్తం

## సూక్తం–77

ఋషి: కబన్ధుడు ॥ దేవతలు జాతవేదులు ॥ ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం – పారిపోయే స్త్రీని నిరోధించుటకు చేసే ప్రక్రియలో దీనికి వినియోగం.

మంత్రము.

అస్థాద్ ద్యౌరస్థాత్ పృథివ్యస్థాద్ విశ్వమిదం జగత్ ।

ఆస్థానే పర్వతా అస్థు స్థామ్న్యశ్వాం అతిష్ఠిపమ్ ॥ 1 ॥

పదము

అ స్థాత్ । ద్యౌః । అస్థాత్ । పృథివీ । అస్థాత్ । విశ్వమ్ । ఇదమ్ ।
జగత్ ।

అఽస్థానే । పర్వతాః । అస్థుః । స్థామ్ని । అశ్వాన్ । అతిష్ఠిపమ్
॥ 1 ॥

అనువాదం :

ఈశ్వరాజ్ఞ వల్ల ద్యులోకం స్వస్థానంలో ఉన్నది.
భూమికూడా నిశ్చలంగా ఉన్నది
ఆ ద్యావా పృథువుల మధ్య ఉన్న
సర్వ జగత్తు ఆ యా స్థానాలలో ఉన్నది.
ఇలాగే పర్వతములు ఆ యా స్థానములలో ఉన్నవి
ఇలాగే ఓ స్త్రీ ఈ ఇంటిలో ఉండు.
అక్కడ నేను ఉండునట్లు బంధిస్తాను
మాట వినని గుఱ్ఱాన్ని కట్టివేసినట్టు కట్టివేస్తాను. ॥ 1 ॥

మంత్రము.

య ఉదానట్ పరాయణం య ఉదానణ్న్యాయనమ్ ।
ఆవర్తనం నివర్తనం యో గోపా అపి తం హువే ॥ 2 ॥

పదము

యః । ఉత్ఽఆనట్ । పరాఽఅయనమ్ । యః । ఉత్ఽఆనట్ ।
నిఽఅయనమ్ ।

ఆఽవర్తనమ్ । నిఽవర్తనమ్ । యః । గోపాః । అపి । తమ్ ।
హువే ॥ 2 ॥

**అనువాదం :**

ఏ దేవుడు పరాఙ్ముఖగమనుడై
ఉత్కర్షతో వ్యాపిస్తున్నాడో, అలాగే నిజ భవనాన్ని
ఉత్కర్షతో వ్యాపిస్తున్నాడో, ఏ దేవుడు రక్షకుడో,
పలాయమానమైన వానిని తిరిగి వచ్చునట్లు
వాని గతిని నిరోధిస్తాడో,
అలాంటి దేవుణ్ణి ఆహ్వానిస్తున్నాను ॥ 2 ॥

**మంత్రము :**

**జాతవేదో ని వర్తయ శతం తే సన్త్వావృతః ।**
**సహస్రం త ఉపావృతస్తాభిర్నః పునరా కృధి ॥ 3 ॥**

**పదము**

**జాత౽వేదః । ని । వర్తయ । శతమ్ । తే । సన్తు । ఆ౽వృతః ।**
**సహస్రమ్ । తే । ఉప౽ఆవృతః । తాభిః । నః । పునః । ఆ ।**
**కృధి ॥ 3 ॥**

**అనువాదం**

ఓ జాతవేదుడా! ఈమెను పారిపోకుండా ఆపు
ఈ విషయంలో నీకు అనేక ఉపాయాలు ఉండుగాక!
సహస్ర సంఖ్యాకములైన రప్పించే మార్గాలు తెలియుగాక!
వాటితో మాకు ఈమె పునరభి ముఖమగునట్లు చెయ్యి ॥3॥

ఇది డెబ్బై ఏడవ సూక్తం

## సూక్తం - 78

**ఋషి, అథర్వుడు ॥ దేవతలు : 1,2 చంద్రుడు ; 3 త్వష్ట ॥ ఛందస్సు . అనుష్టుప్. మంత్రములు .** **॥ 3 ॥**

వినియోగం - వివాహంలో చేసే అజ్యహోమంలో దీనికి వినియోగం.

మంత్రము,

తేన భూతేన హవిషాఽయమా ప్యాయతాం పునః ।
జాయాం యామస్మా ఆవాక్షుస్తాం రసేనాభి వర్ధతామ్ ॥ 1 ॥

పదము

తేన । భూతేన । హవిషా । అయమ్ । ఆ । ప్యాయతామ్ । పునః ।
జాయామ్ । యామ్ । అస్మై । ఆఽఅవాక్షుః । తామ్ । రసేన ।
అభి । వర్ధతామ్ ॥ 1 ॥

అనువాదం

ఆ ప్రసిద్ధమైన సూతంలో, హవిస్సుతో ఈ పతి
పదేపదే ప్రజాపశ్వాదులతో సమృద్ధమగుగాక!
ఈ పతికి తల్లి దండ్రులు ఎవరిని భార్యగా తెచ్చినారో,
ఆమెను దధి మధు ఘృతాలతో
ఆహూయమానమైన అగ్ని అభివృద్ధి చెందించుగాక! ॥ 1 ॥

మంత్రము.

అభి వర్ధతాం పయసాఽభి రాష్ట్రేణ వర్ధతామ్ ।
రయ్యా సహస్రవర్చసేమౌ స్తామనుపక్షితౌ ॥ 2 ॥

పదము

అభి । వర్ధతామ్ । పయసా । అభి । రాష్ట్రేణ । వర్ధతామ్ ।
రయ్యా । సహస్రఽవర్చసా । ఇమౌ । స్తామ్ । అనుపఽక్షితౌ ॥2॥

అనువాదం :

పీరు క్షీరంతో అభివృద్ధి చెందుదురుగాక !
రాష్ట్రంతో అభివృద్ధి చెందుదురుగాక !
అపరిమిత శ్రేయస్సుతో, ధనంతో
ఈ భార్యా భర్తలు సంపూర్ణకాము లగుదురు గాక ! ॥ 2 ॥

మంత్రము

త్వష్టా జాయామజనయత్ త్వష్టాఽస్యై త్వాం పతిమ్ ।
త్వష్టా సహస్రమాయూంషి దీర్ఘమాయుః కృణోతు వామ్ ॥3॥

పదము.

త్వష్టా । జాయామ్ । అజనయత్ । త్వష్టా । అస్యై । తామ్ ।
పతిమ్ ।
త్వష్టా । సహస్రమ్ । ఆయూంషి । దీర్ఘమ్ । ఆయుః । కృణోతు ।
వామ్ ॥ 3 ॥

అనువాదం .

త్వష్ట భార్యను ఉత్పన్నం చేసినాడు.
ఓ వరుడా ! ఈ భార్యకు పతి అయిన నిన్ను కూడా
త్వష్టయే జనింప జేసినాడు.
కాబట్టి మీ ఇద్దరకూ త్వష్ట దేవుడు
సహస్ర సంవత్సర పరిమిత మయిన
దీర్ఘాయుస్సును ప్రసాదించు గాక ! ॥ 3 ॥

ఇది డెబ్బై ఎనిమిదవ సూక్తం

## సూక్తం – 79

ఋషిః అథర్వుడు ॥ దేవత · సంస్ఫానమ్ ॥ ఛందస్సు : 1,2 గాయత్రీ : 3 త్రిపదా ప్రజాపత్యా గాయత్రీ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం — ధాన్యరక్షణకై చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము :

అయం నో నభసస్పతిః సంస్ఫానో అభి రక్షతు ।

అసమాతిం గృహేషు నః ॥ 1 ॥

పదము

అయమ్ । నః । నభసః । పతిః । సమ్ఽస్ఫానః । అభి । రక్షతు ।

అసమాతిమ్ । గృహేషు । నః ॥ 1 ॥

అనువాదం

ఈ అగ్ని ద్యులోకానికి పాలకుడు.
ధాన్యరాశిని వృద్ధి చెందిస్తూ
ఈయన మమ్ములను రక్షించుగాక!
మా ఇళ్ళలో ధాన్యాన్ని, గాదెలలో నింపిన ధాన్యాన్ని
అపరిమితం చేయుగాక! ॥ 1 ॥

మంత్రము.

త్వం నో నభసస్పత ఊర్జం గృహేషు ధారయ ।

ఆ పుష్టమేత్వా వసు ॥ 2 ॥

పదము.

త్వమ్ । నః । నభసః । పతే । ఊర్జమ్ । గృహేషు । ధారయ ।

ఆ। పుష్టమ్। ఏతు। ఆ। వసు ॥ 2 ॥

అనువాదం

ఓ నభస తి! ( అంతరిక్ష పాలకుడైన వాయుదేవా! )
నీవు మా ఇళ్ళలో పుష్టికరమైన ఆహారాన్ని స్థాపించు.
అలాగే ప్రజా-అశ్వాదులు వచ్చునట్లు చెయ్యి
ధనాన్ని కూడా వచ్చునట్లు చెయ్యి ॥ 2 ॥

మంత్రము

దేవ సంస్ఫాన సహస్రాపోషస్యేశిషే ।

తస్య నో రాస్వ తస్య నో ధేహి

తస్య తే భక్తివాంసః స్యామ ॥ 3 ॥

పదము.

దేవ। సమ్ఽస్ఫాన। సహస్రఽపోషస్య। ఈశిషే।

తస్య। నః। రాస్వ। తస్య। నః। ధేహి।

తస్య। తే। భక్తిఽవాంసః। స్యామ ॥ 3 ॥

అనువాదం

ఓ దేవా! ప్రవృద్ధి కారకుడవైన ఆదిత్యుడా!
సహస్ర సంఖ్యాకులైన ప్రజలకు
బహుళమైన ధనాన్ని ఇచ్చువాడవు.
ఆ ధనాన్ని మాకు ప్రసాదించు
ఆ ధనంయొక్క భాగాన్ని
మా అనుభవార్థమై పోషించు.

నీ ధనంలో నీ అనుగ్రహం వల్ల
భాగాన్ని పొందుదుముగాక! ॥ 3 ॥

ఇది డెబ్బై తొమ్మిదవ సూక్తం

## సూక్తం—80

ఋషి అథర్వుడు॥ దేవత. చంద్రుడు॥ ఛందస్సు. 1 భురిగనుష్టుప్. 2 అనుష్టుప్॥ 3 ప్రస్తారపంక్తి॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం — పక్షులతో గాయపడిన వారి విషయంలో చేసే కర్మలో దీనికి వినియోగం.

మంత్రము

అన్తరిక్షేణ పతతి విశ్వా భూతావచాకశత్।
శునో దివ్యస్య యన్మహస్తేనా తే హవిషా విధేమ ॥ 1 ॥

పదము.

అన్తరిక్షేణ। పతతి। విశ్వా। భూతా। అవఽచాకశత్।
శునః। దివ్యస్య। యత్। మహః। తేన। తే। హవిషా। విధేమ ॥ 1 ॥

అనువాదం.

ఆకాశమార్గంలో తిరిగే పక్షులు
పురుషుని అంగముపై పడతాయి.
సర్వ భూతజాతమును మరీమరీ చూస్తూ
తద్దోషనివారణార్థం ద్యులోకజనితమైన
శునకము యొక్క ఏ మహత్తేజస్సైతే ఉన్నదో,
ఆ హవిస్సుతో ఓ అగ్నీ! నిన్ను పరిచరిస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

యే త్రయః కాలకాఞ్జా దివి దేవా ఇవ శ్రితాః ।

తాన్సర్వానహ్వ ఊతయేఽస్మా అరిష్టతాతయే ॥ 2 ॥

పదము.

యే । త్రయః । కాలకాఞ్జాః । దివి । దేవాఃఽఇవ । శ్రితాః ।

తాన్ । సర్వాన్ । అహ్వే । ఊతయే । అస్మై । అరిష్టఽతాతయే

॥ 2 ॥

అనువాదం :

కాల కాంజులనే అసురులు సత్కర్మవశం వల్ల
ద్యులోకంలో దేవతల నాశ్రయించి ఉన్నారు
ఆ కాలకాంజులను ఆహ్వానిస్తున్నాను
రక్షణార్థమై ఈ పురుషునకు
దోషశాంతికై ఆహ్వానిస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము

అప్సు తే జన్మ దివి తే సధస్థం

సముద్రే అన్తర్మహిమా తే పృథివ్యామ్ ।

శునో దివ్యస్య యన్మహస్తేనా తే హవిషా విధేమ ॥ 3 ॥

పదము.

అప్ఽసు । తే । జన్మ । దివి । తే । సధఽస్థమ్ ।

సముద్రే । అన్తః । మహిమా । తే । పృథివ్యామ్ ।

శునః । దివ్యస్య । యత్ । మహః । తేన । తే । హవిషా । విధేమ ॥ 3 ॥

అనువాదం

ఓ అగ్నీ! నీ జన్మ ఉదకంలో
ద్యులోకంలో ఆదిత్యునితో సమానస్థానం.
అలాగే సముద్ర మధ్యంలో పృథివి పైన
నీ మాహాత్మ్యం కనబడుతున్నది.
శునకము యొక్క ఏ మహత్తేజస్సైతే ఉన్నదో
ఆ హవిస్సుతో ఓ అగ్నీ! నిన్ను పరిచరిస్తున్నాను ॥ 3 ॥

ఇది ఎనబైయవ సూక్తం

## సూక్తం - 81

**ఋషిః అథర్వుడు॥ దేవతలు: ఆదిత్యులు॥ ఛందస్సు అనుష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥**

**వినియోగం - గర్భాధాన కర్మలో దీనికి వినియోగం.**

మంత్రము

యన్తాఽసి యచ్ఛసే హస్తావప రక్షాంసి సేధసి ।
ప్రజాం ధనం చ గృహ్ణానః పరిహస్తో అభూదయమ్ ॥ 1 ॥

పదము

యన్తా । అసి । యచ్ఛసే । హస్తౌ । అప । రక్షాంసి । సేధసి ।
ప్రఽజామ్ । ధనమ్ । చ । గృహ్ణానః । పరిఽహస్తః । అభూత్ । అయమ్ ॥ 1 ॥

అనువాదం.

ఓ అగ్నీ! నీవు గర్భాన్ని చెడగొట్టే
రక్షః ప్రభృతులకు నియామకుడవు.
అందుకే నీ చేతులను దూరంగా ప్రసరింపజేస్తావు
రాక్షసులను అపగమింప జేస్తావు
సంతానాన్ని, తద్భోగార్థం ధనాన్ని ఇచ్చే
ఈ అగ్ని హస్తాన్ని పరివేష్టించి
రక్షాకర ప్రతిసరు డగుచున్నాడు. ॥ 1 ॥

మంత్రము

పరిహస్త వి ధారయ యోనిం గర్భాయ ధాతవే ।
మర్యాదే పుత్రమా ధేహి తం త్వమా గమయాగమే ॥ 2 ॥

పదము

పరిఽహస్త । వి । ధారయ । యోనిమ్ । గర్భాయ । ధాతవే ।
మర్యాదే । పుత్రమ్ । ఆ । ధేహి । తమ్ । త్వమ్ । ఆ । గమయ ।
ఆఽగమే ॥ 2 ॥

అనువాదం

ఓ కింకణమా! యోనిని గర్భాధానం చేయుటకు
వివృతిం చెయ్యి మరణధర్ములైన మనుష్యుల చేత
స్వోత్పత్త్యర్థం గర్భాశయంలో ఓ జాయా!
పుత్రుని అభిముఖునిగా ధరించు
నీవు పతినైన నేను రాగా ఆ కుమారుని ఉత్పన్నం చెయ్యి ॥2॥

మంత్రము

యం పరిహస్తమబిభరదితిః పుత్రకామ్యా ।

త్వష్టా తమస్యా ఆ బధ్నాద్ యథా పుత్రం జనాదితి ॥3॥

పదము.

యమ్। పరి౨హస్తమ్। అబిభః। అదితిః। పుత్ర౨కామ్యా।
త్వష్టా। తమ్। అస్యై। ఆ। బధ్నాత్। యథా। పుత్రమ్।
జనాత్। ఇతి ॥ 3 ॥

అనువాదం

అదితి పుత్ర కామియై ఏ హస్తాన్ని పరివేష్టించి
కంకణాదుల్లను ధరించినదో,
ఆ ప్రతిసరాన్ని ఈ భార్యకు త్వష్ట కట్టుగాక!
పుత్రుడు కలుగ వలెనని కట్టుగాక! ॥ 3 ॥

ఇది ఎనభై ఒకటవ సూక్తం

## సూక్తం - 82

ఋషిః భగుడు ॥ దేవత, ఇంద్రుడు ॥ ఛందస్సు: అనుష్టుప్ ॥ మంత్రములు ॥3॥

వినియోగం - వివాహకాముడు చేసే ఇంద్ర యాగంలో దీనికి వినియోగం. వివాహంలో చేసే అజ్యహోమంలో కూడా దీనికి వినియోగం.

మంత్రము

ఆగచ్ఛత ఆగతస్య నామ గృహ్ణామ్యాయతః।
ఇన్ద్రస్య వృత్రఘ్నో వన్వే వాసవస్య శతక్రతోః ॥ 1 ॥

పదము.

ఆ౨గచ్ఛతః। ఆ౨గతస్య। నామ। గృహ్ణామి। ఆ౨యతః।

ఇన్ద్రస్య । వృత్రఽఘ్నః । వన్వే । వాసవస్య । శతఽక్రతోః ॥1॥

అనువాదం

వస్తున్న ఇంద్రునకు ప్రీతికరమైన
పేర్లను ఉచ్చరిస్తున్నాను
ఈ వివాహకాముడ నైన నేనువస్తున్న
వృత్ర హంత అయిన ఇంద్రుని,
వసువులు ఉపాసించే ఇంద్రుని,
శతక్రతువును నా అభిమత ఫలాసి క్తై యాచిస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము

యేన సూర్యాం సావిత్రీమశ్వినోహతుః పథా ।

తేన మామబ్రవీద్ భగో జాయామా వహతాదితి ॥ 2 ॥

పదము

యేన । సూర్యామ్ । సావిత్రీమ్ । అశ్వినా । ఊహతుః । పథా ।

తేన । మామ్ । అబ్రవీత్ । భగః । జాయామ్ । అ । వహతాత్ ।

ఇతి ॥ 2 ॥

అనువాదం

ఏ మార్గంలో అశ్వినీ దేవతలు సావిత్రిని వివాహం
చేసుకున్నారో, ఆ మార్గంలో భార్యను తెమ్మని
భగదేవుడు నాకు చెప్పినాడు ॥ 2 ॥

మంత్రము ।

యస్తేఽఙ్కుశో వసుదానో బృహన్నిన్ద్ర హిరణ్యయః ।

తేనా జనీయతే జాయాం మహ్యం ధేహి శచీపతే ॥ 3 ॥

పదము

యః । తే । అఙ్కుశః । వసుఽదానః । బృహన్ । ఇన్ద్ర । హిరణ్యయః ।

తేన । జనిఽయతే । జాయామ్ । మహ్యమ్ । ధేహి । శచీఽపతే ॥ 3 ॥

అనువాదం

ఓ ఇంద్రుడా! అంకుశమువంటి హస్తం,
ధనాన్ని ధరించే హస్తం, గొప్పదైన,
హిరణ్మయమైన హస్తం సాధనంగా ఓ శచీపతీ!
నా భార్యకు పుత్రోత్పత్తి కల్పించు. ॥ 3 ॥

ఇది ఎనభై రెండవ సూక్తం

ఇది ఎనిమిదవ అనువాకం

# అనువాకం - 9

## సూక్తం - 83

ఋషి. భగుడు ॥ దేవతలు. సూర్యాదులు ॥ ఛందస్సు 1-3 అనుష్టుప్. 4 ద్విపదా నిచృదార్చ్యనుష్టుప్ మంత్రములు ॥ 4 ॥

వినియోగం :- గండమాలా చికిత్సలో చేసే వివిధ ప్రక్రియలలో దీనికి వినియోగం.

మంత్రము :

అపచితః ప్ర పతత సుపర్ణో వసతేరివ ।

సూర్యః కృణోతు భేషజం చన్ద్రమా। వో౽పోచ్ఛతు ॥ 1 ॥

పదము

అప౽చితః । ప్ర । పతత । సు౽పర్ణః । వసతేః౽ఇవ ।

సూర్యః । కృణోతు । భేషజమ్ । చన్ద్రమాః । వః । అప । ఉచ్ఛతు ॥ 1 ॥

అనువాదం

ఒడలంతా వ్యాపించిన ఓ గండమాలలారా!
ఈ శరీరాన్ని విడిచి వెళ్ళండి
డేగ తన గూటి నుంచి త్వరగా వెళ్ళినట్టుగా వెళ్ళండి
మీకు చికిత్సను సూర్యుడు చేయుగాక!
అమృత మయుడైన చంద్రుడు మిమ్ములను తొలగించుగాక!
॥ 1 ॥

మంత్రము,

ఏన్యేకా శ్యేన్యేకా కృష్ణైకా రోహిణీ ద్వే ।

సర్వాసామగ్రభం నామావీరఘ్నీరపేతన ॥ 2 ॥

పదము

ఏనీ । ఏకా । శ్యేనీ । ఏకా । కృష్ణా । ఏకా । రోహిణీ ఇతి ।

ద్వే ఇతి । సర్వాసామ్ । అగ్రభమ్ । నామ । అవీర౽ఘ్నీః । అప ।
ఇతన ॥ 2 ॥

అనువాదం:

ఒక గండమాల పీతవర్ణం (కొంచెము
ఎఱుపు కలిసిన తెలుపు) కలది.

మఱొకటి పూర్తిగా తెల్లనిది.
ఒకటి నల్లనిది మిగతవి లోహితవర్ణమైనవి
వీటన్నిటికీ ప్రీతికరమైన పేరును నేను ఉచ్ఛరిస్తున్నాను ॥ 2 ॥

మంత్రము :

**అసూతికా రామాయణ్యపచిత్ ప్ర పతిష్యతి ।**

**గ్లౌరితః ప్ర పతిష్యతి స గలున్తో నశిష్యతి ॥ 3 ॥**

పదము

**అసూతికా । రామాయణీ । అపఽచిత్ । ప్ర । పతిష్యతి ।**

**గ్లౌః । ఇతః । ప్ర । పతిష్యతి । సః । గలున్తః । నశిష్యతి ॥ 3 ॥**

**అనువాదం .**

ఒకటి మాగి పగిలి ఉన్నది. వనాత్మకమైన
నాడి నుండి ఇది తొలగి పోనున్నది.
వ్రణం వల్ల కలిగిన సంతోషక్షయం
ఈ శరీరం నుంచి వ్యాధితోపాటు తొలగి పోతుంది.
చంద్రుడు గండమాలల వల్ల కీళ్ళలో పుట్టిన
గడ్డలను తొలగిస్తాడు ॥ 3 ॥

మంత్రము

**వీహి స్వామాహుతిం జుషాణో మనసా**

**స్వాహా మనసా యదిదం జుహోమి ॥ 4 ॥**

**పదము :**

**వీహి । స్వామ్ । ఆఽహుతిమ్ । జుషాణః । మనసా ।**

స్వాహా। మనసా। యత్। ఇదమ్। జుహోమి ॥ 4 ॥

**అనువాదం:**

ఓ వ్రణరోగాభిమాని దేవా!
నీవు స్వకీయాహుతిని మనస్సుతో సేవించు భక్షించు
దీనిని నేను మనస్సుతో హోమం చేస్తున్నాను ॥ 4 ॥

ఇది ఎనభై మూడవ సూక్తం

## సూక్తం-84

**ఋషి: భగుడు॥ దేవత నిర్ఋతి॥ ఛందస్సు 1 భురిగ్ జగతీ: 2 త్రిపదా ఒఒర్షీ బృహతీ 3 జగతీ: 4 భురిగ్ త్రిష్టుప్: మంత్రములు! ॥ 4 ॥**

**వినియోగం:-** గండమాలా చికిత్సలో చేసే వివిధ ప్రక్రియలలో దీనికి వినియోగం.

**మంత్రము:**

యస్యాస్త ఆసని ఘోరే జుహోమ్యేషాం
బద్ధానామవసర్జనాయ కమ్।
భూమిరితి త్వాభిప్రమన్వతే జనా
నిర్ఋతిరితి త్వాహం పరి వేద సర్వతః ॥ 1 ॥

**పదము.**

యస్యాః। తే। ఆసని। ఘోరే। జుహోమి। ఏషామ్।
బద్ధానామ్। అవఽసర్జనాయ। కమ్।
భూమిః। ఇతి। త్వా। అభిఽప్రమన్వతే। జనాః।

నిః ఋతిః । ఇతి । త్వా । అహమ్ । పరి । వేద । సర్వతః ॥ 1 ॥

**అనువాదం**

ఓ రోగాభిమాని అయిన పాపదేవతా!
నీ క్రూరమైన ముఖంలో హవిస్సును అర్పిస్తున్నాను.
ఈ వ్రణరోగజనితమైన బంధనమును విడిపించు.
నిన్ను జనులు జన్మమాత్రి సారమైన
విశేషజ్ఞానరహితమైన ప్రాణులు
భూమి అంతటా ప్రబోధింప జేస్తారు.
నేను నీ స్వరూపము నెరిగిన వాడను గనుక
నిన్ను నిర్ ఋతిగానే సర్వత్రా భావిస్తాను. ॥ 1 ॥

**మంత్రము**

భూతే హవిష్మతీ భవైష తే భాగో యో అస్మాసు ।
ముఞ్చేమానమూనేన సః స్వాహా ॥ 2 ॥

పదము

భూతే । హవిష్మతీ । భవ । ఏషః । తే । భాగః । యః । అస్మాసు ।
ముఞ్చ । ఇమాన్ । అమూన్ । ఏనసః । స్వాహా ॥ 2 ॥

**అనువాదం**

ఓ భూతమా! మే మిచ్చిన హవిస్సును గ్రహించు.
ఇదే నీ భాగము. నీకై కల్పించిన ఈ హవిర్భాగంతో
సంతుష్టవై సమీపస్థములైన గవాదులను,
దూరస్థములను రోగనిదాన భూత పాపములనుంచి
విమోచనం చెందించు. ఇది స్వాహుత మగుగాక! ॥ 2 ॥

మంత్రము.

ఏవో ష్వ1స్మన్నిర్ ఋతేనేహా త్వమయస్మయాన్ వి చృతా
బన్ధపాశాన్ ।

యమో మహ్యం పునరిత్ త్వాం దదాతి
తస్మై యమాయ నమో అస్తు మృత్యవే ॥ 3 ॥

పదము

ఏవో ఇతి । సు । అస్మత్ । నిఃఽఋతే । అనేహా । త్వమ్ । అయ
స్మయాన్ । వి । చృత । బన్ధఽపాశాన్ ।
యమః । మహ్యమ్ । పునః । ఇత్ । త్వామ్ । దదాతి ।
తస్మై । యమాయ । నమః । అస్తు । మృత్యవే ॥ 3 ॥

అనువాదం

ఓ నిర్ ఋతీ! మమ్ములను బాధింపకుండా నీవే
ఇలాగే బాగుగా మా నుంచి అయోవికారములైన
బంధపాశములను విచ్ఛిన్నం చెయ్యి.
ఓ రోగి! ప్రాణాపహారి అయిన యముడు
నిన్ను నాకు తిరిగి ఇస్తాడు.
ఆ మృత్యు ప్రదుడైన యమునకు నమస్కారం. ॥ 3 ॥

మంత్రము :

అయస్మయే ద్రుపదే బేధిషే ఇహాభిహితో మృత్యుభిర్యే
సహస్రమ్ ।

యమేన త్వం పితృభిః సంవిదాన
ఉ త్తమం నాకమధి రోహయేమమ్ ॥ 4 ॥

పదము

అయస్మయే । ద్రుఽపదే । బేధిషే । ఇహ । అభిఽహితః ।
మృత్యుభిః । యే । సహస్రమ్ ।
యమేన । త్వమ్ । పితృఽభిః । సమ్ఽవిదానః ।
ఉత్ఽతమమ్ । నాకమ్ । అధి । రోహయ । ఇమమ్ ॥ 4 ॥

అనువాదం

ఇనుప సంకెళ్ళతోను, కఱ్ఱతో చేసిన పాదబంధనంతోను
ఓ నిర్ ఋుతీ! నీవు పురుషుని బంధించినప్పుడు
ఈ లోకంలో అతడు మృత్యుపాశబద్ధు డవుతాడు.
జరాదులు, రక్షఃపిశాచాదులు మొదలైన వేలకొలది
మరణహేతు భూతములైన వానికి లోబడతాడు
ఓ నిర్ ఋుతీ! నీవు యమునితో, పితృదేవతలతో
ఐకమత్యం చెంది ఉత్తమ నాకానికి
ఈ పురుషుని అధిరోహింప జెయ్యి. ॥ 4 ॥

ఇది ఎనభై నాల్గవ సూక్తం

## సూ క్తం – 85

ఋషి. అథర్వుడు (యక్ష్మనాశన కాముడు) ॥ దేవత ॥ వనస్పతి ॥ ఛందస్సు.
అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం:– రాజయక్ష్మాది రోగచికిత్సలో వరణ వృక్షమణిని ఈ సూక్తంతో
అభిమంత్రించి కట్టుకొనాలి.

మంత్రము

వరణో వారయాతా అయం దేవో వనస్పతిః ।

యక్ష్మో యో అస్మిన్నావిష్టస్తము దేవా అవీవరన్ ॥ 1 ॥

పదము :

వరణః । వారయాతై । అయమ్ । దేవః । వనస్పతిః ।

యక్ష్మః । యః । అస్మిన్ । ఆఽవిష్టః । తమ్ । ఓంఇతి । దేవాః ।

అవీవరన్ ॥ 1 ॥

అనువాదం :

ఈ ఎదురుగా కనుపించే దేవతామూర్తి
*వరణ వృక్షంతో నిర్మితమైన మణి
రాజయక్ష్మాది రోగాలను నివారించుగాక!
ఈ పురుషునిలో ప్రవేశించిన రోగం సర్వమూ
ఇంద్రాదులు సర్వులూ నివారింతురుగాక! ॥ 1 ॥

మంత్రము .

ఇన్ద్రస్య వచసా వయం మిత్రస్య వరుణస్య చ ।

దేవానాం సర్వేషాం వాచా యక్ష్మం తే వారయామహే ॥2॥

పదము .

ఇన్ద్రస్య । వచసా । వయమ్ । మిత్రస్య । వరుణస్య । చ ।

---

* వరణ, The tree Crataeva Roxburghii (Moniar Williams Dictionary) (also called Varuna and Setu)
మారేడు (9 M P)

దేవానామ్ । సర్వేషామ్ । వాచా । యక్ష్మమ్ । తే । వారయామహే ॥ 2 ॥

**అనువాదం**

మణి బంధనం చేసే నేను నీ రోగాన్ని
ఇంద్రుని ఆజ్ఞారూపమైన వాక్కుతో నివారిస్తున్నాను.
అలాగే మిత్రుని, వరుణుని ఇతర సర్వదేవతల
వాక్కులతోను నీ రోగాన్ని నివారిస్తున్నాను. ॥ 2 ॥

**మంత్రము**

యథా వృత్ర ఇమా ఆపస్తస్తమ్భ విశ్వధా యతీః ।
ఏవా తే అగ్నినా యక్ష్మం వైశ్వానరేణ వారయే ॥ 3 ॥

**పదము**

యథా । వృత్రః । ఇమాః । ఆపః । తస్తమ్భ । విశ్వధా । యతీః
ఏవ । తే । అగ్నినా । యక్ష్మమ్ । వైశ్వానరేణ । వారయే ॥ 3 ॥

**అనువాదం :**

ఏ విధంగా వృత్రాసురుడు ( త్వష్టకొడుకు )
ఈ కనిపించే స్థావర జంగమాత్మకమైన
సర్వ జగత్తును పోషించే జలములను
స్తంభింప జేసినాడో, నీ రోగాన్ని ఇలా
వైశ్వానరునితో ( అగ్నితో ) నివారిస్తున్నాను. ॥ 3 ॥

ఇది ఎనభై ఐదవ సూక్తం

## సూక్తం - 86

ఋషి అథర్వుడు (వృషకాముడు)॥ దేవత ఏకవృషుడు॥ ఛందస్సు: అను ష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం - శ్రైష్ఠ్యకాముడు చేసే ఇంద్రయాగంలో దీనికి వినియోగం.

మంత్రము

వృషేన్ద్రస్య వృషా దివో వృషా పృథివ్యా అయమ్।
వృషా విశ్వస్య భూతస్య త్వమేకవృషో భవ ॥ 1 ॥

పదము

వృషా। ఇన్ద్రస్య। వృషా। దివః। వృషా। పృథివ్యాః। అయమ్
వృషా। విశ్వస్య। భూతస్య। త్వమ్। ఏకఽవృషః। భవ ॥ 1 ॥

అనువాదం :

ఈ శ్రేష్ఠ్యకాముడైన పురుషుడు
ఇంద్రుని అనుగ్రహం వల్ల శ్రేష్ఠుడగుగాక!
ద్యులోక వాంఛలను వర్షించు గాక!
పృథివికి సంబంధించిన ఆహుతి ద్వారా
ఇతను శ్రేష్ఠుడగు గాక!
సర్వ ప్రాణిజాతంలో ఉత్కృష్టుడగుగాక!
ఓ శ్రేష్ఠకాముడా! నీవు సర్వశ్రేష్ఠుడవు కా! ॥ 1 ॥

మంత్రము .

సముద్ర ఈశే స్రవతామగ్నిః పృథివ్యా వశీ।
చన్ద్రమా నక్షత్రాణామీశే త్వమేకవృషో భవ ॥ 2 ॥

**పదము**

**సముద్రః । ఈశే । స్రవతామ్ । అగ్నిః । పృథివ్యాః । వశీ ।**

**చన్ద్రమాః । నక్షత్రాణామ్ । ఈశే । త్వమ్ । ఏకఽవృషః । భవ**

**॥ 2 ॥**

**అనువాదం :**

ప్రవహించే ఉదకాలతో సముద్రం ఐశ్వర్యవంతమైనది.
పృథివికి అగ్ని స్వామి అయినాడు
నక్షత్రాలకు చంద్రుడు యజమాని అయినాడు
అలాగే నీవు ఏకైక వృషభం కా. (ఉత్తమోత్తముడవు కమ్ము)
॥ 2 ॥

**మంత్రము**

**సమ్రాడస్య సురాణాం కకున్మనుష్యాఽణామ్ ।**

**దేవానామర్ధభాగసి త్వమేకవృషో భవ ॥ 3 ॥**

**పదము**

**సమ్ఽరాట్ । అసి । అసురాణామ్ । కకుత్ । మనుష్యాఽణామ్ ।**

**దేవానామ్ । అర్ధఽభాక్ । అసి । త్వమ్ । ఏకఽవృషః । భవ ॥3॥**

**అనువాదం :**

ఓ ఇంద్రా! నీవు సురవిరోధులకు సామ్రాట్టువు.
అలాగే ఈ ఉత్తముడు కావలెననుకొనే మనిషి
మానవులలో ఎద్దునకు మూపురం వలె ఉన్నతుడగుగాక!
అలాగే ఓ ఇంద్రా! నీవు దేవతల అర్ధభాగంవంటివాడవు.
ఇలాంటి ఇంద్రుని ప్రసాదం వల్ల
శ్రేష్ఠకాముడవైన నీవు ఇంద్రుని వలెనే ఉత్తముడవు కా! ॥ 3 ॥

ఇది ఎనభై ఆరవ సూక్తం

# సూక్తం - 87

ఋషిః అథర్వుడు ॥ దేవత ధ్రువుః ఛందస్సు - అనుష్టుప్ ॥ మంత్రములుః ॥3॥

వినియోగం - స్థైర్యకాముడైనరాజు ఇంద్రునిగూర్చి చేసే యజ్ఞంలోను, భూకం పాది ఉత్పాతాలు రాకుండగ ప్రాయశ్చిత్తార్థం చేసే అజ్యహోమం లోను, ఉదకుంభ మంగళకలశోద్భూత ప్రాయశ్చిత్తార్థం వేతాక సపకలశమును ధ్రువీకరించుటకు అభిమంత్రించుటలోను, ఇంద్ర మహమనే ఉత్సవ కర్మలో ఇంద్రుని ఉత్థాపనం చేయుటలోను, దీనికి వినియోగం.

మంత్రముః

ఆ త్వాహార్షమన్తరభూర్ధ్రువస్తిష్ఠావిచాచలత్ ।

విశస్త్వా సర్వా వాఞ్ఛన్తు మా త్వద్రాష్ట్రమధి భ్రశత్ ॥1॥

పదము

ఆ । త్వా । ఆహార్షమ్ । అన్తః । అభూః । ధ్రువః । తిష్ఠ । అవి ఽచాచలత్ ।

విశః । త్వా । సర్వాః । వాఞ్ఛన్తు । మా । త్వత్ । రాష్ట్రమ్ । అధి । భ్రశత్ ॥ 1 ॥

అనువాదం

ఓ రాజా! నిన్ను రాష్ట్రం వరించినది.
మాలో అధిపతివైనావు.
చలన రహితుడవై ఈ రాజ్యాధిపత్యం లో స్థిరంగా ఉండు
భూమండల మధ్యవర్తులైన సర్వప్రజలు
నిన్ను వాంఛింతురు గాక!
ఈ రాష్ట్రం నీనుంచి ఎన్నటికీ భ్రష్టం కాకుండుగాక! ॥ 1 ॥

మంత్రము

ఇహైవైధి మాఽప చ్యోష్ఠాః పర్వత ఇవావిచాచలత్ ।

ఇన్ద్ర ఇవేహ ధ్రువస్తిష్ఠేహ రాష్ట్రము ధారయ ॥ 2 ॥

పదము

ఇహ । ఏవ । ఏధి । మా । అప । చ్యోష్ఠాః । పర్వతఃఽఇవ । అవి ఽచాచలత్ ।

ఇన్ద్రఃఽఇవ । ఇహ । ధ్రువః । తిష్ఠ । ఇహ । రాష్ట్రమ్ । ఓంఇతి । ధారయ ॥ 2 ॥

అనువాదం

ఈ రాజ్య సింహాసనం పైనే సర్వదా ఉండు
ఎప్పుడూ దీని నుంచి ప్రచ్యుతుడవు కావు
పర్వతము వలె అచంచలుడవై
ఇంద్రుని వలె ఈ రాష్ట్రంలో స్థిరంగా ఉండు.
ఈ రాష్ట్రాన్ని బాధా నివారణం చేసి పాలించు ॥ 2 ॥

మంత్రము

ఇన్ద్ర ఏతమదీధరద్ ధ్రువం ధ్రువేణ హవిషా ।

తస్మై సోమో అధి బ్రవదయం చ బ్రహ్మణస్పతిః ॥ 3 ॥

పదము

ఇన్ద్రః । ఏతమ్ । అదీధరత్ । ధ్రువమ్ । ధ్రువేణ । హవిషా ।

తస్మై । సోమః । అధి । బ్రవత్ । అయమ్ । చ । బ్రహ్మణః । పతిః ॥ 3 ॥

అనువాదం

స్థిరీకరించే హవిస్సుతో సంతుష్టుడైన ఇంద్రుడు
ఈ రాజును ఈ రాజ్యంలో స్థిరంగా ఉంచుగాక!
ఆ రాజుని గూర్చి సోముడు తనవారిని
బహుధా వక్కాణించు గాక!
ఈ బ్రహ్మణస్పతి కూడా తన వారిని ప్రకటించుగాక! ॥ 3 ॥

ఇది ఎనభై ఏడవ సూక్తం

## సూక్తం - 88

ఋషి. అథర్వుడు ॥ దేవత . ధ్రువుడు ॥ ఛందస్సు 1,2 అనుష్టుప్ 3 త్రిష్టుప్ ॥
మంత్రములు ॥ 3 ॥

వినియోగం - పూర్వ సూక్తం వలెనే దీనికి వినియోగం.

మంత్రము :

ధ్రువా ద్యౌర్ధ్రువా పృథివీ ధ్రువం విశ్వమిదం జగత్ ।
ధ్రువాసః పర్వతా ఇమే ధ్రువో రాజా విశామయమ్ ॥ 1 ॥

పదము

ధ్రువా । ద్యౌః । ధ్రువా । పృథివీ । ధ్రువమ్ । విశ్వమ్ । ఇదమ్ । జగత్ ।
ధ్రువాసః । పర్వతాః । ఇమే । ధ్రువః । రాజా । విశామ్ । అయమ్ ॥ 1 ॥

అనువాదం

ద్యులోకం స్థిరమైనది పృథివి నిశ్చలమైనది.
ఈ ద్యావాపృథువుల మధ్యలోని విశ్వజగత్తు స్థిరమైనది

అందులో కనిపించే పర్వతాలు ధ్రువమైనవి.
ఈ రాజు కూడా అట్లే స్థిరుడగు గాక! ॥ 1 ॥

మంత్రము

ధ్రువం తే రాజా వరుణో ధ్రువం దేవో బృహస్పతిః ।
ధ్రువం త ఇన్ద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్ ॥ 2 ॥

పదము,

ధ్రువమ్ । తే । రాజా । వరుణః । ధ్రువమ్ । దేవః । బృహస్పతిః
ధ్రువమ్ । తే । ఇన్ద్రః । చ । అగ్నిః । చ । రాష్ట్రమ్ । ధారయ
తామ్ । ధ్రువమ్ ॥ 2 ॥

అనువాదం

ఓ రాజా! నీ రాజ్యాన్ని వరుణుడు స్థిరపఱచుగాక!
ద్యోతమానుడైన బృహస్పతి నీ రాష్ట్రాన్ని ధ్రువపఱచుగాక!
నీ రాష్ట్రాన్ని ఇంద్రుడు, అగ్ని ధ్రువపఱతురుగాక! ॥ 2 ॥

మంత్రము

ధ్రువోఽచ్యుతః ప్ర మృణీహి శత్రూ-
న్ఛత్రూయతోఽధరాన్ పాదయస్వ ।
సర్వా దిశః సంమనసః సధ్రీచీ-
ర్ధ్రువాయ తే సమితిః కల్పతామిహ ॥ 3 ॥

పదము ,

ధ్రువః । అచ్యుతః । ప్ర । మృణీహి । శత్రూన్ ।

శత్రు॒ఽయతః । అధరాన్ । పాదయస్వ ।

సర్వాః । దిశః । సమ్ఽమనసః । సధ్రీచీః ।

ధ్రువాయ । తే । సమ్ఽఇతిః । కల్పతామ్ । ఇహ ॥ 3 ॥

అనువాదం :

ఓ రాజా! ఈ రాష్ట్రంలో స్థిరుడవై,
అచ్యుతుడవై శత్రువులను వధించు
శత్రువుల వలె ప్రవర్తించే ఇతర జనాన్ని కూడా
అధోముఖులుగా భూమిపై పడవేయి.
సర్వ దిక్కులు సౌమనస్యంతో నీతో వర్తింతురుగాక!
సర్వ దిక్కులలో సుస్థిరుడవై
నీకు ఆయోధనం కల్పితమగుగాక! ॥ 3 ॥

ఇది ఎనభై ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 89

ఋషి, అథర్వుడు ॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్నవారు ॥ ఛందస్సు: అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం .- దంపతుల అన్యోన్య ప్రీతి జనన కర్మలో దీనికి వినియోగం.

మంత్రము

ఇదం యత్ ప్రేణ్యాః శిరో దత్తం సోమేన వృష్ణ్యమ్ ।

తతః పరి ప్రజాతేన హార్దిం తే శోచయామసి ॥ 1 ॥

పదము

**ఇదమ్ । యత్ । ప్రేణ్యః । శిరః । దత్తమ్ । సోమేన । వృష్ణ్యమ్**

**తతః । పరి । ప్రఽజాతేన । హార్దిమ్ । తే । శోచయామసి ॥ 1 ॥**

**అనువాదం**

ప్రేమప్రాపకమైన ఈ శిరస్సు వీర్యప్రదం. సోము డిచ్చినది.
దానినుంచి ఉత్పన్నమైన స్నేహ విశేషంతో
నీ అంతఃకరణాన్ని సంతాపయుక్తం చేస్తున్నాము ॥ 1 ॥

మంత్రము :

**శోచయామసి తే హార్దిం శోచయామసి తే మనః ।**

**వాతం ధూమ ఇవ సధ్ర్యఙ్ మామేవాన్వేతు తే మనః ॥ 2 ॥**

పదము

**శోచయామసి । తే । హార్దిమ్ । శోచయామసి । తే । మనః ।**

**వాతమ్ । ధూమఃఽఇవ । సధ్ర్యఙ్ । మామ్ । ఏవ । అను । ఏతు ।**

**తే । మనః ॥ 2 ॥**

**అనువాదం :**

దంపతులలో ఒకరైన నీ అంతఃకరణాన్ని తప్తం చేస్తున్నాము.
అలాగే నీ మనస్సును శోకింపజేస్తున్నాము.
తరువాత సహభూతమైన వాయువును ధూమం వలె
నీ మనస్సు నన్నే అనుసరించుగాక! ॥ 2 ॥

మంత్రము :

**మహ్యం త్వా మిత్రావరుణౌ మహ్యం దేవీ సరస్వతీ ।**

మహ్యం త్వా మధ్యం భూమ్యా ఉభావన్తౌ సమస్యతామ్

॥ 3 ॥

పదము

మహ్యమ్ । త్వా । మిత్రావరుణౌ । మహ్యమ్ । దేవీ । సరస్వతీ ।
మహ్యమ్ । త్వా । మధ్యమ్ । భూమ్యాః । ఉభౌ । అన్తౌ । సమ్ ।
అస్యతామ్ ॥ 3 ॥

అనువాదం.

ఓ భార్యా! నిన్ను మిత్రావరుణులు నాకు ఇత్తురుగాక!
దేవి సరస్వతి నిన్ను నాతో సంయోగింప జేయుగాక!
భూమి మధ్యలో ఉన్న ప్రాణిజాతం నిన్ను
నాతో సంయోగింప జేయుగాక!
ఆ భూమి ఊర్ధ్వ, అధః ప్రదేశములు
నిన్ను నాతో సంయోగింప జేయుగాక! ॥ 3 ॥

ఇది ఎనభై తొమ్మిదవ సూక్తం

## సూక్తం — 90

ఋషి. అథర్వుడు ॥ దేవత. రుద్రుడు ॥ ఛందస్సు: 1,2 అనుష్టుప్ 3 ఆర్చీ భురిగుష్ణిక్ ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం — శరీర సంబంధమైన శూలరోగ పరిహారార్థమై చేసే లోహమణి బంధన కర్మలో దీనికి వినియోగం.

మంత్రము 1

యాం తే రుద్ర ఇషుమాస్యదఙ్గేభ్యో హృదయాయ చ ।
ఇదం తామద్య త్వద్ వయం విషూచీం వి వృహామసి ॥ 1 ॥

పదము

యామ్ । తే । రుద్రః । ఇషుమ్ । అస్యత్ । అఙ్గేభ్యః । హృద
యాయ । చ ।

ఇదమ్ । తామ్ । అద్య । త్వత్ । వయమ్ । విషూచీమ్ । వి ।
వృహామసి ॥ 1 ॥

అనువాదం.

ఓ రోగీ! హస్తపాదాదుల నుండి హృదయానికి
రుద్రుడు ఏ బాణాన్నైతే వదలెనో
ఇప్పుడు తత్ప్రతీకారార్థమై ఆ బాణాన్ని అనభిముఖంగా
శరీరమధ్యం నుంచి ఉత్క్షేపం చేస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము:

యాస్తే శతం ధమనయోఽఙ్గాన్యను విష్ఠితాః ।
తాసాం తే సర్వాసాం వయం నిర్విషాణి హ్వయామసి ॥2॥

పదము.

యాః । తే । శతమ్ । ధమనయః । అఙ్గాని । అను । విఽస్థితాః ।
తాసామ్ । తే । సర్వాసామ్ । వయమ్ । నిః । విషాణి । హ్వయా
మసి ॥ 2 ॥

అనువాదం

ఓ శూలరోగీ! నీ అంగముల ననుసరించి
ఏ శతాధికాలైన నాడులు వివిధ రూపాలలో ఉన్నవో
ఆ ధమనులను విషరహితములనుగా మేము చేస్తాము. ॥ 2 ॥

మంత్రము

నమ స్తే రుద్రాస్యతే నమః ప్రతిహితాయై ।

నమో విసృజ్యమానాయై నమో నిపతితాయై ॥ 3 ॥

పదము

నమః । తే । రుద్ర । అస్యతే । నమః । ప్రతిఽహితాయై ।

నమః । విఽసృజ్యమానాయై । నమః । నిఽపతితాయై ॥ 3 ॥

అనువాదం -

ఓ రుద్రుడా! వ్యాధిరూపమైన బాణాన్ని వేసే
నీకు నమస్కారం అ ధనుస్సును ఎక్కుపెట్టిన
నీ బాణానికి నమస్కారం. దానినుండి
వదలిన నీ బాణానికి నమస్కారం.
తర్వాత పడిన దానికి నమస్కారం. ॥ 3 ॥

ఇది తొంభైయవ సూక్తం

## సూక్తం - 91

ఋషులు భృగ్వంగిరసులు॥ దేవతలు: 1,2 యక్ష్మనాశనమ్ 3 అపస్సు॥
ఛందస్సు అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం:- సర్వరోగ చికిత్సార్థం చేసే ఆజ్యహోమంలో దీనికి వినియోగం.
అదే కర్మలో చేసే యవమణిబంధన క్రియలో దీనికి వినియోగం.

మంత్రము

ఇమం యవమష్టాయోగైః షడ్యోగేభిరచర్కృషుః ।

తేనా తే తన్వో౩రపోపాచీనమప వ్యయే ॥ 1 ॥

పదము

ఇమమ్ । యవమ్ । అష్టా౽యోగైః । షట్౽యోగేభిః । అచ
ర్కృషుః ।

తేన । తే । తన్వ౽ః । రపః । అపాచీనమ్ । అప । వ్యయే ॥ 1 ॥

**అనువాదం.**

ఈ చికిత్సకై ఉపయోగించే యవధాన్యం
* అష్టాయోగంతో, అట్లే ** షడ్యోగంతో
దున్నిన భూమిలో పుట్టినది.
ఈ యవధాన్యంతో ఓ వ్యాధితుడా!
నీ శరీర రోగ నిదాన భూతమైన పాపాన్ని తొలగిస్తున్నాను.
॥ 1 ॥

మంత్రము

న్య1గ్ వాతో వాతి న్య౽క్ తపతి సూర్యః ।

నీచీనమఘ్న్యా దుహే న్య౽గ్ భవతు తే రపః ॥ 2 ॥

పదము

న్య౽క్ । వాతః । వాతి । న్య౽క్ । తపతి । సూర్యః ।

నీచీనమ్ । అఘ్న్యా । దుహే । న్య౽క్ । భవతు । తే । రపః ॥2॥

**అనువాదం**

వాయువు క్రిందికి వీచినట్లుగా,
సూర్యుడు తన కిరణాలను అవాఙ్ముఖంగా చూపినట్లుగా

* నాగలికి ఎనిమిది ఎద్దులను కట్టి దున్నుట.
** నాగలికి ఆరు ఎద్దులను కట్టి దున్నుట

గోవు అధోముఖంగా పాలను పిండినట్లుగా,
ఓ వ్యాధితుడా! నీ పాపం అధోముఖ మగుగాక! ॥ 2 ॥

మంత్రము:

అప ఇద్ వా ఉ భేషజీరాపో అమీవచాతనీః ।
ఆపో విశ్వస్య భేషజీస్తాస్తే కృణ్వన్తు భేషజమ్ ॥ 3 ॥

పదము:

ఆపః । ఇత్ । వై । ఓం ఇతి । భేషజీః । ఆపః । అమీవ౽చాతనీః ।
ఆపః । విశ్వస్య । భేషజీః । తాః । తే । కృణ్వన్తు । భేషజమ్ ॥ 3 ॥

అనువాదం:

జలమే సర్వ ఓషధులకు మూలం.
ఈ రోగ వినాశకరములైన ఉదకములు
సర్వరోగములకు ఓషధులై
నీకు కావలసిన ఔషధాన్ని చేయునుగాక! ॥ 3 ॥

ఇది తొంభై ఒకటవ సూక్తం

## సూక్తం - 92

ఋషి అథర్వుడు ॥ దేవత. వాజి ॥ ఛందస్సు 1 జగతి 2,3 త్రిష్టుప్ ॥
మంత్రములు: ॥ 3 ॥

వినియోగం:- అశ్వశాంతిలో చేసే ఆజ్యహోమంలో దీనికి వినియోగం.

మంత్రము

వాతరంహా భవ వాజిన్ యుజ్యమాన
ఇన్ద్రస్య యాహి ప్రసవే మనోజవాః ।

యుఞ్జన్తు త్వా మరుతో విశ్వవేదస
ఆ తే త్వష్టా పత్సు జవం దధాతు ॥ 1 ॥

పదము.

వాత౽రంహాః । భవ । వాజిన్ । యుజ్యమానః ।
ఇన్ద్రస్య । యాహి । ప్ర౽సవే । మనః౽జవాః ।
యుఞ్జన్తు । త్వా । మరుతః । విశ్వ౽వేదసః ।
ఆ । తే । త్వష్టా । పత్౽సు । జవమ్ । దధాతు ॥ 1 ॥

అనువాదం:

ఓ తురగమా! రథానికి కట్టిన నీవు వాయువేగంతో వెళ్ళు.
ఇంద్రుని ఆజ్ఞ ఉండగా మనోవేగంతో గమ్యస్థానాన్ని చేరు.
విశ్వధనములు అయిన మరుత్తులు నీతో చేరుదురు గాక!
త్వష్ట నీ పాదములలోని వేగాన్ని అధికం చేయుగాక! ॥ 1 ॥

మంత్రము

జవస్తే అర్వన్ నిహితో గుహా యః
శ్యేనే వాత ఉత యో౽చరత్ పరీత్తః ।
తేన త్వం వాజిన్ బలవాన్ బలేనాజిం
జయ సమనే పారయిష్ణుః ॥ 2 ॥

పదము.

జవః । తే । అర్వన్ । ని౽హితః । గుహా । యః ।

శ్యేనే । వాతే । ఉత । యః । అచరత్ । పరిత్తః ।

తేన । త్వమ్ । వాజిన్ । బల౨వాన్ । బలేన । ఆజిమ్ ।

జయ । సమనే । పారయిష్ణుః ॥ 2 ॥

అనువాదం.

ఓ అశ్వమా! నీ వేగం గుహయందు నిక్షిప్తమై ఉన్నది.
డేగలోను, వాయువులోను ఏ జీవుడైతే ఉన్నాడో,
ఏ వేగము రక్షణార్థం దత్తమై చరిస్తున్నదో,
ఓ వాజీ! వేగవంతమైన నీతో, నీ బలంతో బలవంతమై,
సంగ్రామంలో అంత మొందించునది కాగా
యుద్ధాన్ని జయించు ॥ 2 ॥

మంత్రము.

తనూష్టే వాజిన్ తన్వం 1 నయన్తీ

వామమస్మభ్యం ధావతు శర్మ తుభ్యమ్ ।

అద్రుతో మహో ధరుణాయ దేవో

దివీ౨వ జ్యోతిః స్వమా మిమీయాత్ ॥ 3 ॥

పదము.

తనూః । తే । వాజిన్ । తన్వ౨మ్ । నయన్తీ ।

వామమ్ । అస్మభ్యమ్ । ధావతు । శర్మ । తుభ్యమ్ ।

అద్రుతః । మహః । ధరుణాయ । దేవః ।

దివిఽఇవ । జ్యోతిః । స్వమ్ । ఆ । మిమీయాత్ ॥ 3 ॥

అనువాదం

ఓ వాజీ! నీ శరీర యష్టి నీపై ఆరోహించిన వాని
శరీరాన్ని యుద్ధభూమికి కొనిపోతూ,
మా ధనాన్ని అందించు గాక!
నీకు సుఖమగు నట్లుగా శీఘ్రగమనంతో వెళ్ళుగాక!
అంతరిక్షం యొక్క, గ్రామ, జనపదాదుల యొక్క
ధారణార్థం అకుటిల గామియై వెళ్ళి,
అంతరిక్షంలో సూర్యప్రకాశం వలె
స్వకీయస్థానాన్ని చేరుగాక! ॥ 3 ॥

ఇది తొంభై రెండవ సూక్తం

ఇది తొమ్మిదవ అనువాకం.

## సూక్తం – 93

# అనువాకం: 10

ఋషి: శన్తాతి॥ దేవతలు, మంత్రాలలో పేర్కొన్న యమాదులు॥ ఛందస్సు:
త్రిష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం.– ఈ సూక్తం వాస్తోష్పత్యగణంలోనిది కావున 'వాస్తోష్పత్య'మనే మహాశాంతిలో వాస్తోష్పత్యగణప్రయుక్త వినియోగం అనుసందేయం. ఇది బృహద్గణం లోనిది కూడా గనుక శాంత్యుదకాభిమంత్రణాదులలో బృహద్గణ ప్రయుక్త వినియోగం అనుసందేయం. స్వస్త్యయన కర్మలో ఈ సూక్తంతో ఆజ్యసమిత్పురోడాశాది శష్కుల్యంతములైన పదమూడు ద్రవ్యాలను హోమం చెయ్యాలి

మంత్రము.

యమో మృత్యురఘమారో నిర్ఋథో

బభ్రుః శర్వోస్తా నీలశిఖణ్డః ।
దేవజనాః సేనయోత్తస్థివాంసస్తే
అస్మాకం పరి వృఞ్జన్తు వీరాన్ ॥ 1 ॥

పదము

యమః । మృత్యుః । అఘ౨మారః । నిః౨బుథః ।
బభ్రుః । శర్వః । అస్తా । నీల౨శిఖణ్డః ।
దేవ౨జనాః । సేనయా । ఉత్తస్థి౨వాంసః । తే ।
అస్మాకమ్ । పరి । వృఞ్జన్తు । వీరాన్ ॥ 1 ॥

అనువాదం:

యముడు, మృత్యువు, పాపనిమిత్తంగా చంపే
మారుడు (అఘమారుడు), నిర్బుథుడు
(నిశ్శేషంగా పీడించేవాడు), పింగళవర్ణుడు,
శర్వుడు, క్షేపణశీలుడు, నీలశిఖండుడు
మొదలైన దేవజనులు పాపుల హింసార్థం తమసేనతో
స్వస్థానం నుంచి ఉత్క్రాంతులై ఉన్నారు
వారు మా పుత్ర పౌత్రాదులను బాధింపకుందురుగాక! ॥ 1 ॥

మంత్రము.

మనసా హోమైర్హరసా ఘృతేన
శర్వాయాస్త్ర ఉత రాజ్ఞే భవాయ ।
నమస్యేభ్యో నమ ఏభ్యః కృణోమ్య —

న్యత్రాస్మదఘవిషా నయన్తు ॥ 2 ॥

పదము

మనసా । హోమైః । హరసా । ఘృతేన ।

శర్వాయ । అస్త్రే । ఉత । రాజ్ఞే । భవాయ ।

నమస్యేఽభ్యః । నమః । ఏభ్యః । కృణోమి ।

అన్యత్ర । అస్మత్ । అఘఽవిషాః । నయన్తు ॥ 2 ॥

అనువాదం

మనస్సంకల్ప మాత్రంతో హరణశీలమైన
తేజస్సుతో, ఘృతంతో చేసే హోమంతో పాటు
శర్వునకు, క్షేప్తకు, వీరందరి రాజైన
మహాదేవునకు నమస్కరిస్తున్నాను
వారు మా నుండి అన్యత్ర
మృత్యువును కొనిపోదురు గాక! ॥ 2 ॥

మంత్రము.

త్రాయధ్వం నో అఘవిషాభ్యో వధాద్

విశ్వే దేవా మరుతో విశ్వవేదసః ।

అగ్నిషోమా వరుణః పూతదక్షా

వాతాపర్జన్యయోః సుమతౌ స్యామ ॥ 3 ॥

పదము.

త్రాయధ్వమ్ । నః । అఘఽవిషాభ్యః । వధాత్ ।

విశ్వే । దేవాః । మరుతః । విశ్వఽవేదసః ।
అగ్నిషోమా । వరుణః । పూతఽదక్షాః ।
వాతాపర్జన్యయోః । సుఽమతౌ । స్యామ ॥ 3 ॥

అనువాదం.

ఓ విశ్వేదేవతలారా! మరుత్తులారా! విశ్వవేత్తలారా!
మీరు మొదట చెప్పిన కృత్యాలనుంచి,
వారు చేసే హననం నుంచి మమ్మల్లను కాపాడుదురుగాక!
అగ్ని, సోముడు, వరుణుడు, పూతదక్షుడు (మిత్రుడు)
వాత పర్జన్యులు — వారి శోభనానుగ్రహామునకు
పాత్రులమగుదుము గాక! ॥ 3 ॥

ఇది తొంభై మూడవ సూక్తం

## సూక్తం-94

ఋషులు అథర్వాంగిరసులు ॥ దేవత : సరస్వతి ॥ ఛందస్సు 1,3 అనుష్టుప్
2 విరాడ్ జగతీ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం - సాంమనస్య కర్మలో దీనికి వినియోగం

మంత్రము.

సం వో మనాంసి సం వ్రతా సమాకూతీర్నమామసి ।
అమీ యే వివ్రతా స్థన తాన్ వః సం నమయామసి ॥1॥

పదము.

సమ్ । వః । మనాంసి । సమ్ । వ్రతా । సమ్ । ఆఽకూతీః ।
నమామసి ।

అమీ ఇతి । యే । వి౽వ్రతాః । స్థన । తాన్ । వః । సమ్ ।
నమయామసి ॥ 1 ॥

**అనువాదం.**

మీ మనస్సులు ఏకమగునట్లు వ్రతములను చేస్తున్నాము.
అలాగే సంకల్పాలను ఏకం చేస్తున్నాము
మీరు పూర్వం విరుద్ధ కర్ములైన వారు
ఆ విమనస్కతను తొలగించి
మిమ్ములను ఏకం చేస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము.

అహం గృభ్ణామి మనసా మనాంసి
మమ చిత్తమను చిత్తేభిరేత ।
మమ వశేషు హృదయాని వః
కృణోమి మమ యాతమనువర్త్మాన ఐత ॥ 2 ॥

పదము

అహమ్ । గృభ్ణామి । మనసా । మనాంసి ।
మమ । చిత్తమ్ । అను । చిత్తేభిః । ఆ । ఇత ।
మమ । వశేషు । హృదయాని । వః ।
కృణోమి । మమ । యాతమ్ । అను౽వర్త్మానః । ఆ । ఇత ॥ 2 ॥

**అనువాదం.**

మీ మనస్సులను నా మనస్సుతో స్వాయత్తం
చేసుకుంటున్నాను. మీరు కూడ నా చిత్తాన్ని

అనుసరించిన చిత్తములతో వత్తురుగాక!
నా వశంలోనికి మీ హృదయాలు వచ్చుగాక!
నన్ననుసరించి మీరు వత్తురుగాక! ॥ 2 ॥

మంత్రము

ఓతే మే ద్యావాపృథివీ ఓతా దేవీ సరస్వతీ ।
ఓతా మ ఇన్ద్రశ్చాగ్నిశ్చర్ధ్యాస్మేదం సరస్వతి ॥ 3 ॥

పదము

ఓతేఇత్యాఽఉతే । మే । ద్యావాపృథివీ ఇతి । ఆఽఉతా । దేవీ ।
సరస్వతీ ।
ఆఽఉతా । మే । ఇన్ద్రః । చ । అగ్నిః । చ । ఋధ్యాస్మ । ఇదమ్
సరస్వతి ॥ 3 ॥

అనువాదం

ద్యావాపృథువులు నాకు అభిముఖ్యంతో ఉండుగాక!
ద్యోతమాన అయిన సరస్వతి నాకు
అభిముఖ్యంతో ఉండుగాక!
అలాగే ఇంద్రుడు, అగ్ని నా కోరిక నెరవేరటకు
అభిముఖ్యంతో ఉందురుగాక!
వీరి అనుగ్రహం వల్ల ఓ సరస్వతీ!
ఇప్పుడు మేము సమృద్ధులమై ఉన్నాము ॥ 3 ॥

ఇది తొంభైనాల్గవ సూక్తం

## సూక్తం - 95

ఋషులు : భృగ్వంగిరసులు ॥ దేవత - వనస్పతి (కుష్ఠము) ॥ ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 3 ॥

వినియోగం:- రాజయక్ష్మ, కుష్ఠు మొదలగు రోగశాంత్యర్థం చేసే చికిత్సలో దీనికి వినియోగం. మూడవ మంత్రమునకు అగ్నిచయనంలో వినియోగం.

మంత్రము

అశ్వత్థో దేవసదన స్తృతీయస్యామితో దివి ।
తత్రామృతస్య చక్షణం దేవాః కుష్ఠమవన్వత ॥ 1 ॥

పదము

అశ్వత్థః । దేవఽసదనః । తృతీయస్యామ్ । ఇతః । దివి ।
తత్ర । అమృతస్య । చక్షణమ్ । దేవాః । కుష్ఠమ్ । అవన్వత ॥1॥

అనువాదం

ఇక్కడకు పైనున్న మూడవ దేవలోకంలో
దేవసదనమైన అశ్వత్థం ఉన్నది
అది అమృత స్వరూపమైనది.
అక్కడి కుష్ఠౌషధి దేవతలకు లభించినది. ॥ 1 ॥

మంత్రము

హిరణ్యయీ నౌరచరద్ధిరణ్యబన్ధనా దివి ।
తత్రామృతస్య పుష్పం దేవాః కుష్ఠమవన్వత ॥ 2 ॥

పదము

హిరణ్యయీ । నౌః । అచరత్ । హిరణ్యఽబన్ధనా । దివి ।
తత్ర । అమృతస్య । పుష్పమ్ । దేవాః । కుష్ఠమ్ । అవన్వత ॥2॥

**అనువాదం :**

హిరణ్మయిమైన, సువర్ణబంధనమైన నౌక
ద్యులోకంలో తిరుగుతుంటుంది
అందులో అమృతపుష్ప సమానమైన
ఈ ఓషధి దేవతలకు లభిస్తుంది ॥ 2 ॥

**మంత్రము :**

గర్భో అస్యోషధీనాం గర్భో హిమవతాముత
గర్భో విశ్వస్య భూతస్యేమం మే అగదం కృధి ॥ 3 ॥

**పదము**

గర్భః । అసి । ఓషధీనామ్ । గర్భః । హిమఽవతామ్ । ఉత ।
గర్భః । విశ్వస్య । భూతస్య । ఇమమ్ । మే । అగదమ్ । కృధి
॥ 3 ॥

**అనువాదం**

ఓ అగ్ని ! నీవు సర్వవనస్పతుల గర్భంలో ఉన్నావు
అలాగే చల్లని ఇతర వనస్పతులకు నీవు గర్భంలో ఉన్నవాడవు.
సర్వ భూతజాతమునకు నీవు గర్భంలో ఉన్నవాడవు
ఇలాంటి నీవు మా జనాన్ని రోగరహితులను చెయ్యి ॥ 3 ॥

ఇది తొంభై ఐదవ సూక్తం

## సూక్తం– 96

**ఋషులు : భృగ్వంగిరసులు ॥ దేవతలు 1,2 వనస్పతి, 3 సోముడు ॥ ఛందస్సు 1,2 అనుష్టుప్ 3 విరాణ్ణామగాయత్రి ॥ మంత్రములు. ॥ 3 ॥**

**వినియోగం. బ్రాహ్మణాక్రోశంలో, జలోదరంలో శాంత్యర్థం చేసే వివిధ ప్రక్రియలలో దీనికి వినియోగం.**

మంత్రము

యా ఓషధయః సోమరాజ్ఞీర్బహ్వీః శతవిచక్షణాః ।
బృహస్పతిప్రసూతాస్తా నో ముఞ్చన్త్వంహసః ॥ 1 ॥

పదము

యాః । ఓషధయః । సోమఽరాజ్ఞీః । బహ్వీః । శతఽవిచక్షణాః ।
బృహస్పతిఽప్రసూతాః । తాః । నః । ముఞ్చన్తు । అంహసః
॥ 1 ॥

అనువాదం.

ఏ ఓషధులు సోమాధిపత్యము గలవో,
అనేక విధాలైన శతవిధ దర్శనాలు బృహస్పతితో
ఆ యా రోగ చికిత్సలో ప్రసూతము లైనవో,
ఆ ఓషధులన్నీ మమ్ములను పాపం నుంచి వేరుచేయుగాక!
॥ 1 ॥

మంత్రము :

ముఞ్చన్తు మా శపథ్యా౩దథో వరుణ్యాఽదుత ।
అథో యమస్య షడ్వీశాద్ విశ్వస్మాద్ దేవకిల్బిషాత్ ॥ 2 ॥

పదము :

ముఞ్చన్తు । మా । శపథ్యాఽత్ । అథో ఇతి । వరుణ్యాఽత్ । ఉత ।
అథో ఇతి । యమస్య । షడ్వీశాత్ । విశ్వస్మాత్ । దేవఽకిల్బిషాత్
॥ 2 ॥

నన్ను బ్రాహ్మణశాపం నుంచి ఓషధులు
విమోచనం చెందించుగాక!
మఱిన్ని అబద్ధమాడినందు వల్ల కలిగే
పాపం నుంచి విమోచనం చేయుగాక!
అంతక సంబంధి అయిన పాదబంధన
పాశం నుంచి విడిపించుగాక!
ఇంతెందుకు? సర్వదేవకృత పాపం నుంచి
నన్ను విముక్తుని చేయుగాక! ॥ 2 ॥

మంత్రము :

**యచ్చక్షుషా మనసా యచ్చ వాచోపారిమ**
**జాగ్రతో యత్ స్వపన్తః ।**
**సోమస్తాని స్వధయా నః పునాతు ॥ 3 ॥**

పదము.

**యత్ । చక్షుషా । మనసా । యత్ । చ । వాచా । ఉపఽఆరిమ ।**
**జాగ్రతః । యత్ । స్వపన్తః ।**
**సోమః । తాని । స్వధయా । నః । పునాతు ॥ 3 ॥**

అనువాదం

జాగ్రదవస్థ నుంచి వ్యవహరిస్తున్న మేము
కంటితో మనస్సుతో ఏ పాపం చేస్తామో,
ఏ పాపం వాక్కునుంచి ఉపగత మైనదో,
అలాగే నిద్రిస్తూ మేము కేవలం మనస్సుతో
ఏ పాపం చేస్తామో, మమ్ములను ఆ పాపాల నుండి

పితృలోకాధిపతి అయిన సోమదేవుడు
పితృదేవతలను గూర్చి మే మిచ్చే
స్వధాకర్మతో పునీతులను చేయుగాక ! ॥ 3 ॥

ఇది తొంభై ఆరవ సూక్తం

## సూక్తం - 97

ఋషి: అథర్వుడు ॥ దేవతలు: 1,3 దేవుడు 2 మిత్రావరుణులు ॥ ఛందస్సు:
1 త్రిష్టుప్: 2 జగతి. 3 భురిక్ త్రిష్టుప్ ॥ మంత్రములు· ॥ 3 ॥

వినియోగం:- సంగ్రామజయకర్మకు సంబంధించిన ఆజ్యహోమాదులలో దీనికి వినియోగం. ఈ సూక్తం అపరాజితగణంలోనిది గనుక ఉపాకర్మాదులలో గణప్రయుక్త వినియోగం అనుసంధేయం ఇంద్ర మహాఖ్య కర్మలో చేసే పూర్ణహోమంలోను, ఇంద్రోపస్థానంలోను దీనికి వినియోగం.

మంత్రము·

అభిభూర్యజ్ఞో అభిభూరగ్నిరభిభూః
సోమో అభిభూరిన్ద్రః ।
అభ్యహం విశ్వాః పృతనా యథాసాన్యేవా
విధేమాగ్నిహోత్రా ఇదం హవిః ॥ 1 ॥

పదము :

అభిఽభూః । యజ్ఞః । అభిఽభూః । అగ్నిః । అభిఽభూః ।
సోమః । అభిఽభూః । ఇన్ద్రః ।
అభి । అహమ్ । విశ్వాః । పృతనాః । యథా । అసాని । ఏవ ।

విధేమ । అగ్నిఽహోత్రాః । ఇదమ్ । హవిః । ॥ 1 ॥

అనువాదం.

ఈ యజ్ఞము శత్రువులను అభిభవించుగాక!
ఈ అగ్ని అభిభవించు గాక!
సోముడు శత్రువులను అభిభవించుగాక!
ఇంద్రుడు అభిభవించు గాక!
శత్రుజయ కాముడనైన నేను సర్వ శత్రుసేనలను
అభిభవించునట్లు, అగ్నిహోత్రునిలో హోమంచేసే మేము
సంగ్రామ జయార్థం ఈ హవిస్సును సమర్పిస్తున్నాము ॥ 1 ॥

మంత్రము

స్వధాఽస్తు మిత్రావరుణా విపశ్చితా
ప్రజావత్ క్షత్రం మధునేహ పిన్వతమ్ ।
బాధేథాం దూరం నిర్ఋతిం పరాచైః
కృతం చిదేనః ప్ర ముముక్తమస్మత్ ॥ 2 ॥

పదము:

స్వధా । అస్తు । మిత్రావరుణా । విపఃఽచితా ।
ప్రజాఽవత్ । క్షత్రమ్ । మధునా । ఇహ । పిన్వతమ్ ।
బాధేథామ్ । దూరమ్ । నిఃఽఋతిమ్ । పరాచైః ।
కృతమ్ । చిత్ । ఏనః । ప్ర । ముముక్తమ్ । అస్మత్ ॥ 2 ॥

అనువాదం।

మేధావులైన మిత్రావరుణులారా!
మీకు హవిస్సు తృప్తికరమగు గాక!

మీరు ఈ రాజు నందు ప్రజాయుక్తుడైన
క్షత్ర బలసంయుతుడైన వానిని మధురరసంతో తడపండి.
నిర్‌ఋతిని ( పాపదేవతను ) పరాఙ్ముఖంగా
దూరంగా తరిమివేయుగాక!
శత్రుకృతమైన పాపమైనా మా సమీపం నుండి
ప్రమోచనం చెందుగాక! ॥ 2 ॥

మంత్రము

ఇమం వీరమను హర్షధ్వముగ్రమిన్ద్రం
సఖాయో అను సం రభధ్వమ్ ।
గ్రామజితం గోజితం వజ్రబాహుం
జయన్తమజ్మ ప్రమృణన్తమోజసా ॥ 3 ॥

పదము

ఇమమ్ । వీరమ్ । అను । హర్షధ్వమ్ । ఉగ్రమ్ । ఇన్ద్రమ్ ।
సఖాయః । అను । సమ్ । రభధ్వమ్ ।
గ్రామఽజితమ్ । గోఽజితమ్ । వజ్రఽబాహుమ్ ।
జయన్తమ్ । అజ్మ । ప్రఽమృణన్తమ్ । ఓజసా ॥ 3 ॥

అనువాదం .

ఈ వీరుడైన రాజును అనుసరించిన
సైనికులారా హర్షించండి.
ఉద్గూర్ణబలుడైన ఇంద్రుని
సమాన ఖ్యానులైన సైనికులు

రాజుననుసరించి యీ ద్దోద్యుక్తు లగుదురుగాక!
ఆ ఇంద్రుడు గ్రామాలను జయించిన వాడు,
శత్రువుల గోగ్రహణం చేసిన వాడు
క్షేపణశీలమైన శత్రుబలాన్ని
ఓజస్సుతో హింసించే వాడు. ॥ 3 ॥

ఇది తొంభై ఏడవ సూక్తం

## సూక్తం — 98

ఋషి అథర్వుడు ॥ దేవత : ఇంద్రుడు ॥ ఛందస్సు 1,3 త్రిష్టుప్ 2 బృహతీ గర్భాస్తార పంక్తి ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం.— పూర్వసూక్తం ఎలెనే దీనికి కూడా వినియోగం. పరసేనావిద్వేషణ కర్మలో రాజు దీనిని పఠిస్తూ సేనను మూడు సార్లు ప్రదక్షిణం చేస్తాడు. అలాగే మహావ్రతానికి సన్నద్ధుడైన రాజునో మణికారినో బ్రహ్మ దీనితో అనుమంత్రిస్తాడు.

మంత్రము :

ఇన్ద్రో॑ జయాతి న పరా జయాతా అధిరాజో రాజసు
రాజయాతై ।
చర్కృత్య ఈడ్యో వన్ద్యశ్చోపసద్యో నమస్యోఽభవేహ ॥1॥

పదము.

ఇన్ద్రః । జయాతి । న । పరా । జయాతై । అధిఽరాజః ।
రాజఽసు । రాజయాతై ।
చర్కృత్యః । ఈడ్యః । వన్ద్యః । చ । ఉపఽసద్యః । నమస్యః ।
భవ । ఇహ ॥ 1 ॥

**అనువాదం**

ఈ సంగ్రామంలో రాజు సహాయార్థం వచ్చిన ఇంద్రుడు
జయిస్తాడు సరాజయం పొందడు.
రాజులందరికి అధిపతి అయిన ఇంద్రుడు
ఇతర భూపాలుర విషయంలో ప్రకాశించుగాక!
ఆ ఇంద్రుడు శత్రుచ్ఛేత్త వందనీయుడు,
స్తవనీయుడు, సర్వులకు సేవనీయుడు.
ఓ ఇంద్రా! ఇందువల్ల ఈ సంగ్రామంలో
నీవు మాకు పూజనీయుడవగుదువు గాక! ॥ 1 ॥

మంత్రము

త్వమిన్ద్రాధిరాజః శ్రవస్యుస్త్వం
భూరభిభూతి ర్జనానామ్ ।
త్వం దైవీర్విశ ఇమా వి
రాజా యుష్మత్ క్షత్రమజరం తే అస్తు ॥ 2 ॥

పదము :

త్వమ్ । ఇన్ద్ర । అధి ఽ రాజః । శ్రవస్యుః । త్వమ్ ।
భూః । అభి ఽ భూతిః । జనానామ్ ।
త్వమ్ । దైవీః । విశః । ఇమాః । వి ।
రాజ । ఆయుష్మత్ । క్షత్రమ్ । అజరమ్ । తే । అస్తు ॥ 2 ॥

అనువాదం.

ఓ ఇంద్రుడా! నీవు రాజులకెల్లా అధిరాజువు.
ఓ ఇంద్రా! నీవు సర్వప్రాణులను అభిభవించగలవాడవు.

దైవ సంబంధులైన ఈ ప్రజలను నీవు పరిపాలించు
ఓ రాజా! నీ ఆయుష్యం అజరమై, బలసంపన్నమగుగాక!
॥ 2 ॥

మంత్రము :

ప్రాచ్యా దిశస్త్వమిన్ద్రాసి రాజోతోదీచ్యా

దిశో వృత్రహన్ఛత్రుహోఽసి ।

యత్ర యన్తి స్రోత్యాస్త జ్జితం తే

దక్షిణతో వృషభ ఏషి హవ్యః ॥ 3 ॥

పదము

ప్రాచ్యాః । దిశః । త్వమ్ । ఇన్ద్ర । అసి । రాజా । ఉత । ఉదీచ్యాః

దిశః । వృత్రఽహన్ । శత్రుఽహః । అసి ।

యత్ర । యన్తి । స్రోత్యాః । తత్ । జితమ్ । తే ।

దక్షిణతః । వృషభః । । ఏషి । హవ్యః ॥ 3 ॥

అనువాదం

ఓ ఇంద్రుడా! ప్రాగ్దిక్కునకు నీవు రాజువు.
అంతే గాక, ఉత్తరదిక్కునకు అధిపతివి
కాబట్టి ఓ వృత్రహంతకుడా!
నీవు మాకు శత్రుహంతకుడవు కూడా
ఏ భూప్రదేశంలో స్రోతస్వినులు ప్రవహిస్తున్నవో
ఆ సర్వస్థానమూ నీవే.
ఇలాంటి కామవర్షి అయిన నీవు

మాతో ఆహూతుడవై సంగ్రామజయార్థం
మా దక్షిణ భాగం నుంచి వర్తించు ॥ 3 ॥

ఇది తొంభై ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 99

**ఋషిః అథర్వుడు ॥ దేవతలు: 1,2 ఇంద్రుడు 3 ఇంద్రుడు, సోముడు మరియు సవిత ॥ ఛందస్సు. 1,2 అనుష్టుప్, 3 భురిగ్ బృహతీ ॥ మంత్రములు: ॥ 3 ॥**

**వినియోగం:- 97వ సూక్తమునకు వలెనే దీనికి కూడా వినియోగం. అగ్నిష్టోమంలోను, ప్రాతస్సవనంలోను బ్రహ్మ దీనిని అనుమంత్రించాలి.**

**మంత్రము**

**అభి త్వేన్ద్ర వరిమతః పురా త్వాంహూరణాద్ధువే ।**
**హ్వయామ్యుగ్రం చేత్తారం పురుణామానమేకజమ్ ॥ 1 ॥**

పదము

**అభి । త్వా । ఇన్ద్ర । వరిమతః । పురా । త్వా । అంహూరణాత్ । హువే ।**
**హ్వయామి । ఉగ్రమ్ । చేత్తారమ్ । పురుఽనామానమ్ । ఏకఽజమ్ ॥ 1 ॥**

**అనువాదం**

ఓ ఇంద్రా! నీవు స్థూలకాయుడవు గనుక
సంగ్రామాలలో కుటిలగమనం వల్ల
పూర్వమే అభిముఖ్యానికై ఆహ్వానించినాను
ఉద్ఘూర్ణబలుడు, జయోపాయజ్ఞుడు,

అనేక ప్రశస్తనామాలతో కూడినవాడు,
యుద్ధంలో ఒకడే పుట్టిన వాడు
అయిన ఇంద్రుని ఆహ్వానిస్తున్నాను ॥ 1 ॥

మంత్రము :

యో అద్య సేన్యో వధో జిఘాంసన్న ఉదీరతే।
ఇన్ద్రస్య తత్ర బాహూ సమన్తం పరి దద్మః ॥ 2 ॥

పదము

యః। అద్య। సేన్యః। వధః। జిఘాంసన్। నః। ఉత్ఽఈరతే।
ఇన్ద్రస్య। తత్ర। బాహూఇతి। సమన్తమ్। పరి। దద్మః ॥ 2 ॥

అనువాదం :

ఇప్పుడు శత్రుసేనాసంబంధియైన,
హననసాధనమైన ఏ ఆయుధం మమ్ములను చంపుటకు
మాపైనికి వస్తున్నదో, ఆ వధలో ఇంద్రుడు బాహువులు
మా రక్షణార్థమై మా చుట్టూ ప్రాకారం వలె నిలుపు గాక!
॥ 2 ॥

మంత్రము :

పరి దద్మ ఇన్ద్రస్య బాహూ సమన్తం త్రాతుస్త్రాయతాం నః।
దేవ సవితః సోమ రాజన్సుమనసం మా కృణు స్వస్తయే
॥ 3 ॥

పదము .

పరి। దద్మః। ఇన్ద్రస్య। బాహూఇతి। సమన్తమ్। త్రాతుః।
త్రాయతామ్। నః।

దేవ । సవితః । సోమ । రాజన్ । సుఽమనసమ్ । మా । కృణు ।
స్వస్తయే ॥ 3 ॥

అనువాదం :

పాలకులైన ఇంద్రుని బాహువులు సర్వతః పరిరక్షించుగాక!
అందువల్ల ఇంద్రుడు మమ్ములను రక్షించుగాక!
ఓ సవితా! ఓ రాజా! సోమా! క్షేమార్థమై నన్ను
సంగ్రామంలో శోభన మనస్కుని చేయి ॥ 3 ॥

ఇది తొంభై తొమ్మిదవ సూక్తం

## సూక్తం—100

ఋషి: గరుత్మంతుడు॥ దేవత : వనస్పతి॥ ఛందస్సు: అనుష్టుప్॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం :— స్థావరజంగమ విషచికిత్సలో దీనికి వినియోగం అహితాగ్నికి అంత్య సంస్కారంలో పురోడాశాన్ని హృదయంపై ఉంచి దీనితో అనుమంత్రించాలి.

మంత్రము :

దేవా అదుః సూర్యో అదాద్ ద్యౌరదాత్ పృథివ్యఽదాత్ ।
తిస్రః సరస్వతీరదుః సచిత్తా విషదూషణమ్ ॥ 1 ॥

పదము :

దేవాః । అదుః । సూర్యః । అదాత్ । ద్యౌః । అదాత్ । పృథివీ ।
అదాత్ ।
తిస్రః । సరస్వతీః । అదుః । సఽచిత్తాః । విషఽదూషణమ్ ॥ 1 ॥

**అనువాదం**

దేవతలు సమానమనస్కులై విషాన్ని నిగ్రహించుటను ఇచ్చినారు
సూర్యుడు కూడా ఇచ్చుగాక!
ద్యులోకం ఇచ్చుగాక! పృథివి ఇచ్చుగాక!
త్రయీరూపమైన సర్వోషధి
విషనివారక ఔషధాన్ని ఇత్తురుగాక! ॥ 1 ॥

**మంత్రము**

**యద్ వో దేవా ఉపజీకా ఆసిఞ్చన్ ధన్వన్యుదకమ్ ।**

**తేన దేవప్రసూతేనేదం దూషయతా విషమ్ ॥ 2 ॥**

**పదము .**

**యత్ । వః । దేవాః । ఉపऽజీకాః । ఆऽఅసిఞ్చన్ । ధన్వని । ఉదకమ్ ।**

**తేన । దేవऽప్రసూతేన । ఇదమ్ । దూషయత । విషమ్ ॥ 2 ॥**

**అనువాదం :**

ఓ దేవతలారా! మీకు సంబంధించిన ఉపజీకలు
( వల్మీకనిర్మాల్యం ) ( ఈ పేరుగల ప్రాణివిశేషములు )
ఉదకం లేని స్థానంలో నీ వరప్రసాదం వల్ల
ఏ నీటిని చల్లిరో, ఆ ఉదకంతో,
దేవగత్తమైన దానితో ఈ విషాన్ని నివర్తించండి ॥ 2 ॥

**మంత్రము .**

**అసురాణాం దుహితాసి సా దేవానామసి స్వసా ।**

**దివస్పృథివ్యాః సంభూతా సా చకర్థారసం విషమ్ ॥ 3 ॥**

పదము

అసురాణామ్ । దుహితా । అసి । సా । దేవానామ్ । అసి । స్వసా

దివః । పృథివ్యాః । సమ్ఽభూతా । సా । చకర్థ । అరసమ్ ।

విషమ్ ॥ 3 ॥

అనువాదం

ఓ వల్మీక మృత్తికా! సురవిరోధులకు దుహితవు
ఇంద్రాదులకు కూడా భగినివి
అంతరిక్షం నుంచి పృథివి నుంచి ఉత్పన్నమైన నీవు
విషాన్ని రసరహితంగా చేయుదువు గాక! ॥ 3 ॥

ఇది నూఅవ సూక్తం

## సూక్తం-101

ఋషులు. అథర్వాంగిరసులు॥ దేవత : బ్రహ్మణస్పతి॥ ఛందస్సు: అనుష్టుప్॥
మంత్రములు: ॥ 3 ॥

వినియోగం , వాజీకరణకాముడు ఏకశాఖార్క మణిని కట్టుకొనడంలోను, అలాగే
కృష్ణమృగ చర్మమణిని బంధించుకొనడంలోను దీనికి వినియోగం

మంత్రము

ఆ వృషాయస్వ శ్వసిహి వర్ధస్వ ప్రథయస్వ చ ।

యథాఙ్గం వర్ధతాం శేపస్తేన యోషితమిజ్జహి ॥ 1 ॥

పదము

ఆ । వృషఽయస్వ । శ్వసిహి । వర్ధస్వ । ప్రథయస్వ । చ ।

యథాఽఅఙ్గమ్ । వర్ధతామ్ । శేపః । తేన । యోషితమ్ । ఇత్ ।

జహి ॥ 1 ॥

**అనువాదం :**

ఓ పురుషుడా! అంతటా వృషభము వలె సంచరించు.
నీ అవయవాలు పుష్టి చెందుగాక!
బలిసిన శరీరం కలవాడవు కమ్ము.
ఎలా నీ మర్మాంగం మిథునీభవన సమర్థమౌతుందో
అలా వృద్ధి పొందనీ అలా వృద్ధి పొందిన ప్రజననాంగంతో
సురతార్థిని అయిన స్త్రీని పొందు ॥ 1 ॥

మంత్రము

**యేన కృశం వాజయన్తి యేన హిన్వన్త్యాతురమ్ ।**

**తేనాస్య బ్రహ్మణస్పతే ధనురివా తానయా పసః ॥ 2 ॥**

పదము

**యేన । కృశమ్ । వాజయన్తి । యేన । హిన్వన్తి । ఆతురమ్ ।**

**తేన । అస్య । బ్రహ్మణః । పతే । ధనుఃఽఇవ । ఆ । తానయ ।**

**పసః ॥ 2 ॥**

**అనువాదం.**

ఏ రస విశేషంతో వంధ్యమైన పురుషాంగాన్ని
వాజీకరణం చేస్తారో, ఏ రసవిశేషంతో రోగార్తుడైన
పురుషుని ప్రీతుని చేస్తారో, ఓ బ్రహ్మణస్పతీ!
ఆ రసవిశేషంతో వాజీకరణకాముడైన ఇతని శేపం
ధనుర్దండము వలె ఉన్నమితం చెయ్యి ॥ 2 ॥

మంత్రము

**ఆహం తనోమి తే పసో అధి జ్యామివ ధన్వని ।**

క్రమస్వర్శ్న ఇవ రోహితమనవగ్లాయతా సదా ॥ 3 ॥

పదము

ఆ । అహమ్ । తనోమి । తే । పసః । అధి । జ్యామ్ఽఇవ ।
ధన్వని ।
క్రమస్వ । ఋశఃఽఇవ । రోహితమ్ । అనవఽగ్లాయతా । సదా
॥ 3 ॥

అనువాదం.

ఓ వీర్యకాముడా! నీ పురుషాంగాన్ని
మంత్రప్రభావంతో వీర్యయుక్తం చేస్తున్నాను.
విల్లునకు ఎక్కుపెట్టిన అల్లెత్రాటి వలె చేస్తున్నాను.
అందువల్ల నీవు సేచన సమర్థమైన వృషభం వలె
వర్తిస్తున్న మనస్సుతో సదా నీ భార్యను ఆక్రమించు ॥ 3 ॥

ఇది నూట ఒకటవ సూక్తం

## సూక్తం-102

ఋషి జమదగ్ని ॥ దేవతలు ॥ అశ్వినులు ॥ ఛందస్సు . అనుష్టుప్ ॥ మంత్రములు
॥ 3 ॥

వినియోగం - స్త్రీ వశీకరణ కర్మలో దీనికి వినియోగం

మంత్రము

యథాయం వాహో అశ్వినా సమైతి సం చ వర్తతే ।

ఏవా మామభి తే మనః సమైతు సం చ వర్తతామ్ ॥ 1 ॥

పదము:

యథా । అయమ్ । వాహః । అశ్వినా । సమ్ఽఏతి । సమ్ । చ ।
వర్తతే ।

ఏవ । మామ్ । అభి । తే । మనః । సమ్ఽఏతు । సమ్ । చ ।
వర్తతామ్ ॥ 1 ॥

అనువాదం

ఓ అశ్వినీ దేవతలారా !
ఎలా ఈ సుశిక్షితమైన అశ్వం వస్తుందో,
అతని అధీనంలో ఉంటుందో, అలాగే
ఓ కామిని ! నీమనస్సు కాముకుడనైన
నాకు అభిముఖంగా వచ్చుగాక !
నా అధీనంలో వర్తించుగాక ! ॥ 1 ॥

మంత్రము

ఆహం ఖిదామి తే మనో రాజాశ్వః పృష్ట్యామివ ।
రేష్మచ్ఛిన్నం యథా తృణం మయి తే వేష్టతాం మనః ॥ 2 ॥

పదము.

ఆ । అహమ్ । ఖిదామి । తే । మనః । రాజఽఅశ్వః । పృష్ట్యామ్ఽఇవ ।

రేష్మఽఛిన్నమ్ । యథా । తృణమ్ । మయి । తే । వేష్టతామ్ ।
మనః ॥ 2 ॥

అనువాదం

ఓ కామినీ! నీ చిత్తాన్ని ఈ ప్రయోగంతో
నేను నాకు అభిముఖంగా ఉన్మూలనం చేస్తున్నాను
రాతికి కట్టివేసిన రాజాశ్వం ఆ త్రాడును సులభంగా
త్రెంచి వేసుకొనునట్లు ఛిన్నమైన తృణం దానికి
వశమై ఎలా ఉంటుందో ఓ కామినీ!
నీ మనస్సు అలాగే నాచుట్టూ పరిభ్రమించుగాక!
ఎప్పుడూ దూరం కాకుండు గాక! ॥ 2 ॥

మంత్రము

ఆఞ్జనస్య మదుఘస్య కుష్ఠస్య నలదస్య చ ।
తురో భగస్య హస్తాభ్యామనురోధనముద్భరే ॥ 3 ॥

పదము

ఆఽఅఞ్జనస్య । మదుఘస్య । కుష్ఠస్య । నలదస్య । చ ।
తురః । భగస్య । హస్తాభ్యామ్ । అనుఽరోధనమ్ । ఉత్ । భరే ॥3॥

అనువాదం

అంజనమునకు, మధుకమునకు, కుష్ఠమునకు,
నలదము (వట్టివేరు) నకు – వీటికి సంబంధించిన
అనురోధనంతో త్వరపడుతున్న భగదేవుని
హస్తములతో నేను నీ అంగాన్ని అనులేపనం చేస్తాను ॥ 3 ॥

ఇది నూట రెండవ సూక్తం

ఇది పదవ అనువాకం

## అనువాకం: 11

### సూక్తం - 103

ఋషి: ఉచ్ఛోచనుడు॥ దేవతలు॥ మంత్రాలలో పేర్కొన్న బృహస్పతి మొద
లగువారు॥ ఛందస్సు అనుష్టుప్॥ మంత్రములు. ॥ ౮ ॥

వినియోగం - సంగ్రామ జయకర్మలో పాశప్రక్షేపప్రక్రియలో దీనికి వినియోగం.

మంత్రము

సందానం వో బృహస్పతిః సందానం సవితా కరత్ ।
సందానం మిత్రో అర్యమా సందానం భగో అశ్వినా ॥ 1 ॥

పదము

సమ్ఽదానమ్ । వః । బృహస్పతిః । సమ్ఽదానమ్ । సవితా ।
కరత్ ।
సమ్ఽదానమ్ । మిత్రః । అర్యమా । సమ్ఽదానమ్ । భగః ।
అశ్వినా ॥ 1 ॥

అనువాదం

శత్రుసేనలారా! బృహస్పతి దేవుడు
మిమ్ములను బంధించు గాక!
అలాగే సవిత మిమ్ములను బంధించుగాక!
మిత్రుడు అర్యముడు బంధించుగాక!
భగుడు, అశ్వినీదేవతలు బంధింతురు గాక! ॥ 1 ॥

మంత్రము

సం పరమాత్స్వమవ మానథో సం ద్యామి మధ్యమాన్ ।

ఇన్ద్రస్తాన్ పర్యహార్దామ్నా తానగ్నే సం ద్యా త్వమ్ ॥ 2 ॥

పదము

సమ్ । పరమాన్ । సమ్ । అవమాన్ । అథో ఇతి । సమ్ । ద్యామి। మధ్యమాన్ ।

ఇన్ద్రః । తాన్ । పరి । అహాః । దామ్నా । తాన్ । అగ్నే । సమ్ । ద్య । త్వమ్ ॥ 2 ॥

అనువాదం .

ఉత్కృష్టమైన శత్రుసేనను పాశములతో నేను బంధిస్తున్నాను
అపకృష్టమైన పరసేనను బంధిస్తున్నాను
అటూ ఇటూ గాని సేనను బంధిసున్నాను
ఆ సేనాపతులను ఇంద్రుడు పరిహరించుగాక!
ఓ అగ్నీ! ఆ పరిహృత శత్రువులను
పాశములతో నీవు బంధింతువు గాక! ॥ 2 ॥

మంత్రము :

అమీ యే యుధమాయన్తి కేతూన్ కృత్వానీకశః ।
ఇన్ద్రస్తాన్ పర్యహార్దామ్నా తానగ్నే సం ద్యా త్వమ్ ॥ 3 ॥

పదము

అమీ ఇతి । యే । యుధమ్ । ఆఽయన్తి । కేతూన్ । కృత్వా । అనీకఽశః ।

ఇన్ద్రః । తాన్ । పరి । అహాః । దామ్నా । తాన్ । అగ్నే । సమ్ । ద్య । త్వమ్ ॥ 3 ॥

**అనువాదం**

ఆ దూరంగా కనపడే శత్రువులు
యుద్ధం చేయుటకై వస్తున్నారు
గుంపులుగా ధ్వజములను కట్టుకొనివచ్చి, యుద్ధం చేస్తారు.
ఇంద్రుడు వారిని పరిహరించుగాక!
ఓ అగ్నీ! ఆ పరిహృత శత్రువులను
పాశములతో నీవు బంధించుదువు గాక! ॥ 3 ॥

ఇది నూట మూడవ సూక్తం

## సూక్తం 104

ఋషి. ప్రశోచనుడు॥ దేవతలు: 1,2 ఇంద్రాగ్నులు: 3 ఇంద్రాగ్నులు, సోముడు, మరియు ఇంద్రుడు॥ ఛందస్సు. అనుష్టుప్॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం — సంగ్రామ జయ కర్మలో పాశప్రక్షేప ప్రక్రియలో దీనికి వినియోగం,

మంత్రము

ఆదానేన సందానేనామిత్రానా ద్యామసి ।
అపానా యే చైషాం ప్రాణా అసునాసూన్త్సమచ్ఛిదన్ ॥1॥

పదము .

ఆఽదానేన । సమ్ఽదానేన । అమిత్రాన్ । ఆ । ద్యామసి ।
అపానాః । యే । చ । ఏషామ్ । ప్రాణాః । అసునా । అసూన్ ।
సమ్ । అచ్ఛిదన్ ॥ 1 ॥

**అనువాదం**

శత్రువులను ఆదానంతో
సందానంతో (బంధనంతో) బంధిస్తున్నాము.

శత్రువుల అంతర్ముఖములైన ప్రాణవాయువులు,
బహిర్ముఖములైన శ్వాస వృత్తులు — వాటిని
ప్రాణంతో పూర్తిగా విచ్ఛిన్నం చేస్తున్నాను ॥ 1 ॥

మంత్రము .

ఇదమాదానమకరం తపసేన్ద్రేణ సంశితమ్ ।
అమిత్రా యేఽత్ర నః సన్తి తానగ్న ఆ ద్యా త్వమ్ ॥2॥

పదము .

ఇదమ్ । ఆఽదానమ్ । అకరమ్ । తపసా । ఇన్ద్రేణ । సమ్ఽశితమ్
అమిత్రాః । యే । అత్ర । నః । సన్తి । తాన్ । అగ్నే । ఆ । ద్య।
త్వమ్ ॥ 2 ॥

అనువాదం

ఈ పాశయంత్రాన్ని అభిచార కర్మోక్త
నియమ విశేషంతో చేస్తున్నాను
ఇంద్రునితో తీక్ష్ణీకృతమైన ఈ యుద్ధంలో
మా కున్న శత్రువులను ఓ అగ్నీ !
నీవు పాశయంత్రంతో పరిగ్రహించు. ॥ 2 ॥

మంత్రము

ఐనాన్ ద్యతామిన్ద్రాగ్నీ సోమో రాజా చ మేదినా ।
ఇన్ద్రో మరుత్వానాదానమమిత్రేభ్యః కృణోతు నః ॥ 3 ॥

పదము

ఆ । ఏనాన్ । ద్యతామ్ । ఇన్ద్రాగ్నీ ఇతి । సోమః । రాజా । చ ।
మేదినా ।

ఇన్ద్రః । మరుత్వాన్ । ఆఽదానమ్ । అమిత్రేభ్యః । కృణోతు ।
నః । ॥ 3 ॥

అనువాదం

ఇంద్రాగ్నులు మా హవిస్సుతో మత్తెక్కి,
మా శత్రువులను బంధింతురు గాక !
అలాగే రాజైనసోముడు బంధించు గాక !
మరుద్గణ యుక్తుడైన ఇంద్రుడును మమ్ములను
శత్రువుల నుంచి అబంధనం చేయుగాక ! ॥ 3 ॥

ఇది నూట నాల్గవ సూక్తం

## సూక్తం - 105

ఋషి. ఉన్మోచనుడు ॥ దేవత కాస ॥ ఛందస్సు. అనుష్టుప్ ॥ మంత్రములు; ॥ 3 ॥

వినియోగం :- కాసశ్లేష్మాది రోగశమనార్థం పేలపిండిని అభిమంత్రించి భక్షించుటలోను, అలాగే ఉదకాన్ని అభిమంత్రించి త్రాగడంలోను, అలాగే సూర్యుని ప్రార్థించుటలోను దీనికి వినియోగం.

మంత్రము :

యథా మనో మనస్కేతైః పరాపతత్యాశుమత్ ।
ఏవా త్వం కాసే ప్ర పత మనసోను ప్రవాయ్యమ్ ॥1॥

పదము,

యథా । మనః । మనఃఽకేతైః । పరాఽపతతి । ఆశుఽమత్ ।
ఏవ । త్వమ్ । కాసే । ప్ర । పత । మనసః । అను । ప్రఽవా
య్యఽమ్ ॥ 1 ॥

**అనువాదం**

మనస్సుతో తెలుసు కొన్న విషయములతో పాటు
అంతఃకరణం త్వరగా ధ్రువమండలంవఱకు పరాఙ్ముఖమై
వెడుతుంది ఇట్లే ఓ కాసశ్లేష్మరోగాత్మకమైన పిశాచీ!
నీవు మనోవేగంతో పరువెత్తు
(ఇతనిని వదలి చాలా దూరం వెళ్ళిపో) ॥ 1 ॥

**మంత్రము.**

**యథా బాణః సుసంశితః పరాపతత్యాశుమత్ ।**

**ఏవా త్వం కాసే ప్ర పత పృథివ్యా అను సంవతమ్ ॥2॥**

**పదము.**

**యథా । బాణః । సుऽసంశితః । పరాऽపతతి । ఆశుऽమత్ ।**

**ఏవ । త్వమ్ । కాసే । ప్ర । పత । పృథివ్యాః । అను । సమ్ ऽవతమ్ ॥ 2 ॥**

**అనువాదం:**

బాగా పదును బెట్టిన బాణం విముక్తమై
త్వరగా భూమిని ఛేదించుకొని వెడుతుంది.
ఇట్లే ఓ కాసా! నీవు బాణం తగిలిన
భూప్రదేశాన్ని అనులక్షించి పరువెత్తు. ॥ 2 ॥

**మంత్రము**

**యథా సూర్యస్య రశ్మయః పరాపతన్త్యాశుమత్ ।**

**ఏవా త్వం కాసే ప్ర పత సముద్రస్యాను విక్షరమ్ ॥ 3 ॥**

పదము:

యథా । సూర్యస్య । రశ్మయః । పరాఽపతన్తి । ఆశుఽమత్ ।

ఏవ । త్వమ్ । కాసే । ప్ర । పత । సముద్రస్య । అను । విఽక్షరమ్

॥ 3 ॥

అనువాదం :

సూర్యకిరణాలు ఉదయించగానే పైకెలావెళ్ళి
తిరిగి వస్తాయో, ఇట్లే ఓ కాసా! నీవు సముద్రం
ప్రవహించే ప్రదేశాన్ని అనులక్షించి వెళ్ళు. ॥ 3 ॥

ఇది నూట ఐదవ సూక్తం

## సూక్తం-106

ఋషి: ప్రమోచనుడు ॥ దేవతలు దూర్వ, శాల ॥ ఛందస్సు. అనుష్టుప్॥
మంత్రములు ॥ 3 ॥

వినియోగం - ఇళ్ళుమొదలైనవి కాలిపోకుండగ ఇంటిమధ్యలో గుంటత్రవ్వి నీటితోనింపి, నాచును ఇంటిపైన అభిమంత్రించి వేయడంలో దీనికి వినియోగం.

మంత్రము :

ఆయనే తే పరాయణే దూర్వా రోహన్తు పుష్పిణీః ।

ఉత్సో వా తత్ర జాయతాం హ్రదో వా పుణ్డరీకవాన్ ॥ 1 ॥

పదము

ఆఽఅయనే । తే । పరాఽఅయనే । దూర్వాః । రోహన్తు ।

పుష్పిణీః ।

ఉత్సః । వా । తత్ర । జాయతామ్ । హ్రదః । వా । పుణ్డరీక

ఽవాన్ ॥ 1 ॥

**అనువాదం.**

ఓ అగ్ని ! నీకు అభిముఖంగాను,
పరాఙ్ముఖంగాను మా దేశంలో
పుష్పయుక్తమైన గరిక మొలుచు గాక !
ఆ ప్రదేశంలో ఉదకస్రవణం ఉత్పాద్య మగుగాక !
లేదా తామరలున్న కొలను అగుగాక ! ॥ 1 ॥

మంత్రము

అపామిదం న్యయనం సముద్రస్య నివేశనమ్ ।

మధ్యే హ్రదస్య నో గృహాః పరాచీనా ముఖా కృధి ॥2॥

పదము

అపామ్ । ఇదమ్ । నిఽఅయనమ్ । సముద్రస్య । నిఽవేశనమ్ ।

మధ్యే । హ్రదస్య । నః । గృహాః । పరాచీనా । ముఖా । కృధి ॥2॥

**అనువాదం.**

ఈ మా ఇల్లు ఉదకములకు నివాసస్థానమగుగాక !
సముద్రానికి నిరూపస్థాన మగుగాక !
తటాకాదుల మధ్యంలో మాకు గృహము లేర్పడుగాక !
ఓ అగ్ని ! నీవు జ్వాలారూపములైన ముఖములను
పరాఙ్ముఖములను చేసుకో. ॥ 2 ॥

మంత్రము

హిమస్య త్వా జరాయుణా శాలే పరి వ్యయామసి ।

శీతహ్రదా హి నో భువోఽగ్నిష్కృణోతు భేషజమ్ ॥ 3 ॥

పదము

హిమస్య । త్వా । జరాయుణా । శాలే । పరి । వ్యయామసి ।

శీతఽహ్రదా । హి । నః । భువః । అగ్నిః । కృణోతు । భేషజమ్

॥ 3 ॥

అనువాదం .

ఓశాలా! హిమ జరాయువుతో ఆవేష్టించు.
నిన్ను నాచుతో పరివేష్టింప జేస్తున్నాము.
మాకు నీవు శీతల తటాక యుక్తవగుదువు గాక!
అగ్ని గృహాదులు కాలిపోకుండా భేషజం చేయుగాక! ॥ 3 ॥

ఇది నూట ఆరవ సూక్తం

## సూక్తం—107

ఋషి శన్తాతి॥ దేవత. విశ్వజిత్ ॥ ఛందస్సు: అనుష్టుప్ ॥ మంత్రములు. ॥4॥

వినియోగం - ఈ సూక్తం బృహద్గణంలోనిది గనుక శాంత్యుదకాది మంత్రగణాదులలో దీనికి వినియోగం. అలాగే స్వస్త్యయనకర్మలో చేసే హోమంలో దీనికి వినియోగం.

మంత్రము :

విశ్వజిత్ త్రాయమాణాయై మా పరి దేహి

త్రాయమాణే ద్విపాచ్చ సర్వం నో రక్ష

చతుష్పాద్ యచ్చ నః స్వమ్ ॥ 1 ॥

పదము :

విశ్వఽజిత్ । త్రాయమాణాయై । మా । పరి । దేహి ।

త్రాయమాణే । ద్వి౽పాత్ । చ । సర్వమ్ । నః । రక్ష ।

చతుః౽పాత్ । యత్ । చ । నః । స్వమ్ ॥ 1 ॥

అనువాదం.

విశ్వజిత్ అను సంజ్ఞగల దేవా!
జగత్పాలనాధిదేవతకు స్వస్త్యయన కాముడనైన నన్ను
రక్షణార్థమై అప్పగించు. ఆయన మాకు స్వభూతము,
పాద ద్వయోపేతము అయిన పుత్ర భృత్యాదికమును
పాలించుగాక! అలాగే మాకు స్వభూతము,
పాద చతుష్టయోపేతము అయిన దానిని రక్షించుగాక! ॥1॥

మంత్రము.

త్రాయమాణే విశ్వజితే మా పరి దేహి ।

విశ్వజిత్ ద్విపాచ్చ సర్వం నో రక్ష

చతుష్పాద్ యచ్చ నః స్వమ్ ॥ 2 ॥

పదము.

త్రాయమాణే । విశ్వ౽జితే । మా । పరి । దేహి ।

విశ్వ౽జిత్ । ద్వి౽పాత్ । చ । సర్వమ్ । నః । రక్ష ।

చతుః౽పాత్ । యత్ । చ । నః । స్వమ్ ॥ 2 ॥

అనువాదం.

జగత్పాలనాధిదేవతా!
విశ్వజిత్తునకు నన్ను అర్పించు.

విశ్వజిత్తు మాకు స్వభూతము, పాదద్వయోపేతము అయిన
పుత్రభృత్యాదికమును పాలించుగాక!
అలాగే మాకు స్వభూతము,
పాదచతుష్టయోపేతము అయిన దానిని రక్షించుగాక! ॥ 2 ॥

మంత్రము

విశ్వజిత్ కల్యాణ్యై౽మా పరి దేహి ।
కల్యాణి ద్విపాచ్చ సర్వం నో రక్ష
చతుష్పాద్ యచ్చ నః స్వమ్ ॥ 3 ॥

పదము

విశ్వ౽జిత్ । కల్యాణ్యై౽ । మా । పరి । దేహి ।
కల్యాణి । ద్వి౽పాత్ । చ । సర్వమ్ । నః । రక్ష ।
చతుః౽పాత్ । యత్ । చ । నః । స్వమ్ ॥ 3 ॥

అనువాదం

ఓ విశ్వజిత్తూ! సర్వమంగళకారిణి అయిన దేవతకు నన్ను
అప్పగించు ఓ కల్యాణీ! నీవు మా స్వభూతము,
పాదద్వయోపేతము అయిన పుత్రభృత్యాదికమును
పాలించు అలాగే మా స్వభూతము
పాదచతుష్టయోపేతము అయిన దానిని రక్షించు. ॥ 3 ॥

మంత్రము.

కల్యాణి సర్వవిదే మా పరి దేహి ।
సర్వవిద్ ద్విపాచ్చ సర్వం నో రక్ష

చతుష్పాద్ యచ్ఛ నః స్వమ్ ॥ 4 ॥

పదము

కల్యాణి । సర్వఽవిదే । మా । పరి । దేహి ।

సర్వఽవిత్ । ద్విఽపాత్ । చ । సర్వమ్ । నః । రక్ష ।

చతుఃఽపాత్ । యత్ । చ । నః । స్వమ్ ॥ 4 ॥

అనువాదం.

ఓ కల్యాణీ! సర్వకార్యజాత విదుడైన
దేవునకు నన్ను అర్పించు.
ఓ సర్వవేత్తా! నీవు మా స్వభూతము,
పాదద్వయోపేతము అయిన
పుత్ర భృత్యాదికమును పాలించు.
అలాగే మా స్వభూతము, పాద చతుష్టయోపేతము
అయిన దానిని రక్షించు ॥ 4 ॥

ఇది నూట ఏడవ సూక్తం

## సూక్తం - 108

ఋషి శౌనకుడు॥ దేవతలు: 1-3,5 మేధస్సు: 4 అగ్ని॥ ఛందస్సు: 1,4,5 అనుష్టుప్ 2 ఉరోబృహతి; 3 పథ్యాబృహతి॥ మంత్రములు ॥ 5 ॥

వినియోగం :- మేధాజనన కర్మలో దీనికి వినియోగం. అదేకర్మలో ఈ సూక్తంతో ఆదిత్యుని ఉపాసించాలి. అట్లే ఉపనయన కర్మలో దీనితో అగ్నిని ఉపాసించాలి.

మంత్రము

త్వం నో మేధే ప్రథమా గోభిరశ్వేభిరా గహి ।

త్వం సూర్యస్య రశ్మిభిస్త్వం నో అసి యజ్ఞియా ॥ 1 ॥

పదము,

త్వమ్ । నః । మేధే । ప్రథమా । గోభిః । అశ్వేభిః । ఆ । గహి ।

త్వమ్ । సూర్యస్య । రశ్మిఽభిః । త్వమ్ । నః । అసి । యజ్ఞియా ॥ 1 ॥

అనువాదం

ఓ మేధా! ముఖ్యురాలా!
నీవు మాకివ్వవలసిన గోవులతో, అశ్వములతో మా వద్దకు రా!
ఓ మేధా! నీవు సూర్యుని సర్వవ్యాపక
కిరణాలవలె మా వద్దకు రా!
ఓ మేధా! నీవు మాకు యజ్ఞార్హవు.
మేం మిచ్చిన హవిస్సుతో ప్రీతురాలవై రమ్ము ॥ 1 ॥

మంత్రము

మేధామహం ప్రథమాం బ్రహ్మణ్వతీం బ్రహ్మజూతా
మృషిష్టుతామ్ ।
ప్రపీతాం బ్రహ్మచారిభిర్దేవానామవసే హువే ॥ 2 ॥

పదము

మేధామ్ । అహమ్ । ప్రథమామ్ । బ్రహ్మణ్ఽవతీమ్ । బ్రహ్మఽజూతామ్ । ఋషిఽస్తుతామ్ ।
ప్రఽపీతామ్ । బ్రహ్మచారిఽభిః । దేవానామ్ । అవసే । హువే ॥ 2 ॥

అనువాదం :

మేధాకాముడనైన నేను ముఖ్యదేవత అయిన
మేధను ఆహ్వానిస్తున్నాను.
ఆమె బ్రాహ్మణ సేవిత ఋషిస్తుతి పాత్రురాలు
దేవతల రక్షణార్థమై బ్రహ్మచారులచే సేవితురాలైనది ॥2॥

మంత్రము

యాం మేధామృభవో విదుర్యాం మేధామసురా విదుః ।
ఋషయో భద్రాం మేధాం యాం విదుస్తాం మయ్యా
వేశయామసి ॥ 3 ॥

పదము

యామ్ । మేధామ్ । ఋభవః । విదుః । యామ్ । మేధామ్ ।
అసురాః । విదుః ।
ఋషయః । భద్రామ్ । మేధామ్ । యామ్ । విదుః । తామ్ ।
మయి । ఆ । వేశయామసి ॥ 3 ॥

అనువాదం

దేవులు ఏ మేధను ఎఱుగుదురో,
దానవులు ఏ మేధను ఎఱుగుదురో,
వేదశాస్త్రాది విషయకమయిన ఏ మేధను
ఋషులు ఎఱుగుదురో ఆ మేధను సాధకుడనైన
నాయందు వారు ఆవేశింప జేయుదురు గాక! ॥ 3 ॥

మంత్రము

యామృషయో భూతకృతో మేధాం మేధావినో విదుః ।

తయా మామద్య మేధయాగ్నే మేధావినం కృణు ॥ 4 ॥

పదము

యామ్ । ఋషయః । భూత౽కృతః । మేధామ్ । మేధావినః । విదుః ।

తయా । మామ్ । అద్య । మేధయా । అగ్నే । మేధావినమ్ । కృణు ॥ 4 ॥

**అనువాదం.**

మంత్ర ద్రష్టలు, పృథివ్యాది భూతములను
సృష్టింపగల కశ్యపాది మేధావులు
ఏ మేధను ఎఱుగుదురో, ఓ అగ్నీ !
ఆ మేధతో ఇప్పుడు నన్ను మేధావినిగా చెయ్యి ॥ 4 ॥

మంత్రము

మేధాం సాయం మేధాం ప్రాతర్మేధాం మధ్యన్దినం పరి ।
మేధాం సూర్యస్య రశ్మిభిర్వచసా వేశయామహే ॥ 5 ॥

పదము

మేధామ్ । సాయమ్ । ప్రాతః । మేధామ్ । మధ్యన్దినమ్ । పరి ।

మేధామ్ । సూర్యస్య । రశ్మి౽భిః । వచసా । ఆ । వేశయామహే ॥ 5 ॥

**అనువాదం**

సాయం కాలం మేధను స్తుతిస్తున్నాను.
ప్రాతః కాలం మేధను స్తుతిస్తున్నాను

మధ్యాహ్నకాలం మేధను భజిస్తున్నాను
సూర్యరశ్మలతో పాటు రోజల్లా
శ్రుతిరూపమైన వాక్యంతో ఆ మేధను
నాలో ఆవహింప జేసుకుంటున్నాను. ॥ 5 ॥

ఇది నూట ఎనిమిదవ సూక్తం

## సూక్తం – 109

ఋషి: అథర్వుడు ॥ దేవత పిప్పలీ ॥ ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు .॥3॥
వినియోగం :– ధనుర్వాత, క్షిప్తవాతాదికృత్స్నవాతవ్యాధిశాంత్యర్థం చేసే జపంలో దీనికి వినియోగం.

మంత్రము

**పిప్పలీ క్షిప్తభేషజ్యూతాతివిద్ధభేషజీ ।**
**తాం దేవాః సమకల్పయన్నియం జీవితవా అలమ్ ॥ 1 ॥**

పదము

**పిప్పలీ । క్షిప్తఽభేషజీ । ఉత । అతివిద్ధఽభేషజీ ।**
**తామ్ । దేవాః । సమ్ । అకల్పయన్ । ఇయమ్ । జీవితవై ।**
**అలమ్ ॥ 1 ॥**

అనువాదం:

*పిప్పలి అనే ఓషధి ఇతర ఔషధాలలో ఉత్తమం.
అదిగాక, ఇతర ఓషధుల నన్నిటిని త్రోసి రాజన్నది
ఆ పిప్పలిని ఇంద్రాదులు అమృతమథన
సమయంలో బయటకు లాగినారు
ఈ ఓషధి ఒక్కటే జీవింపజేయడానికి సమర్థమైనది. ॥ 1 ॥

---

* పిప్పలి : A berry, Piper Longum

మంత్రము

పిప్పల్య1ః సమవదన్తాయతీర్జననాదధి ।

యం జీవమశ్నవామహై న స రిష్యాతి పూరుషః ॥ 2 ॥

పదము

పిప్పల్యఽః । సమ్ । అవద న్త । ఆఽయతీః । జననాత్ । అధి ।

యమ్ । జీవమ్ । అశ్నవామహై । న । సః । రిష్యాతి । పురుషః

॥ 2 ॥

అనువాదం

గజపిప్పలి మొదలైన ఓషధులు
అవి పుట్టిన మొదలు పరస్పరం సంభాషిస్తున్నవి.
"ఏ జీవి మనలను ఔషధంగా సేవిస్తాడో
ఆ పురుషుడు వినాశం చెందకుండు గాక!" ॥ 2 ॥

మంత్రము

అసురాస్త్వా న్యఽఖనన్ దేవాస్త్వోదవపన్ పునః ।

వాతీకృతస్య భేషజీమథో క్షిప్తస్య భేషజీమ్ ॥ 3 ॥

పదము

అసురాః । త్వా । ని । అఖనన్ । దేవాః । త్వా । ఉత్ । అవపన్ ।

పునః ।

వాతీఽకృతస్య । భేషజీమ్ । అథో ఇతి । క్షిప్తస్య । భేషజీమ్ ॥ 3 ॥

అనువాదం.

ఓ పిప్పలీ! నిన్ను అసురులు పూడ్చి పెట్టినారు
దేవతలు నిన్ను తిరిగి సర్వప్రాణిహితం కోసం
త్రవ్వి వెలికి తీసినారు వాతరోగ పీడితమైన
శరీరానికి నీవు ఔషధభూతమైన దానివి.
మూర్ఛ రోగం వంటి వాతరోగ విశేషాలను నివర్తించేదానవు

॥ 3 ॥

ఇది నూట తొమ్మిదవ సూక్తం

## సూక్తం – 110

ఋషిః అథర్వుడు॥ దేవతః అగ్ని॥ ఛందస్సు–1 పంక్తి. 2, 3 త్రిష్టుప్॥
మంత్రములు ॥ 3 ॥

వినియోగం:–పాపనక్షత్రజాత సంతానదోష నివృత్త్యర్థం చేసే ప్రక్రియలలో
దీనికి వినియోగం

మంత్రము

ప్రత్నో హి కమీడ్యో అధ్వరేషు
సనాచ్చ హోతా నవ్యశ్చ సత్సి।
స్వాం చాగ్నే తన్వం2 పిప్రాయస్వాస్మభ్యం
చ సౌభగమా యజస్వ ॥ 1 ॥

పదము

ప్రత్నః। హి। కమ్। ఈడ్యః। అధ్వరేషు। సనాత్। చ। హోతా
నవ్యః। చ। సత్సి।

స్వామ్ । చ । అగ్నే । తన్వ౨మ్ । పిప్రాయస్వ । అస్మభ్యమ్ ।
చ । సౌభగమ్ । ఆ । యజస్వ ॥1॥

**అనువాదం:**

సర్వ దేవాత్మకుడైన ఈ అగ్ని అతి పురాతనుడు.
అందుకే స్తవనీయుడు. యజ్ఞములలో చిరంతనుడు.
దేవతలను ఆహ్వానించే వాడు. ఓ అగ్ని!
ఇలాంటి నీవు నవహోతవై వేదికపై నున్నావు.
నీ శరీరాన్ని ఆజ్యాది హవిస్సులతో పూరించు.
సౌభాగ్య కరమైన ధనాన్ని ప్రసాదించు. ॥ 1 ॥

**మంత్రము:**

జ్యేష్ఠఘ్న్యాం జాతో విచృతోర్యమస్య
మూలబర్హణాత్ పరి పాహ్యేనమ్ ।
అత్యేనం నేషద్ దురితాని విశ్వా
దీర్ఘాయుత్వాయ శత శారదాయ ॥ 2 ॥

**పదము:**

జ్యేష్ఠ౨ఘ్న్యామ్ । జాతః । వి౨చృతోః । యమస్య ।
మూల౨బర్హణాత్ । పరి । పాహి । ఏనమ్ ।
అతి । ఏనమ్ । నేషత్ । దుః౨ఇతాని । విశ్వా ।
దీర్ఘాయు౨త్వాయ । శత౨శారదాయ ॥ 2 ॥

అనువాదం:

జ్యేష్ఠానక్షత్రమునందు పుట్టిన పుత్రుడు
పితృభ్రాతాల హంత అవుతాడు
మూలా నక్షత్రంలో పుట్టిన పుత్రుడు
సర్వవంశనాశకుడు అవుతాడు.
కాబట్టి పాపనక్షత్రంలో పుట్టిన ఈ కుమారుని
నీ తాన మూలో ఛ్ఛదనం నుంచి సర్వతః కాపాడు.
ఈ పుత్రుని సర్వ దురితములు అంటకుండుగాక!
శతవత్సర దీర్ఘాయువును ఇతడు పొందుగాక! ॥ 2 ॥

మంత్రము

వ్యాఘ్రేఽహ్న్యజనిష్ట వీరో నక్షత్రజా జాయమానః సువీరః

స మా వధీత్ పితరం వర్ధమానో మా మాతరం ప్ర

మినీజ్జనిత్రీమ్ ॥ 3 ॥

పదము

వ్యాఘ్రే । అహ్ని । అజనిష్ట । వీరః । నక్షత్రఽజాః । జాయ
మానః । సుఽవీరః ।

సః । మా । వధీత్ । పితరమ్ । వర్ధమానః । మా । మాతరమ్ ।

ప్ర । మినీత్ । జనిత్రీమ్ ॥ 3 ॥

అనువాదం

క్రూరమైన పాపనక్షత్రంలో పుత్రుడు పుట్టినాడు
ఈ నక్షత్రజుడు పుట్టగానే శోభన వీర్యయుక్తుడగుగాక!
పెరిగి తండ్రిని చంపకుండు గాక!
తల్లిని హింసించకుండు గాక! ॥ 3 ॥

ఇది నూట పదవ సూక్తం

# సూక్తం-111

ఋషి అథర్వుడు. దేవత : అగ్ని॥ ఛందస్సు 1 పరానుష్టుప్ త్రిష్టుప్॥ 2-4 అనుష్టుప్॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం - ఈ సూక్తం మాతృనామగణం లోనిది, గనుక వాటికి సంబంధించిన అన్నిటిలో దీనికి వినియోగం గన్ధర్వ, రాక్షస, అప్సరో భూత గ్రహాదిపీడా శాంతికి చేసే హోమాదులలో దీనికివినియోగం.

మంత్రము

ఇమం మే అగ్నే పురుషం ముముగ్ధ్యయం

యో బద్ధః సుయతో లాలపీతి ।

అతోధి తే కృణవద్ భాగధేయం

యదానున్మదితోఽసతి ॥ 1 ॥

పదము

ఇమమ్ । మే । అగ్నే । పురుషమ్ । ముముగ్ధి । అయమ్ ।

యః । బద్ధః । సుఽయతః । లాలపీతి ।

అతః । అధి । తే । కృణవత్ । భాగఽధేయమ్ ।

యదా । అనుత్ఽమదితః । అసతి ॥ 1 ॥

అనువాదం .

ఓ అగ్నీ ! నా ఈ పురుషుని రోగనిదాన
భూతమైన పాపం నుండి విముక్తి చెందించు.
ఈ పురుషుడు పాపపాశబద్ధుడై నిరుద్ధగతియై విలపిస్తున్నాడు

అందువల్ల ఓ అగ్నీ! నీ హవిర్భాగాన్ని అధికం చేయుగాక! ఈ
ఇతను ఉన్మాదరహితు డగుగాక! ॥ 1 ॥

మంత్రము

అగ్నిష్టే ని శమయతు యది తే మన ఉద్యుతమ్ ।
కృణోమి విద్వాన్ భేషజం యథానున్మదితోఽససి ॥ 2 ॥

పదము

అగ్నిః । తే । ని । శమయతు । యది । తే । మనః । ఉత్ఽ
యుతమ్ ।
కృణోమి । విద్వాన్ । భేషజమ్ । యథా । అనుత్ఽమదితః ।
అససి ॥ 2 ॥

అనువాదం,

ఓ గంధర్వగ్రహ పీడితుడా!
నిన్ను అగ్ని ఉన్మాదరహితునిగా చేయుగాక!
నీ మనస్సు గ్రహవికారంతో ఉద్భ్రాంతమై ఉన్నది.
దానిని ఎఱిగిన నేను ఔషధం ఇస్తున్నాను
ఆ వికారం తొలగిపోయి నీవు
ఉన్మాదరహితుడ వగుదువు గాక! ॥ 2 ॥

మంత్రము

దేవైనసాదున్మదితమున్మత్తం రక్షసస్పరి ।
కృణోమి విద్వాన్ భేషజం యదానున్మదితోఽసతి ॥ 3 ॥

పదము .

దేవఽఏనసాత్ । ఉత్ఽమదితమ్ । ఉత్ఽమ త్తమ్ । రక్షసః । పరి।

కృణోమి । విద్వాన్ । భేషజమ్ । యదా । అనుత్ఽమదితః ।

అసతి ॥ 3 ॥

అనువాదం:

దేవ పాపంతో ఉన్మాదితు డగునట్లు
బ్రహ్మరక్షోది గ్రహములు ఆవేశించడంతో
ఉన్మత్తుడై ఉన్న ఇతనిని సమీపించి
దానికి విరుగడు తెలిసిన నేను వైద్యం చేస్తున్నాను
దానితో ఇతడు ఉన్మాదరహితు డగుగాక! ॥ 3 ॥

మంత్రము

పునస్త్వా దురప్సరసః పున రిన్ద్రః పునర్భగః ।

పునస్త్వా దుర్విశ్వే దేవా యథానున్మదితః ఽసతి ॥ 4 ॥

పదము

పునః । త్వా । దుః । అప్సరసః । పునః । ఇన్ద్రః । పునః । భగః।

పునః । త్వా । దుః । విశ్వే । దేవాః । యథా । అనుత్ఽమదితః ।

అసతి ॥ 4 ॥

అనువాదం.

ఓ ఉన్మత్తుడైన పురుషుడా!
నిన్ను అప్సరసలు ఉన్మాదపరిహారార్థం మాకు అప్పగించినారు
ఇంద్రుడు తిరిగి నిన్ను ఇచ్చినాడు
భగుడు ఇచ్చినాడు

సర్వదేవతలు మాకు పునర్దానం చేసినారు
ఇందుతో నీవు ఉన్మాదరహితుడవగుదువుగాక! ॥ 4 ॥

ఇది నూట పదకొండవ సూక్తం

## సూక్తం - 112

ఋషిః అథర్వుడు॥ దేవత అగ్ని॥ ఛందస్సు త్రిష్టుప్॥ మంత్రములు: ॥3॥
వినియోగం - పరివిత్తి, పరివేత్తృ ప్రాయశ్చిత్తార్థం చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం.

మంత్రము॥

మా జ్యేష్ఠం వధీదయ మగ్న ఏషాం
మూలబర్హణాత్ పరి పాహ్యేనమ్ ।
స గ్రాహ్యాః పాశాన్ వి చృత
ప్రజానన్ తుభ్యం దేవా అను జానన్తు విశ్వే ॥ 1 ॥

పదము

మా । జ్యేష్ఠమ్ । వధీత్ । అయమ్ । అగ్నే । ఏషామ్ ।
మూలఽబర్హణాత్ । పరి । పాహి । ఏనమ్ ।
సః । గ్రాహ్యాః । పాశాన్ । వి । చృత ।
ప్రఽజానన్ । తుభ్యమ్ । దేవాః । అను । జానన్తు । విశ్వే ॥ 1 ॥

అనువాదం

ఓ అగ్నీ! ఇతడు తన బంధువుల మధ్య
అన్నను చంపకుండుగాక!
మూలోచ్ఛేదనం నుంచి ఇతనిని పరిపాలించు

ఓ అగ్నీ! విమోచనోపాయ మెఱిగిన నీవు
గ్రహణశీలయైన పిశాచి పాశములను విడిపించు.
విమోచన కారకమైన నీకు సర్వ దేవతలు అనుజ్ఞ నిత్తురుగాక!
॥ 1 ॥

మంత్రము :

ఉన్ముఞ్చ పాశాంస్త్వమగ్న ఏషాం

త్రయ స్త్రిభి రుత్సితా యేభిరాసన్ ।

స గ్రాహ్యాః పాశాన్ వి చృత ప్రజానన్

పితాపుత్రౌ మాతరం ముఞ్చ సర్వాన్ ॥ 2 ॥

పదము

ఉత్ । ముఞ్చ । పాశాన్ । త్వమ్ । అగ్నే । ఏషామ్ ।

త్రయః । త్రిఽభిః । ఉత్సితాః । యేభిః । అసన్ ।

సః । గ్రాహ్యాః । పాశాన్ । వి । చృత । ప్రఽజానన్ ।

పితాపుత్రౌ । మాతరమ్ । ముఞ్చ । సర్వాన్ ॥ 2 ॥

అనువాదం :

ఓ అగ్నీ! ఈ పిత్రాదుల పాశములను విడిపించు
మాతా, పితృ, పుత్రాదులు ముప్పురు
ఈ పాశములచే ఉత్క్రమించి ఉన్నారు.
ఓ అగ్నీ! విమోచనోపాయమెఱిగిన నీవు
గ్రహణశీలయైన పిశాచిపాశములను విడిపించు
ఇతని తల్లి, తండ్రి, కొడుకు మొదలగువారి నందరిని
పరివేదన దోషము నుండి విముక్తి పొందించు. ॥ 2 ॥

మంత్రము

యేభిః పాశైః పరివిత్తో విబద్ధోఽఙ్గేఅఙ్గ ఆర్పిత ఉత్సితశ్చ।
వి తే ముచ్యన్తాం విముచో హి సన్తి
భ్రూణఘ్ని పూషన్ దురితాని మృక్ష్వ ॥ 3 ॥

పదము.

యేభిః। పాశైః। పరిఽవిత్తః। విఽబద్ధః। అఙ్గేఽఅఙ్గే। ఆర్పితః
ఉత్సితః। చ।
వి। తే। ముచ్యన్తామ్। విఽముచః। హి। సన్తి।
భ్రూణఽఘ్ని। పూషన్। దుఃఽఇతాని। మృక్ష్వ ॥ 3 ॥

అనువాదం

జ్యేష్ఠుడు పెళ్ళి చేసికొనక ముందే
పెళ్ళి చేసుకొన్న పురుషుడు
ఏ పాపరూపమైన పాశములతో
ప్రతి అవయవమందు బద్ధుడై,
అర్పుడై ఉన్నాడో, అతడు ఆ పాశముల
నుంచి విమోచనం చెంది ఉత్థితుడగు గాక!
విమోక్తలైన దేవతలు ఆ పని చేయుదురు గాక!
ఓ పూషా! భ్రూణఘ్నీ! భ్రూణహంతను
పరివేదనోద్భవమైన పాపం నుంచి విమోచనం పొందించు.
॥ 3 ॥

ఇది నూట పన్నెండవ సూక్తం

## సూక్తం_113

ఋషిః అథర్వుడు॥ దేవత పూష॥ ఛందస్సు 1,2 త్రిష్టుప్ః 3 పంక్తి॥
మంత్రములుః ॥ 3 ॥

వినియోగం :_ పరివిత్తి, పరివేత్తృ ప్రాయశ్చిత్తార్థం చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం.

మంత్రము

త్రితే దేవా అమృజతైతదేనస్త్రిత

ఏనన్మనుష్యేఽషు మమృజే ।

తతో యది త్వా గ్రాహిరానశే

తాం తే దేవా బ్రహ్మణా నాశయన్తు ॥ 1 ॥

పదము :

త్రితే । దేవాః । అమృజత । ఏతత్ । ఏనః । త్రితః ।

ఏనత్ । మనుష్యేఽషు । మమృజే ।

తతః । యది । త్వా । గ్రాహిః । ఆనశే ।

తామ్ । తే । దేవాః । బ్రహ్మణా । నాశయన్తు ॥ 1 ॥

**అనువాదం.**

పూర్వం దేవతలు పురోడాశాదికమైన హవిస్సును గ్రహించి
తత్పాప సమ్మార్జనార్థం ఇద్దరు ముగ్గురు పురుషులను
అగ్ని ఉదక సంపర్కం వల్ల సృష్టించినారు.
వారిలో ఆ పాపాన్ని ఉంచినారు.

వారు సూర్యాభీత పరంపరలతో
పాపాన్ని నివృష్టం చేసినారు
ఈ పాపం పూర్వం దేవాస్త్రితమనే అస్త్రంలో సృష్టించినారు.
ఆ ముగ్గురూ తమలోని పాపాన్ని
మనుష్యులలో ఉండునట్లు చేసినారు
అందువల్ల ఓ గ్రహపీడితుడా! నిన్ను ఏ గ్రహణశీలయైన
పాపదేవత పట్టుకొన్నదో, దానిని దేవతలు, బ్రాహ్మణులు
మంత్రములతో నాశనం చేయుదురు గాక! ॥ 1 ॥

మంత్రము

మరీచీ ర్ధూమాన్ ప్ర విశాను పాప్మన్నుదారాన్ గచ్ఛోత వా
నీహారాన్ ।

నదీనాం ఫేనాం అను తాన్ వి నశ్య

భ్రూణఘ్ని పూషన్ దురితాని మృక్ష్వ ॥ 2 ॥

పదము

మరీచీః । ధూమాన్ । ప్ర । విశ । అను । పాప్మన్ । ఉత్ఽఆరాన్
గచ్ఛ । ఉత । వా । నీహారాన్ ।

నదీనామ్ । ఫేనాన్ । అను । తాన్ । వి । నశ్య ।

భ్రూణఽఘ్ని । పూషన్ । దుఃఽఇతాని । మృక్ష్వ ॥ 2 ॥

అనువాదం :

ఓ పరవేదన జనిత పాపి!
అగ్ని సూర్యప్రభావిశేషాలను నీలో ప్రవేశింపజేసుకో,

పైకి వెళ్ళిన వానిలో ప్రవేశించు
వాని వల్ల కలిగిన నీహారములను గూర్చి వెళ్ళు
ఓ పాప! నురుగులు గ్రక్కుతూ
ప్రవహిస్తున్న నదులలో ప్రవేశించు
ఓ భ్రూణఘ్ని! భ్రూణహంతను
పరివేదనోద్భవమైన పాపం నుంచి
విమోచనం పొందించు ॥ 2 ॥

మంత్రము

ద్వాదశధా నిహితం త్రితస్యాపమృష్టం మనుష్యైనసాని।
తతో యది త్వా గ్రాహిరానశే తాం తే దేవా బ్రహ్మణా
నాశయన్తు ॥ 3 ॥

పదము

ద్వాదశఽధా । నిఽహితమ్ । త్రితస్య । అపఽమృష్టమ్ । మనుష్య
ఏనసాని ।
తతః । యది । త్వా । గ్రాహిః । ఆనశే । తామ్ । తే । దేవాః ।
బ్రహ్మణా । నాశయన్తు ॥ 3 ॥

అనువాదం

పై ముగ్గురికీ సంబంధించిన ఆ పాపం
పన్నెండు స్థానాలలో స్థాపితమై ఉన్నది.
మొదట దేవతలలో, తరువాత ఆ ముగ్గురిలో,
తరువాత సూర్యాభ్యుదితులైన ఎనమండుగురిలో,
వివిధంగా పన్నెండు స్థానాలలో
ఆ పాపం నిక్షిప్తమై ఉన్నది

ఆ పాపం మనుష్యుని బాధిస్తున్న
ఇటీవలి పాపములతో కలిసి ఉన్నది
అందువల్ల ఓ గ్రహపీడితుడా! నిన్ను
ఏ గ్రహణశీలమైన పాపదేవత పట్టుకొన్నదో
దానిని దేవతలు, బ్రాహ్మణులు
మంత్రములతో నాశం చేయుదురు గాక! ॥ 3 ॥

ఇది నూట పదమూడవ సూక్తం

ఇది పదకొండవ అనువాకం

# అనువాకం – 12

## సూక్తం–114

**ఋషి.** బ్రహ్మ ॥ దేవతలు. విశ్వేదేవులు ॥ ఛందస్సు ॥ అనుష్టుప్ ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం :– సప్తయజ్ఞాలలో బ్రహ్మౌదని కాగ్నియందు చేసే పూర్ణాహుతిలో, అగ్నిష్టోమంలో, తృతీయసవనంలో చేసే ఆదిత్యగ్రహ హోమంలో, సర్వప్రాయశ్చిత్తహోమాలలో దీనికి వినియోగం ఆచార్యుని మరణకాలంలో చేసే ఆజ్యసమిత్పురోడాశాది హోమంలో దీనికి వినియోగం వ్రీహి, యవ, తిలాదులతో ప్రాయశ్చిత్తార్థం చేసే హోమంలో దీనికి వినియోగం. అదే కర్మలో ఈ అనువాకంతో చరుహోమం చేయాలి. అంత్యేష్టిలో చితాగ్నిని వెలిగించిన తరువాత చేసే ఆజ్యహోమంలో దీనికి వినియోగం యామ్యమనే మహాశాంతిలో దీనికి వినియోగం సవయజ్ఞాదులలో చేసే పూర్ణాహుతిలో దీనికివినియోగం దీనిలోని మొదటి రెండు సూక్తాలకు అగ్నిష్టోమంలో, తృతీయ సవనంలో ఆదిత్యగ్రహహోమంలో బ్రహ్మచేసే అనుమంత్రణంలో వినియోగం. అగ్నిష్టోమంలోనే తృతీయ సవనాంతంలో చేసే సర్వప్రాయశ్చిత్త హోమంలో దీనికి వినియోగం

మంత్రము

యద్ దేవా దేవహేడనం దేవాసశ్చకృమా వయమ్ ।
ఆదిత్యాస్తస్మాన్నో యూయమృతస్యర్తేన ముఞ్చత ॥ 1 ॥

పదము

యత్ । దేవాః । దేవఽహేడనమ్ । దేవాసః । చకృమ । వయమ్ ।
ఆదిత్యాః । తస్మాత్ । నః । యూయమ్ । ఋతస్య । ఋతేన ।
ముఞ్చత ॥ 1 ॥

అనువాదం

దేవతలకు కోపం తెప్పించే పాపాన్ని
ఇంద్రియ వశులమై మనం చేసినాము.
ఓ ఆదిత్యులారా! మీరు ఆ పాపం నుంచి
ఋతంతో మమ్ములను విముక్తి పొందించండి. ॥ 1 ॥

మంత్రము ।

ఋతస్యర్తేనాదిత్యా యజత్రా ముఞ్చతేహ నః ।
యజ్ఞం యద్ యజ్ఞవాహసః శిక్షన్తో నోపశేకిమ ॥ 2 ॥

పదము

ఋతస్య । ఋతేన । ఆదిత్యాః । యజత్రాః । ముఞ్చత । ఇహ ।
నః ।
యజ్ఞమ్ । యత్ । యజ్ఞఽవాహసః । శిక్షన్తః । న । ఉపఽశేకిమ
॥ 2 ॥

అనువాదం

ఓ ఆదిత్యులారా! యష్టవ్యులైన మీరు
ఋతంతో ఇక్కడ ఈ కర్మలో
మమ్ములను కర్మాధికార విఘాతకమైన
సర్వపాపముల నుండి విముక్తి పొందించండి
యజ్ఞ నిర్వర్తకులైన దేవతలారా!
మేము యజ్ఞాన్ని చేయదలచి
ఏ పాపం వల్ల అసమర్థుల మౌతున్నామో,
ఆ పాపం నుంచి మమ్ములను విముక్తి పొందించండి. ॥ 2 ॥

మంత్రము

మేదస్వతా యజమానాః స్రుచాజ్యాని జుహ్వతః ।
అకామా విశ్వే వో దేవాః శిక్షన్తో నోప శేకిమ ॥ 3 ॥

పదము

మేదస్వతా । యజమానాః । స్రుచా । ఆజ్యాని । జుహ్వతః ।
అకామాః । విశ్వే । వః । దేవాః । శిక్షన్తః । న । ఉప । శేకిమ ॥3॥

అనువాదం.

మేదస్వతమైన పశువుతో యజమానులు
యాగాన్ని చేస్తూ ఆజ్యాదులను హోమం చేస్తూ
ఆహవనీయాగ్నిలో పడవేస్తూ ఉన్నారు.
ఓ విశ్వేదేవతలారా! మమ్ములను నిష్కాములను చేయండి.
యాగానుష్ఠానం చేయదలచి మేము
ఏ పాపం వల్ల అశక్తుల మౌతున్నామో
ఆ పాపం నుంచి మమ్ములను విముక్తి పొందించండి ॥ 3 ॥

ఇది నూట పదునాల్గవ సూక్తం.

## సూక్తం - 115

ఋషి. బ్రహ్మ॥ దేవతలు. విశ్వేదేవులు॥ ఛందస్సు. అనుష్టుప్॥ మంత్రములు ॥ 8 ॥

వినియోగం:- నవయజ్ఞాలలో చేసె పూర్ణాహుతిలోను, అగ్నిష్టోమంలోను, అగ్రాయణేష్టిలో వైశ్వదేవమైన చరువును బ్రహ్మ అనుమంత్రించడంలోను దీనికి వినియోగం

మంత్రము.

యద్ విద్వాంసో య దవిద్వాంస ఏనాంసి చకృమా వయమ్।
యూయం న స్తస్మా న్ముఞ్చత విశ్వే దేవాః సజోషసః ॥ 1 ॥

పదము.

యత్ । విద్వాంసః । యత్ । అవిద్వాంసః । ఏనాంసి । చకృమ । వయమ్ ।
యూయమ్ । నః । తస్మాత్ । ముఞ్చత । విశ్వే । దేవాః । సఽజోషసః ॥ 1 ॥

అనువాదం,

పాపహేతు విదీ అని తెలిసో తెలియకనో
మేము పాపములను చేసినాము.
ఓ విశ్వేదేవతలారా! మీ రంతా ప్రీతిచెంది
ఆ పాపం నుంచి మమ్ములను విముక్తిపొందించండి. ॥ 1 ॥

మంత్రము.

యది జాగ్రద్ యది స్వపన్నేన ఏనస్యోఽకరమ్ ।

భూతం మా తస్మాద్ భవ్యం చ ద్రుపదాదివ ముఞ్చతామ్

॥ 2 ॥

పదము

యది । జాగ్రత్ । యది । స్వపన్ । ఏనః । ఏనస్యః । అకరమ్ ।

భూతమ్ । మా । తస్మాత్ । భవ్యమ్ । చ । ద్రుపదాత్ఽఇవ ।

ముఞ్చతామ్ ॥ 2 ॥

**అనువాదం.**

అజ్ఞానం వల్ల ఈదృశుడనైన నేను
జాగరావస్థితుడనై ఏ పాపాన్ని చేసినానో,
అలాగే నిద్రపోతూ ఏ పాపాన్ని చేసినానో
ఆ ఉభయవిధపాపముల నుండి
లబ్ధసత్తాక మైన ప్రాణిజాతాన్ని,
భవిష్యత్సత్తాకమైన ప్రాణిజాతాన్ని,
నన్ను *గుంజ నుండి విడిపించండి. ॥ 2 ॥

మంత్రము

ద్రుపదాదివ ముముచానః స్విన్నః స్నాత్వా మలాదివ ।

పూతం పవిత్రేణే వాజ్యం విశ్వే శుమ్భన్తు మైనసః ॥ 3 ॥

**పదము**

ద్రుపదాత్ఽఇవ । ముముచానః । స్విన్నః । స్నాత్వా । మలాత్

ఽఇవ ।

---

* పాదబంధనార్థమై ఉన్న చెట్లు ( ద్రుపదములు )
**పశువులను కట్టివేసే చెట్లు - గుంజలు**

పూతమ్ । పవిత్రేణఽఇవ । ఆజ్యమ్ । విశ్వే । శుమ్భన్తు । మా ।
ఏనసః ॥ 3 ॥

అనువాదం :

ఆ పాద బంధనం నుంచి వలె
పాపాన్నుంచి మమ్ములను విముక్తి చేస్తూ,
అలాగే ఖేదయుక్తుడైన పురుషుడు
స్నానం చేసి దేహమలినం నుంచి విముక్తుడైనట్లు,
పవిత్రమైన, శోధితమైన ఆజ్యాన్ని
నిష్కల్మషాన్ని చేసినట్టుగా
నన్ను విశ్వేదేవతలు పాపం నుంచి
పరిశుద్ధుని చేతురు గాక! ॥ 3 ॥

ఇది నూట పదునైదవ సూక్తం

## సూక్తం-116

ఋషి. జాటికాయనుడు ॥ దేవత వివస్వంతుడు ॥ ఛందస్సు : 1,3 జగతి,
2 త్రిష్టుప్ ॥ మంత్రములు. ॥ 3

వినియోగం :- ఘృత, తైల, మధుపరిమితమైన వృద్ధిక్షయలక్షణమైన అద్భుత ప్రాయశ్చిత్తార్థం చేసే ఆజ్యహోమంలో దీనికి వినియోగం.

మంత్రము :

యద్ యామం చక్రుర్నిఖనన్తో అగ్రే
కార్షీవణా అన్నవిదో న విద్యయా ।
వైవస్వతే రాజని తజ్జుహోమ్యథ
యజ్ఞియం మధుమదస్తు నోఽన్నమ్ ॥ 1 ॥

**పదము :**

**యత్ । యామమ్ । చక్రుః । నిఽఖనన్తః । అగ్రే ।**

**కార్షీవణాః । అన్నఽవిదః । న । విద్యయా ।**

**వైవస్వతే । రాజని । తత్ । జుహోమి । అథ ।**

**యజ్ఞియమ్ । మధుఽమత్ । అస్తు । నః । అన్నమ్ ॥ 1 ॥**

**అనువాదం**

కృషీవలులు, వారి కర్మ కారుల
వారి ముందున్న భూమిని ఖననం చేస్తూ
నియతమైన కర్మను చేస్తారు.
వారు విశేష జ్ఞానంతో ఉపలక్షితులు కారు
అందు వల్లనే కార్యాకార్య విభాగ జ్ఞాన శూన్యులు
ఆదిత్య పుత్రుడైన యమునికై హోమం చేస్తున్నాను
అద్భుత శమనానంతరం యజ్ఞార్హమైన
ఆ అన్నం మాధుర్యోపేతమై
మాకు భోజనార్హమగు గాక! ॥ 1 ॥

**మంత్రము :**

**వైవస్వతః కృణవద్ భాగధేయం**
**మధుభాగో మధునా సం సృజాతి ।**
**మాతుర్యదేన ఇషితం న ఆగన్**
**యద్ వా పితాఽపరాద్ధో జిహీడే ॥ 2 ॥**

అథర్వ III 19

పదము :

వై వస్వతః । కృణవత్ । భాగఽధేయమ్ ।

మ ధుఽభాగః । మధునా । సమ్ । సృజాతి ।

మాతుః । యత్ । ఏనః । ఇషితమ్ । నః । ఆఽఅగన్ ।

యత్ । వా । పితా । అపఽరాద్ధః । జిహీడే ॥ 2 ॥

అనువాదం

వివస్వతుని పుత్రుడైన యముడు
ఆత్మార్థమై హవిర్భాగాన్ని చేయుగాక।
మాధుర్యోపేతమైన హవిస్సుతో కలిసి
మాధుర్యోపేతమైన క్షీరఘృతాదులతో
మమ్ములను సృజించు గాక!
తల్లి దగ్గఱనుంచి ఏ పాపం ప్రేరితమై
మమ్ములను కృతాపరాధులను చేసినదో,
ఏ మా అపరాధం నుంచి విముఖుడై తండ్రి
కోపపడుతున్నాడో అదంతా శమించు గాక! ॥ 2 ॥

మంత్రము

యదీదం మాతుర్యది వా పితుర్నః పరి

భ్రాతుః పుత్రాచ్చేతస ఏన ఆగన్ ।

యావన్తో అస్మాన్ పితరః సచన్తే

తేషాం సర్వేషాం శివో అస్తు మన్యుః ॥ 3 ॥

పదము

యదీ । ఇదమ్ । మాతుః । యదీ । వా । పితుః । నః । పరి ।

భ్రాతుః । పుత్రాత్ । చేతసః । ఏనః । ఆ౨అగన్ ।

యావన్తః । అస్మాన్ । పితరః । సచన్తే ।

తేషామ్ । సర్వేషామ్ । శివః । అస్తు । మన్యుః ॥ 3 ॥

అనువాదం

ఈ పరిదృశ్యమానమైన పాపం తల్లి వద్ద నుంచి వచ్చినా, తండ్రి వద్ద నుంచి వచ్చినా, సోదరుని వద్దనుంచి వచ్చినా, మరెక్కడ నుంచి వచ్చినా, పరజనుల నుంచి గానీ, పుత్రాదుల నుంచి గానీ వచ్చినా, ఆ పాపం మమ్ములను చేరినది. అందుతో క్రుద్ధులై ఏ పితృాదులు మమ్ములను చేరినారో, వారందరి కోపం శాంతించు గాక! ॥ 3 ॥

ఇది నూట పదునారవ సూకం

## సూక్తం-117

ఋషిః కౌశికుడు (అనృణకాముడు) ॥ దేవత : అగ్ని ॥ ఛందస్సు. త్రిష్టుప్ ॥
మంత్రములు ॥ 3 ॥

వినియోగం.– ఉత్తమర్ణుడు ( ధనం అప్పిచ్చినవాడు ) చనిపోగా, అతని పుత్రునకు గానీ, అతని సగోత్రునకు గానీ ధనాన్ని అభిమంత్రించి అధమర్ణుడు ( అప్పుతీసుకున్నవాడు ) ఇవ్వడంలో దీనికి వినియోగం అలాగే ఈ మూడు సూక్తాలతో ద్రవ్యాన్ని అభిమంత్రించి ఉత్తమర్ణుని శ్మశాన భూమిలోగాని, చతుష్పథంలో గాని ఉంచాలి. అలాగే వీటితో ద్రవాన్ని అభిమంత్రించి కక్ష్యములలో ఉంచి వాటిని అగ్నిలో కాల్చివేయాలి. ఈ మూడు సూక్తములకు నవయజ్ఞానికి చేసే పూర్ణహోమంలో వినియోగం

అలాగే గృహాదులు కాలిపోతున్నప్పుడు దాని శాంతికొఱకు వ్రీహి, యవ, గోధూమాది మిశ్రధాన్యంతో పూర్ణాంజలిని హోమం చేయాలి అలాగే అగ్నిష్టోమావసానంలో గార్హపత్యాగ్ని సమారోపణానంతరం ఉపోష్యమాణమైన వేదిని అనుమంత్రణంచేయాలి.

మంత్రము

అపమిత్యమప్రతీత్తం యదస్మి
యమస్య యేన బలినా చరామి ।
ఇదం తదగ్నే అనృణో భవామి
త్వం పాశాన్ విచృతం వేత్థ సర్వాన్ ॥ 1 ॥

పదము

అప౽మిత్యమ్ । అప్రతీత్తమ్ । యత్ । అస్మి ।
యమస్య । యేన । బలినా । చరామి ।
ఇదమ్ । తత్ । అగ్నే । అనృణః । భవామి ।
త్వమ్ । పాశాన్ । వి౽చృతమ్ । వేత్థ । సర్వాన్ ॥ 1 ॥

**అనువాదం.**

ధాన్యాదికమైన ఋణం తీసుకొని అతనికి తిరిగి ఇవ్వలేదు
ఈ ఋణమే నేనైనాను ఈ బలవంతమైన ఋణంతో
శాసించే యమునకు వశమైనాను
ఓ అగ్ని! నీ అనుగ్రహం వల్ల
ఇప్పుడా ఋణం నుంచి విముక్తుడనౌతున్నాను
నీవా ఋణానికి సంబంధించిన సర్వపాశములను
విడిపించుటకు శక్తుడవు. ॥ 1 ॥

మంత్రము

ఇహైవ సన్తః ప్రతి దద్మ ఏనజ్జీవా

జీవేభ్యో ని హరామ ఏనత్ ।

అపమిత్య ధాన్యం 1 యజ్జఘసాహమిదం

తదగ్నే అనృణో భవామి ॥ 2 ॥

పదము :

ఇహ । ఏవ । సన్తః । ప్రతి । దద్మః । ఏనత్ । జీవాః ।

జీవేభ్యః । ని । హరామః । ఏనత్ ।

అప౽మిత్య । ధాన్య౽మ్ । యత్ । జఘస । అహమ్ । ఇదమ్ ।

తత్ । అగ్నే । అనృణః । భవామి ॥ 2 ॥

అనువాదం

ఇహలోకంలోనే ఉన్న ఈ ఋణం
ఉత్తమర్ణునకు తిరిగి ఇస్తున్నాము.
జీవుడు లోకంలో ఉంటూనే ఉత్తమర్ణుడు చనిపోకముందే
ఋణాన్ని ఇచ్చివేస్తాడు.
ధాన్యాన్ని తీసుకొని నేను భుజించినాను.
ఓ అగ్నీ ! నేనిప్పుడా ఎరకీయు ధాన్యభక్షణ నుంచి
నీ అనుగ్రహంతో ఋణరహితుడను అవుతున్నాను. ॥ 2 ॥

మంత్రము

అనృణా అస్మిన్ననృణాః పరస్మిన్

తృతీయే లోకే అనృణాః స్యామ ।
యే దేవయానాః పితృయాణాశ్చ లోకాః
సర్వాన్ పథో అనృణా ఆ క్షియేమ ॥ 3 ॥

పదము .

అనృణాః । అస్మిన్ । అనృణాః । పరస్మిన్ ।
తృతీయే । లోకే । అనృణాః । స్యామ ।
యే । దేవఽయానాః । పితృఽయానాః । చ । లోకాః ।
సర్వాన్ । పథః । అనృణాః । ఆ । క్షియేమ ॥ 3 ॥

అనువాదం:

ఓ అగ్ని ! నీ అనుగ్రహం వల్ల
భూలోకంలో ఋణరహితులమౌతున్నాము
*లౌకిక, వైదిక ఋణాలనుంచి,
ఈ ఋణాలన్నిటి నుంచి విముక్తులమౌతున్నాము.
పరలోకంలో కూడా ఋణరహితులమౌతున్నాము.
తృతీయ లోకం ( స్వర్గం )లో కూడా
ఋణరహితుల మౌతున్నాము.
ఇంకా ఇతరములైన దేవయానములు,
పితృయానములు మొదలైన అన్నిలోకాలను,
అక్కడికి వెళ్ళే మార్గాలను అనుగమించినప్పటికీ
అంతటా ఋణప్రతిబంధ రహితుల మగుతున్నాము. ॥ 3 ॥

ఇది నూట పదునేడవ సూక్తం.

---

* బ్రహ్మచర్యంతో తీర్చవలసినది ఋషి ఋణం.
యజ్ఞంతో తీర్చవలసినది దేవఋణం
సంతానంతో తీర్చవలసినది పితృఋణం.

## సూక్తం - 118

ఋషిః కౌశికుడు॥ దేవత . అగ్ని॥ ఛందస్సు త్రిష్టుప్॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం — పూర్వసూక్తమునకు వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము .

యద్ధస్తాభ్యాం చకృమ కిల్బిషాణ్యక్షాణాం గత్నుముపలి
ప్సమానాః ।
ఉగ్రంపశ్యే ఉగ్రజితౌ తదద్యాప్సరసావను దత్తామృణం నః
॥ 1 ॥

పదము .

యత్ । హస్తాభ్యామ్ । చకృమ । కిల్బిషాణి । అక్షాణామ్ ।
గత్నుమ్ । ఉపఽలిప్సమానాః ।
ఉగ్రంపశ్యే । ఇత్యుగ్రమ్ఽపశ్యే । ఉగ్రఽజితౌ । తత్ । అద్య ।
అప్సరసౌ । అను । దత్తామ్ । ఋణమ్ । నః ॥ 1 ॥

అనువాదం .

హస్తాదీంద్రియాలతో ఏ పాపములను చేసితిమో,
ఇంద్రియముల శబ్దస్పర్శాది విషయాలను
అనుభవించవలెనని కోరి ఏ ఋణాన్ని చేసితిమో,
ఓ తీక్ష్ణదర్శనమైన ఉగ్రం పశ్యా! ఉగ్రజిత్తూ!
ఈ పేర్లుగల అప్సరసలు ఇప్పుడు మా పూర్వోక్తమైన
ఋణమును ఉత్తమర్ణులకు ఇచ్చివేతురు గాక! ॥ 1 ॥

మంత్రము :

ఉగ్రంపశ్యే రాష్ట్రభృత్ కిల్బిషాణి ।

యదక్షవృత్తమను దత్తం న ఏతత్ ।
ఋణాన్నో నర్ణమేర్త్సమానో యమస్య
లోకే అధిరజ్జురాయత్ ॥ 2 ॥

పదము

ఉగ్రంపశ్యేఇత్యుగ్రమ్ఽపశ్యే । రాష్ట్రఽభృత్ । కిల్బిషాణి ।
యత్ । అక్షఽవృత్తమ్ । అను । దత్తమ్ । నః । ఏతత్ ।
ఋణాత్ । నః । న । ఋణమ్ । ఏర్త్సమానః । యమస్య ।
లోకే । అధిఽరజ్జుః । ఆ । అయత్ ॥ 2 ॥

అనువాదం

ఓ ఉగ్రం పశ్యా! రాష్ట్రభృత్ అప్సరసలారా!
మేము చేసిన పాపములను ఇంద్రియాది జనితమైన వానిని
మాకు అనుకూల్యంతో ఇత్తురుగాక!
ఋణవంతులు ఋణములు తీర్చని మమ్ము బంధించి
యముని సంబంధమైన లోకంలో, ఋణాన్ని
మా దగ్గరనుంచి తీసికొనదలచి
పాశాన్ని ధరించి రాకుండునట్లు ఋణాన్ని తీర్తుముగాక! ॥2॥

మంత్రము

యస్మా ఋణం యస్య జాయాముపైమి
యం యాచమానో అభ్యైమి దేవాః ।

తే వాచం వాదిషుర్మో త్తరాం
మద్దేవపత్నీ అప్సరసావధీతమ్ ॥ 3 ॥

పదము

యస్మై । ఋణమ్ । యస్య । జాయామ్ । ఉపఽఐమి ।
యమ్ । యాచమానః । అభిఽఐమి । దేవాః ।
తే । వాచమ్ । వాదిషుః । మా । ఉత్తరామ్ ।
మత్ । దేవపత్నీ ఇతి దేవఽపత్నీ । అప్సరసౌ । అధి । ఇతమ్॥3॥

అనువాదం

ఏ ఉత్తమర్ణునకు ఏ ఋణాన్ని నే నివ్వవలెనో,
ఏ పురుషుని భార్యను కాముకుడనై పొందుతున్నానో,
ఏ పురుషుని అవసరమైనధనాన్ని ఇమ్మని అడుగుతున్నానో,
వారందరూ నా గురించి ఉత్కృష్టతరమైన
ప్రతికూలవాక్కును పలుక కుందురు గాక!
దేవపత్నులైన అప్సరసలు
నా విజ్ఞాపనాన్ని చిత్తగింతురు గాక! ॥ 3 ॥

ఇది నూట పదునెనిమిదవ సూక్తం

## సూక్తం - 119

ఋషిః కౌశికుడు ॥ దేవత : వైశ్వానరోఽగ్ని ॥ ఛందస్సు : మంత్రములు. ॥3॥
వినియోగం :- పూర్వ సూక్తమునకు వలెనే దీనికి కూడా వినియోగం.
మంత్రము.

యదదీవ్యన్నృణమహం కృణోమ్యదాస్యన్నగ్న ఉత
సంగృణామి ।

వైశ్వానరో నో అధిపా వసిష్ఠ ఉదిన్నయాతి సుకృతస్య
లోకమ్ ॥ 1 ॥

పదము

యత్ । అదీవ్యన్ । ఋణమ్ । అహమ్ । కృణోమి । అదాస్యన్ ।
అగ్నే । ఉత । సమ్ఽగృణామి ।

వైశ్వానరః । నః । అధిఽపాః । వసిష్ఠః । ఉత్ । ఇత్ । నయాతి ।
సుఽకృతస్య । లోకమ్ ॥ 1 ॥

అనువాదం

వ్యవహరింపలేక ఏ ఋణాన్ని నేను చేసితినో,
ఓ అగ్నీ ! దానిని తిరిగి ఇవ్వలేక
జ్ఞాపకం మాత్రం పెట్టుకున్నాను.
వైశ్వానరుడు, అధిపుడు, వసిష్ఠుడు అయిన అగ్ని,
పుణ్యకర్మఫలభూతమైన లోకాన్ని
మమ్ములను అధిరోహింప జేయుగాక ! ॥ 1 ॥

మంత్రము

వైశ్వానరాయ ప్రతి వేదయామి యద్యృణం సంగరో
దేవతాసు ।

స ఏతాన్ పాశాన్ విచృతం వేద సర్వానథ పక్వేన సహ
సం భవేమ ॥ 2 ॥

పదము

వైశ్వానరాయ । ప్రతి । వేదయామి । యది । ఋణమ్ । సమ్
ఽగరః । దేవతాసు ।

సః । ఏతాన్ । పాశాన్ । వి౽చృతమ్ । వేద । సర్వాన్ । అథ ।
పక్వేన । సహ । సమ్ । భవేమ ॥ 2 ॥

అనువాదం

వైశ్వానరునకు విజ్ఞాపనం చేస్తున్నాన.
ఏ లౌకికమైన ఋణం దేవతలయెడ ఉన్నదో,
ఆ వైదిక ఋణం సర్వమూ వైశ్వానరునకు నివేదిస్తున్నాను
ఆ వైశ్వానరుడు లౌకిక, వైదిక ఋణాత్మకమైన
సర్వ పాశ బంధములను విడిపించుటకు
మార్గం తెలిసిన వాడు. ఆ పాశచ్ఛేదనానంతరం
పరిపక్వమైన స్వర్గాది ఫలంతో కూడి
మేము ఉత్తమ లోకాలకు వెడుతున్నాము ॥ 2 ॥

మంత్రము

వైశ్వానరః పవితా మా పునాతు యత్
సంగరమభిధావామ్యాశామ్ ।
అనాజానన్ మనసా యాచమానో
యత్ తత్రైనో అప తత్ సువామి ॥ 3 ॥

పదము.

వైశ్వానరః । పవితా । మా । పునాతు । యత్ ।
సమ్౽గరమ్ । అభి౽ధావామి । ఆ౽శామ్ ।
అనాజానన్ । మనసా । యాచమానః ।

యత్ । తత్ర । ఏనః । అప । తత్ । సువామి ॥ 3 ॥

అనువాదం.

వైశ్వానరుడు, శుద్ధి కర్త అయిన అగ్ని
నన్ను పరిశుద్ధుని చేయుగాక!
ఆ కారణం వల్ల నా ప్రతిజ్ఞను కేవలం అభిముఖ్యంతో
దేవతల అభిలాషనే ఉత్పాదనం చేస్తున్నాను.
హితాహిత విభాగం తెలియక
మనసుతో ఐహిక సుఖాన్నే ప్రార్థిస్తున్నాను
అలాంటి అన్నృత కరణంలో ఏ పాపమైతే ఉన్నదో,
అది మా నుండి తొలగింపబడు గాక! ॥ 3 ॥

ఇది నూట పందొమ్మిదవ సూక్తం

## సూక్తం-120

ఋషిః కౌశికుడు॥ దేవతలు. మంత్రాలలో పేర్కొన్న అంతరిక్షాదులు॥
ఛందస్సు. 1 జగతీః 2 పంక్తి. 3 త్రిష్టుప్॥మంత్రములుః ॥ 3 ॥

వినియోగం:- పూర్వ సూక్తంలో వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము:

యదన్తరిక్షం పృథివీముత ద్యాం
యన్మాతరం పితరం వా జిహింసిమ ।
అయం తస్మాద్ గార్హపత్యో నో
అగ్నిరుదిన్నయాతి సుకృతస్య లోకమ్ ॥ 1 ॥

పదము:

యత్ । అన్తరిక్షమ్ । పృథివీమ్ । ఉత । ద్యామ్ ।

యత్ । మాతరమ్ । పితరమ్ । వా । జిహింసిమ ।

అయమ్ । తస్మాత్ । గార్హఽపత్యః । నః । అగ్నిః ।

ఉత్ । ఇత్ । నయాతి । సుఽకృతస్య । లోకమ్ ॥ 1 ॥

అనువాదం

అంతరిక్షలోకస్థులైన జనాన్ని, భూలోకస్థులైన జనాన్ని,
ద్యులోకస్థులైన జనాన్ని హింసించి
ఏ పాపాన్ని చేసినామో, అట్లే తల్లి దండ్రులను హింసించి
ఏ పాపాన్ని చేసినామో___
ఆ ఉభయవిధ పాపముల నుండి
ఈ గార్హపత్యాగ్ని మమ్ములను ఉద్ధరించి
సుకృత పరిపాకమైన స్వర్గలోకాన్ని అధిరోహింపజేయుగాక!
॥ 1 ॥

మంత్రము

భూమిర్మాతాఽదితిర్నో జనిత్రం

భ్రాతాఽన్తరిక్షమభిశస్త్యా నః ।

ద్యౌర్నః పితా పిత్ర్యాచ్ఛం భవాతి

జామిమృత్వా మావ పత్సి లోకాత్ ॥ 2 ॥

పదము .

భూమిః । మాతా । అదితిః । నః । జనిత్రమ్ ।

భ్రాతా । అన్తరిక్షమ్ । అభిఽశస్త్యై । నః ।

ద్యౌః । నః । పితా । పిత్ర్యాత్ । శమ్ । భవాతి ।

జామిమ్ । ఋత్వా । మా । అవ । పత్సి । లోకాత్ ॥ 2 ॥

అనువాదం :

మాకు పృథివీ దేవత తల్లి. అదితి జనన కారణం
అంతరిక్షం భ్రాత ఈ సర్వరూపమైన అభిశంసనం వల్ల
జనించిన పాపం నుంచి వీరు
మమ్ములను రక్షింతురు గాక !
అలాగే మాకు ద్యులోకం తండ్రి
అతను పిత్రీయమైన దోషం నుంచి
సుఖాన్ని ఉత్పాదింప జేయుగాక !
పిత్ర్యమైన దోషాన్ని నివర్తింపజేసి
సుఖవంతులను చేయుగాక !
నేను వ్యర్థంగా ప్రాణాలను పరిత్యజించి
యాగాదులను చేయక స్వర్గాదులమ్నుంచి
అధోగతిని చెందకుందును గాక ! ॥ 2 ॥

మంత్రము

యత్రా సుహార్దః సుకృతో మదన్తి
విహాయ రోగం తన్వ1ః స్వాయాః ।
అశ్లోణా అఙ్గైరహ్రుతాః స్వర్గే తత్ర
పశ్యేమ పితరౌ చ పుత్రాన్ ॥ 3 ॥

పదము .

యత్ర । సుఽహార్దః । సుఽకృతః । మదన్తి ।

వి౨హాయ। రోగమ్। తన్వ౨ః। స్వాయాః।

అశ్లోణాః। అఙ్గైః। అహ్రుతాః। స్వ౨ః౨గే।

తత్ర। పశ్యేమ। పితరౌ। చ। పుత్రాన్ ॥ 3 ॥

**అనువాదం:**

ఏ ఉత్తమలోకంలో సహృదయులు, సుకృతులు
స్వకీయ శారీరక జ్వరాదికాన్ని విడిచి
దుఃఖస్పర్శలేని సుఖానుభవంతో మత్తిల్లుతున్నారో,
హస్తాది పాదములతో, కుష్ఠాది రోగరహితులై,
అకుటిలగతులై ఆ పుణ్యవంతులు పొందే స్వర్గలోకాన్ని,
తల్లిని, తండ్రిని, పుత్రులను సాక్షాత్కరింప
జేసుకొందుముగాక! ॥ 3 ॥

ఇది నూట ఇరవైయవ సూక్తం

## సూక్తం – 121

**ఋషి: కౌశికుడు॥ దేవతలు. మంత్రాలలో పేర్కొన్న అగ్ని మొదలగువారు॥ ఛందస్సు. 1,2 త్రిష్టుప్, 3,4 అనుష్టుప్॥ మంత్రములు: ॥ 4 ॥**

**వినియోగం – దారులోహరజ్జ్వాది బంధనమోచనార్థమై చేసే కర్మలలో దీనికి వినియోగం.**

మంత్రము .

**విషాణా పాశాన్ వి ష్యా౨ధ్యస్మద్**

**య ఉత్తమా అధమా వారుణా యే**

**దుష్వప్న్యం దురితం ని ష్వాస్మదథ**

గచ్ఛేమ సుకృతస్య లోకమ్ ॥ 1 ॥

పదము :

వి౽సానా । పాశాన్ । వి । స్య । అధి । అస్మత్ ।

యే । ఉత్౽తమాః । అధమాః । వారుణాః । యే ।

దుః౽స్వప్న్యమ్ । దుః౽ఇతమ్ । నిః । స్వ । అస్మత్ ।

అథ । గచ్ఛేమ । సు౽కృతస్య । లోకమ్ ॥ 1 ॥

అనువాదం

బంధనాభిమాని అయిన నిర్ ఋతి దేవతా !
మా అవయవములకు తగుల్కొన్న
రజ్జుబంధములను విడిపిస్తూ, మా మీదవి కూడా విడిపించి
ఊర్ధ్వకాయగతములైన పాశములను,
అధఃకాయగతములైన పాశములను,
సర్వకాయాశ్రితములైన పాశములను,
అనేక భేదభిన్నములైన పాశములను,
అన్నిటిని మా నుండి విమోచనం చెందించు
దుస్స్వప్న జనితమైన పాపంనుండి మమ్ములను విడిపించు.
పాశవిమోచనానంతరం సుకృతఫలభూతమైన
లోకాన్ని చేరుదుముగాక ! ॥ 1 ॥

మంత్రము

యద్ దారుణి బధ్యసే యచ్చ రజ్జ్వాం

యద్ భూమ్యాం బధ్యసే యచ్చ వాచా ।

అయం తస్మాద్ గార్హపత్యో నో
అగ్నిరుదిన్నయాతి సుకృతస్య లోకమ్ ॥ 2 ॥

పదము

యత్ । దారుణి । బధ్యసే । యత్ । చ । రజ్జ్వామ్ ।
యత్ । భూమ్యామ్ । బధ్యసే । యత్ । చ । వాచా ।
అయమ్ । తస్మాత్ । గార్హఽపత్యః । నః । అగ్నిః ।
ఉత్ । ఇత్ । నయాతి । సుఽకృతస్య । లోకమ్ ॥ 2 ॥

అనువాదం

ఓ పురుషుడా! నీవు
ఏ కాష్ఠ విశేషమునందు బంధితుడవౌతావో,
రజ్జువులతో బంధితుడవౌతావో,
భూమిలో బంధితుడవౌతావో,
రాజాజ్ఞతో బంధితుడవౌతావో, ఆ బంధనము లన్నిటి నుండి
మా గార్హపత్యాగ్ని నిన్ను ఉత్తీర్ణుని చేయుగాక!
తదనంతరం సుకృతఫలభూతమైన
లోకమునకు చేర్చుగాక! ॥ 2 ॥

మంత్రము

ఉదగాతాం భగవతీ విచృతౌ నామ తారకే ।
ప్రేహామృతస్య యచ్ఛతాం పైతు బద్ధకమోచనమ్ ॥ 3 ॥
అథర్వ III 20

పదము :

ఉత్ । అగాతామ్ । భగవతీఇతిభగ౽వతీ । వి౽చృతౌ । నామ ।
తారకేఇతి ।

ప్ర । ఇహ । అమృతస్య । యచ్ఛతామ్ । ప్ర । ఏతు । బద్ధక౽మోచనమ్ ॥ 3 ॥

అనువాదం :

భగవతి, విమోచని నామకమైన నక్షత్రాలు ఉదయించి
ఈ బంధితుడైన పురుషుని ఆ మరణాంతం
బంధమోక్షణం చేయుగాక !
అతడు బంధితుడు కాక ఉండుగాక !
దాని నుండి విమోచనం చెందుగాక ! ॥ 3 ॥

మంత్రము

వి జిహీష్వ లోకం కృణు బద్ధాన్ముఞ్చాసి బద్ధకమ్ ।
యోన్యా ఇవ ప్రచ్యుతో గర్భః పథః సర్వాం అను క్షియ ॥ 4 ॥

పదము

వి । జిహీష్వ । లోకమ్ । కృణు । బన్ధాత్ । ముఞ్చాసి । బద్ధకమ్ ।
యోన్యాః౽ఇవ । ప్ర౽చ్యుతః । గర్భః । పథః । సర్వాన్ ।
అను । క్షియ ॥ 4 ॥

అనువాదం :

ఓ బంధనాభిమానిదేవా ! నీవు
దిక్కులను పట్టి పారిపో. ఈ పురుషునికి స్థానం చూపించు.

బంధనార్తుడైన ఈ పురుషుని ఆ బం ... సి ... సూచిన
చెందించు ఓ పురుషుడ ! ... దు ... యో ... ండి
బయటుపడీన గర్భం వలె అటూ ఇటూ కదం తూ
సర్వ మార్గాలనూ అనుసరించి వెళ్ళు ॥ 4 ॥

ఇది నూట ఇరవై ఒకటవ సూక్తం

## సూక్తం-122

ఋషి· భృగువు ॥ దేవత ॥ విశ్వకర్మ ॥ ఛందస్సు ॥ 1-3 త్రిష్టుప్ 4 5 జగతి ॥ మంత్రములు. ॥ 5 ॥

వినియోగం.— నవయజ్ఞాలలో ... స్థితహోమాలలోను, వాటి అను ... ంత్రణం లోను దీనికి వినియోగం అలాగే ... గ్ని ... షో ... ంలో హవిర్ధానంలో పితరుల నుద్దేశించి పురోడాశఖండాలను ఇసూవేసే అనుమంత్రిణంలో దీనికి వినియోగం శుద్ధాః పూ ... ః అనే మంత్రంతో సర్వ యజ్ఞాలలో ఋత్విజులకు హ ... ప్రక్షాళనార్థం ఉదకం ... వ్వాలి.

మంత్రము .

ఏతం భాగం పరి దదామి విద్వాన్
విశ్వకర్మన్ ప్రథమజా ఋతస్య ।
అస్మాభిర్దత్తం జరసః పరస్తా దచ్ఛిన్నం
తన్తుమను సం తరేమ ॥ 1 ॥

పదము ;

ఏతమ్ । భాగమ్ । పరి । దదామి । విద్వాన్ ।
విశ్వఽకర్మన్ । ప్రథమఽజాః । ఋత ... ।
అస్మాభిః । దత్తమ్ । జరసః । పరస్తాత్ । అచ్ఛిన్నమ్ ।

తన్తుమ్ । అను । సమ్ । తరేమ ॥ 1 ॥

అనువాదం .

ఓ విశ్వకర్మా! నీవు స్వచ్ఛ స్వరూపుడైన
పరబ్రహ్మకు ప్రథమ జాతుడవు.
ఈ మాహాత్మ్యన్నెఱిగి ఈ పక్వాన్న మైన
హవిర్భాగాన్ని రక్షణార్థమై నీకు సమర్పిస్తున్నాను
ఈ లోకంలో మే మిచ్చిన ఈ భాగంతో
ఈ శరీరానంతరం అవిచ్ఛిన్న మైన
పుత్రపౌత్రాది లక్షణ సంతానాన్ని పొందుదుముగాక!
ఇదే గదా సంసారి అయిన పురుషునికి అమృతత్వం! ॥ 1 ॥

మంత్రము .

తతం తన్తుమన్వేకే తరన్తి యేషాం దత్తం పిత్ర్యమాయనేన ।
అబన్ధ్వేకే దదతః ప్రయచ్ఛన్తో దాతుం చేచ్ఛిక్షాన్త్స స్వర్గ ఏవ ॥ 2 ॥

పదము

తతమ్ । తన్తుమ్ । అను । ఏకే । తరన్తి । యేషామ్ । దత్తమ్ ।
పిత్ర్యమ్ । ఆఽఅయనేన ।
అబన్ధు । ఏకే । దదతః । ప్రఽయచ్ఛన్తః । దాతుమ్ । చ । ఇత్ ।
శిక్షాన్ । సః । స్వఃఽగః । ఏవ ॥ 2 ॥

అనువాదం :

కొందరు జనులు ఆ విస్తీర్ణ తంతువును
అనులక్షించి దానిని అతిక్రమిస్తారు.

ఈ జనుల పితృతీయమైన ఋణం
ఆగమనంతో పుత్రపౌత్రాదులలో ప్రవేశించి
ఇచ్చినవారికి తిరిగి ఇవ్వడ మౌతుంది.
సంతాన రహితులైన జనం తీసుకున్న
హిరణ్యధాన్యాదికముల నిస్తూ లోకంలోనే ప్రత్యర్పణం
చేయిలేకపోయినా ఇవ్వాలన్న సంకల్పమే వారి
స్వర్గప్రాప్తికి కారణ మౌతుంది. ॥ 2 ॥

**మంత్రము :**

అన్వారభేథామనుసంరభేధామేతం
లోకం శ్రద్ధధానాః సచన్తే ।
యద్వాం పక్వం పరివిష్ట మగ్నౌ
తస్య గుప్తయే దమ్పతీ సం శ్రయేథామ్ ॥ 3 ॥

**పదము**

అను౨ఆరభేథామ్ । అను౨సంరభేధామ్ । ఏతమ్ ।
లోకమ్ । శ్రత్౨దధానాః । సచన్తే । యత్ । వామ్ ।
పక్వమ్ । పరి౨విష్టమ్ । అగ్నౌ । తస్య । గుప్తయే ।
దంపతీ ఇతి దమ్౨పతీ । సమ్ । శ్రయేథామ్ ॥ 3 ॥

**అనువాదం.**

ఓ దంపతులారా!
పరలోకహితమైన సత్కర్మను అనులక్షించి
దానిని ఆరంభించండి.

ఆరంభానంతరం సంయుక్తులు కండి
ఈ కర్మఫలభూతమైన స్వర్గాదికమును
ఆస్తిక్యబుద్ధి యుక్తులై జనం సేవిస్తారు
మీ కొఱకు కూడా పరిపక్వమైన అన్నం
ఇతరుల కిచ్చినది, హవిస్సురూపంలో అగ్నిలో వేల్చినది
– ఇష్టాపూర్తి రక్షణకు ఓ దంపతులారా!
మీరు సంసేవించండి ॥ 3 ॥

మంత్రము :

యజ్ఞం యన్తం మనసా బృహన్తమన్వారోహామి తపసా సయోనిః ।
ఉపహూతా అగ్నే జరసః పరస్తాత్ తృతీయే నాకే సధమాదం మదేమ ॥ 4 ॥

పదము

యజ్ఞమ్ । యన్తమ్ । మనసా । బృహన్తమ్ । అను౨ఆరోహామి । తపసా । స౨యోనిః ।
ఉప౨హూతాః । అగ్నే । జరసః । పరస్తాత్ । తృతీయే । నాకే । సధ౨మాదమ్ । మదేమ ॥ 4 ॥

అనువాదం

మేను చేసిన యాగం దేవతలకు చెందుతుంది
మనస్సుతో, బుద్ధితో అందులో నేను ప్రవేశించి ఉంటాను
తపస్సుతో సయోనియై (దివ్యదేహోత్పత్తిరూపంలో) ఉంటాను.
ఓ అగ్నీ! నీతో అనుజ్ఞాతుడనై చిరకాలం

ఈ లోకంలో ఉండి వృద్ధాప్యం తరువాత జీర్ణమైన
ఈ శరీరాన్ని పరిత్యజించి మూడవ నాకలోకంలో
పుత్రపౌత్రాదులతో కూడా సంతోషిస్తూ ఉంటాను. ॥ 4 ॥

మంత్రము

శుద్ధాః పూతా యోషితో యజ్ఞియా ఇమా
బ్రహ్మణాం హస్తేషు ప్రపృథక్ సాదయామి ।
యత్కామ ఇదమభిషిఞ్చామి వోఽహ మిన్ద్రో
మరుత్వాన్త్స దదాతు తన్మే ॥ 5 ॥

పదము

శుద్ధాః । పూతాః । యోషితః । యజ్ఞియాః । ఇమాః ।
బ్రహ్మణామ్ । హస్తేషు । ప్రఽపృథక్ । సాదయామి ।
యత్ఽకామః । ఇదమ్ । అభిఽసిఞ్చామి । వః ।
అహమ్ । ఇన్ద్రః । మరుత్వాన్ । సః । దదాతు । తత్ । మే ॥5॥

అనువాదం

పాపరహితములు, జగత్పవిత్రభూతములు,
స్త్రీరూపములు, యజ్ఞార్థములు అయిన
ఈ ఉదకములను ఋత్వక్కుల చేతులలో
ప్రక్షాళనచే మా ఉపభోగార్థం ఉంచుతాను.
ఏ ఫలాన్ని కోరి ఇప్పుడు ఓ ఉదకములారా!
మిమ్ములను అభిషేకిస్తున్నానో, మరుద్గణములతో యుక్తుడైన
ఆ ఇంద్రుడు నాకు ఆ ఫలాన్ని ఇచ్చుగాక! ॥ 5 ॥

ఇది నూట ఇరవై రెండవ సూక్తం

## సూక్తం - 123

ఋషి భృగువు॥ దేవతలు విశ్వేదేవులు॥ ఛందస్సు: 1,2 త్రిష్టుప్: 3 ద్విపదాసామ్న్యనుష్టుప్ 4 ద్విపదా ప్రాజాపత్యా భురిగనుష్టుప్ (ఏకావసానా) 5 అనుష్టుప్॥ మంత్రములు ॥ 5 ॥

వినియోగం - పూర్వసూక్తంలో వలెనే దీనికి కూడా వినియోగం. అట్లే బ్రహ్మ దీనితో వైశ్వ కర్మణహోమములను అనుమంత్రించాలి

మంత్రము

ఏతం సధస్థాః పరి వో దదామి

యం శేవధి మావహాజ్జాతవేదాః ।

అన్వాగన్తా యజమానః స్వస్తి

తం స్మ జానీత పరమే వ్యోమన్ ॥ 1 ॥

పదము

ఏతమ్ । సధఽస్థాః । పరి । వః । దదామి ।

యమ్ । శేవఽధిమ్ । ఆఽవహాత్ । జాతఽవేదాః ।

అనుఽఆగన్తా । యజమానః । స్వస్తి ।

తమ్ । స్మ । జానీత । పరమే । విఽఓమన్ ॥ 1 ॥

అనువాదం .

యజమానితో పాటు, స్వర్గంలో ఉండే ఓ దేవతలారా !
ఈ హవిర్భాగాన్ని మీకు సమర్పిస్తున్నాను.
ఏ భాగాన్ని నిధిరూపంలో అగ్ని మీకు అందిస్తాడో
ఈ యజమానుడు క్షేమంగా ఆ నిధిని వెనుకనే

అందుకుంటాడు ఉత్కృష్టమైన స్వర్గలోకంలో
ఆ యజమానుని జ్ఞాపక ముంచుకోనండి. ॥ 1 ॥

మంత్రము

జానీత స్మైనం పరమే వ్యోమన్ దేవాః
సధస్థా విద లోకమత్ర ।
అన్వాగన్తా యజమానః స్వస్తీష్టాపూర్తం
స్మ కృణుతావిరస్మై ॥ 2 ॥

పదము

జానీత । స్మ । ఏనమ్ । పరమే । విఽఓమన్ । దేవాః ।
సధఽస్థాః । విద । లోకమ్ । అత్ర ।
అనుఽఆగన్తా । యజమానః । స్వస్తి । ఇష్టాపూర్తమ్ ।
స్మ । కృణుత । ఆవిః । అస్మై ॥ 2 ॥

అనువాదం .

ఇతనిని అలా ఆ లోకంలో జ్ఞాపక ముంచుకొని
సధస్థితులైన దేవతలారా! ఈ స్వర్గంలో
ఈ యజమానుని లోకాన్ని అవధరించండి
ఏ భాగాన్ని నిధిరూపంలో అగ్నిమీకు లందిస్తాడో,
ఈ యజమానుడు క్షేమంగా
ఆ నిధిని వెనుకనే అందుకుంటాడు.

అనుగతుడైన యజమానునకు చెందిన
*ఇష్టాపూర్తం ఫలితాన్ని ఇవ్వండి. ॥ 2 ॥

మంత్రము

దేవాః పితరః పితరో దేవాః ।

యో అస్మి సో అస్మి ॥ 3 ॥

పదము

దేవాః । పితరః । పితరః । దేవాః ।

యః । అస్మి । సః । అస్మి ॥ 3 ॥

అనువాదం

వసురుద్రాదిత్యరూపులైన దేవతలే మా పితృదేవతలు.
మా పితృపితామహ ప్రపితామహ రూపులైన మనుష్యులే
పైన చెప్పిన దేవతలు
( ఈ పరస్పర వ్యతిహారంతో పితృపితామహరూపులైన
మనుష్యులకే ప్రాగుక్తమైన దేవత్వం లభించినది )
అందులో నే నెవరివాడనో వారి వాడను. ॥ 3 ॥

మంత్రము

స పచామి స దదామి స యజే

స దత్తాన్మా యూషమ్ ॥ 4 ॥

---

* ఇష్టం = శ్రుత్యుక్త యాగాది కర్మ.
పూర్తం = స్మృత్యుక్త వాపీకూప తటాకాదుల నిర్మాణం.

పదము

సః । పచామి । సః । దదామి । సః । యజే ।

సః । దత్తాత్ । మా । యూషమ్ ॥ 4 ॥

అనువాదం

నే నతని వాడనే. పాకయజ్ఞములను చేస్తున్నాను
దానములను చేస్తున్నాను. యాగములను చేస్తున్నాను.
ఆ నేను, పుత్రాదులు చేసే శ్రాద్ధాది జన్య ఫలితం నుంచి
పృథక్కృతుడను కాను ॥ 4 ॥

మంత్రము :

నాకే రాజన్ ప్రతి తిష్ఠ తత్రై౯తత్ ప్రతి తిష్ఠతు ।

విద్ధి పూర్తస్య నో రాజన్త్స దేవ సుమనా భవ ॥ 5 ॥

పదము.

నాకే । రాజన్ । ప్రతి । తిష్ఠ । తత్ర । ఏతత్ । ప్రతి । తిష్ఠతు ।

విద్ధి । పూర్తస్య । నః । రాజన్ । సః । దేవ । సుఽమనాః । భవ
॥ 5 ॥

అనువాదం

ఓ రాజా! సోమా! నీవు స్వర్గంలో
మా అపరాధాలను విస్మరించి సుఖంగా ఉండు.
అక్కడ ఉన్న నీ కోసమై మేము చేసే,
ఇష్టాపూర్తం ఫలప్రదాన సమర్థమగుగాక!
ఓ రాజా! మా ఇష్టాపూర్తం నీకు తెలుసు
ఓ దేవా! అలాంటి నీవు శోభనమనస్కుడవు కమ్ము. ॥ 5 ॥

ఇది నూట ఇరవై మూడవ సూక్తం

## సూక్తం — 124

ఋషి అథర్వుడు॥ దేవత దివ్యఆపస్సు॥ ఛందస్సు. త్రిష్టుప్ 3 మంత్రములు॥ 3 ॥

వినియోగం.— ఆకాశోదకప్లావన 'దోషశాంత్యర్థం ఉదకాన్ని అభిమంత్రించి చేసే శరీర ప్రక్షాళనలోను, అదే కర్మలో తైలం, శాంత్యోషధీగంధం, హిరణ్యం, వస్త్రంవీటిని అభిమంత్రించి చేసే శరీరోద్వర్తనంలోను దీనికి వినియోగం.

మంత్రము

దివో ను మాం బృహతో అన్తరిక్షా దపాం

స్తోకో అభ్యఽపప్తద్ రసేన ।

స మిన్ద్రియేణ పయసాఽహ మగ్నే

ఛన్దోభి ర్యజ్ఞైః సుకృతాం కృతేన ॥ 1 ॥

పదము

దివః । ను । మామ్ । బృహతః । అన్తరిక్షాత్ । అపామ్ ।

స్తోకః । అభి । అపప్తత్ । రసేన ।

సమ్ । ఇన్ద్రియేణ । పయసా । అహమ్ । అగ్నే ।

ఛన్దఃఽభిః । యజ్ఞైః । సుఽకృతామ్ । కృతేన ॥ 1 ॥

అనువాదం

ద్యులోకం నుంచి, మహాదంతరిక్షంలో నుంచి
ఉదకబిందువు తన రసంతో నా మీద పడుగాక!
ఓ అగ్నీ! నీ ప్రసాదంతో అకాల వర్షబిందు

సేకజనితదోషం ప్రక్షాళితమై, ఇంద్రతేజస్సుతో,
క్షీరంతో, ఛందస్సులతో, యాగములతో,
పుణ్యం చేసిన జనుల కర్మతో
నేను సంయుక్తుడ నగుదును గాక! ॥ 1 ॥

మంత్రము

యది వృక్షా దభ్యపప్తత్ ఫలం తద్
యద్యన్తరిక్షాత్ స ఉ వాయురేవ ।
యత్రాస్పృక్షత్ తన్వో౩ యచ్చ వాసస
ఆపో నుదన్తు నిరృతిం పరాచైః ॥ 2 ॥

పదము

యది । వృక్షాత్ । అభిఽఅపప్తత్ । ఫలమ్ । తత్ ।
యది । అన్తరిక్షాత్ । సః । ఉంఇతి । వాయుః । ఏవ ।
యత్ర । అస్పృక్షత్ । తన్వఽః । యత్ । చ । వాససః ।
ఆపః । నుదన్తు । నిఃఽఋతిమ్ । పరాచైః ॥ 2 ॥

అనువాదం :

వృక్షాగ్రం నుండి వర్షబిందువు నా మీాద పడినది.
దానికి వృక్షసంబంధమైన ఫలమే ఉంటుంది.
ఆకాశం నుండి పడితే అది వాయ్వాత్మక మౌతుంది.
శరీరసంబంధమైన ఏ అంగంపై వర్షబిందువు పడుతుందో,
మా అంగంపై నున్న వస్త్రంపై పడుతుందో,

ఆ అనిష్ట కార అయిన పాపదేవతను
ప్రక్షాళనార్థములైన ఈ ఉదకములు
పరాఙ్ముఖంగా, మా నుండి దూరంగా తరుముగాక! ॥ 2 ॥

మంత్రము

అభ్యఞ్జనం సురభి సా సమృద్ధిర్హిరణ్యం వర్చ స్తదు
పూత్రిమ మేవ ।
సర్వా పవిత్రా వితతాఽధ్యస్మత్ తన్మా తారీన్నిర్ఋతిర్మో
అరాతిః ॥ 3 ॥

పదము

అభిఽఅఞ్జనమ్ । సురభి । సా । సమ్ఽఋద్ధిః । హిరణ్యమ్ ।
వర్చః । తత్ । ఓంఇతి । పూత్రిమమ్ । ఏవ ।
సర్వా । పవిత్రా । విఽతతా । అధి । అస్మత్ । తత్ । మా ।
తారీత్ । నిఃఽఋతిః । మోఇతి । అరాతిః ॥ 3 ॥

అనువాదం.

నా మీదపడిన ఆ వర్షబిందువు అభ్యంగసాధనమైన జలం
సురభిళమైన చందనాదికం అదే సమృద్ధి.
స్వర్ణమయాలంకారాదులు. వర్చస్సు.
ఈ విధమైన ఆ వర్షబిందుజలం శుద్ధికరమే.
దోషావహం కాదు.
సర్వ పవిత్ర జలబిందువులు నాపైన పడినవి
కావున అనిష్టకారిణి, పాపదేవత అయిన

ఆ నిర్ ఋతి మమ్ములను అతిక్రమించ కుండుగాక!
శత్రువు కూడ అతిక్రమించ కుండుగాక! ॥ 3 ॥

ఇది నూట ఇరవై నాల్గవ సూక్తం

ఇది పన్నెండవ అనువాకం

# అనువాకం: 13

## సూక్తం - 125

ఋషి: అథర్వుడు॥ దేవత వనస్పతి॥ ఛందస్సు. 1,3 త్రిష్టుప్. 2 జగతీ॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం.- క్రొత్తరథాన్ని అభిమంత్రించి జయకాముడైన రాజును అధిరోహింప జేయుటలోను, మహావ్రతంలో మాధ్యందిన సవనంలో రథాన్ని అభిమంత్రించి, రాజును ఆరోహింపజేయుటలోను దీనికి వినియోగం

మంత్రము

వనస్పతే వీడ్వఙ్గో హి భూయా అస్మత్సఖా ప్రతరణః సువీరః ।
గోభిః సంనద్ధో అసి వీడయస్వాస్థాతా తే జయతు జేత్వాని ॥ 1 ॥

పదము

వనస్పతే । వీడఽఅఙ్గః । హి । భూయాః । అస్మత్ఽసఖా । ప్రఽతరణః । సుఽవీరః ।
గోభిః । సమ్ఽనద్ధః । అసి । వీడయస్వ । ఆఽస్థాతా । తే । జయతు । జేత్వాని ॥ 1 ॥

అనువాదం

వనస్పతినిర్మిత రథమా! దృఢాంగుడవు కమ్ము
మా సఖుడు స్వశత్రువులతో ప్రతరుణుడు
వీరులతో కూడిన వాడు
గోచర్మ రజ్జువులతో సన్నద్ధుడవయి ఉన్నావు
అందువల్ల దృఢంగా ఉండు. మీ అధిష్ఠాత అయిన పురుషుడు
జయించవలసిన పరకీయబలములను జయించుగాక! ॥ 1 ॥

మంత్రము,

దివస్పృథివ్యాః పర్యోజ ఉద్భృతం
వనస్పతిభ్యః పర్యాభృతం సహః ।
అపామోజ్మానం పరి గోభిరావృత మిన్ద్రస్య
వజ్రం హవిషా రథం యజ ॥ 2 ॥

పదము,

దివః । పృథివ్యాః । పరి । ఓజః । ఉత్ఽభృతమ్ ।
వనస్పతిఽభ్యః । పరి । ఆఽభృతమ్ । సహః ।
అపామ్ । ఓజ్మానమ్ । పరి । గోభిః । ఆఽవృతమ్ ।
ఇన్ద్రస్య । వజ్రమ్ । హవిషా । రథమ్ । యజ ॥ 2 ॥

అనువాదం:

ద్యులోకం నుంచి, భూలోకం నుంచి
అయన బలం ఉద్ధృత మైనది
సారవంతములైన వృక్షముల నుంచి ఆహృత మైనది.

పరాభిభవనక్షమమైన బలమే ఈ రథము.
అలాగే ఉదక ఓజో వికారమైనది.
చుట్టూ గోచర్మములతో ఆవేష్టితమైనది.
ఇంద్రాయుధము వలె అప్రతిహత గతి కలది.
ఇలాంటి రథాన్ని ఓ హోతా!
ఆజ్యాది హవిస్సుతో సంతోష పెట్టు. ॥ 2 ॥

**మంత్రము**

ఇన్ద్రస్యౌజో మరుతా మనీకం
మిత్రస్య గర్భో వరుణస్య నాభిః ।
స ఇమాం నో హవ్యదాతిం జుషాణో
దేవ రథ ప్రతి హవ్యా గృభాయ ॥ 3 ॥

**పదము.**

ఇన్ద్రస్య । ఓజః । మరుతామ్ । అనీకమ్ ।
మిత్రస్య । గర్భః । వరుణస్య । నాభిః ।
సః । ఇమామ్ । నః । హవ్యఽదాతిమ్ । జుషాణః ।
దేవ । రథ । ప్రతి । హవ్యా । గృభాయ ॥ 3 ॥

**అనువాదం.**

ఓ దేవాత్మకమైన రథమా! నీవు ఇంద్రుని ఓజస్సువు.
మరుత్తుల సముదాయరూపమైన బలానివి.
మిత్రుని గర్భమువలె పాలనీయవు.

వరుణుని నాభివలె అవయవభూతవు
అలాంటి నీవు మా యజ్ఞక్రియతో సేవితుడవై
మే మిచ్చే హవిస్సులను ప్రతిగ్రహించు ॥ 3 ॥

ఇది నూట ఇరవై ఐదవ సూక్తం

## సూక్తం-126

ఋషిః అథర్వుడు॥ దేవత ః దున్దుభి॥ ఛందస్సు . 1,2 భురిక్ త్రిష్టుప్ . 3 పురో బృహతీ గర్భా త్రిష్టుప్॥ మంత్రములు ః ॥ 3 ॥

వినియోగం:- పరసేనాత్రాసన విద్వేషణ కర్మలో భేర్యాది వాద్రిత్రాలను మూడు సార్లు వాదనంచేసి ఇవ్వడంలోను, అట్లే మహావ్రతంలో భూమి దుందుభిని తాడనంచేయడంలోను దీనికి వినియోగం.

మంత్రము

ఉప శ్వాసయ పృథివీ ముత ద్యాం
పురుత్రా తే వన్వతాం విష్ఠితం జగత్ ।
స దున్దుభే సజూ రిన్ద్రేణ దేవై ర్దూరాద్
దవీయో అప సేధ శత్రూన్ ॥ 1 ॥

పదము ః

ఉప । శ్వాసయ । పృథివీమ్ । ఉత । ద్యామ్ ।
పురుऽత్రా । తే । వన్వతామ్ । విऽస్థితమ్ । జగత్ ।
సః । దున్దుభే । సऽజూః । ఇన్ద్రేణ । దేవైః । దూరాత్ ।
దవీయః । అప । సేధ । శత్రూన్ ॥ 1 ॥

**అనువాదం**

భూమిని ఆత్మీయకోశంతో ఓ దుందుభీ! పూరించు.
ద్యులోకాన్ని కూడా ఉపశ్వసించు
వివిధావస్థితమైన జగత్తును బహుదేశాలలో
నీ జయఘోషతో సంభజించు
అలాంటి నీవు సంగ్రామాధిదేవత అయిన ఇంద్రునితో
ఓ దుందుభీ! తదనుచరులైన దేవతలతో, మరుత్తులతో
సర్వజనులు వెళ్ళే సుదూరదేశాల కంటె దూరతరంగా
మా శత్రువులను తరిమి వెయ్యి. ॥ 1 ॥

**మంత్రము**

ఆ క్రన్దయ బల మోజో న ఆ ధా
అభి ష్టన దురితా బాధమానః ।
అప సేధ దున్దుభే దుచ్ఛునామిత
ఇన్ద్రస్య ముష్టిరసి వీడయస్వ ॥ 2 ॥

**పదము.**

ఆ । క్రన్దయ । బలమ్ । ఓజః । నః । ఆ । ధాః ।
అభి । స్తన । దుఃఽఇతా । బాధమానః ।
అప । సేధ । దున్దుభే । దుచ్ఛునామ్ । ఇతః ।
ఇన్ద్రస్య । ముష్టిః । అసి । వీడయస్వ ॥ 2 ॥

**అనువాదం :**

ఓ దుందుభీ! శత్రుబలాన్ని ఆక్రందింప జెయ్యి
మా బలాన్ని యుద్ధాభిముఖం చెయ్యి.

పరాజయ నిమిత్తాలైన పాపాలను నివర్తింపజేసి
శత్రువిదారకంగా, కఠోరంగా నినదించు.
యుద్ధరంగం నుంచి దుఃఖకారి అయిన
శత్రుసేనను అపగమింప జెయ్యి
ఇంద్రుని ముష్టివి నీవు కొట్టి దృఢతరమవు కమ్ము. ॥ 2 ॥

మంత్రము

ప్రామూం జయాభీమే జయన్తు

కేతుమద్ దున్దుభి ర్వావదీతు ।

స మశ్వపర్ణాః పతన్తు నో

నరోఽస్మాక మిన్ద్ర రథినో జయన్తు ॥ 3 ॥

పదము.

ప్ర । అమూమ్ । జయ । అభి । ఇమే । జయన్తు ।

కేతుఽమత్ । దున్దుభిః । వావదీతు ।

సమ్ । అశ్వఽపర్ణాః । పతన్తు । నః ।

నరః । అస్మాకమ్ । ఇన్ద్ర । రథినః । జయన్తు ॥ 3 ॥

అనువాదం.

ఓ ఇంద్రా ! ఆ దూరంలో కనిపించే శత్రుసేనను
పూర్తిగా పరాజితం చెయ్యి.
మా ముందున్న భటులు శత్రువులకు
అభిముఖంగా వెళ్ళి జయింతురు గాక !
ఈ దుందుభి ప్రజ్ఞావంతమైనట్టు

ఉచ్చైః స్స్వరంతో పదేపదే ధ్వనించుగాక!
మా సేనానాయకులు అశ్వారూఢులై
యుద్ధభూమిలో విహరింతురు గాక!
అలాగే మా రథికులు జయింతురు గాక! ॥ 3 ॥

ఇది నూట ఇరవై ఆరవ సూక్తం

## సూక్తం-127

ఋషులు - భృగ్వంగిరసులు॥ దేవతలు. వనస్పతి. యక్ష్మనాశనమ్॥
ఛందస్సు 1,2అనుష్టుప్. 3 షట్పదా జగతీ. మంత్రములు. ॥ 3 ॥

వినియోగం,- జలోదర విసర్పాది సర్వరోగ చికిత్సార్థం చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం

మంత్రము

విద్రధస్య బలాసస్య లోహితస్య వనస్పతే
విసల్పకస్యోషధే మోచ్ఛిషః పిశితం చన ॥ 1 ॥

పదము.

విఽద్రధస్య । బలాసస్య । లోహితస్య । వనస్పతే ।
విఽసల్పకస్య । ఓషధే । మా । ఉత్ । శిషః । పిశితమ్ । చన ॥1॥

అనువాదం:

ఓ వనస్పతీ!* ఓ ఓషధీ!**
విదరణ శీలమైన వ్రణవిశేషానికి,
కాసశ్వాసాదులకు, లోహితవర్ణానికి, విసర్పికి
నిదానభూతమైన దుష్టమాంసమును,
వీటి నన్నిటిని కూడా నివర్తించు

* 'చతురంగుళ పలాశ వృక్షః' అని సాయణుడు.
** విసర్పకాది వ్యాధులకు ఔషధభూతమైనది.

మంత్రము॥

యా తే బలాస తిష్ఠతః కక్షే ముష్కావపశ్రితా।

వేదాహం తస్య భేషజం చీపుద్రు రభిచక్షణమ్ ॥ 2 ॥

పదము

యా। తే। బలాస। తిష్ఠతః। కక్షే। ముష్కౌ। అపఽశ్రితా।

వేద। అహమ్। తస్య। భేషజమ్। చీపుద్రుః। అభిఽచక్షణమ్॥2॥

అనువాదం॥

ఓ కాసశ్వాసాది రోగమా!
ఏ వికారములైన, విసర్పకాది రూపములైన
బాహుమూలములలో ఉండే, ముష్కములలో ఉండే
నీ వివిధరూప రోగాలకు నాకు చికిత్సచేయడం తెలుసు
* 'చీపుద్రు' అనే వృక్షవిశేషం ఈ వ్యాధిమూలం తెలిసి
నివర్తింప జేయగల ఔషధము. ॥ 2 ॥

మంత్రము

యో అఙ్గ్యో యః కర్ణ్యో యో అక్ష్యోర్విసల్పకః।

వి వృహామో విసల్పకం విద్రధం హృదయామయమ్।

పరా తమజ్ఞాతం యక్ష్మమధరాఞ్చం సువామసి ॥ 3 ॥

---

* చీపుద్రుః — వృక్షవిశేషము
ఈ పేరుగల వృక్షవిశేషమని సాయణ భాష్యం.
అన్ని ప్రామాణిక నిఘంటువులలోను అట్లే ఉన్నది
'చీపుద్రుః,' 'శిపుద్రుః'— అని పాఠాంతరాలు

పదము :

యః । అఙ్గ్యః । యః । కర్ణ్యః । యః । అక్ష్యోః । వి॒ఽసల్ప॑కః ।
వి । వృహా॒మః । వి॒ఽసల్ప॑కమ్ । వి॒ఽద్రధమ్ । హృ॒దయ
ఽఆమయమ్ ।
పరా । తమ్ । అజ్ఞాతమ్ । యక్ష్మమ్ । అ॒ధరా॑ఞ్చమ్ । సు॒వా॒మ॒సి
॥ 3 ॥

అనువాదం :

ఏ విసర్పకం అంగాది భవమో,
ఏది కర్ణ సమీపంలో ఉన్నదో, ఏది కన్నులవద్ద ఉన్నదో,
ఇలాంటి బహువిధములైన విసర్పక విశేషములను
సమూలంగా ఉన్మూలిస్తున్నాము.
అలాగే విదారణ స్వభావం గల వ్రణవిశేషాన్ని,
హృద్రోగాన్ని నివర్తింపజేస్తున్నాము.
అలాగే అజ్ఞాతమైన యక్ష్మాన్ని,
అధరం నుంచి క్రిందికి వెళ్ళే రోగాన్ని కూడా
పరాఙ్ముఖమగునట్లు చేస్తున్నాము. ॥ 3 ॥

ఇది నూట ఇరవై ఏడవ సూక్తం.

## సూక్తం - 128

ఋషి అంగిరసుడు ॥ దేవతలు, శకధూముడు సోముడు ॥ ఛందస్సు : అనుష్టుప్॥
మంత్రములు · ॥ 4 ॥

వినియోగం - స్వస్త్యయనకాముడు చేసే ఆజ్యాదిహోమంలోను, ప్రశ్నప్రత్యుత్తరంలోను, చంద్రగ్రహణజనిత అరిష్టశాంతికి చేసే ఆజ్యహోమంలోను, గ్రహయజ్ఞంలోను దీనికి వినియోగం.

మంత్రము

శకధూమం నక్షత్రాణి యద్ రాజాన మకుర్వత ।
భద్రాహ మస్మై ప్రాయచ్ఛ న్నిదం రాష్ట్ర మసాదితి ॥ 1 ॥

పదము .

శకఽధూమమ్ । నక్షత్రాణి । యత్ । రాజానమ్ । అకుర్వత ।
భద్రఽఅహమ్ । అస్మై । ప్ర । అయచ్ఛన్ । ఇదమ్ । రాష్ట్రమ్।
అసాత్ । ఇతి ॥ 1 ॥

అనువాదం

శకధూముని (బ్రాహ్మణుని, అగ్నిని) పూర్వం
తారకలు రాజునుగా చేసినవి.
దానికి కారణం ఈ శకధూమానికై
కల్యాణప్రదమైన దినంగా చేసినారు
నక్షత్ర మండలాధిపత్యం మంగళప్రదమైనదిగా
ఉండవలెనని అలా చేసినారు. ॥ 1 ॥

మంత్రము .

భద్రాహం నో మధ్యందినే భద్రాహం సాయ మస్తు నః ।
భద్రాహం నో అహ్నాం ప్రాతా రాత్రీ భద్రాహ మస్తు నః
॥ 2 ॥

పదము ॥

భద్రఽఅహమ్ । నః । మధ్యందినే । భద్రఽఅహమ్ । సాయమ్ ।
అస్తు । నః ।

భద్రఽఅహమ్ । నః । అహ్నమ్ । ప్రాతః । రాత్రీ । భద్ర
ఽఅహమ్ । అస్తు । నః ॥ 2 ॥

అనువాదం

మాకు మధ్యాహ్నం మంగళకరమగుగాక !
అలాగే సాయంకాలం కల్యాణప్రదమగుగాక ।
దినములలో పూర్వాహ్ణకాలం కూడా
మాకు పుణ్యదినమగుగాక !
అలాగే రాత్రి కూడా శుభకాలమగుగాక ! ॥ 2 ॥

మంత్రము :

అహోరాత్రాభ్యాం నక్షత్రేభ్యః సూర్యాచన్ద్రమసాభ్యామ్ ।
భద్రాహ మస్మభ్యం రాజ న్ఛకధూమ త్వం కృధి ॥ 3 ॥

పదము.

అహోరాత్రాభ్యామ్ । నక్షత్రేభ్యః । సూర్యాచన్ద్రమసాభ్యామ్ ।
భద్రఽఅహమ్ । అస్మభ్యమ్ । రాజన్ । శకఽధూమ । త్వమ్ ।
కృధి ॥ 3 ॥

అనువాదం

అహోరాత్రుల నుంచి, నక్షత్రాలనుంచి,
సూర్యచంద్రుల నుంచి ఓ శకధూమా !
ఓ రాజా ! తారాధిపతీ ! మాకు
దినాన్ని మంగళ ప్రదంగా చేయి ॥ 3 ॥

మంత్రము

యో నో భద్రాహ మకరః సాయం న క్తమథో దివా ।

తస్మై తే నక్షత్రరాజ శకధూమ సదా నమః ॥ 4 ॥

పదము

యః । నః । భద్రఽఅహమ్ । అకరః । సాయమ్ । నక్తమ్ ।

అథో ఇతి । దివా ।

తస్మై । తే । నక్షత్రఽరాజ । శకఽధూమ । సదా । నమః ॥ 3 ॥

**అనువాదం**

ఓ శకధూమా! నక్షత్రరాజా!
నీవు మాకు సాయంకాలము నందు, రాత్రిపూట
మఱి పగలు సుదినములుగా చేసినావు
అలాంటి నీకు సర్వదా నమస్కరిస్తున్నాము ॥ 4 ॥

ఇది నూట ఇరవై ఎనిమిదవ సూక్తం

## సూక్తం-129

**ఋషి** అథర్వుడు ॥ **దేవత** : భగుడు ॥ **ఛందస్సు** : అనుష్టుప్ ॥ మంత్రములు: ॥3॥

**వినియోగం** - శంఖపుష్పిక వేరును త్రవ్వి, అభిమంత్రించి సౌభాగ్యకామునికి బంధించడంలోను, తలమీద కట్టడంలోను దీనికి వినియోగం.

మంత్రము

భగేన మా శాంశపేన సాకమిన్ద్రేణ మేదినా ।

* శంఖపుష్పిక - Canscora decussata - అక్షపిద, దండోత్పల, దృఢపాద, కమ్బుపుష్పి, మహాతిక్త, మహేశ్వరి, నకులి, నేత్రమిల, పత్రతండులి, శంఖపుష్పి, శంఖిణి, సూక్ష్మపుష్పి, తిక్త తిక్తయవ, తుండులి. విసర్పిణి, యశస్విని, యవతిక్త, యవి. I M P
శంఖపుష్పికా —A kind of herb increasing virility శంఖపుష్పా. Andropogon acicularium (Vedic dictionary)
Andropogan Acicutatus (M W Dictionary (Samskarak)
ఇన్నిటా తెలుగులో ఏమిటో నిర్దిష్టంగా తెలియదు.

కృణోమి భగినం మాప ద్రాన్త్వరాతయః ॥ 1 ॥

పదము

భగేన । మా । శాంశపేన । సాకమ్ । ఇన్ద్రేణ । మేదినా ।

కృణోమి । భగినమ్ । మా । అప । ద్రాన్తు । అరాతయః ॥ 1 ॥

అనువాదం

శపాకృతిలో నున్న భగదేవునితో కూడా
నన్ను సౌభాగ్యవంతుని చేసుకుంటున్నాను
నా సేవతో సంతుష్టుడైన ఇంద్రునితో
నన్ను భాగ్యవంతునిగా చేసుకుంటున్నాను
దానశీలురు కాని శత్రువులు
మా ముందుకు వచ్చి కుత్సిత గతు లగుదురు గాక! ॥ 1 ॥

మంత్రము

యేన వృక్షాం అభ్యభవో భగేన వర్చసా సహ ।

తేన మా భగినం కృణ్వప ద్రాన్త్వరాతయః ॥ 2 ॥

పదము

యేన । వృక్షాన్ । అభిఽఅభవః । భగేన । వర్చసా । సహ ।

తేన । మా । భగినమ్ । కృణు । అప । ద్రాన్తు । అరాతయః ॥2॥

అనువాదం

ఏ భగునితో ఓ ఓషధీ! అతని తేజస్సుతో నిండి
సమీపస్థములైన వృక్షములను తిరస్కరిస్తున్నావో,

ఆ భగునితో నన్ను సౌభాగ్యవంతుని చేయి
దానశీలురు కాని శత్రువులు మా ముందుకు వచ్చి
కుత్సిత గతు లగుదురు గాక! ॥ 2 ॥

మంత్రము

యో అన్ధో యః పునఃసరో భగో వృక్షే ష్వాహితః ।
తేన మా భగినం కృణ్వప ద్రాన్త్వరాతయః ॥ 3 ॥

పదము

యః । అన్ధః । యః । పునఃఽసరః । భగః । వృక్షేషు । ఆఽహితః
తేన । మా । భగినమ్ । కృణు । అప । ద్రాన్తు । అరాతయః ॥3॥

అనువాదం.

ఏ భగుడు దృష్టిరహితుడో, ఏ భగుడు పునస్సరుడో,
( కళ్ళుకనబడక పోయిన చోటికే పోవువాడు )
దారిలో నున్న వృక్షములతో ఎవడు తాడితుడౌ తుంటాడో,
ఆ భగుడు నన్ను సౌభాగ్యవంతుణ్ణి చేయుగాక !
దానశీలురు కాని శత్రువులు
మా ముందుకు వచ్చి కుత్సితగతు లగుదురు గాక! ॥ 3 ॥

ఇది నూటఇరవై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 130

ఋషిః అథర్వుడు ॥ దేవత, స్మరుడు ॥ ఛందస్సు, 1 విరాట్ పురస్తాద్ బృహతీ ; 2-4 అనుష్టుప్ ॥ మంత్రములు ; ॥ 4 ॥

వినియోగం :- దుష్టస్త్రీ వశీకరణ కర్మలో చేసే ప్రక్రియలలో దీనికి వినియోగం.

మంత్రము

రథజితాం రాథజితేయీనా మప్సరసా మయం స్మరః ।

దేవాః ప్ర హిణుత స్మరమసౌ మామను శోచతు ॥ 1 ॥

పదము :

రథ౽జితామ్ । రాథ౽జితేయీనామ్ । అప్సరసామ్ । అయమ్ । స్మరః ।

దేవాః । ప్ర । హినుత । స్మరమ్ । అసౌ । మామ్ । అను । శోచతు ॥ 1 ॥

అనువాదం

ఓ రథజితా! (మాషాఖ్యమైన ఔషధీ!)
ఆత్మీయవాహనంతో విశ్వాన్ని జయించే
ధ్యానజనకములైన అప్సరసలకు చెందిన
ఈ కాముడు, ఈ దుష్టస్త్రీ నన్ను కామించుటు లేదు.
ఓ దేవతలారా! ఆ కాముని ఈమె వద్దకు పంపండి
ఈ పరాఙ్ముఖురాలు స్మరపీడితయై
నన్ను స్మరించి శోకించు గాక! ॥ 1 ॥

మంత్రము

అసౌ మే స్మరతాదితి ప్రియో మే స్మరతాదితి ।

దేవాః ప్ర హిణుత స్మరమసౌ మామను శోచతు ॥ 2 ॥

పదము :

అసౌ । మే । స్మరతాత్ । ఇతి । ప్రియః । మే । స్మరతాత్ । ఇతి ।

దేవాః । ప్ర । హినుత । స్మరమ్ । అసౌ । మామ్ । అను । శోచతు ॥ 2 ॥

మంత్రము

యథా మమ స్మరాదసౌ నాముష్యాహం కదా చన ।
దేవాః ప్ర హిణుత స్మరమసౌ మామను శోచతు ॥ 3 ॥

పదము

యథా । మమ । స్మరాత్ । అసౌ । న । అముష్య । అహమ్ । కదా । చన ।
దేవాః । ప్ర । హినుత । స్మరమ్ । అసౌ । మామ్ । అను । శోచతు ॥ 3 ॥

అనువాదం

ఈ పురుషుడు నన్ను స్మరించుగాక!
నా యందు అనురాగ యుక్తుడై నన్ను స్మరించుగాక!
ఇలా ఆశంసించే కామార్తురాలైన ఆమె నన్ను స్మరించుగాక!
ఈ స్త్రీని నే నెప్పుడో ఒకప్పుడు కామార్తుడనై
స్మరింపకుండునట్లు ఓ దేవతలారా! ఆ కాముని పంపండి
ఆమె నన్ను గుఱించి అనుశోకించు గాక! ॥ 2, 3 ॥

మంత్రము .

ఉన్మాదయత మరుత ఉదన్తరిక్ష మాదయ ।
అగ్న ఉన్మాదయా త్వమసౌ మా మను శోచతు ॥ 4 ॥

పదము

ఉత్ । మాదయత । మరుతః । ఉత్ । అన్తరిక్ష । మాదయ ।
అగ్నే । ఉత్ । మాదయ । త్వమ్ । అసౌ । మామ్ । అను । శోచతు
॥ 4 ॥

అనువాదం

ఓ మరుత్తులారా! ఈ స్త్రీని ఉన్మత్తురాలిని చేయండి.
ఓ అంతరిక్షమా! నీవు కూడా ఈమెను నావశం చేయి.
ఓ అగ్నీ! నీవు ఈమెను ఉన్మత్తురాలిని చేయి.
అలా ఉన్మత్తురాలైన ఈమె నన్ను తలచుకొని శోకించు గాక!
॥ 4 ॥

ఇది నూట ముప్పైయవ సూక్తం

## సూక్తం - 131

ఋషి. అథర్వుడు॥ దేవత: స్మరుడు॥ ఛందస్సు అనుష్టుప్॥ మంత్రములు.
॥ 3 ॥

వినియోగం:- పూర్వ సూక్తంలో వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము

ని శీర్షతో ని పత్తత ఆధ్యో౩ ని తిరామి తే ।
దేవాః ప్ర హిణుత స్మరమసౌ మామను శోచతు ॥ 1 ॥

పదము

ని । శీర్షతః । ని । పత్తతః । ఆఽధ్యఽః । ని । తిరామి । తే ।
దేవాః । ప్ర । హినుత । స్మరమ్ । అసౌ । మామ్ । అను । శోచతు
॥ 1 ॥

అనువాదం

ఓ భార్యా! నీ శిరస్సు మొదలుకొని
చింతావిశేషములను నీ శరీరములో నిక్షేపిస్తున్నాను
అలాగే నీ పాదములు మొదలుకొని నీ శరీరంలో
మనో వ్యాధులను నిక్షేపిస్తున్నాను.
ఓ దేవతలారా! ఆ కాముని ఈమె ఎద్దకు పంపండి.
ఈమె నన్ను గురించి అనుశోకించు గాక! ॥ 1 ॥

మంత్రము

అనుమతేఽన్విదం మన్యస్వాకూతే సమిదం నమః ।
దేవాః ప్ర హిణుత స్మరమసౌ మామను శోచతు ॥ 2 ॥

పదము

అనుఽమతే । అను । ఇదమ్ । మన్యస్వ । ఆఽకూతే । సమ్ ।
ఇదమ్ । నమః ।
దేవాః । ప్ర । హినుత । స్మరమ్ । అసౌ । మామ్ । అను । శోచతు
॥ 2 ॥

అనువాదం

సర్వ కార్యాలను అనుమతించే దేవపత్నీ!
నా ఈ కోరికను అనుమతించు
సంకల్పాభిమాని అయిన దేవతా!
నీవు కూడా మేము చేసే
హావిర్లక్షణమైన నమస్కారాన్ని అనుమతించు.
ఓ దేవతలారా! ఆ కాముని ఈమె వద్దకు పంపండి.
ఈమె నన్ను గురించి అనుశోకించుగాక! ॥ 2 ॥

మంత్రము

యద్ ధావసి త్రియోజనం పఞ్చయోజనమాశ్వినమ్ ।

తత స్త్వం పునరాయసి పుత్రాణాం నో అసః పితా ॥ 3 ॥

పదము,

యత్। ధావసి। త్రిఽయోజనమ్। పఞ్చఽయోజనమ్।

ఆశ్వినమ్।

తతః। త్వమ్। పునః। ఆఽఅయసి। పుత్రాణామ్। నః।అసః।

పితా ॥ 3 ॥

అనువాదం :

ఓ పురుషుడా! నీవు మూడు యోజనాల దూరం వెళ్ళిపోతావు.
అయిదు యోజనాల దూరం వెళ్ళిపోతావు
అశ్వం మీద వెళ్ళవలసిన దూరాన్ని కూడా వెళ్ళిపోతావు.
ఆ దూరం నుంచి నీవు తిరిగి రా.
మా ఇంటిలో ఉన్న కొడుకులకు తండ్రివి కా ॥ 3 ॥

ఇది నూట ముప్పై ఒకటవ సూక్తం

## సూక్తం - 132

ఋషి. అథర్వుడు ॥ దేవత. స్మరుడు ॥ ఛందస్సు 1 త్రిపాదనుష్టుప్. 2,4,5 (మహా) బృహతీ 3 భురిగనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 5 ॥

వినియోగం — పూర్వసూక్తములో వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము

యం దేవాః స్మర మసిఞ్చ న్నప్స్వ1 న్తః శోశుచానం సహాధ్యా ।

అథర్వ. III 22

తం తే తపామి వరుణస్య ధర్మణా ॥ 1 ॥

పదము:

యమ్ । దేవాః । స్మరమ్ । అసిఞ్చన్ । అప్ఽసు । అన్తః ।
శోశుచానమ్ । సహ । ఆధ్యా ।
తమ్ । తే । తపామి । వరుణస్య । ధర్మణా ॥ 1 ॥

అనువాదం.

సర్వ దేవతలు, భార్యతో పాటు విరహాగ్నితో
సంతప్యమాన గాత్రుడైన ఏ కాముని
ఉదకమధ్యంలో పరితాపశమనార్థమై ఉంచినారో,
ఓ స్త్రీ నీకై ఆకాముని, జలాధి పతి అయిన
వరుణుని ధారణశక్తితో సంతపింప జేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము.

యం విశ్వే దేవాః స్మరమసిఞ్చన్నప్స్వ1న్తఃశోశుచానం
సహాధ్యా ।
తం తే తపామి వరుణస్య ధర్మణా ॥ 2 ॥

పదము

యమ్ । విశ్వే । దేవాః । స్మరమ్ । అసిఞ్చన్ । అప్ఽసు । అన్తః
శోశుచానమ్ । సహ । ఆధ్యా ।
తమ్ । తే । తపామి । వరుణస్య । ధర్మణా ॥ 2 ॥

**అనువాదం :**

విశ్వేదేవతలు, భార్యతో పాటు విరహాగ్నితో
సంతప్యమాన గాత్రుడైన ఏ కాముని ఉదకమధ్యంలో
పరితాపశమనార్థమై ఉంచినారో, ఓ స్త్రీ నీకై ఆ కాముని
జలాధి పతి అయిన వరుణుని ధారణశక్తితో
సంతపింప జేస్తున్నాను. ॥ 2 ॥

**మంత్రము :**

యమిన్ద్రాణీ స్మరమసిఞ్చదప్స్వ1న్తః శోశుచానం సహాధ్యా ।
తం తే తపామి వరుణస్య ధర్మణా ॥ 3 ॥

**పదము**

యమ్ । ఇన్ద్రాణీ । స్మరమ్ । అసిఞ్చత్ । అప్ఽసు । అన్తః ।
శోశుచానమ్ । సహ । ఆధ్యా ।
తమ్ । తే । తపామి । వరుణస్య । ధర్మణా ॥ 3 ॥

**అనువాదం**

ఇంద్రపత్ని, భార్యతో పాటు విరహాగ్నితో
సంతప్యమాన గాత్రుడైన ఏ కాముని
ఉదకమధ్యంలో పరితాపశమనార్థమై ఉంచినదో,
ఓ స్త్రీ! నీకై ఆ కాముని, జలాధిపతి అయిన
వరుణుని ధారణశక్తితో సంతపింప జేస్తున్నాను. ॥ 3 ॥

**మంత్రము :**

యమిన్ద్రాగ్నీ స్మరమసిఞ్చతామప్స్వ1న్తః శోశుచానం
సహాధ్యా ।

తం తే తపామి వరుణస్య ధర్మణా ॥ 4 ॥

పదము :

యమ్ । ఇన్ద్రాగ్నీ ఇతి । స్మరమ్ । అసిఞ్చతామ్ । అప్ఽసు ।

అన్తః । శోశుచానమ్ ।

సహ । ఆధ్యా । తమ్ । తే । తపామి । వరుణస్య । ధర్మణా ॥ 4 ॥

అనువాదం :

ఇంద్రాగ్నులు, భార్యతోపాటు విరహాగ్నితో
సంతప్యమాన గాత్రుడైన ఏ కాముని
ఉదకమధ్యంలో పరితాపశమనార్థమై ఉంచినారో,
ఓ స్త్రీ! నీకై ఆ కాముని జలాధిపతి అయిన
వరుణుని ధారణ శక్తితో సంతపింప జేస్తున్నాను. ॥ 4 ॥

మంత్రము :

యం మిత్రావరుణౌ స్మరమసిఞ్చతామప్స్వ1న్తః శోశుచానం
సహాధ్యా ।

తం తే తపామి వరుణస్య ధర్మణా ॥ 5 ॥

పదము :

యమ్ । మిత్రావరుణౌ । స్మరమ్ । అసిఞ్చతామ్ । అప్ఽసు ।
అన్తః ।

శోశుచానమ్ । సహ । ఆధ్యా । తమ్ । తే । తపామి । వరుణస్య ।
ధర్మణా ॥ 5 ॥

అనువాదం.

మిత్రావరుణులు, భార్యతో పాటు విరహాగ్నితో
సంతప్యమాన గాత్రుడైన ఏ కాముని
ఉదకమధ్యంలో పరితాపశమనార్థమై ఉంచినారో,
ఓ స్త్రీ! నీకై ఆ కాముని జలాధిపతి అయిన
వరుణుని ధారణశక్తితో సంతపింప జేస్తున్నాను. ॥ 5 ॥

ఇది నూట ముప్పై రెండవ సూక్తం

## సూక్తం – 133

ఋషి: అగస్త్యుడు ॥ దేవత మేఖల ॥ ఛందస్సు. 1 భురిక్ త్రిష్టుప్: 2,5 అనుష్టుప్: 3 త్రిష్టుప్. 4 జగతీ ॥ మంత్రములు. ॥ 5 ॥

వినియోగం:- అభిచారకర్మలో దీక్ష వహించే టప్పుడు మేఖలను బంధించడంలో దీనికి వినియోగం. ఉపనయనకర్మలో 4,5 మంత్రాలకు మౌంజీ బంధనంలో వినియోగం.

మంత్రము:

య ఇమాం దేవో మేఖలామాబబన్ధ
యః సంననాహ య ఉ నో యుయోజ ।
యస్య దేవస్య ప్రశిషా చరామః
స పారమిచ్ఛాత్ స ఉ నో వి ముఞ్చాత్ ॥ 1 ॥

పదము.

యః । ఇమామ్ । దేవః । మేఖలామ్ । ఆఽబబన్ధ ।
యః । సమ్ఽననాహ । యః । ఓంఇతి । నః । యుయోజ ।

యస్య । దేవస్య । ప్రఽశిషా । చరామః ।

నః । పారమ్ । ఇచ్ఛాత్ । సః । ఓంఇతి । నః । వి । ముఞ్చాత్
॥ 1 ॥

అనువాదం ॥

ఏ దేవుడు ఈ మేఖలను ( స్వశత్రువధార్థం )
పూర్వం బంధించినాడో, అలాగే ఏ దేవుడు ఇప్పటికీ
ఇతరులకు ఆ మేఖలను కడుతున్నాడో,
ఏ దేవుడు మమ్ములను అభిచారకర్మలో
మేఖలతో యోజనం చేస్తున్నాడో,
ఏ దేవుని ప్రశాసనంతో తిరుగుతున్నామో,
ఆ సర్వాంతర్యామి అయిన దేవుడు
మా మొదటి కోరికను పూర్తిచేయుగాక !
ఆయనే మమ్ములను శత్రువుల నుంచి
విమోచనం చెందించు గాక ! ॥ 1 ॥

మంత్రము ॥

ఆహుతాస్యభిహుత ఋషీణా మస్యాయుధమ్ ।

పూర్వా వ్రతస్య ప్రాశ్నతీ వీరఘ్నీ భవ మేఖలే ॥ 2 ॥

పదము:

ఆఽహుతా । అసి । అభిఽహుతా । ఋషీణామ్ । అసి ।
ఆయుధమ్ ।

పూర్వా । వ్రతస్య । ప్రఽఅశ్నతీ । వీరఽఘ్నీ । భవ । మేఖలే
॥ 2 ॥

అనువాదం.

ఓ మేఖలా! నీవు ఆహుతులతో సంస్కృతమైనదానవు.
సంపాతాభిహుతమైన దానవు.
అతీంద్రియ దర్శులైన విశ్వామిత్రాది ఋషులకు
శత్రుహనన సాధనమైన దానవు.
ఈ కర్మకు ప్రథమంలో వచ్చుదానవు.
శత్రువీరులను సంహరించుదానవు కమ్ము. ॥ 2 ॥

మంత్రము

మృత్యోరహం బ్రహ్మచారీ యదస్మి నిర్యాచన్ భూతాత్ పురుషం యమాయ ।
తమహం బ్రహ్మణా తపసా శ్రమేణానయైనం మేఖలయా సినామి ॥ 3 ॥

పదము:

మృత్యోః । అహమ్ । బ్రహ్మఽచారీ । యత్ । అస్మి । నిః ఽయాచన్ । భూతాత్ । పురుషమ్ । యమాయ ।
తమ్ । అహమ్ । బ్రహ్మణా । తపసా । శ్రమేణ । అనయా । ఏనమ్ । మేఖలయా । సినామి ॥ 3 ॥

అనువాదం:

మృత్యువునకు నేను కర్మకరుడ నవుతున్నాను.
ఎందువల్ల బ్రహ్మచారి నయితినో,
అందువల్ల నా అభిచారకర్మతో, నియమవిశేషంతో,
శత్రువధకు సహాయభూతుడ నౌతున్నాను.

అందువల్ల భూతగ్రామం నుంచి పురుషుని
యమునకు సమర్పిస్తున్నాను.
వధార్హుడైన ఈ శత్రువును మంత్రంతో, తపస్సుతో,
శరీరదండంతో ఈ మేఖలతో నేను బంధిస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము :

శ్రద్ధయా దుహితా తపసోఽధి జాతా
స్వస ఋషీణాం భూతకృతాం బభూవ ।
సా నో మేఖలే మతిమా ధేహి
మేధామథో నో ధేహి తప ఇన్ద్రియం చ ॥ 4 ॥

పదము

శ్రద్ధాయాః । దుహితా । తపసః । అధి । జాతా ।
స్వసా । ఋషీణామ్ । భూతఽకృతామ్ । బభూవ ।
సా । నః । మేఖలే । మతిమ్ । ఆ । ధేహి । మేధామ్ ।
అథో ఇతి । నః । ధేహి । తపః । ఇన్ద్రియమ్ । చ ॥ 4 ॥

అనువాదం :

శ్రద్ధకు కుమార్తె తపస్సు వల్ల ఉత్పన్నురాలైనది.
భూతగ్రామానికి కర్తలైన మరీచి,
అత్రిప్రభృతులకు భగిని అయినది
ఓ మేఖలా! అలాంటి నీవు మా
ఆగామి గోచరమైన బుద్ధిని అభిముఖ్యం చేయి.

అలాగే మేధను అభిముఖం చెయ్యి
అంతేగాక, తపస్సును, ఇంద్రియాన్ని మాకు సమకూర్చు. ॥ 4 ॥

మంత్రము :

యాం త్వా పూర్వే భూతకృత ఋషయః పరిబేధిరే ।
సా త్వం పరి ష్వజస్వ మాం దీర్ఘాయుత్వాయ మేఖలే॥5॥

పదము.

యామ్ । త్వా । పూర్వే । భూతఽకృతః । ఋషయః । పరి ఽబేధిరే ।
సా । త్వమ్ । పరి । స్వజస్వ । మామ్ । దీర్ఘాయుఽత్వాయ । మేఖలే ॥ 5 ॥

అనువాదం.

ఓ మేఖలా! ఏ నిన్ను పృథివ్యాదిభూతగ్రామ కర్తలు,
పూర్వఋషులు పరిబంధించినారో,
అలాంటి నీవు నన్ను దీర్ఘాయుష్మంతుని చేసి,
చిరకాలజీవనార్థం ఆలింగనం చేసుకో. ॥ 5 ॥

ఇది నూట ముప్పై మూడవ సూక్తం

## సూక్తం-134

ఋషి, శుక్రుడు ॥ దేవత: వజ్రుడు ॥ ఛందస్సు. 1 పరానుష్టుప్ త్రిష్టుప్. 2 భురిక్ త్రిపదా గాయత్రి. 3 అనుష్టుప్ ॥ మంత్రములు: ॥ 4 ॥

వినియోగం - అభిచారకర్మలో దీక్షవహిస్తూ దండ పరిగ్రహణం చేయడంలోను, అన్నాన్ని అభిమంత్రించి భుజించడంలోను దీనికి వినియోగం.

మంత్రము

అయం వజ్రస్తర్పయతా మృతస్యావాస్య
రాష్ట్రమప హన్తు జీవితమ్ ।
శృణాతు గ్రీవాః ప్ర శృణాతూష్ణిహా
వృత్రస్యేవ శచీపతిః ॥ 1 ॥

పదము

అయమ్ । వజ్రః । తర్పయతామ్ । ఋతస్య । అవ । అస్య ।
రాష్ట్రమ్ । అప । హన్తు । జీవితమ్ ।
శృణాతు । గ్రీవాః । ప్ర । శృణాతు । ఉష్ణిహాః ।
వృత్రస్యఽఇవ । శచీఽపతిః ॥ 1 ॥

అనువాదం :

నేను ధరించిన ఈ దండం వజ్రాయుధం వలె
సత్యసామర్థ్యంతో తృప్తిచెందుగాక!
ఆ వజ్రాయుధం ఈ శత్రురాజు రాజ్యాన్ని అపహరించు గాక!
కడపటు అతని జీవితాన్ని కూడా అపహరించుగాక!
అలాగే అతని గళగతములైన అస్థికలను ఛిన్నం చేయుగాక!
అక్కడి ధమనులను విచ్ఛినం చేయుగాక!
వృత్రుని అస్థికాదులను ఇంద్రుడు వలె విచ్ఛిన్నం చేయుగాక!
॥ 1 ॥

మంత్రము.

అధరోఽధర ఉత్తరేభ్యో గూఢః పృథివ్యా మోత్సృపత్ ।

వజ్రేణావహతః శయామ్ ॥ 2 ॥

పదము

అధరఃఽఅధరః । ఉత్తరేభ్యః । గూఢః। పృథివ్యాః । మా । ఉత్ ।
సృపత్ ।

వజ్రేణ । అవఽహతః । శయామ్ ॥ 2 ॥

అనువాదం.

ఉత్కృష్టతరములనుంచి నికృష్టతరమైన,
గూఢమైన భూమిలో పడిపోయి,
ఆ పృథివీసకాశం నుంచి మఱల లేవకుండుగాక!
ఈ వజ్రాయుధంతో చూర్ణీకృతుడై మరణించు గాక! ॥ 2 ॥

మంత్రము

యో జినాతి త మన్విచ్ఛ యో జినాతి తమిజ్జహి ।

జినతో వజ్ర త్వం సీమ న్తమన్వఞ్చ మను పాతయ ॥ 3 ॥

పదము.

యః । జినాతి । తమ్ । తమ్ । ఇచ్ఛ । యః । జినాతి । తమ్ ।
ఇత్ । జహి ।

జినతః । వజ్ర । త్వమ్ । సీమ న్తమ్ । అన్వఞ్చమ్ । అను ।
పాతయ ॥ 3 ॥

అనువాదం.

ఏ శత్రువు హాని కలిగిస్తాడో, ఓ వజ్రాయుధమా!
ఆ శత్రువును విచ్ఛిన్నం చెయ్యి

అలాగే ఎవడు చంపడానికి వస్తాడో, వానినే చంపు.
హానిని కల్పించే శత్రుసీమంతాన్ని అనులోమంగా విదారించు.
॥ 3 ॥

ఇది నూట ముప్పై నాల్గవ సూక్తం

## సూక్తం - 135

ఋషి శుక్రుడు॥ దేవత : వజ్రుడు॥ ఛందస్సు. అనుష్టుప్॥ మంత్రములు : ॥3॥

వినియోగం:- అభిచారకర్మలో భుజించే అన్నాన్ని అభిమంత్రించడంలో 1,3 మంత్రాలకు వినియోగం. రెండవమంత్రానికి నీటిని అభిమంత్రించి త్రాగడంలో వినియోగం.

మంత్రము :

యదశ్నామి బలం కుర్వ ఇత్థం వజ్రమా దదే ।
స్కన్ధా నముష్య శాతయన్ వృత్రస్యేవ శచీపతిః ॥ 1 ॥

పదము

యత్ । అశ్నామి । బలమ్ । కుర్వే । ఇత్థమ్ । వజ్రమ్ । ఆ । దదే
స్కన్ధాన్ । అముష్య । శాతయన్ । వృత్రస్యఽఇవ । శచీఽపతిః
॥ 1 ॥

అనువాదం .

భుజించడంతో బలాన్ని వృద్ధిచేసుకుంటున్నాను.
ఆ బలంతో ఇలా వజ్రాయుధాన్ని గ్రహిస్తున్నాను.
ఇంద్రుడు వృత్రుని వలె మేము మా పగవాని
భుజాద్యవయవములను ఛేదిస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము :

యత్ పిబామి సం పిబామి సముద్ర ఇవ సంపిబః ।

ప్రాణా నముష్య సంపాయ సం పిబామో అముం వయమ్ ॥ 2 ॥

పదము

యత్ । పిబామి । సమ్ । పిబామి । సముద్రఃఽఇవ । సమ్ఽపిబః।

ప్రాణాన్ । అముష్య । సమ్ఽపాయ । సమ్ । పిబామః । అముమ్ వయమ్ ॥ 2 ॥

అనువాదం :

నేను నీటిని త్రాగుతున్నాను.
ఆ రూపంతో శత్రురసాన్నే పానం చేస్తున్నాను.
సముద్రం వలె సర్వజలమును పరిగ్రహించి
స్వాధీనం చేసుకుంటున్నాను.
ఈ శత్రువు ప్రాణములను రసీకరించి,
పానం చేసి, కడపట శత్రువునే పానం చేసివేస్తాము. ॥ 1 ॥

మంత్రము .

యద్ గిరామి సం గిరామి సముద్ర ఇవ సంగిరః ।
ప్రాణానముష్య సంగీర్య సం గిరామో అముం వయమ్ ॥3॥

పదము :

యత్ । గిరామి । సమ్ । గిరామి । సముద్రఃఽఇవ। సమ్ఽగిరః

ప్రాణాన్ । అముష్య । సమ్ఽగీర్య । సమ్ । గిరామః । అముమ్ వయమ్ ॥ 3 ॥

**అనువాదం.**

దేనిని నేను లోనికి తీసుకుంటున్నానో
దానిని పూర్తిగా సముద్రం వలె పరిగ్రహిస్తున్నాను.
నా శత్రువు ప్రాణాలను సంగరణం చేస్తున్నాను
తర్వాత వానినే సంగరణం చేస్తున్నాము ॥ 3 ॥

ఇది నూట ముప్పై ఐదవ సూక్తం

## సూక్తం-136

ఋషిః వీతహవ్యుడు (కేశవర్ధనకాముడు)॥ దేవత. నితత్నీ వనస్పతి॥
ఛందస్సు: 1,3 అనుష్టుప్. 2 ద్విపదాసామ్నీ బృహతీ (ఏకావసానా)॥
మంత్రములు. ॥ 3 ॥

వినియోగం.- కేశవృద్ధికరణకాముడు కాచమాచీఫలంకానీ, జీవన్తిఫలంగాని, భృంగ రాజంగాని తలకు అంటుకొని అభిమంత్రించడంలోను, వీటితోకూడిన నీటిని ఉషఃకాలంలో చల్లడంలోను దీనికి వినియోగం.

**మంత్రము:**

దేవీ దేవ్యామధి జాతా పృథివ్యామస్యోషధే ।
తాం త్వా నితత్ని కేశేభ్యో దృంహణాయ ఖనామసి ॥ 1 ॥

**పదము.**

దేవీ । దేవ్యామ్ । అధి । జాతా । పృథివ్యామ్ । అసి । ఓషధే ।
తామ్ । త్వా । నిఽతత్ని । కేశేభ్యః । దృంహణాయ । ఖనామసి
॥ 1 ॥

**అనువాదం**

కాచమాచీమొదలైన ఓ ఓషధీ!
నీవు ద్యోతమానయైన పృథివి యందు ఉత్పన్నురాలవైనావు.

ఓ ప్రసరణశీలమైన (అల్లుకునే) ఓషధీ!
పూర్వగుణవిశిష్టురాలవైన నిన్ను
కేశముల దృఢీకరణకై త్రవ్వి తీసుకుంటున్నాము. ॥ 1 ॥

మంత్రము

దృంహ ప్రత్నాన్ జనయాజాతాన్ జాతాను వర్షీయ
సస్కృధి ॥ 2 ॥

పదము :

దృంహ । ప్రత్నాన్ । జనయ । అజాతాన్ । జాతాన్ । ఓంఇతి ।
వర్షీయసః । కృధి ॥ 2 ॥

అనువాదం :

పండిన వెంట్రుకలను ఓ ఓషధీ!
రాలిపోకుండా చూడు. పుట్టని కేశములను పుట్టించు.
పుట్టిన వానిని బాగా పెరుగునట్లు చెయ్యి. ॥ 2 ॥

మంత్రము :

యస్తే కేశోఽవపద్యతే సమూలో యశ్చ వృశ్చతే ।
ఇదం తం విశ్వభేషజ్యాఽభి సిఞ్చామి వీరుధా ॥ 3 ॥

పదము

యః । తే । కేశః । అవఽపద్యతే । సఽమూలః । యః । చ ।
వృశ్చతే ।
ఇదమ్ । తమ్ । విశ్వఽభేషజ్యా । అభి । సిఞ్చామి । వీరుధా ॥3॥

అనువాదం

ఓ కేశవృద్ధికాముడా!
నీ శిరోజం భగ్నమై భూమిమీద పడుతున్నది
సమూలంగా తెగిపోతున్నది.
అలాంటి కేశమును కేశసంబంధమైన
సర్వరోగాలను నివర్తింప జేసే ఓషధితో అర్ద్రీకరిస్తున్నాను.
॥ 3 ॥

ఇది నూట ముప్పై ఆరవ సూక్తం

## సూక్తం-137

ఋషి: వీతహవ్యుడు (కేశవర్ధన కాముడు)॥ దేవత: నితత్నీవనస్పతి॥
ఛందస్సు: అనుష్టుప్॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం:- పూర్వ సూక్తమునకు వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము

యాం జమదగ్నిరఖనద్ దుహిత్రే కేశవర్ధనీమ్ ।
తాం వీతహవ్య ఆభరదసితస్య గృహేభ్యః ॥ 1 ॥

పదము:

యామ్ । జమత్ఽఅగ్నిః । అఖనత్ । దుహిత్రే । కేశఽవర్ధనీమ్ ।
తామ్ । వీతఽహవ్యః । ఆ । అభరత్ । అసితస్య । గృహేభ్యః ॥ 1 ॥

అనువాదం॥

జమదగ్ని మహర్షి ఆత్మజ కోసమై
కేశవర్ధని అయిన ఓషధిని త్రవ్వి పైకితీసినాడు.
ఆ ఓషధిని వీతహవ్యుడనే మహర్షి
కృష్ణ కేశుడనే మహర్షి ఇంటినుంచి కొనివచ్చినాడు. ॥ 1 ॥

మంత్రము

అభీశునా మేయా ఆసన్ వ్యామేనానుమే యాః ।

కేశా నడా ఇవ వర్ధన్తాం శీర్‌ష్ణస్తే అసితాః పరి ॥ ౨ ॥

పదము

అభీశునా । మేయాః । ఆసన్ । విఽఆమేన । అనుఽమేయాః ।

కేశాః । నడాఃఽఇవ । వర్ధన్తామ్ । శీర్‌ష్ణః । తే । అసితాః । పరి ॥2॥

అనువాదం:

ఓ కేశాభివృద్ధి కాముడా! నీ కేశములు
మొదట అంగుళులతో పరిచ్ఛేద్యము లైనవి
తరువాత ఇవి బారలతో కొలుచుటకు తగిన వైనవి.
ఓ పురుషుడా! నీ శిరస్సంతటా నల్లని కేశము లు
తుంగ వలె పెరుగు గాక! ॥ 2 ॥

మంత్రము.

దృంహ మూలమాగ్రం యచ్ఛ వి మధ్యం యామయౌషధే ।

కేశా నడా ఇవ వర్ధన్తాం శీర్‌ష్ణస్తే అసితాః పరి ॥ 3 ॥

పదము.

దృంహ । మూలమ్ । ఆ । అగ్రమ్ । యచ్ఛ । వి । మధ్యమ్ ।
యమయ । ఓషధే ।

కేశాః । నడాఃఽఇవ । వర్ధన్తామ్ । శీర్‌ష్ణః । తే । అసితాః । పరి ॥3॥

అథర్వ III 23

అనువాదం.

ఓ ఓషధీ! కేశముల మూలములను దృఢం చెయ్యి
అలాగే కేశాగ్రములను పెరుగునట్లు చెయ్యి.
కేశమధ్యములను స్థిరీకరించు ఓ పురుషుడా!
నీ శిర స్సంతటా నల్లని కేశములు తుంగవలె పెరుగు గాక!
॥ 3 ॥

ఇది నూట ముప్పై ఏడవ సూక్తం

## సూక్తం-138

ఋషి: అథర్వుడు॥ దేవత. వనస్పతి॥ ఛందస్సు: 1,2,4,5 అనుష్టుప్; 3 పథ్యాపంక్తి॥ మంత్రములు. ॥ 5 ॥

వినియోగం:- అభిచారకర్మలో సూత్రోక్తప్రకారంగా, మూత్ర పురీషస్థానాన్ని బాధించే కాష్ఠంతో తాడనం చేయడంలో దీనికి వినియోగం.

మంత్రము.

త్వం వీరుధాం శ్రేష్ఠతమాఽభిశ్రుతాఽస్యోషధే ।
ఇమం మే అద్య పూరుషం క్లీబమోపశినం కృధి ॥ 1 ॥

పదము:

త్వమ్ । వీరుధామ్ । శ్రేష్ఠఽతమా । అభిఽశ్రుతా । అసి । ఓషధే ।
ఇమం । మే । అద్య । పూరుషమ్ । క్లీబమ్ । ఓపశినమ్ । కృధి
॥ 1 ॥

అనువాదం.

నిర్వీర్యకారియైన ఓ ఓషధీ!
నీవు ఇతర లతలలో ప్రశస్తమైన దానవు
ఓ ఓషధీ! నీవు సర్వత్రా ప్రసిద్ధమైన దానవు.

ఇప్పుడు నా ద్వేషి అయిన ఈ పురుషుని
నపుంసకునిగా, స్త్రీ వ్యంజనం కలవానిగా చెయ్యి ॥ 1 ॥

మంత్రము

క్లీబం కృధ్యోపశినమథో కురీరిణం కృధి ।

అథాస్యేన్ద్రో గ్రావభ్యాముభే భినత్త్వాణ్డ్యౌ ॥ 2 ॥

పదము

క్లీబమ్ । కృధి । ఓపశినమ్ । అథో ఇతి । కురీరిణమ్ । కృధి ।

అథ । అస్య । ఇన్ద్రః । గ్రావభ్యామ్ । ఉభే ఇతి । భినత్తు ।

ఆణ్డ్యౌ ॥ 2 ॥

అనువాదం,

ఓ ఓషధీ! నా శత్రువును నపుంసకునిగా
స్త్రీ లక్షణోపేతునిగా చెయ్యి.
ఇంకనూ వానికి కేశములు పెరుగునట్లు కూడనూ చెయ్యి
అనంతరం ఈ ద్వేషికి చెందిన అండములను
ఇంద్రుడు రాళ్ళతో నలుగగొట్టు గాక! ॥ 2 ॥

మంత్రము

క్లీబ క్లీబం త్వాకరం వధ్రే వధ్రిం

త్వాకరమరసారసం త్వాకరమ్ ।

కురీరమస్య శీర్షణి కుమ్బం చాధినిదధ్మసి ॥ 3 ॥

పదము

క్లీబ । క్లీబమ్ । త్వా । అకరమ్ । వధ్రే । వధ్రిమ్ ।

త్వా । అకరమ్ । అరస । అరసమ్ । త్వా । అకరమ్ ।

కురీరమ్ । అస్య । శీర్షణి । కుమ్బమ్ । చ । అధిఽనిదధ్మసి ॥ 3 ॥

అనువాదం :

ఓ నపుంసకుడా! నిన్ను ఈ కర్మతో క్లీబునిగా చేసినాను.
స్వభావతః షండుడ వైన నిన్ను సహజక్లీబుని చేసినాను.
రేతోహీనుడా! నిన్ను రేతోహీనునిగా చేస్తున్నాను.
ఇందువల్ల ఈ ద్వేషి తలపై కేశజాలంపై ధరించే
ఆభరణాన్ని నిక్షేపిస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము

యే తే నాడ్యౌ దేవకృతే యయోస్తిష్ఠతి వృష్ణ్యమ్ ।
తే తే భినద్మి శమ్యయాఽముష్యా అధి ముష్కయోః ॥ 4 ॥

పదము

యే ఇతి । తే । నాడ్యౌ । దేవకృతే ఇతి దేవఽకృతే । యయోః ।
తిష్ఠతి । వృష్ణ్యమ్ ।
తే ఇతి । తే । భినద్మి । శమ్యయా । అముష్యాః । అధి ।
ముష్కయోః ॥ 4 ॥

అనువాదం :

విధాతృ నిర్మితాలైన ఏ నీ నాడులలో
నీకు సంబంధించిన వీర్యం ఉన్నదో,
నీ అండముల పైభాగాన ఉన్న ఆ రేతోవహాము లైన

నాడులను ఈ శిలపై పెట్టి రోకలిబండతో
నలుగగొట్టు చున్నాను. ॥ 4 ॥

మంత్రము :

యథా నడం కశిపునే స్త్రియో భిన్దన్త్యశ్మనా ।
ఏవా భినద్మి తే శేపోఽముష్యా అధి ముష్కయోః ॥ 5 ॥

పదము

యథా । నడమ్ । కశిపునే । స్త్రియః । భిన్దన్తి । అశ్మనా ।
ఏవ । భినద్మి । తే । శేపః । అముష్యాః । అధి । ముష్కయోః ॥ 5 ॥

అనువాదం :

స్త్రీలు చాపను అల్లుటకై తుంగను
ఎలా రాళ్ళతో నలుగగొడతారో,
అలాగే ఓ పగవాడా! నీ ముష్కములను,
నీ శేపమును ఈ శిలపై ఉంచి రాతితో నలుగగొడుతున్నాను ॥ 5 ॥

ఇది నూట ముప్పై ఎనిమిదవ సూక్తం

## సూక్తం-139

ఋషి, అథర్వుడు ॥ దేవత. వనస్పతి ॥ ఛందస్సు.- 1 షట్‌పదా విరాడ్ జగతీ ; 2-5 అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 5 ॥

వినియోగం.- స్త్రీ వశీకరణ కర్మలో ( 129వ సూక్తంలో వినియోగం చెప్పినట్లు ) దీనికి కూడా వినియోగం

మంత్రము .

న్యస్తికా రురోహిథ సుభగంకరణీ మమ

శతం తవ ప్రతానాస్త్రయస్త్రింశన్నితానాః ।
తయా సహస్రపర్ణ్యా హృదయం శోషయామి తే ॥ 1 ॥

పదము

ని౽అస్తికా । రురోహిథ । సుభగమ్౽కరణీ । మమ ।
శతమ్ । తవ । ప్ర౽తానాః । త్రయః౽త్రింశత్ । ని౽తానాః ।
తయా । సహస్ర౽పర్ణ్యా । హృదయమ్ । శోషయామి । తే ॥ 1 ॥

అనువాదం :

ఓ శంఖపుష్పికా! న్యస్తికవై నీవు ఉత్పన్నమైనావు
నాకు సౌభాగ్య కర్తవుగా పుట్టినావు
ఓ ఓషధీ! నీ వందలాది శాఖలు
పెరుగుతూ ముప్పైమూడు అవుతున్నవి.
ఓ కామినీ! అలాంటి సహస్రపత్రసమన్వితం అయిన ఓషధిచే
నీ హృదయాన్ని నేను కామాగ్నితో పరితపింప జేస్తున్నాను ॥ 1 ॥

మంత్రము

శుష్యతు మయి తే హృదయమథో శుష్యత్వాస్య౽మ్ ।
అథో ని శుష్య మాం కామేనాథో శుష్కాస్యా చర ॥ 2 ॥

పదము :

శుష్యతు । మయి । తే । హృదయమ్ । అథో ఇతి । శుష్యతు ।
ఆస్య౽మ్ ।

అధో౾ఇతి । ని । శుష్య । మామ్ । కామేన । అధో౾ఇతి । శుష్క౾ఆస్యా । చర ॥ 2 ॥

అనువాదం

ఓ కామినీ! నా విషయంలో నీ హృదయం శుష్క మగుగాక!
ఇంకనూ నీ ముఖం కూడా శుష్కమై పోవుగాక!
మఱీన్ని, నన్ను ఉద్దేశించి కామంతో
విపరీతంగా పరితపించు.
శుష్కాస్యవై నా వద్దకు రా. ॥ 2 ॥

మంత్రము

సం వననీ సముష్పలా బభ్రు కల్యాణి సం నుద ।
అమూం చ మాం చ సం నుద సమానం హృదయం కృధి ॥ 3 ॥

పదము

సమ్౾వననీ । సమ్౾ఉష్పలా । బభ్రు । కల్యాణి । సమ్ । నుద ।
అమూమ్ । చ । మామ్ । చ । సమ్ । నుద । సమానమ్ । హృదయమ్ । కృధి ॥ 3 ॥

అనువాదం

ఓ పీతవర్ణవైన, మంగళకారిణివైన ఓషధీ!
వశీకరణశక్తి గలదానా!
ఉత్తఫలవై నా సమీపానికి ఆ స్త్రీ వచ్చునట్టు చెయ్యి
ఆ తరువాత ఈ కామినిని
కాముకుడనైన నాతో సంయోగింప జెయ్యి
మా హృదయాలను ఏకీభవింపజెయ్యి. ॥ 3 ॥

మంత్రము

యథోదక మపపుషోఽపశుష్యత్యాస్య౽మ్ ।

ఏవా ని శుష్య మాం కామేనాథో శుష్కాస్యా చర ॥ 4 ॥

పదము

యథా । ఉదకమ్ । అపపుషః । అప౽శుష్యతి । ఆస్య౽మ్ ।

ఏవ । ని । శుష్య । మామ్ । కామేన । అథో ఇతి । శుష్క౽ఆస్యా ।

చర ॥ 4 ॥

అనువాదం .

ఏ విధంగా నీరు త్రాగక తృషార్తుడైన
పురుషుని ముఖం శుష్కించి పోతుందో,
అలాగే ఓ కామినీ! నాకై నీవు కామంతో పరితప్తవు కమ్ము
నీవు శుష్కాస్యవై నా వద్దకు రమ్ము ॥ 4 ॥

మంత్రము

యథా నకులో విచ్ఛిద్య సందధాత్యహిం పునః ।

ఏవా కామస్య విచ్ఛిన్నం సం ధేహి వీర్యావతి ॥ 5 ॥

పదము

యథా । నకులః । వి౽ఛిద్య । సమ్౽దధాతి । అహిమ్ । పునః ।

ఏవ । కామస్య । వి౽ఛిన్నమ్ । సమ్ । ధేహి । వీర్య౽వతి ॥ 5 ॥

అనువాదం :

ముంగిస ఏ విధంగా పామును ఖండ ఖండములు చేసి
తిరిగీ సంయోగింప జేస్తుందో,

అలాగే అతివీర్యవతివైన ఓ ఓషధీ!
స్త్రీ పరాఙ్ముఖురాలైనందు వల్ల
అవఖండితుడనైన నన్ను పునస్సంయోగింపజెయ్యి ॥ 5 ॥

ఇది నూట ముప్పై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 140

ఋషిః అథర్వుడు॥ దేవతలు బ్రహ్మణస్పతి, దంతములు॥ ఛందస్సు 1 ఉరోబృహతీ. 2 ఉపరిష్టాజ్జ్యోతిష్మతీ త్రిష్టుప్; 3 ఆస్తారపంక్తి॥
మంత్రములు : ॥ 3 ॥

వినియోగం.– కుమారీ కుమారులకు మొదటగా పై పళ్ళు వచ్చినపుడు ఆ దోష పరిహారార్థం చేసే హోమంలోను, అదే కర్మలో వ్రీహి, యవ, మాష, తిలలను కలిపి నమిలించడంలోను, స్థాలీపాకాన్ని అభిమంత్రించి శిశువుచే తినిపించడంలోను దీనికి వినియోగం.

మంత్రము

యౌ వ్యాఘ్రావవరూఢౌ జిఘత్సతః పితరం మాతరం చ ।
తౌ దన్తౌ బ్రహ్మణస్పతే శివౌ కృణు జాతవేదః ॥ 1 ॥

పదము

యౌ । వ్యాఘ్రౌ । అవఽరూఢౌ । జిఘత్సతః । పితరమ్ । మాతరమ్ । చ ।
తౌ । దన్తౌ । బ్రహ్మణః । పతే । శివౌ । కృణు । జాతఃఽవేదః ॥1॥

అనువాదం

వ్యాఘ్రముల వలె హింసకములైన పైపళ్ళు
[illegible]వాఙ్ముఖములై ప్రబాధములైనవి

తల్లిని, తండ్రిని తినదలచుకొన్న
ఓ బ్రహ్మణస్పతీ! జాతవేద!
ఆ దంతములను శుభంకరములుగా చేయుము ॥ 1 ॥

సూక్తము

వ్రీహిమత్తం యవమత్తమథో మాషమథో తిలమ్ ।
ఏష వాం భాగో నిహితో రత్నధేయాయ
దన్తౌ మా హింసిష్టం పితరం మాతరం చ ॥ 2 ॥

పదము

వ్రీహిమ్ । అత్తమ్ । యవమ్ । అత్తమ్ । అథో ఇతి । మాషమ్ । అథో ఇతి । తిలమ్ ।
ఏషః । వామ్ । భాగః । నిఽహితః । రత్నఽధేయాయ । దన్తౌ । మా ।
హింసిష్టమ్ । పితరమ్ । మాతరమ్ । చ ॥ 2 ॥

అనువాదం:

ఓ మొదట పుట్టిన ఉపరి దంతములారా!
వ్రీహిని భక్షించండి యవలను భక్షించండి.
మినుములను కూడా భక్షించండి. నువ్వులను భక్షించండి
ఓ దంతములారా! రమణీయఫలమునకై
మీ కొఱకు ఈ వ్రీహియవాదిలక్షణమైన భాగం నిక్షిప్తమైనది.
దానితో సంతృప్తిచెందిన మీరు
ఈ శిశువు తల్లి దండ్రులను హింసించకండి. ॥ 2 ॥

మంత్రము.

ఉపహూతౌ సయుజౌ స్యోనౌ దన్తౌ సుమఙ్గలౌ ।
అన్యత్ర వాం ఘోరం తన్వః పరైతు దన్తౌ
మా హింసిష్టం పితరం మాతరం చ ॥ 3 ॥

పదము

ఉపఽహూతౌ । సఽయుజౌ । స్యోనౌ । దన్తౌ । సుఽమఙ్గలౌ ।
అన్యత్ర । వామ్ । ఘోరమ్ । తన్వః । పరా । ఏతు । దన్తౌ ।
మా । హింసిష్టమ్ । పితరమ్ । మాతరమ్ । చ ॥ 3 ॥

అనువాదం

ఉపహూతములు మిత్రయుక్తములు, సుఖకరములు.
ంగళకరములు ఆ పంగోముః అ... ...క!
ఓ దంతములారా! మీకు గొందిన క్రూరకర్మ
ఈ శిశువు శరీరము ను ండి
ఇంకొక చోటికి తరలిపోవుగాక!
మీరు ఈ శిశువు తల్లిదండ్రులను హింసించవద్దు ॥ 3 ॥

ఇది నూట నలభైయవ సూక్తం

## సూక్తం – 141

ఋషి విశ్వామిత్రుడు ॥ దేవతలు. అశ్వినులు ॥ ఛందస్సు అనుష్టుప్ ॥
మంత్రములు. ॥ 3 ॥

వినియోగం – పుష్ట్యర్థ చిత్రాకర్మలో చేసే వివిధ ప్రక్రియలలో దీనికి వినియోగం.

మంత్రము

వాయురేనాః సమాకరత్ త్వష్టా పోషాయ ధ్రియతామ్ ।

ఇన్ద్రి ఆభ్యో అధి బ్రవద్ రుద్రో భూమ్నే చికిత్సతు ॥1॥

పదము.

వాయుః । ఏనాః । సమ్ఽఆకరత్ । త్వష్టా । పోషాయ ।
ధ్రియతామ్ ।

ఇన్ద్రిః । ఆభ్యః । అధి । బ్రవత్ । రుద్రః । భూమ్నే । చికిత్సతు
॥ 1 ॥

అనువాదం.

మా ఆవులను వాయుదేవుడు కలిపి తోలుకొని రావాలి
అలాగే త్వష్ట వాని అభివృద్ధికై వానిని రక్షించాలి
ఈ ఆవులను ఇంద్రుడు అధికంగా ప్రశంసించుగాక!
రుద్రుడు బహుత్వం కోసం చికిత్స చేయుగాక! ॥ 1 ॥

మంత్రము.

లోహితేన స్వధితినా మిథునం కర్ణయోః కృధి ।
అకర్తా మశ్వినా లక్ష్మ తదస్తు ప్రజయా బహు ॥ 2 ॥

పదము.

లోహితేన । స్వఽధితినా । మిథునమ్ । కర్ణయోః । కృధి ।
అకర్తామ్ । అశ్వినా । లక్ష్మ । తత్ । అస్తు । ప్రఽజయా । బహు
॥ 2 ॥

అనువాదం:

ఓ గోపాలా! తామ్ర వికారమైన శస్త్రంతో
కర్ణముల యందు మిథున చిహ్నాన్ని చెయ్యి

అశ్వినీ దేవతలు ఆ చిహ్నాన్ని చేయుదురుగాక।
ఆ గుర్తు పుత్రపౌత్రాదిరూపంగా సంవృత మగుగాక! ॥ 2 ॥

మంత్రము.

యథా చక్రుర్దేవాసురా యథా మనుష్యా౨ఉత ।
ఏవా సహస్రపోషాయ కృణుతం లక్ష్మాశ్వినా ॥ 3 ॥

పదము

యథా । చక్రుః । దేవ౨అసురాః । యథా । మనుష్యా౨ః । ఉత
ఏవ । సహస్ర౨పోషాయ । కృణుతమ్ । లక్ష్మ । అశ్వినా ॥ 3 ॥

అనువాదం

దేవాసురులు పశులక్ష్మను చెవులపై ఎలా చేసినారో,
మనుష్యులు కూడా ఎలా చేసినారో,
ఓ అశ్వినీ దేవతలారా!
గోవులు వేలాదిగా వృద్ధి చెందుటకు
ఆ చిహ్నాన్ని చేయండి ॥ 3 ॥

ఇది నూట నలభై ఒకటవ సూక్తం

## సూక్తం - 142

ఋషి విశ్వామిత్రుడు॥ దేవత. వాయువు॥ ఛందస్సు. అనుష్టుప్॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం:- పుష్ట్యర్థబీజావాపన కర్మలో వ్రీహ్యాదులను నేతితోకలిపి, అభిమంత్రించి మూడు మారులు మూడు పిడికిళ్ళు నాగేటిచాలులో వేసి మట్టితో కప్పి వేయడంలో దీనికి వినియోగం

మంత్రము

ఉచ్ఛ్రియస్వ బహుర్భవ స్వేన మహసా యవ ।
మృణీహి విశ్వా పాత్రాణి మా త్వా దివ్యాశనిర్వధీత్ ॥ 1 ॥

పదము

ఉత్ । శ్రయస్వ । బహుః । భవ । స్వేన । మహసా । యవ ।
మృణీహి । విశ్వా । పాత్రాణి । మా । త్వా । దివ్యా । అశనిః ।
వధీత్ ॥ 1 ॥

అనువాదం.

ఓ యవ ధాన్యమా! నీవు పైకి ఎదిగిరా!
అలాగే అనేక విధాలుగా విస్తరించు.
ఆత్మీయ తేజస్సుతో సర్వవిశ్వములను
కోష్ఠాగారాదులను నింపుము.
దివి భవమైన అశని నిన్ను హింసించ కుండుగాక! ॥ 1 ॥

మంత్రము :

ఆ శృణ్వన్తం యవం దేవం యత్ర త్వాऽచ్ఛావదామసి ।
తదుచ్ఛ్రియస్వ ద్యౌరివ సముద్ర ఇవైధ్యక్షితః ॥ 2 ॥

పదము

ఆऽశృణ్వన్తమ్ । యవమ్ । దేవమ్ । యత్ర । త్వా । అచ్ఛ
ఽఆవదామసి ।
తత్ । ఉత్ । శ్రయస్వ । ద్యౌఃऽఇవ । సముద్రః ఇవ । ఏధి ।
అక్షితః ॥ 2 ॥

అనువాదం

నేను చెప్పున్న దాసిసి వింటున్న
యవధాన్య రూపంలో నున్న దేవుడవైన నిన్ను
ఆ భూమియందు ప్రార్థిస్తున్నాము
ఆ భూమి యందు ఆకాశమువలె ఉన్నతుడవు కమ్ము
సముద్రము వలె అక్షీణుడవు కమ్ము ॥ 2 ॥

మంత్రము

అక్షితాస్త ఉపసదోఽక్షితాః సన్తు రాశయః ।
పృణన్తో అక్షితాః సన్త్వత్తారః సన్త్వక్షితాః ॥ 3 ॥

పదము

అక్షితాః । తే । ఉపఽసదః । అక్షితాః । సన్తు । రాశయః ।
పృణన్తః । అక్షితాః । సన్తు । అత్తారః । సన్తు । అక్షితాః ॥ 3 ॥

అనువాదం

ఓ యవ ధాన్యమా !
నీకై పనిచేసే కర్మకారులు క్షయరహితు లగుదురు గాక !
ధాన్య సమూహములు క్షయరహితములగుగాక !
ఇళ్ళను నింపుతూ కొనివచ్చే జనం
క్షయరహితు లగుదురుగాక !
భోక్తలైన జనం క్షయరహితు లగుదురుగాక ! ॥ 3 ॥

ఇది నూట నలభై రెండవ సూక్తం

ఇది పదమూడవ అనువాకం

ఇది ఆరవ కాండం

# అనువాకం: 1

## సూక్తం - 1

ఋషి. అథర్వుడు (బ్రహ్మవర్చస్కాముడు) ॥ దేవత: ఆత్మ ॥ ఛందస్సు
1 త్రిష్టుప్, 2 విరాడ్ జగతీ ॥ మంత్రములు ॥ 2 ॥

వినియోగం - అర్ధోత్థాపన విఘ్నశమన కర్మలో ఆజ్యసమిత్పురోడాశాది శష్కుల్యంతములైన పదమూడు ద్రవ్యములలో ఏదో ఒక దానిని హోమంచేయడంలో లేదా జపం చేయడంలో దీనికి వినియోగం. సర్వఫలకాముడు దీనితో ఇంద్రాగ్నుల నుద్దేశించి యజ్ఞం కాని ఉపతిష్ఠానం కాని చేస్తాడు.

మంత్రము

ధీతీ వా యే అనయన్ వాచో అగ్రం
మనసా వా యేఽవదన్నృతాని ।
తృతీయేన బ్రహ్మణా వావృధానా
స్తురీయేణామన్వత నామ ధేనోః ॥ 1 ॥

పదము

ధీతీ । వా । యే । అనయన్ । వాచః । అగ్రమ్ ।
మనసా । వా । యే । అవదన్ । ఋతాని ।
తృతీయేన । బ్రహ్మణా । వావృధానాః ।
తురీయేణ । అమన్వత । నామ । ధేనోః ॥ 1 ॥

**అనువాదం .**

ప్రజాపతి లేక ఇంద్రాగ్నుల వాచక వివక్షగల స్తోతలు
ధ్యానాత్మక శబ్దబ్రహ్మతో ప్రజాపతి రూపమైన అర్థమును
లేక ఇంద్రాది రూపమైన అర్థమును
ధ్యాన విషయత్వాన్ని చేసుకొన్నారు
సత్యభూతములైన వాక్యములను పలికినారు
వారు మూడవ బ్రహ్మతో అన్తర్భావితం చేసినారు.
నాల్గవ దానితో మంత్రప్రతిపాదితమైన బ్రహ్మను
ప్రజాపతి నామధేయాన్ని ఉచ్చరించినారు. ॥ 1 ॥

**మంత్రము :**

స వేద పుత్రః పితరం న మాతరం
స సూనుర్భువత్ స భువత్ పునర్మఘః ।
స ద్యామౌర్ణోదన్తరిక్షం స్వ1ః స ఇదం
విశ్వమభవత్ స ఆభవత్ ॥ 2 ॥

**పదము :**

సః । వేద । పుత్రః । పితరమ్ । సః । మాతరమ్ ।
సః । సూనుః । భువత్ । సః । భువత్ । పునః౽మఘః ।
సః । ద్యామ్ । ఔర్ణోత్ । అన్తరిక్షమ్ । స్వ౽ః । సః । ఇదమ్ ।
విశ్వమ్ । అభవత్ । సః । ఆ । అభవత్ ॥ 2 ॥

**అనువాదం.**

ఆ విశ్వాత్మకుడైన ప్రజాపతి
పుత్రుని, ద్యులోకాన్ని ( తండ్రిని ) కనుగొన్నాడు.

ఆయనే తల్లిని ( భూమిని ) తెలుసుకొన్నాడు
వారు ప్రజాపతిని పుత్రుడుగా కనుగొన్నారు
ఆ ప్రజాపతి సర్వజగత్తునకు కుమారుడు.
అతనే కర్మఫలభూతుడు కూడా
అతనే మఘశబ్దంతో కర్మఫలాన్ని ఇస్తున్నాడు
ఆ ప్రజాపతి పరిదృశ్యమానమైన,
నామరూపాత్మకమైన జగత్తుగా తానే పరిణమించినాడు.
ఆయనే అంతటా వ్యాపించి ఉన్నాడు ॥ 2 ॥

ఇది ఒకటవ సూక్తం

## సూక్తం 2

ఋషిః అథర్వుడు ॥ (బ్రహ్మవర్చస్కాముడు)॥ దేవత ఆత్మ ॥ ఛందస్సు॥ త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం.— ఈ చెప్పబోయే ఎనిమిది మంత్రాలలో అథర్వుని గూర్చి యజ్ఞం కాని జపం కాని చెయ్యాలి.

మంత్రము।

అథర్వాణం పితరం దేవబన్ధుం
మాతుర్గర్భం పితురసుం యువానమ్ ।
య ఇమం యజ్ఞం మనసా చికేత
ప్ర ణో వోచస్తమిహేహ బ్రవః ॥ 1 ॥

పదము.

అథర్వాణమ్ । పితరమ్ । దేవఽబన్ధుమ్ ।
మాతుః । గర్భమ్ । పితుః । అసుమ్ । యువానమ్ ।

యః । ఇమమ్ । యజ్ఞమ్ । మనసా । చికేత ।

ప్ర । నః । వోచః । తమ్ । ఇహ । ఇహ । బ్రవః ॥ 1 ॥

అనువాదం

ప్రజాపాలకుని. సృష్టికారణమైన వానిని,
మాతృగర్భమైన వానిని, తండ్రికి
ప్రాణసమానమైన వానిని, యువకుని,
—ఏ తాదృశుడైన * ప్రజాపతిని
( కోరిక నెరవేరుటకై ప్రార్థించుము )
అథర్వాత్మకుడైన, ఋత్విగ్భూతుడైన బ్రహ్మ
ఇప్పుడు చేస్తున్న యజ్ఞాన్ని ఎఱుగును
ఆయన బాగా ఎఱిగినవాడు గనుక
ఈ అభిలషిత సాధనమైన కర్మలో
ఆయన గుఱించి చెప్పుము. ॥ 1 ॥

ఇది రెండవ సూక్తం

## సూక్తం-3

ఋషి అథర్వుడు ॥ (బ్రహ్మవర్చస్కాముడు)॥ దేవత - వాయువు ॥ ఛందస్సు త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం .- ఈ చెప్పబోయే రెండు మంత్రాలలో క్రొత్తరథాన్ని అభిమంత్రించి రాజును ఆరోహింప జేయాలి

మంత్రము :

అయా విష్ఠా జనయన్ కర్వరాణి

* 'అథర్వాణం బ్రహ్మోఽబ్రవీత్ ప్రజాపతేః ప్రజాః సృష్ట్వా పాలయస్వేతి
బ్రహ్మ అథర్వుణుని ప్రజలను సృష్టించి పాలించు మని చెప్పినాడు
అందువలన అతడు ప్రజాపతి అయినాడు.

స హి ఘృణీరురుర్వరాయ గాతుః ।
స ప్రత్యుదైద్ ధరుణం మధ్వో
అగ్రం స్వయా తన్వా౨ తన్వ౨ మైరయత ॥ 1 ॥

పదము

అయా । వి౨స్థా । జనయన్ । కర్వరాణి ।
సః । హి । ఘృణిః । ఉరుః । వరాయ । గాతుః ।
సః । ప్రతి౨ఉదైత్ । ధరుణమ్ । మధ్వః ।
అగ్రమ్ । స్వయా । తన్వా౨ । తన్వ౨మ్ । ఐరయత ॥ 1 ॥

అనువాదం

ఈ సర్వాత్మ భావంతో ఉన్న ప్రజాపతి
యజ్ఞాదికర్మలను ఉత్పన్నం చేస్తున్నాడు
ఆయన దీప్యమానుడై, కర్మఫలం కోసం
గొప్ప మార్గాన్ని, చిరకాలం నుంచి ఉన్న
మధురూపమైన కర్మఫలాన్ని మొదట సృష్టించినాడు.
తన విరాడ్రూపాన్ని, సర్వప్రాణి శరీరాలను
ఆయా కర్మలకై ప్రేరేపిస్తున్నాడు. ॥ 1 ॥

అర్థాంతరం :-

ఈ జయికాముడైన రాజు, శత్రుత్రాసాది
కర్మలను జనింపజేస్తూ, రథస్థితుడై,
దీప్యమానుడై, వరిష్ఠుడై ఫలం కోసం
మహామార్గాన్ని, మధురూపమైన దానిని పొందును గాక!
స్వకీయ బలంతో శత్రుశరీరములను కంపింపజేయుగాక! ॥1॥

ఇది మూడవ సూక్తం

## సూక్తం - 4

ఋషి: అథర్వుడు ॥ (బ్రహ్మవర్చస్కాముడు) ॥ దేవత, వాయువు ॥ ఛందస్సు త్రిష్టుప్ ॥ మంత్రము. ॥ 1 ॥

వినియోగం - పూర్వ సూక్తంలో వలెనే దీనికి కూడా వినియోగం. అశ్వశాంతిలో సర్వౌషధి చూర్ణాన్ని అశ్వం తలపై చల్లడంలో దీనికి వినియోగం. అలాగే చాతుర్మాస్యంలో సునాసీరీయ పర్వంలో వాయవ్యయాగాను మంత్రణంలో దీనికి వినియోగం

మంత్రము

ఏకయా చ దశభిశ్చ సుహూతే

ద్వాభ్యామిష్టయే వింశత్యా చ ।

తిసృభిశ్చ వహసే త్రింశతా చ

వియుగ్భిర్వాయ ఇహ తా వి ముఞ్చ ॥ 1 ॥

పదము.

ఏకయా । చ । దశఽభిః । చ । సుఽహూతే ।

ద్వాభ్యామ్ । ఇష్టయే । వింశత్యా । చ ।

తిసృఽభిః । చ । వహసే । త్రింశతా । చ ।

వియుక్ఽభిః । వాయో ఇతి । ఇహ । తాః । వి । ముఞ్చ ॥ 1 ॥

అనువాదం

కల్యాణాహ్వానానికి కారణమైన ఓ వాయూ!
నీ రథమునకు పదకొండు గుఱ్ఱములను పూన్చినారు.
అవి నిన్ను కొని వస్తున్నవి

యాగార్థమై మా యజ్ఞానికి నిమ్ము
మేము కోరే ఫలాన్ని పూరించుటకే
అవి నిన్ను కొనివస్తున్నవి.
నీ రథానికి ఇరవై రెండు హయములను పూన్చినాగు.
అలాగే మున్పై మూడు అశ్వములను పూన్చినాగు
మా ఆహ్వానాన్ని పురస్కరించు కొని
ఫలప్రదాన ఆదరాన సారంతో శీఘ్రంగా రమ్ము.
ఓ వాయూ! ఇక్కడ మా యజ్ఞంలో
ఆ అశ్వములను కట్టివేయి 1 ॥

ఇది నాల్గవ సూక్తం.

## సూక్తం 5

ఋషి అథర్వుడు॥ (బ్రహ్మవర్చస్కాముడు)॥ దేవత : ఆత్మ॥ ఛందస్సు 1,2,5 త్రిష్టుప్, 3 పంక్తి; 4 అనుష్టుప్॥ మంత్రములు ॥ 5 ॥

**వినియోగం – సోమయాగంలో ఆతిథ్యేష్టిలో హవిస్సు బ్రహ్మను అభిమర్శించుటలో దీనికి వినియోగం.**

మంత్రము

యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని
ధర్మాణి ప్రథమాన్యాసన్ ।
తే హ నాకం మహిమానః సచన్త
యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః ॥ 1 ॥

పదములు

యజ్ఞేన । యజ్ఞమ్ । అయజన్త । దేవాః । తాని ।

ధర్మాణి । ప్రథమాని । ఆసన్ ।

తే । హ । నాకమ్ । మహిమానః । సచన్త ।

యత్ర । పూర్వే । సాధ్యాః । సన్తి । దేవాః ॥ 1 ॥

**అనువాదం.**

దేవతలు (పూర్వం యజ్ఞాలు చేసి దేవత్వం పొందిన
యజమానులు) పూర్వం అగ్నితో నిర్మథనం చేసి
హోమాధారమైన ఆహవనీయాగ్నిని సంయోగింప చేసినారు.
ఆ అగ్నిసాధనములైన కర్మలు ప్రకృష్టతమము లైనవి.
ఆ దేవతలు మాహాత్మ్యయుక్తులై
దుఃఖరహితమైన స్వర్గంలో సంగతు లైనారు
పురాతనులైన దేవత లెక్కడ ఉన్నారో
ఆ నాకం నుంచి ఇక్కడికి
యజ్ఞాధికారుల కోసమై వత్తురు గాక! ॥ 1 ॥

మంత్రము

యజ్ఞో బభూవ స ఆ బభూవ

స ప్ర జజ్ఞే స ఉ వావృధే పునః ।

స దేవానామధిపతిర్బభూవ నో

అస్మాసు ద్రవిణమా దధాతు ॥ 2 ॥

పదము

యజ్ఞః । బభూవ । సః । ఆ । బభూవ ।

సః । ప్ర । జజ్ఞే । సః । ఓంఇతి । వవృధే । పునః ।

సః । దేవానామ్ । అధిపతిః । బభూవ । సః ।

అస్మాసు । ద్రవిణమ్ । ఆ । దధాతు ॥ 2 ॥

అనువాదం

యజ్ఞరూపుడైన ప్రజాపతి విశ్వాత్మనా వ్యాప్తుడైనాడు.
అన్నింటికీ కారణాత్ముడైనాడు.
ప్రసిద్ధుడైన ఆయన ఇప్పటికీ
జగదాత్ముడై పునః పునః వర్ధిల్లుగాక!
ఆయన దేవతలలో ముఖ్యుడు
ఆ యజ్ఞం మాకు హవిస్సుతో
అభిమత ఫలాన్ని ప్రసాదించు గాక! ॥ 2 ॥

మంత్రము

యద్ దేవా దేవాన్ హవిషాఽయజన్తామర్త్యాన్ మనసా
ఽమర్త్యేన ।
మదేమ తత్ర పరమే వ్యోఽమన్ పశ్యేమ తదుదితా
సూర్యస్య ॥ 3 ॥

పదము

యత్ । దేవాః । దేవాన్ । హవిషా । అయజన్త । అమర్త్యాన్ ।
మనసా । అమర్త్యేన ।
మదేమ । తత్ర । పరమే । విఽఓమన్ । పశ్యేమ । తత్ ।
ఉత్ఽఇతౌ । సూర్యస్య ॥ 3 ॥

**అనువాదం**

కర్మతో దేవత్వాన్ని పొందిన వారు
అమరులైన ఇంద్రాదులను మనస్సుతో,
హవిస్సుతో యజనం చేసినారు.
ఆ ఉత్కృష్టమైన ద్యులోకంలో ఈ యజ్ఞ యజమానులమైన
మనం మత్తులమై ఉన్నాము
సూర్యోదయ ఫలాన్ని చూస్తున్నాము. ॥ 3 ॥

**జ్ఞానయజ్ఞఫలమైన మరొక అర్థం.**

ఆత్మవిషయ విద్యతో క్రీడిస్తున్న దేవతలు బ్రహ్మాగ్నిలో
మనస్సుతోను, విషయములతోను, అమర్త్యత్వాభిధానులై,
వినాశి విషయ అనాసక్తమైన మనస్సుతో ఇంద్రియ
వృత్తులను హవిస్సుతో సంకల్పించి యజ్ఞం చేసినారు.
ఆ చిదానంద లక్షణమైన బ్రహ్మ విషయంలో మేము
సంతృప్తి చెందినాము
ఆ ప్రకాశాత్మకమైన తత్త్వాన్ని చూస్తున్నాము

**మంత్రము**

**యత్ పురుషేణ హవిషా యజ్ఞం దేవా అతన్వత ।**

**అస్తి ను తస్మాదోజీయో యద్ విహవ్యేనేజిరే ॥ 4 ॥**

**పదము**

**యత్ । పురుషేణ । హవిషా । యజ్ఞమ్ । దేవాః । అతన్వత ।**

**అస్తి । ను । తస్మాత్ । ఓజీయః । యత్ । వి౽హవ్యేన । ఈజిరే ॥ 4 ॥**

**అనువాదం**

యజమానులు అశ్వరూపములైన హవిస్సుతో
పురుషమేధాఖ్యమైన యజ్ఞాన్ని విస్తరింపజేసినారు

ఆ అతిశయ - ఓజోవంతమైన హవి స్సున్నది.
హోతవ్యరూపమైన జ్ఞానయజ్ఞంతో తమ ఆత్మను
పరమాత్మకు భిన్నం కాకుండా చేసి
సాక్షాత్కరింప జేసుకున్నారు. 4 ॥

మంత్రము

ముగ్ధా దేవా ఉత శునాఽయజన్తోత గోరఙ్గైః పురుధాఽయ
జన్త ।
య ఇమం యజ్ఞం మనసా చికేత ప్ర ణో వోచ స్తమి
హేహ బ్రవః ॥ 5 ॥

పదము

ముగ్ధాః దేవాః । ఉత । శునా । అయజన్త । ఉత । గోః । అఙ్గైః ।
పురుఽధా । అయజన్త ।
యః । ఇమమ్ । యజ్ఞమ్ । మనసా । చికేత । ప్ర । నః । వోచః ।
తమ్ । ఇహ । ఇహ । బ్రవః ॥ 5 ॥

అనువాదం :

కార్యాకార్య వివేక రహితులైన యజమానులు
శునకంతో కూడా యజ్ఞం చేసినారు
గోరూప పశ్వంగములతో పురుషులు
బహుధా యజ్ఞం చేసినారు.
ఏ విద్వాంసుడు ఈ పరమాత్మరూపమైన యజ్ఞాన్ని
మనస్సుతో తెలిసికొనగలడో,
అలాంటి గురువును గూర్చి మాకు తెలుపవలసినది.

ఈ పరమాత్మ స్వరూపాన్ని
ఇప్పుడే మాకు ఉపదేశించవలసినది ॥ 5 ॥

ఇది ఐదవ సూక్తం

## సూక్తం—6

ఋషి: అథర్వుడు (బ్రహ్మవర్చస్కాముడు)॥ దేవత అదితి॥ ఛందస్సు:- 1 త్రిష్టుప్; 2 భురిక్ త్రిష్టుప్, 3,4 విరాడ్జగతీ॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం:-సర్వఫలకాముడు అదితిని ఉద్దేశించి చేసే యజ్ఞంలో లేదా ఉపస్థానంలో దీనికి వినియోగం. అగ్న్యాధానంలో పవమానేష్టిలో అదిత్య హవిరనుమంత్రణంలో దీనికి వినియోగం 2, 3, 4 మంత్రాలకు ఉదకతరణంలో స్వస్త్యయనకాముడు పడవలు మొదలైన వానిని అభిమంత్రించడంలో వినియోగం. దూరదేశగమనంలో స్వస్త్యయన కాముడు ఈ మంత్రత్రయంతో నావను నీటిలో వదలి అభిమంత్రిస్తాడు. అదే కర్మలో ఈ మంత్రత్రయానికి నౌమణిని అభిమంత్రించి నావికులకు కట్టడంలో వినియోగం. 'మహీమూ షు' అనే మంత్రానికి వివాహంలో చతుర్థికా కర్మలో మంచాన్ని స్పృశించడంలో వినియోగం.

అవసథ్యాధానంలో క్రవ్యాద్విసర్జనానంతరం గృహ సమీపంలో నదీరూపాలను చేసి ఉదకంతోనింపి 'మహీమూ షు', 'సుత్రామాణమ్' అనే రెండు మంత్రాలతో నావను ఆరోహిస్తాడు సోమ యాగంలో దీక్షలో 'సుత్రామాణమ్' అనే మంత్రాన్ని కృష్ణాజినస్థుడై యజమానుడు జపిస్తాడు. అగ్నిచయనంలో "వాజస్య ను ప్రసవే అనే మంత్రంతో వాజప్రసవీయ హోమాలను బ్రహ్మ అనుమంత్రిస్తాడు.

మంత్రము

అదితిర్ద్యౌరదితిరన్తరిక్షమదితిర్మాతా స పితా స పుత్రః ।

విశ్వే దేవా అదితిః పఞ్చ జనా అదితిర్జాతమదితిర్జనిత్వమ్
॥ 1 ॥

పదము

అదితిః । ద్యౌః । అదితిః । అన్తరిక్షమ్ । అదితిః । మాతా । సః ।
పితా । సః । పుత్రః ।

విశ్వే । దేవాః । అదితిః । పఞ్చ । జనాః । అదితిః । జాతమ్ ।
అదితిః । జనిత్వమ్ ॥ 1 ॥

అనువాదం.

అదితి పృథివి అదితి ఆకాశం అదితి అంతరిక్షం
అదితి జగజ్జనని అదితే తండ్రి పుత్రుడు కూడా అతనే.
విశ్వేదేవత లంతా అదితి స్వరూపులె
పంచజనులు అదితియే ప్రజాస్సృష్టి అదితియే
జన్మాధికరణం అదితియే ॥ 1 ॥

మంత్రము

మహీమూ షు మాతరం సువ్రతానామృతస్య పత్నీమవసే
హువామహే ।

తువిక్షత్రామజరన్తీమురూచీం సుశర్మాణమదితిం సుప్రణీతిమ్
॥ 2 ॥

పదము

మహీమ్ । ఓం ఇతి । సు । మాతరమ్ । సుఽవ్రతానామ్ । ఋతస్య
పత్నీమ్ । అవసే । హువామహే ।

తువిఽక్షత్రామ్ । అజరన్తీమ్ । ఉరూచీమ్ । సుఽశర్మాణమ్ ।

అదితిమ్ । సుఽప్రనీతిమ్ ॥ 2 ॥

అనువాదం

మహనీయుమైన సువ్రతులైన పురుషులకు
మాతృస్థానంలోని ఋతస్వరూపం, పత్నీ స్వరూపం,
బహుబలమైన, అవినశ్వరమైన, మహత్తరమైన,
సుఖకరమైన, సుప్రణీతమైన అదితిని
రక్షణకోసమై ఆహ్వానిస్తున్నాము. ॥ 2 ॥

మంత్రము

సుత్రామాణం పృథివీం ద్యామనేహసం

సుశర్మాణమదితిం సుప్రణీతిమ్ ।

దైవీం నావం స్వరిత్రామనాగసో

అస్రవన్తీమా రుహేమా స్వస్తయే ॥ 3 ॥

పదము.

సుఽత్రామాణమ్ । పృథివీమ్ । ద్యామ్ । అనేహసమ్ ।

సుఽశర్మాణమ్ । అదితిమ్ । సుఽప్రనీతిమ్ ।

దైవీమ్ । నావమ్ । సుఽఅరిత్రామ్ । అనాగసః ।

అస్రవన్తీమ్ । ఆ । రుహేమ । స్వస్తయే ॥ 3 ॥

అనువాదం :

చక్కగా రక్షించే పృథివిని, ద్యోతమానమైన,
పాపరహితమైన, సుఖకరియైన, శోభనారిత్రయైన,

అచ్ఛిద్రమైన దేవిని - నౌకాసదృశమైన
ప్రసిద్ధమైన నావను - అనపరాధులమైన మేము
మా క్షేమంకోసం ఆరోహిస్తున్నాము ॥ 3 ॥

మంత్రము

వాజస్య ను ప్రసవే మాతరం మహీమదితిం నామ వచసా
కరామహే ।
యస్యా ఉపస్థ ఉర్వ1న్తరిక్షం సా నః శర్మ త్రివరూథం
ని యచ్ఛాత్ ॥ 4 ॥

పదము

వాజస్య । ను । ప్రఽసవే । మాతరమ్ । మహీమ్ । అదితిమ్ ।
నామ । వచసా । కరామహే ।
యస్యాః । ఉపఽస్థః । ఉరు । అన్తరిక్షమ్ । సా । నః । శర్మ ।
త్రిఽవరూథమ్ । ని । యచ్ఛాత్ ॥ 4 ॥

అనువాదం.

అన్నోత్పత్తి కోసం తల్లియైన భూమిని
'అదితి' అను పేరుగల దానిని స్తుతిస్తున్నాము
ఏ అదితి సమీపస్థమై విస్తీర్ణమైన అంతరిక్షం కలదో,
ఆ అదితి మాకు త్రికక్ష్యమైన గృహాన్ని ఇచ్చుగాక! ॥ 4 ॥

ఇది ఆరవ సూక్తం

## సూక్తం – 7

ఋషి. అథర్వుడు (బ్రహ్మవర్చస్కాముడు)॥ దేవత : అదితి॥ ఛందస్సు :
ఆర్షీ జగతీ ॥ మంత్రము : ॥ 1 ॥

**వినియోగం** సర్వఫలకాముడు దేవతల నుద్దేశించి చేసే యజ్ఞంలో దీనికి వినియోగం.

మంత్రము

దితేః పుత్రాణా మదితే రకారిషమ్
అవ దేవానాం బృహతా మనర్మణామ్ ।
తేషాం హి ధామ గభిషక్ సముద్రియం
నైనాన్ నమసా పరో అస్తి కశ్చన ॥ 1 ॥

పదము.

దితేః । పుత్రాణామ్ । అదితేః । అకారిషమ్ ।
అవ । దేవానామ్ । బృహతామ్ । అనర్మణామ్ ।
తేషామ్ । హి । ధామ । గభిఽసక్ । సముద్రియమ్ ।
న । ఏనాన్ । నమసా । పరః । అస్తి । కః । చన ॥ 1 ॥

**అనువాదం**

*దితికుమారుల స్థానాన్ని అదితి పుత్రులకోసమై విచ్ఛిన్నం చేస్తున్నాను.
గుణసహితమైన, శత్రువులకు అందుబాటులో లేని,
సముద్రంలో పుట్టిన, అలాంటి దైత్యుల స్థానాన్ని గంభీరమైన

* కశ్యప మహర్షికి దితి, అదితి అని ఇద్దరు భార్యలు. అదితి కుమారులు దేవతలు. దితి కుమారులు దైత్యులు లేక దానవులు. దేవయాగంలో ఈ మంత్ర మున్నది గనుక దేవప్రశంసాపరంగా దీనిని వ్యాఖ్యానిస్తున్నా నని సాయణాచార్యులు.

దానిని, ఊర్జయమైన దానిని పడగొడుతున్నాను
దేవతలైన వారికి నమస్కారంతో
హవిః ప్రదానం బహూకరించుదు లేదు. ॥ 1 ॥

ఇది ఏడవ సూక్తం

## సూక్తం — 8

ఋషిః ఉపరిబభ్రవుడు ॥ దేవత. బృహస్పతి ॥ ఛందస్సు . త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

**వినియోగం :**— ప్రవాసంలో ద్రవ్యలాభార్థం దీనితో ఆజ్యసమిత్పురోడాశాదులలో ఏదో ఒకదానితో హోమం చేస్తారు. లేదా దీనిని పఠిస్తారు. గుఱ్ఱాలు మొదలైన వాటిపై వెళ్ళినపుడు దీనితో అశ్వాదికాన్ని అభిమంత్రించి, ఉదకంతో సంప్రోక్షించి, విడిచిపెడతారు.
వస్త్రాదులను విక్రయించడానికి వెళ్ళేటప్పుడు దీనితో వాటిని అభిమంత్రించి లాభకాముడు అభిగత దేశానికి తీసుకొని వెళ్తాడు. అలాగే లాభకాముడు ఈ వస్త్రాదికములను దీనితో అభిమంత్రించి స్వీకరిస్తాడు.

అలాగే గ్రహయజ్ఞంలో ఈ మంత్రంతో బృహస్పతిని ఉపస్థానం చేస్తాడు.

మంత్రము :

**భద్రాదధి శ్రేయః ప్రేహి బృహస్పతిః పురఏతా తే అస్తు।**
**అథేమ మస్యా వర ఆ పృథివ్యా ఆరేశత్రుం కృణుహి సర్వవీరమ్ ॥ 1 ॥**

పదము :

**భద్రాత్ । అధి । శ్రేయః । ప్ర । ఇహి । బృహస్పతిః । పురఃఽఏతా । తే । అస్తు ।**

అథ । ఇమమ్ । అస్యాః । వరే । ఆ । పృథివ్యాః ।

ఆరేఽశత్రుమ్ । కృణుహి । సర్వఽవీరమ్ ॥ 1 ॥

**అనువాదం :**

ఓ వస్త్రధనాది లాభకామ పురుషుడా !
మంగళకరమైన సంపదల నుండి శ్రేయస్సును పొందు.
లాభార్థమై పోతున్న నీకు బృహస్పతి అగ్రగామి అగుగాక !
ఓ బృహస్పతీ ! నీవు పురోగామివై ఈ లాభకాముడైన
పురుషుని ఈ భూమికి ఉత్కృష్టస్థానంలో నిలబెట్టు
పుత్రభృత్యాదులతో కూడిన శత్రువును దూరీకరించు ॥ 1 ॥

ఇది ఎనిమిదవ సూక్తం

## సూక్తం-9

ఋషి ఉపరి బభ్రవుడు ॥ దేవత : పూష ॥ ఛందస్సు : 1,2 త్రిష్టుప్. 3 త్రిపదా ఉఽర్షీ గాయత్రీ : 4 అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 4 ॥

**వినియోగం :-** నష్టద్రవ్యలాభార్థం నష్టద్రవ్యకాంక్షుల దక్షిణహస్తాన్ని స్పృశించి ఉత్థాపనం చేయడంలో దీనికి వినియోగం అదే కర్మలో ఇరవై యొక్క చక్కెరముక్కలను అభిమంత్రించి చతుష్పథంలో చల్లడంలో దీనికి వినియోగం,

చాతుర్మాస్యంలో వైశ్వదేవపర్వంలో పౌష్ణహవిస్సును అనుమంత్రించడంలో 'ప్రపథే పథామ్' అనే మంత్రానికి వినియోగం.

**మంత్రము :**

ప్రపథే పథా మజనిష్ట పూషా

ప్రపథే దివః ప్రపథే పృథివ్యాః ।

ఉభే అభి ప్రియతమే సధ స్థే
ఆ చ పరా చ చరతి ప్రజానన్ ॥ 1 ॥

పదము

ప్రఽపథే । పథామ్ । అజనిష్ట । పూషా ।
ప్రఽపథే । దివః । ప్రఽపథే । పృథివ్యాః ।
ఉభేఇతి । అభి । ప్రియఽతమేఇతి । ప్రియఽతమే ।
సధఽస్థేఇతిసధఽస్థే । ఆ । చ । పరా । చ । చరతి । ప్రఽజానన్
॥ 1 ॥

అనువాదం

పూష అనే మార్గదర్శకుడైన దేవుడు
మార్గ రక్షణార్థమై, మార్గముఖాలలో ప్రాదుర్భవిస్తాడు.
అలాగే ద్యులోక ప్రవేశ ద్వారంలో,
పృథివీ ప్రవేశద్వారంలో ప్రాదుర్భవిస్తాడు.
ఆ పూష అతిశయప్రీతిమంతమైన ద్యావాపృథువుల
నభిలక్షించి యజమాన కృత
కర్మఫలాన్ని ఉత్కృష్టంగా చేస్తాడు
పృథివికి వస్తాడు
పృథివి నుండి దివికి వెళ్తాడు. ॥ 1 ॥

మంత్రము.

పూషే మా ఆశా అను వేద సర్వాః
సో అస్మాం అభయతమేన నేషత్ ।

స్వస్తిదా అఘృణిః సర్వవీరోఽప్రయుచ్ఛన్
పుర ఏతు ప్రజానన్ ॥ 2 ॥

పదము

పూషా । ఇమాః । ఆశాః । అను । వేద । సర్వాః ।
సః । అస్మాన్ । అభయఽతమేన । నేషత్ ।
స్వస్తిఽదాః । అఘృణిః । సర్వఽవీరః ।
అప్రఽయుచ్ఛన్ । పురః । ఏతు । ప్రఽజానన్ ॥ 2 ॥

అనువాదం

పూష ఈ దిక్కు లన్నిటిని అనుక్రమంగా తెలిసినవాడు.
ఆయన మమ్ములను భయరహితమైన
మార్గంలో నడిపించుగాక! ఆయన స్వస్తిప్రదుడు
వ్యాప్త దీప్తి గలవాడు సర్వవీర సంయుతుడు.
ప్రమాదం చేయకుండా మా మార్గంలో మాకు
దారి చూపుతూ నడచుగాక! ॥ 2 ॥

మంత్రము

పూషన్ తవ వ్రతే వయం న రిష్యేమ కదా చన ।
స్తోతారస్త ఇహ స్మసి ॥ 3 ॥

పదము,

పూషన్ । తవ । వ్రతే । వయమ్ । న । రిష్యేమ । కదా । చన ।
స్తోతారః । తే । ఇహ । స్మసి ॥ 3 ॥

అనువాదం

ఓ పూషా! నీ యాగరూపమైన కర్మలో నిమగ్నులమైన
మేము ఏ ఒకప్పుడూ నశింప కుందుముగాక!
మేము నీ స్తుతిపరుల మగుదుము గాక! ॥ 3 ॥

మంత్రము:

పరి పూషా పరస్తా ద్ధస్తం దధాతు దక్షిణమ్ ।
పున ర్నో నష్ట మాజతు సం నష్టేన గమేమహి ॥ 4 ॥

పదము:

పరి । పూషా । పరస్తాత్ । హస్తమ్ । దధాతు । దక్షిణమ్ ।
పునః । నః । నష్టమ్ । ఆ । అజతు । సమ్ । నష్టేన । గమేమహి
॥ 4 ॥

అనువాదం

పూష అతిదూరదేశం నుంచి కూడా
దక్షిణ హస్తాన్ని ( ధనార్థమై ) ప్రసరింప జేయుగాక!
మేము నష్టపోయిన ధనాన్ని తిరిగి తెచ్చి ఇచ్చుగాక! ॥ 4 ॥

ఇది తొమ్మిదవ సూక్తం

## సూక్తం-10

ఋషి: శౌనకుడు ॥ దేవత . సరస్వతి ॥ ఛందస్సు . త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం .- జ్వరరోగగ్రస్తుడైన బాలకుని చికిత్సార్థం దీనిని వరించి బాలుని పాలు త్రాపించాలి అదే కర్మలో ప్రియంగు, తండులములమీద పాలు పిండి దీనితో అభిమంత్రించి వ్యాధితుస కివ్వాలి.

మంత్రము:

యస్తే స్తనః శశయుర్యో మయోభూర్యః

సుమ్నయుః సుహవో యః సుదత్రః ।
యేన విశ్వా పుష్యసి వార్యాణి
సరస్వతి తమిహ ధాతవే కః ॥ 1 ॥

మంత్రము.

యః । తే । స్తనః । శశయుః । యః । మయఃఽభూః । యః ।
సుమ్నఽయుః । సుఽహవః । యః । సుఽదత్రః ।
యేన । విశ్వా । పుష్యసి । వార్యాణి ।
సరస్వతి । తమ్ । ఇహ । ధాతవే । కః ॥ 1 ॥

**అనువాదం :**

ఓ సరస్వతీ! నీవు ఏ శిశువును పాలిచ్చి పోషిస్తున్నావో,
ఏ స్తనం సుఖప్రదాత అయినదో, శోభనాహ్వాన మైనదో,
ఏది కల్యాణదాన పరమైనదో, దేనిచేత విశ్వవరణీయములను
పోషిస్తున్నావో, తాదృశగుణోపేతమైన స్తనాన్ని
ఇక్కడ ఈ బాలకుని రక్షించునదిగా చేయి ॥ 1 ॥

ఇది పదవ సూక్తం

## సూక్తం - 11

**ఋషిః** శౌనకుడు ॥ దేవత - సరస్వతి॥ ఛందస్సు : త్రిష్టుప్॥ మంత్రము ॥ 1 ॥

**వినియోగం.-** అశని నివారణ కర్మలోను, గ్రహయజ్ఞంలో కేతువును గూర్చి హోమం చేయుటలోను, ఉపాకర్మలో చేసే ఆజ్యహోమంలోను దీనికి వినియోగం

మంత్రము.

యస్తే పృథు స్తనయిత్నుర్య ఋష్వో

దైవః కేతుర్విశ్వమాభూషతీదమ్ ।

మా నో వధీ ర్విద్యుతా దేవ సస్యం

మోత వధీ రశ్మిభిః సూర్యస్య ॥ 1 ॥

పదము

యః । తే । పృథుః । స్తనయిత్నుః । యః । ఋష్వః ।

దైవః । కేతుః । విశ్వమ్ । ఆఽభూషతి । ఇదమ్ ।

మా । నః । వధీః । విఽద్యుతా । దేవ । సస్యమ్ ।

మా । ఉత । వధీః । రశ్మిఽభిః । సూర్యస్య ॥ 1 ॥

అనువాదం

ఓ పర్జన్యదేవా! నీ వికీర్ణమైన
గర్జించే అశని ఏదైతే బాధకమో,
పర్జన్యసంబంధమైన, కేతుగ్రహరూపమైన ఆ అశని
ఈ పరిదృశ్యమానమైన విశ్వాన్ని వ్యాపిస్తున్నది
ఓ పర్జన్యా అలాంటి అశనులను మాపై వేయవద్దు
సూర్యుని కిరణములతో మా సస్యములు
ఎండిపోవ కుండు గాక! ॥ 1 ॥

ఇది పదకొండవ సూక్తం

## సూక్తం-12

ఋషి: శౌనకుడు ॥ దేవతలు- 1 సభా, సమితి, పితరులును. 2 సభా 3 ఇంద్రుడు. 4 మనస్సు ॥ ఛందస్సు 1 భురిక్ త్రిష్టుప్ 2-4 అనుష్టుప్ ॥ మంత్రములు- ॥ 4

**వినియోగం :- 'సభా చ మా' అనే మంత్రపంచకంతో సభాజయ కర్మలో క్షీరౌదనం, పురోడాశం వేసి అభిమంత్రించి తినాలి. అదే కర్మలో ఈ మంత్రపంచకాన్ని జపిస్తూ సభా స్తంభాన్ని పట్టుకోవాలి. అదే కర్మలో వీటితో సభను ఉన్ముఖం చేసుకోవాలి.**

మంత్రము

సభా చ మా సమితి శ్చావతాం
ప్రజాపతే ర్దుహితరౌ సంవిదానే ।
యేనా సంగచ్ఛా ఉప మా స
శిక్షా చ్చారు వదాని పితరః సంగతేషు ॥ 1 ॥

పదము,

సభా । చ । మా । సమ్ఽఇతిః । చ । అవతామ్ ।
ప్రజాఽపతేః । దుహితరౌ । సంవిదానేఇతి సమ్ఽవిదానే ।
యేన । సమ్ఽగచ్ఛై । ఉప । మా । సః ।
శిక్షాత్ । చారు । వదాని । పితరః । సమ్ఽగతేషు ॥ 1 ॥

**అనువాదం**

ప్రజాపతి పుత్రికలైన విద్వత్సభ, సమితి
వాదియైన నన్ను రక్షించుగాక!
ఆ సభలు మా రక్షణవిషయమై
ఐకమత్యాన్ని పొంది వాదితో
వాదించుటకు సిద్ధముగా నున్నవి
ఆ విద్వాంసుడు ఆ వాదితో మాట్లాడుటకు సంగతుడై ఉన్నాడు.

ఆ విద్వాంసుడు నా వద్దకు వచ్చి నాకు శిక్షణ ఇచ్చుగాక!
ఓ పితరులారా! మీరే నన్ను మాట 'సాధు, సాధు'
అని ప్రశంసిస్తూ, సంగతులై నాతో పాటు
మిళితులైన వాదుల యందు న్యాయోపేతమైన
చక్కని జవాబును ఇత్తును గాక! ॥ 1 ॥

మంత్రము :

విద్మ తే సభే నామ నరిష్టా నామ వా అసి ।
యే తే కే చ సభాసదస్తే మే సన్తు సవాచసః ॥ 2 ॥

పదము

విద్మ । తే । సభే । నామ । నరిష్టా । నామ । వై । అసి ।
యే । తే । కే । చ । సభాऽసదః । తే । మే । సన్తు । సऽవాచసః
॥ 2 ॥

అనువాదం.

ఓ సభా! నీపేరు మాకు తెలుసు
నీవు పరులచేత అనభిభావ్యమైన దానవు.
ఎక్కువమంది కలిసి ఒకే మాటను పలికితే
దానిని అతిక్రమించటానికి సాధ్యం కాదు
కాబట్టి నీకు సంబంధించిన సభలోని
విద్వాంసులు సర్వులూ నాతో సమానవాక్కులగుదురు గాక!
॥ 2 ॥

మంత్రము .

ఏషా మహం సమాసీనానాం వర్చో విజ్ఞానమా దదే ।
అస్యాః సర్వస్యాః సంసదో మా మిన్ద్ర భగినం కృణు॥ 3 ॥

పదము

ఏషామ్ । అహమ్ । సమ్ఽఆసీనానామ్ । వర్చః । విఽజ్ఞానమ్ ।
ఆ । దదే ।

అస్యాః । సర్వస్యాః । సమ్ఽసదః । మామ్ । ఇన్ద్ర । భగినమ్ ।
కృణు ॥ 3 ॥

అనువాదం

సభలో ఆసీనులై ముందున్న వారుల
వర్చస్సును, విజ్ఞానమును నేను స్వీకరిస్తున్నాను.
ఓ ఇంద్రా! ఈ సభాసదులందరి భాగ్యం నాకు అప్పగించు.
॥ 3 ॥

మంత్రము

యద్ వో మనః పరాగతం యద్ బద్ధమిహ వేహ వా ।
తద్ వ ఆ వర్తయామసి మయి వో రమతాం మనః ॥4॥

పదము:

యత్ । వః । మనః । పరాఽగతమ్ । యత్ । బద్ధమ్ । ఇహ ।
వా । ఇహ । వా ।

తత్ । వః । ఆ । వర్తయామసి । మయి । వః । రమతామ్ ।
మనః ॥ 4 ॥

అనువాదం.

ఓ సభాసదులారా! మీ ఏ మనస్సు మా నుండి పరాగతమై,
ఇతర విషయ సంసక్తమై ఉన్నదో అలాంటి మీ మనస్సును

మాకు అభిముఖంగా చేయండి
అలా ఆవర్తితమైన మనస్సు నాయందు రమించు గాక! ॥ 4 ॥

ఇది పన్నెండవ సూక్తం

## సూక్తం . 13

ఋషి అథర్వుడు (శత్రువర్చస్సును హరించు కోరిక గలవాడు.) దేవత: సూర్యుడు ॥ ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు ॥ 2 ॥

వినియోగం: కృత్యాప్రతిహరణ కర్మలో కృత్యానిస్సారణానంతరం స్వగృహానికి వచ్చి 'యథా సూర్యః' అనే మంత్రాన్ని పఠిస్తూ ప్రదక్షిణం చేయాలి.

అభిచార కర్మలో 'యథా సూర్యో నక్షత్రాణాం' అనే మంత్ర ద్వయాన్ని శత్రువును చూస్తూ జపించాలి. అదే కర్మలో 'యావన్తో మాం సపత్నానాం' అనే మంత్రాన్ని జపిస్తూ శత్రువులను నిరీక్షించాలి

అలాగే నైర్ఋత కర్మలో నిర్ఋతి ప్రతికృతి విసర్జనానంతరం 'యథా సూర్యః' అనే మంత్రాన్ని జపిస్తూ తిరిగి ఇంటికి రావాలి.

మంత్రము

యథా సూర్యో నక్షత్రాణా ముద్యం స్తేజాం స్యాదదే ।
ఏవా స్త్రీణాం చ పుంసాం చ ద్విషతాం వర్చ ఆ దదే ॥1॥

పదము:

యథా । సూర్యః । నక్షత్రాణామ్ । ఉత్ఽయన్ । తేజాంసి ।
ఆఽదదే ।
ఏవ । స్త్రీణామ్ । చ । పుంసామ్ । చ । ద్విషతామ్ । వర్చః । ఆ ।
దదే ॥ 1 ॥

అనువాదం

ఉదయిస్తూ సూర్యుడు నక్షత్రముల తేజస్సును
ఏ విధంగా పరిగ్రహిస్తాడో, అలాగే మాకు శత్రువులైన
స్త్రీ పురుషుల తేజస్సును నా స్వాధీనం చేసుకుంటున్నాను
॥ 1 ॥

మంత్రము.

యావన్తో మా సపత్నానా మాయన్తం ప్రతిపశ్యథ ।
ఉద్యన్త్సూర్య ఇవ సుప్తానాం ద్విషతాం వర్చ ఆ దదే ॥2॥

పదము.

యావన్తః । మా । సఽపత్నానామ్ । ఆఽయన్తమ్ । ప్రతి
ఽపశ్యథ ।
ఉత్ఽయన్ । సూర్యఃఽఇవ । సుప్తానామ్ । ద్విషతామ్ । వర్చః ।
ఆ । దదే ॥ 2 ॥

అనువాదం

శత్రు మధ్యంలో మీ రెంతమంది ఉన్నారో,
మీపైకి యుద్ధానికి వచ్చే నన్ను ప్రతికూలంగా చూడండి.
మీ వర్చస్సు నే నపహరిస్తున్నాను
ఉదయిస్తూ సూర్యుడు నిద్రిస్తున్న వారి
వర్చస్సును అపహరించినట్టుగా అపహరిస్తున్నాను. ॥ 2 ॥

ఇది ఒకటవ అనువాకం

ఇది పదమూడవ సూక్తం

# అనువాకం - 2

## సూక్తం - 14

ఋషి అథర్వుడు॥ దేవత: సవిత॥ ఛందస్సు. 1,2 అనుష్టుప్. 3 త్రిష్టుప్ 4 జగతీ॥ మంత్రములు· ॥ 4 ॥

వినియోగం - పుష్టికాముడు దీనిని పరిస్తూ సూత్రోక్త స్థానానికి వెళ్ళి ఉపపాత్రం పడవేసి, దానిని సోమరసంతో మిశ్రమం చేసి, అన్నాన్ని అందులో కలిపి, అభిమంత్రించి భుజిస్తాడు సోమక్రయణానంతరం 'అభి త్యమ్' అనే మంత్రంతో హిరణ్యపాణి బ్రహ్మ సోమలతను విడదీస్తాడు.

మంత్రము

అభి త్యం దేవం సవితారమోణ్యోః కవిక్రతుమ్ ।
అర్చామి సత్యసవం రత్నధామభి ప్రియం మతిమ్ ॥ 1 ॥

పదము

అభి । త్యమ్ । దేవమ్ । సవితారమ్ । ఓణ్యోః । కవిఽక్రతుమ్।
అర్చామి। సత్యఽసవమ్ । రత్నఽధామ్ । అభి । ప్రియమ్ ।
మతిమ్ ॥ 1 ॥

అనువాదం:

ద్యావాపృథువు లంతటికి ద్యోతమానుడైన
సవితను అభిస్తుతిస్తున్నాను కవులకు,
మేధావులకు వలె క్రతుకర్మ ఎవరికి సంబంధించినదో,
ఆ సత్యసవుడు, రత్నధాముడు, తనను స్తుతించువానిని
అభిలక్షించి ప్రియమును చేయువాడు, అందరిచేత
మంతవ్యుడు అయిన సవితను అభ్యర్చిస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము.

ఊర్ధ్వా యస్యామతిర్భా అదిద్యుతత్ సవీమని ।
హిరణ్యపాణి రమిమీత సుక్రతుః కృపాత్ స్వః ॥ 2 ॥

పదము.

ఊర్ధ్వా । యస్య । అమతిః । భాః । అదిద్యుతత్ । సవీమని ।
హిరణ్యఽపాణిః । అమిమీత । సుక్రతుః । కృపాత్ । స్వః ॥2॥

అనువాదం.

సవితృ దేవుని వ్యాపనశీలమైన దీప్తి
ఉత్కృష్టంగా ప్రకాశిస్తున్నది.
ఏ సవిత అనుమతితో పుష్టికాముడైన బ్రహ్మ
హిరణ్యపాణియై కల్పనచే సుఖప్రదమైన
సోమమును కలిపెనో ఆ ప్రసిద్ధుడు,
ద్యోతనాత్మకుడు అయిన సవితను స్తుతిస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము

సావీర్హి దేవ ప్రథమాయ పిత్రే
వర్ష్మాణ మస్మై వరిమాణ మస్మై ।
అథాస్మభ్యం సవితర్వార్యాణి
దివోదివ ఆ సువా భూరి పశ్వః ॥ 3 ॥

పదము :

సావీః । హి । దేవ । ప్రథమాయ । పిత్రే ।

వర్ష్మాణమ్ । అస్మై । వరిమాణమ్ । అస్మై ।

అథ । అస్మభ్యమ్ । సవితః । వార్యాణి ।

దివఃఽదివః । ఆ । సువ । భూరి । పశ్వః ॥ 3 ॥

**అనువాదం**

ఓ దేవా! ప్రకృష్ట తముడైన పాలకునకు
చొరవ తీసుకొని ఫలిత మివ్వు.
ఈ పుష్టికామునకు పుత్రపౌత్రాది సంతతి నివ్వు.
ఈ పుష్టికాముడైన యజమానునకు
దానిని భరించుటకు తగిన బల మివ్వు.
అనంతరం ఓ సవితా!
మాకు వరణీయములైన ఫలములను ప్రసాదించు
అనుదినం భూరిపశువులను మాకు అభిముఖంగా చెయ్యి ॥3॥

**మంత్రము**

దమూనా దేవః సవితా వరేణ్యో దధద్

రత్నం దక్షం పితృభ్య ఆయూంషి ।

పిబాత్ సోమం మమదదేన మిష్టే

పరిజ్మా చిత్ క్రమతే అస్య ధర్మణి ॥ 4 ॥

**పదము :**

దమూనాః । దేవః । సవితా । వరేణ్యః । దధత్ ।

రత్నమ్ । దక్షమ్ । పితృఽభ్యః । ఆయూంషి ।

పిబాత్ । సోమమ్ । మమదత్ । ఏనమ్ । ఇష్టే ।

పరిఒజ్మా । చిత్ । క్రమతే । అస్య । ధర్మణి ॥ 4 ॥

**అనువాదం :**

దానమనస్కుడు, వరణీయుడు, సర్వప్రేరకుడునైన దేవుడు
రమణీయమైన రత్నరూప ధనాన్ని ఇచ్చుగాక!
బలమును ఇచ్చుగాక!
పూర్వుల సకాశాన్నుంచి శతవత్సరపరిమితమైన
ఆయుస్సును ఇచ్చుగాక!
సోమరసమును త్రాగుగాక!
ఆ పీతమైన సోమరసం యాగంలో
ఈ సవితకు మత్తు కల్పించు గాక!
ఆ తరువాత సర్వవ్యాపనశీలుడైనప్పటికీ
సోముడు ఈ సవితకు జరంస్థానంలో
అప్రతిబద్ధుడై వర్తించు గాక! ॥ 4 ॥

ఇది పదునాల్గవ సూక్తం

## సూక్తం - 15

**ఋషి. భృగువు ॥ దేవత : సవిత : ఛందస్సు త్రిష్టుప్ ॥ మంత్రము : ॥ 1 ॥**

**వినియోగం :- ఒకసారి కలిగిన గోర్బంధవ రజ్జుమణిని చేసి, అందులో పడవేసి, అభిమంత్రించి, పుష్టికామునకు కట్టడంలో దీనికి వినియోగం.**

**మంత్రము.**

తాం సవితః సత్యసవాం సుచిత్రామాహం

వృణే సుమతిం విశ్వవారామ్ ।

యామస్య కణ్వో అదుహత్ ప్రపీనాం
సహస్రధారాం మహిషో భగాయ ॥ 1 ॥

పదము.

తామ్ । సవితః । సత్య౽సవామ్ । సు౽చిత్రామ్ । ఆ । అహమ్ ।
వృణే । సు౽మతిమ్ । విశ్వ౽వారామ్ ।
యామ్ । అస్య । కణ్వః । అదుహత్ । ప్ర౽పీనామ్ ।
సహస్ర౽ధారామ్ । మహిషః । భగాయ ॥ 1 ॥

అనువాదం.

సూర్యుని, తాదృశమైన సత్యసవుని,
సుచిత్రుని, విశ్వవారుని, అనుగ్రహబుద్ధిని
నేను అభిముఖ్యంతో యాచిస్తున్నాను.
ఈ సవితకు సంబంధించిన బుద్ధిని
మహాత్ముడైన కణ్వమహర్షి దోహనం చేసినాడు.
ప్రవృద్ధమైన, సహస్రధారయైన పొదుగును
సౌభాగ్యం కోసం కణ్వుడు పిండుకొన్నాడు. ॥ 1 ॥

ఇది పదహైదవ సూక్తం

## సూక్తం-16

ఋషి. భృగువు దేవత: సవిత ॥ ఛందస్సు. త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం :- దీనితో సూర్యోదయ పర్యంతం నిద్రించే బ్రహ్మచారిని నిద్రలేపుతారు. అలాగే ఆధానంలో సంభారస్పర్శనదివసంలో నిద్రిస్తున్న యజమానాదులను దీనితో నిద్రలేపుతారు.

మంత్రము :

బృహస్పతే సవితర్వర్ధయైనం జ్యోతయైనం మహతే
సౌభగాయ ।
సంశితం చిత్ సంతరం సం శిశాధి
విశ్వ ఏనమను మదన్తు దేవాః ॥ 1 ॥

పదము :

బృహస్పతే । సవితః । వర్ధయ । ఏనమ్ । జ్యోతయ । ఏనమ్ ।
మహతే । సౌభగాయ ।
సమ్ఽశితమ్ । చిత్ । సమ్ఽతరమ్ । సమ్ । శిశాధి ।
విశ్వే । ఏనమ్ । అను । మదన్తు । దేవాః ॥ 1 ॥

అనువాదం :

ఓ బృహస్పతీ! ఓ సవితా!
సూర్యోదయ పర్యంతం నిద్రిస్తున్న
ఈ బ్రహ్మచారిని, యజమానాదులను మేల్కొల్పు
ఈ యజమానాదులను ప్రభూతమైన
సౌభాగ్యం కోసం దీప్తిమంతులను చెయ్యి.
సంశితవ్రతుని కూడా పూర్తిగా తీక్ష్ణతరం చెయ్యి.
విశ్వేదేవతలు యజమానాదులను అనుమోదింతురుగాక! ॥1॥

ఇది పదునారవ సూక్తం

# సూక్తం - 17

ఋషి, భృగువు॥ దేవతలు మంత్రములలో పేర్కొన్న ధాత్రి మొదలగువారు
ఛందస్సు॥ 1 త్రిపదా ఉర్ష్ణి గాయత్రీ, 2 అనుష్టుప్, 3,4 త్రిష్టుప్॥
మంత్రములు : ॥ 4 ॥

వినియోగం.— సర్వఫలకాముడు ధాతను గూర్చి చేసే యజనంలో కాని, ఉపతిష్ఠానంలో కాని, అట్లే వీరపురుష ప్రజననార్థం గర్భిణీ ఉదరాన్ని అభిమంత్రించడంలోను దీనికి వినియోగం.

మంత్రము

ధాతా దధాతు నో రయి మీశానో జగతస్పతిః ।
స నః పూర్ణేన యచ్ఛతు ॥ 1 ॥

పదము :

ధాతా । దధాతు । నః । రయిమ్ । ఈశానః । జగతః । పతిః ।
సః । నః । పూర్ణేన । యచ్ఛతు ॥ 1 ॥

అనువాదం :

ధాత అనే దేవుడు మాకు ధనం ఇచ్చుగాక!
ఆయన సర్వార్థసాధన శక్తియుతుడు.
జగత్పాలకుడు ఆ ధాత మాకు
సమృద్ధమైన ధనం సమకూర్చుగాక! ॥ 1 ॥

మంత్రము.

ధాతా దధాతు దాశుషే ప్రాచీం జీవాతు మక్షితామ్ ।
వయం దేవస్య ధీమహి సుమతిం విశ్వరాధసః ॥ 2 ॥

పదము

ధాతా । దధాతు । దాశుషే । ప్రాచీమ్ । జీవాతుమ్ । అక్షితామ్ ।

వయమ్ । దేవస్య । ధీమహి । సు౽మతిమ్ । విశ్వ౽రాధసః ॥2॥

అనువాదం.

ధాత హవిస్సునిచ్చు యజమానునకు
ప్రకృష్టగమనమైన, జీవనకారిణి అయిన,
అనుపక్షీణమైన సౌభాగ్యాన్ని ఇచ్చుగాక!
మేము కూడా సర్వధనుడైన ధాతకు
కల్యాణ మతిని కల్పించుచున్నాము. ॥ 2 ॥

మంత్రము :

ధాతా విశ్వా వార్యా దధాతు
ప్రజాకామాయ దాశుషే దురోణే ।
తస్మై దేవా అమృతం సం వ్యయన్తు
విశ్వే దేవా అదితిః సజోషాః ॥ 3 ॥

పదము :

ధాతా । విశ్వా । వార్యా । దధాతు ।
ప్రజా౽కామాయ । దాశుషే । దురోణే ।
తస్మై । దేవాః । అమృతమ్ । సమ్ । వ్యయన్తు ।
విశ్వే । దేవాః । అదితిః । స౽జోషాః ॥ 3 ॥

అనువాదం.

ధాత విశ్వవరణీయములైన ఫలములను ప్రదానం చేయుగాక
ప్రజాకాముడైన వానికి హవిస్సు నిచ్చిన
యజమానునకు ఇంటిలో ఇంద్రాదులు
అవినాశకరమైన అమృతాన్ని ఇత్తురు గాక!
విశ్వేదేవతలు, అదితి సహప్రియమాణలై
ఈ విధంగా అనుగ్రహింతురు గాక! ॥ 3 ॥

మంత్రము:

ధాతా రాతిః సవితేదం జుషన్తాం
ప్రజాపతిర్నిధి పతి ర్నో అగ్నిః।
త్వష్టా విష్ణుః ప్రజయా సంరరాణో
యజమానాయ ద్రవిణం దధాతు ॥ 4 ॥

పదము:

ధాతా। రాతిః। సవితా। ఇదమ్। జుషన్తామ్।
ప్రజాఽపతిః। నిధిఽపతిః। నః। అగ్నిః।
త్వష్టా। విష్ణుః। ప్రఽజయా। సమ్ఽరరాణః।
యజమానాయ। ద్రవిణమ్। దధాతు ॥ 4 ॥

అనువాదం

ధాత సర్వశ్రేయోదాత, సర్వప్రేరకుడు,
ప్రజాపతి, నిధిపతి, అగ్ని; రూపత్వష్ట, సర్వవ్యాపకుడు.
ఈ దేవత లందరూ మా హవిస్సును సేవింతురుగాక!

ధాత్రాది దేవతలు పుత్రపౌత్రాదికంతో
రమమాణులై అభిమత ఫలమును అనుభవింతురు గాక!
యజమానునకు ధనాన్ని ఇత్తురు గాక! ॥ 4 ॥

ఇది పదిఏడవ సూక్తం

## సూక్తం-18

ఋషి: అథర్వుడు ॥ దేవత ॥ పృథివీ. పర్జన్యుడు ॥ ఛందస్సు ॥ 1 చతుష్పాద్ భురిగ్ ఉష్ణిక్. 2 త్రిష్టుప్. మంత్రములు. ॥ 2 ॥

వినియోగం ॥- 'ప్ర నభస్వ' అనే మంత్రద్వయంతో వృష్టికాముడు మరుత్తులకు, లేక మంత్రవార్ణికీ దేవతలకు క్షీరోదన హోమం, అజ్య హోమాదులు చేయాలి అలాగే కాశాదులైన ఓషధులను నీళ్ళలో ముంచి మేషశిరస్సుపై మంత్రించిన నీళ్ళను చల్లి, మనుష్యుల కేశములను, పాతచెప్పులను వెదురునకు కట్టి పొట్టుతో పాటు అమ పాత్రంలో అభిమంత్రితోదకంతో సంప్రోక్షణచేసి, మూడు త్రాళ్ళుగల ఉట్టిలో ఉంచి నీళ్ళలో పడవేయడం ఇత్యాదులైన అభివర్షణ కర్మలు చేయాలి.

ఉపతారకాద్భుతశాంతిలో ఈ సూక్తంతో అజ్యహోమంచెయ్యాలి దర్శపూర్ణమాసలలో, పత్నీ సంయాజములలో, సౌమ్యయాగంలో 'నప్రఘంస్తతాప' అనే మంత్రంతో అనుమంత్రించాలి.

మంత్రము:

ప్ర నభస్వ పృథివి భిన్ధీదం దివ్యం నభః।
ఉద్నో దివ్యస్య నో ధాత రీశానో వి ష్యా దృతిమ్ ॥ 1 ॥

పదము

ప్ర । నభస్వ । పృథివి । భిన్ధి । ఇదమ్ । దివ్యమ్ । నభః ।
ఉద్నః । దివ్యస్య । నః । ధాతః । ఈశానః । వి । స్య । దృతిమ్ ॥ 1 ॥

అనువాదం

ఓ పృథివీ! విస్తీర్ణ భూమిలో నీవు సంగతురాలవు కా!
ఓ పర్జన్యుడా! ఈ ముందున్న
నభోభవమైన మేఘాన్ని విదారించు
ఉదక భాగాన్ని మాకు ప్రదానం చేయి.
వృష్టిప్రదాన శక్తుడవైన నీవు
జలపూర్ణమైన, తోలుతిత్తివంటి మేఘాన్ని వదలిపెట్టు ॥ 1 ॥

మంత్రము

న ఘ్రంస్తతాప న హిమో జఘాన
ప్ర నభతాం పృథివీ జీరదానుః ।
ఆపశ్చిదస్మై ఘృతమిత్ క్షరన్తి
యత్ర సోమః సదమిత్ తత్ర భద్రమ్ ॥ 2 ॥

పదము

న । ఘ్రన్ । తతాప । న । హిమః । జఘాన ।
ప్ర । నభతామ్ । పృథివీ । జీరఽదానుః ।
ఆపః । చిత్ । అస్మై । ఘృతమ్ । ఇత్ । క్షరన్తి ।
యత్ర । సోమః । సదమ్ । ఇత్ । తత్ర । భద్రమ్ ॥ 2 ॥

అనువాదం

గ్రీష్మర్తువు తపింప జేయుట లేదు.
హేమంతం చంపలేదు.
పృథివి జీవన ప్రదాత నభోభవమైనది.

యజమానునకు నీరు కూడా ఘృతమే
అయి ప్రీతికారి అవుతుంది
ఏ దేశంలో సోముడు ఉంటాడో
అక్కడ ఎల్లప్పుడు కల్యాణకారి అవుతాడు ॥ 2 ॥

ఇది పదునెనిమిదవ సూక్తం

## సూక్తం-19

ఋషి. బ్రహ్మ॥ దేవతలు: ప్రజాపతి, ధాత ॥ ఛందస్సు: జగతీ ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం.- దీనితో వంధ్యకు పుత్రలాభార్థమై చేసే కర్మలో ఆమె ఉత్సంగంలో ఆజ్యహోమం చేయాలి. అదే కర్మలో ఎఱ్ఱని మేక మాంసాన్ని వేసి అభిమంత్రించి తినాలి. అదె కర్మలో ఉదకుంభాన్ని కాని, సురాకుంభాన్ని కాని అభిమంత్రించి ప్రజాకాముడు అగ్ని చుట్టూ తిరిగి అగ్నిలో వేయాలి. దీనితో అన్నాన్నికాని సురనుకాని, నీళ్ళను కాని కలిపి ప్రజాకామురాలైన ఆమెకు ఇవ్వాలి. అభిలషిత కాముడు దీనితో ప్రజాపతిని గూర్చి యజ్ఞంచేయాలి లేదా ఉపస్థానం చెయ్యాలి.

మంత్రము ॥

ప్రజాపతి ర్జనయతి ప్రజా ఇమా
ధాతా దధాతు సుమనస్యమానః ।
సంజానానాః సంమనసః సయోనయో
మయి పుష్టం పుష్టపతి ర్దధాతు ॥ 1 ॥

పదము

ప్రజాऽపతిః । జనయతి । ప్రऽజాః । ఇమాః ।

ధాతా । దధాతు । సు౽మనస్యమానః ।

సమ్౽జానానాః । సమ్౽మనసః । స౽యోనయః ।

మయి । పుష్టమ్ । పుష్ట౽పతిః । దధాతు ॥ 1 ॥

అనువాదం

ప్రజాపతి ఈ ప్రజలను
సంతానం వలె ఉత్పన్నం చేయుగాక!
ధాత సుమనస్కుడై పోషించు గాక!
ఆ ప్రజలు సమానజ్ఞానులు కార్యైక పరతంత్రులు
సంగత మనస్కులు సమానకారణులు
పుష్టపతి నాయందు ప్రజావిషయాన్ని సమకూర్చుగాక! ॥1॥

ఇది పందొమ్మిదవ సూక్తం

## సూక్తం-20

ఋషిః అథర్వుడు దేవత. అనుమతిః ఛందస్సు 1,2 అనుష్టుప్. 3 త్రిష్టుప్. ॥
భురిక్ త్రిష్టుప్ః 5 జగతీ 6 అతిశక్వరగర్భా జగతీ॥ మంత్రములు ॥64

వినియోగం.- అభిలషిత కాముడు అనుమతి దేవతను యజనం చేయుటలోను
లేదా ఉపతిష్ఠానం చేయుటలోను, పూర్ణమాస యాగంలో అను
మతిదేవతను పరిగ్రహించుటలోను దీనికి వినియోగం

మంత్రము

అన్వద్య నో౽నుమతిర్యజ్ఞం దేవేషు మన్యతామ్ ।

అగ్నిశ్చ హవ్యవాహనో భవతాం దాశుషే మమ ॥ 1 ॥

పదము

అను । అద్య । నః । అను౽మతిః । యజ్ఞమ్ । దేవేషు ।
మన్యతామ్ ।

అగ్నిః । చ । హవ్యఽవాహనః । భవతామ్ । దాశుషే । మమ ॥1॥

**అనువాదం**

సర్వ కర్మానుజ్ఞాత్రి అయిన పౌర్ణమాస
అభిమాని దేవత ఇప్పుడు మాకు యష్టవ్యముల
విషయంలో అనుమతి నిచ్చుగాక!
అగ్ని కూడా నే నిచ్చిన హవిస్సును
యష్టవ్య దేవతలకు చేకూర్చుగాక! ॥ 1 ॥

**మంత్రము :**

అన్విదనుమతే త్వం మంససే శం చ నస్కృధి ।
జుషస్వ హవ్యమాహుతం ప్రజాం దేవి రరాస్వ నః ॥ 2 ॥

**పదము**

అను । ఇత్ । అనుఽమతే । త్వమ్ । మంససే । శమ్ । చ । నః । కృధి ।
జుషస్వ । హవ్యమ్ । ఆఽహుతమ్ । ప్రఽజామ్ । దేవి । రరాస్వ । నః ॥ 2 ॥

**అనువాదం**

ఓ అనుమతి నామక దేవతా!
నీవు అనుమతించు. నాకు సుఖాన్నివ్వు.
అగ్నిలో ప్రక్షిప్తమైన హవ్యం సేవించు.
ఓ దేవీ! మాకు పుత్రాదులను ప్రసాదించు. ॥ 2 ॥

మంత్రము

అను మన్యతా మనుమన్యమానః ।

ప్రజావన్తం రయి మక్షీయమాణమ్ ।

తస్య వయం హేడసి మా ఽపి భూమ

సుమృడీకే అస్య సుమతౌ స్యామ ॥ 3 ॥

పదము

అను । మన్యతామ్ । అనుఽమన్యమానః ।

ప్రజాఽవన్తమ్ । రయిమ్ । అక్షీయమాణమ్ ।

తస్య । వయమ్ । హేడసి । మా । అపి । భూమ ।

సుఽమృడీకే । అస్య । సుఽమతౌ । స్యామ ॥ 3 ॥

అనువాదం:

అనుమంత్రి అయిన దేవత ధనాన్నిచ్చుగాక!
పుత్రాది యుక్తునిగా, అక్షీయమానునిగా చేయుగాక!
ఆ దేవత క్రోధానికి మేము గురికాకుందుముగాక!
ఇంకొక దేవి సుమృళీక యొక్క
శోభన స్వరూపమైన, అనుగ్రహాత్మికమైన
మంగళ బుద్ధికి పాత్రుల మగుదుము గాక! ॥ 3 ॥

మంత్రము

యత్ తే నామ సుహవం సుప్రణీతేఽనుమతే అనుమతం
సుదాను ।

తేనా నో యజ్ఞం పీప్పహి విశ్వవారే
రయిం నో ధేహి సుభగే సువీరమ్ ॥ 4 ॥

పదము

యత్ । తే । నామ । సుఽహవమ్ । సుఽప్రనీతే । అనుఽమతే ।
అనుఽమతమ్ । సుఽదాను ।
తేన । నః । యజ్ఞమ్ । పిప్పహి । విశ్వఽవారే ।
రయిమ్ । నః । ధేహి । సుఽభగే । సుఽవీరమ్ ॥ 4 ॥

అనువాదం

ఓ సుప్రణీతా! అనుమతీదేవీ!
నీ శుభానుమతి సర్వాభిమతంతో అనుమతిరూపమగు గాక!
ఆ పేరుతో మా యజ్ఞాన్ని పరిపూర్తి చెయ్యి.
విశ్వవరణీయ, శోభనభాగ్యయుక్త అయిన ఓ అనుమతీ!
మాకు శోభన సంతానాన్ని ధనాన్ని ప్రసాదించు. ॥ 4 ॥

మంత్రము

ఏమం యజ్ఞమను మతిర్జగామ సుక్షేత్రతాయై సువీరతాయై
సుజాతమ్ ।
భద్రా హ్యఽస్యాః ప్రమతిర్బభూవ
సేమం యజ్ఞమవతు దేవగోపా ॥ 5 ॥

పదము.

ఆ। ఇమమ్। యజ్ఞమ్। అనుఽమతిః। జగామ। సుఽక్షేత్రతాయై। సుఽవీరతాయై। సుఽజాతమ్।

భద్రా। హి। అస్యాః। ప్రఽమతిః। బభూవ।

సా। ఇమమ్। యజ్ఞమ్। అవతు। దేవఽగోపా ॥ 5 ॥

అనువాదం:

అనుమతీదేవి మా యజ్ఞానికి వచ్చుగాక!
సుభూమి సుఫలము అగుటకై, సువీరసంతానానికై,
మంత్ర ద్రవ్యాదులతో నిష్పన్న మైనదీ యజ్ఞం
ఈ అనుమతికి కల్యాణాత్మకమైన
ప్రకృష్టానుగ్రహ బుద్ధి కలదు.
అందువల్లనే అగ్న్యాది దేవతలకు
రక్షకురాలైన ఆ అనుమతీ దేవి ఈ యజ్ఞాన్ని రక్షించుగాక!
॥ 5 ॥

మంత్రము.

అనుమతిః సర్వమిదం బభూవ యత్

తిష్ఠతి చరతి యదు చ విశ్వమేజతి।

తస్యాస్తే దేవి సుమతౌ స్యామానుమతే

అను హి మంససే నః ॥ 6 ॥

పదము

అనుఽమతిః। సర్వమ్। ఇదమ్। బభూవ। యత్।

తిష్ఠతి । చరతి । యత్ । ఓం౯ఇతి । చ । విశ్వమ్ । ఏజతి ।

తస్యాః । తే । దేవి । సు౯మతౌ । స్యామ । అను౯మతే ।

అను । హి । మంససే । నః ॥ 6 ॥

అనువాదం.

అనుమతిదేవి పరిదృశ్యమానమైన సర్వ జగత్తు అయి ఉన్నది
ఈ చరాచర జగత్తు తనంతటు తానే పెరుగుతున్నది
అది కూడా సర్వ జగత్తును
బుద్ధి పూర్వకంగా చలింప జేస్తున్నది.
( స్థావర జంగమాత్మకమైన సర్వజగత్తు అనుమతిరూపమే )
ఓ దేవీ! అలాంటి నీ శోభనానుగ్రహానికి
మేము పాత్రుల మగుదుము గాక!
మమ్ములను అనుమతింతువు గాక! ॥ 6 ॥

ఇది ఇరవై సూక్తం

## సూక్తం - 21

ఋషి : బ్రహ్మ ॥ దేవత : అత్మ ఛందస్సు : శక్వరీ విరాడ్జగతీ ॥ మంత్రము. ॥ 1 ॥

వినియోగం.-పితృమేధ కర్మలో ఇష్టికలతో ఏర్పఱచిన చితిని శ్మశానాన్ని దీనితో సర్వబంధువులు పరిషేచనం చేయాలి.

మంత్రము :

సమేత విశ్వే వచసా పతిం దివ

ఏకో విభూరతిథి ర్జనానామ్ ।

స పూర్వ్యో నూతన మావివాసత్

తం వ ర్తనిరను వావృత ఏకమిత్ పురు ॥ 1 ॥

పదము.

సమ్ఽఏత । విశ్వే । వచసా । పతిమ్ । దివః ।

ఏకః । విఽభూః । అతిథిః । జనానామ్ ।

సః । పూర్వ్యః । నూతనమ్ । ఆఽవివాసత్ ।

తమ్ । వ ర్తనిః । అను । వవృతే । ఏకమ్ । ఇత్ । పురు ॥ 1 ॥

అనువాదం :

( పైతృమేధిక కర్మలో సంస్కృతుడైన పురుషుడు
సూర్యప్రశంసా పూర్వకంగా తదనుగ్రహార్థం చేసే ప్రార్థన. )
ఓ విశ్వే దేవతలారా ! ద్యులోకాధిపతి సూర్యుని
ఈ మంత్రరూప స్తోత్రంతో సంస్తుతించండి.
ప్రాణుల ముఖ్యస్వామి, అతిథి, పురాతనుడు
అయిన సూర్యుడు పితృస్వరూపుడైన
ఈ పురుషుని తన వానినిగా అనుగ్రహించుగాక !
ఆ ఒక్క సూర్యునే బహుధా సత్కర్మమార్గం అనువర్తిస్తున్నది
॥ 1 ॥

ఇది ఇరవై ఒకటవ సూక్తం.

## సూక్తం—22

ఋషి. బ్రహ్మ॥ దేవతలు: లింగమునందు చెప్పబడినవారు: (బధ్నుడు) ఛందస్సు
1 ద్విపదా విరాడ్ గాయత్రీ ( ఏకావసానా ) 2 త్రిపదాఽనుష్టుప్ ॥
మంత్రములు : ॥ 2 ॥

వినియోగం :- పృశ్నిసవంలో దీనితో హవిర్మర్శన సంపాతప్రదానాదులను చేయాలి.

మంత్రము.

అయం సహస్రమా నో దృశే

కవీనాం మతిర్జ్యోతిర్విధర్మణి ॥ 1 ॥

పదము:

అయమ్ । సహస్రమ్ । ఆ । నః । దృశే ।

కవీనామ్ । మతిః । జ్యోతిః । వి౽ధర్మణి ॥ 1 ॥

అనువాదం:

పరిదృశ్యమానుడైన సూర్యుడు
మాకు సహస్ర సంవత్సరకాల పర్యంతం
దర్శనార్థమై ఉండుగాక!
ఆయన క్రాంతదర్శులైన పురుషులకు మాననీయుడు.
జ్యోతి స్స్వరూపుడు. ॥ 1 ॥

మంత్రము:

బ్రధ్నః సమీచీరుషసః సమైరయన్ ।

అరేపసః సచేతసః స్వసరే

మన్యుమత్తమాశ్చితే గోః ॥ 2 ॥

పదము:

బ్రధ్నః । సమీచీః । ఉషసః । సమ్ । ఐరయన్ ।

అరేపసః । స౽చేతసః । స్వసరే ।

మన్యుమత్౽తమాః । చితే । గోః ॥ 2 ॥

**అనువాదం :**

సూర్యుడు వివిధ ధర్మసాధన కర్మయందు
వారివారికి ఆయా ఫలాలను అనుగ్రహిస్తాడు
ఆయన ఉషః కాలోపలక్షితములైన దినములను
సంగతములైన వానిని సత్కర్మల కొఱకు ప్రేరేపించుగాక!
పాపహరులు, సమానజ్ఞానులునైన అహస్సులు
దీప్తిమంతులై గోరూపస్థితికై ప్రోత్సహించుగాక!
ఆదిత్యచయనం కోసం అహస్సులు ఉపయుక్తము లగుగాక! ॥ 2 ॥

ఇది రెండవ అనువాకం

ఇది ఇరవై రెండవ సూక్తం

## అనువాకం: 3

### సూక్తం-23

**ఋషిః యముడు ॥ దేవతః దుస్స్వప్ననాశనమ్ ॥ ఛందస్సు : అనుష్టుప్ ॥ 1 ॥**

**మంత్రము**

దౌష్వప్న్యం దౌర్జీవిత్యం రక్షో అభ్వమరాయ్యః ।
దుర్ణామ్నీః సర్వా దుర్వాచస్తా అస్మన్నాశయామసి ॥ 1 ॥

**పదము :**

దౌఃస్వప్న్యమ్ । దౌఃజీవిత్యమ్ । రక్షః । అభ్వమ్ । అరాయ్యః ।
దుఃనామ్నీః । సర్వాః । దుఃవాచః । తాః । అస్మత్ । నాశయామసి ॥ 1 ॥

**అనువాదం.**

దుస్స్వప్నం వల్ల కలిగే అరిష్టాన్ని, దుర్జీవితం వల్ల కలిగే
అరిష్టాన్ని, రాక్షసజాతిని, అసమృద్ధి హేతువులైన
పాపలక్షణాలను, అలాగే ఛేదిక, భేదిక ఇత్యాది దుష్ట
వాచ్య శబ్దాలైన ఈ కృత్య లన్నింటిని,
ఈ అభిచారలక్షీభూతుడైన పురుషునికి,
సోకకుండా నాశనం చేస్తున్నాము. ॥ 1 ॥

ఇది ఇరవై మూడవ సూక్తం

## సూక్తం - 24

**ఋషిః బ్రహ్మా॥ దేవత॥ సవిత॥ ఛందస్సుః త్రిష్టుప్॥ మంత్రము: ॥ 1 ॥**

**వినియోగంః-** ఇంద్రాది నవదేవతలను సర్వఫలకాముడు ఉపతిష్ఠానం చేయడంలో లేదా వారిని గూర్చి యజ్ఞం చేయడంలో దీనికి వినియోగం.

**మంత్రము :**

యన్న ఇన్ద్రో అఖనద్ యదగ్నిర్విశ్వే
దేవా మరుతో యత్ స్వర్కాః ।
తదస్మభ్యం సవితా సత్యధర్మా
ప్రజాపతిరనుమతిర్ని యచ్ఛాత్ ॥ 1 ॥

**పదము :**

యత్ । నః । ఇన్ద్రః । అఖనత్ । యత్ । అగ్నిః । విశ్వే ।
దేవాః । మరుతః । యత్ । సుఽఅర్కాః ।
తత్ । అస్మభ్యమ్ । సవితా । సత్యఽధర్మా ।

ప్రజాఽపతిః । అనుఽమతిః । ని । యచ్ఛాత్ ॥ 1 ॥

అనువాదం.

ఇంద్రుడు మాకు ఏ ఫలాన్ని ఇచ్చినాడో,
అగ్ని మాకు ఏ ఫలాన్ని ఇచ్చినాడో,
విశ్వేదేవతలు, మరుత్తులు, సుమంత్ర
సుదేవులను దేవతలు దేని నిచ్చినారో,
ఆ ఫలాన్ని మాకు సవిత, సత్యధర్ముడు,
ప్రజాపతి, అనుమతి స్థిరపరుచుదురు గాక। ॥ 1 ॥

ఇది ఇరవై నాల్గవ సూక్తం.

## సూక్తం-25

ఋషిః మేధాతిథి ॥ దేవతలు విష్ణువు, వరుణుడు ॥ ఛందస్సు: త్రిష్టుప్ ॥
మంత్రములు : ॥ 2 ॥

వినియోగం.- సర్వఫలకాముడు విష్ణువరుణులను గూర్చి యజనం లేదా ఉపతి
ష్ఠానం చేయడంలో దీనికి వినియోగం.

మంత్రము

యయోరోజసా స్కభితా రజాంసి
యౌ వీర్యైఽర్వీరతమా శవిష్ఠా ।
యౌ పత్యేతే అప్రతీతా
సహోభిర్విష్ణుమగన్ వరుణం పూర్వహూతిః ॥ 1 ॥

పదము

యయోః । ఓజసా । స్కభితా । రజాంసి ।

యౌ । వీర్యైః । వీర్యఽతమా । శవిష్ఠా ।

యౌ । పత్యేతేఇతి । అప్రతిఽఇతౌ ।

సహఃఽభిః । విష్ణుమ్ । అగన్ । వరుణమ్ । పూర్వఽహూతిః ॥ 1 ॥

అనువాదం.

ఏ విష్ణు వరుణుల బలంతో రంజనాత్మకములైన
పృథివ్యాదిస్థావరములు దృఢీకృతములైనవో,
ఏ విష్ణువరుణులు వీరకర్మలతో అత్యంత శూరులై,
అతిబలవంతులై ఉన్నారో, ఏ విష్ణు వరుణులు బలగములతో
అప్రతిహతులై ఐశ్వర్యాన్ని పొందుతున్నారో,
అట్టి విష్ణువును, వరుణుని ప్రథమంగా ఆహ్వానిస్తున్నాము ॥1॥

మంత్రము :

యస్యేదం ప్రదిశి యద్ విరోచతే

ప్ర చానతి వి చ చష్టే శచీభిః ।

పురా దేవస్య ధర్మణా సహోభిర్విష్ణుమగన్ వరుణం

పూర్వహూతిః ॥ 2 ॥

పదము.

యస్య । ఇదమ్ । ప్రఽదిశి । యత్ । విఽరోచతే ।

ప్ర । చ । అనతి । వి । చ । చష్టే । శచీభిః ।

పురా । దేవస్య । ధర్మణా । సహఃఽభిః । విష్ణుమ్ । అగన్ ।

వరుణమ్ । పూర్వఽహూతిః ॥ 2 ॥

**అనువాదం.**

ఏ విష్ణు వరుణుల ఆజ్ఞతో ఈ విశ్వం
విశేషంగా దీప్యమానమౌతున్నదో,
చైతన్యసహితమౌతున్నదో,
తమతమ కర్తవ్యకర్మలను విశేషముగా చూడగలుగుతున్నదో,
ఏ విష్ణువరుణుల ధారక కర్మతో, బలగంతో
పూర్వం ఈ జగత్తు ప్రాణవంత మయినదో
అట్టి విష్ణువరుణులను ఇతరులకంటె ప్రథమం ఆహ్వానం చేసే
ఫలార్థి అయిన ఈ జనం హవిస్సుతో
సంయోగం పొందించుగాక! ॥ 2 ॥

ఇది ఇరవై ఐదవ సూక్తం.

## సూక్తం-26

ఋషి: మేధాతిథి ॥ దేవత : విష్ణువు ॥ ఛందస్సు 1 త్రిష్టుప్, 2 త్రిపదా విరాడ్ గాయత్రి : 3 షట్పదా విరాట్ శక్వరీ : 4-7 గాయత్రి, 8 త్రిష్టుప్ మంత్రములు. ॥ 8 ॥

వినియోగం :- సర్వసంపత్కాముడు విష్ణువును గూర్చి యజనం చేయడంలో లేదా ఉపతిష్ఠానం చేయడంలో దీనికి వినియోగం. 'వైష్ణవీ' అను పేరుగల మహాశాంతిలో 'విష్ణోర్ను కమ్' అనే మంత్రానికి వినియోగం.

ఆతిథ్యేష్టిలో 'విష్ణోర్ను కమ్' అనే మంత్రంతో వైష్ణవ హవిస్సును అభిమర్శించాలి.

అలాగే సోమయాగంలో ఔపవసథ్యాహమ్సులో హవిస్సును, ధాన్యాన్ని ఉపస్తభ్యమానం చేయడంలో ఉపస్తంభన కాష్ఠాన్ని 'విష్ణోర్ను కమ్' అనే మంత్రంతో అనుమంత్రించాలి.

సోమయాగంలో 'యస్యోరుషు' అనే మంత్రంతో సోమ క్రయణార్థం నిష్క్రమించాలి.

పశుయాగానికి ముందు చేసే ఇష్టిలో 'ఉరు విష్ణో' అనే మంత్రంతో వైష్ణవపూర్ణహోమాన్ని బ్రహ్మ అనుమంత్రించాలి.

అద్భుతశాంతిలో 'ఉరువిష్ణో' అనే మంత్రంతో విష్ణువును యజనం చేయాలి.

దర్శపౌర్ణమాసలలో ప్రణీతాప్రణయన ప్రభృతి హవిష్కృదు ద్వాదనం తరువాత అభిపదన ప్రాయశ్చిత్తార్థం 'ఇదం విష్ణుః' అనే మంత్రాన్ని జపించాలి.

సోమయాగంలో ఉత్తరవేద్యగ్ని ప్రణయనానంతరం దక్షిణ హవిర్ధానుని వర్త్మహోమాన్ని 'ఇదం విష్ణుః' అనే మంత్రంతో బ్రహ్మ అను మంత్రణం చేయాలి.

అదే కర్మలో ఉత్తరహవిర్ధానుని వర్త్మహోమాన్ని 'త్రీణి పదా' అనే మంత్రంతో అనుమంత్రణం చెయ్యాలి

తృతీయ సవనంలో సోమయాగానంతరం 'ఇదం విష్ణుః' అనే మంత్రంతో చమసములను నీటిలో వేయాలి

'త్వాష్ట్ర' మనే మహాశాంతిలో 'ఇదం విష్ణుః' అనే మంత్రంతో త్రివృన్మణిబంధనం చెయ్యాలి.

పశుతంత్రంలో అవటంలో స్థాపించిన యూపస్తంభాన్ని 'విష్ణోః కర్మాణి' 'తద్ విష్ణోః' అనే రెండు మంత్రాలతో బ్రహ్మ అనుమంత్రణం చెయ్యాలి.

అగ్నిచయనంలో కూర్మాభ్యంజనానంతరం తోలు, రోకలిని విష్ణోః కర్మాణి' అనే మంత్రంతో అనుమంత్రించాలి.

మంత్రము :

విష్ణోర్ను కం ప్రా వోచం వీర్యాఽణి

యః పార్థివాని విమమే రజాంసి ।

యో అస్కభాయ దుత్తరం సధస్థం

విచక్రమాణ స్త్రేధోరుగాయః ॥ 1 ॥

పదము

విష్ణోః । ను । కమ్ । ప్ర । వోచమ్ । వీర్యాఽణి ।

యః । పార్థివాని । విఽమమే । రజాంసి ।

యః । అస్కభాయత్ । ఉత్ఽతరమ్ । సధఽస్థమ్ ।

విఽచక్రమాణః । త్రేధా । ఉరుఽగాయః ॥ 1 ॥

అనువాదం

విష్ణువు వీరకర్మలను గొప్పగా ప్రశంసిస్తున్నాను.
ఆ దేవుడు పృథివీమయములైన లోకములను నిర్మించినాడు
ఆ విష్ణువు ఉత్తరస్థానాన్ని అస్తమించకుండా నిలబెట్టినాడు.
మూడు రూపాలలో పృథివిని, అంతరిక్షాన్ని, దివిని
పాదప్రక్షేపం చేసి, మహాత్ములతో స్తూయమానుడౌతున్నాడు ॥ 1 ॥

మంత్రము

ప్ర తద్ విష్ణు స్తవతే వీర్యాఽణి

మృగో న భీమః కుచరో గిరిష్ఠాః ।

పరావత ఆ జగమ్యాత్ పరస్యాః ॥ 2 ॥

పదము

ప్ర తత్ విష్ణుః । స్తవతే । వీర్యాఽణి ।

మృగః । న । భీమః । కుచరః । గిరిఽస్థాః ।

పరాఽవతః । ఆ । జగమ్యాత్ । పరస్యాః ॥ 2 ॥

అనువాదం :

ఆ మహానుభావుడైన విష్ణువు
వీరకర్మలలో ప్రస్తుతి పొందుతున్నాడు
సింహం వలె భీముడై, భూచరుడై,
పర్వతస్థితుడై అతిదూరదేశం నుంచి
స్తుతిని విని వచ్చుగాక! ॥ 2 ॥

మంత్రము.

యస్యోరుషు త్రిషు విక్రమణే ష్వధిక్షియన్తి భువనాని విశ్వా ।
ఉరు విష్ణో వి క్రమస్వోరు క్షయాయ నస్కృధి ।
ఘృతం ఘృతయోనే పిబ ప్రప్ర యజ్ఞపతిం తిర ॥ 3 ॥

పదము :

యస్య । ఉరుషు । త్రిషు । వి౽క్రమణేషు । అధి౽క్షియన్తి ।
భువనాని । విశ్వా ।
ఉరు । విష్ణో ఇతి । వి । క్రమస్వ । ఉరు । క్షయాయ । నః । కృధి ।
ఘృతమ్ । ఘృత౽యోనే । పిబ । ప్ర౽ప్ర । యజ్ఞ౽పతిమ్ ।
తిర ॥ 3 ॥

అనువాదం :

ఆ విష్ణువు విస్తీర్ణములైన త్రివిక్రమస్థానములలో
(త్రిపాదస్థానములలో) విశ్వభువనములను అధివసిస్తున్నాడు.
ఓ విష్ణూ! గొప్పగా లోకత్రయంలో పాదత్రయాన్ని ఉంచు.
మా నివాసార్థమై ప్రభూతమైన ధనాదికాన్ని ప్రసాదించు.

ఓ ఘృతయోనీ! ఈ హవనం చేస్తున్న
ఘృతాన్ని పానం చేయి
యజ్ఞపతిని (యజమానుని) వృద్ధిపొందించు. ॥ 3 ॥

మంత్రము:

ఇదం విష్ణుర్వి చక్రమే త్రేధా ని దధే పదా ।
సమూఢమస్య పాంసురే ॥ 4 ॥

పదము.

ఇదమ్ । విష్ణుః । వి । చక్రమే । త్రేధా । ని । దధే । పదా ।
సమ్ఽఊఢమ్ । అస్య । పాంసురే ॥ 4 ॥

అనువాదం.

విష్ణువు ఈ విశ్వాన్ని విక్రమించినాడు.
మూడు పాదాలను మూడు చోట్ల ఉంచినాడు
విక్రమిస్తున్న రజోయుతమైన పాదంలో
లోకత్రయము సమాకృష్టమైనది. ॥ 4 ॥

మంత్రము:

త్రీణి పదా వి చక్రమే విష్ణుర్గోపా అదాభ్యః ।
ఇతో ధర్మాణి ధారయన్ ॥ 5 ॥

పదము:

త్రీణి । పదా । వి । చక్రమే । విష్ణుః । గోపాః । అదాభ్యః ।
ఇతః । ధర్మాణి । ధారయన్ ॥ 5 ॥

అనువాదం.

రక్షకుడు, అనభిభవ్యుడునైన విష్ణువు
మూడు పాదములను విక్రమించినాడు.
అందువలన పృథివితో మొదలు పెట్టి
ధర్మములను ధరింపజేస్తూ విక్రమించినాడు. ॥ 5 ॥

మంత్రము.

విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే ।
ఇన్ద్రస్య యుజ్యః సఖా ॥ 6 ॥

పదము॥

విష్ణోః కర్మాణి । పశ్యత । యతః । వ్రతాని । పస్పశే ।
ఇన్ద్రస్య । యుజ్యః । సఖా ॥ 6 ॥

అనువాదం.

( ఓ స్తోతలారా ! ) విష్ణువు కర్మములను చూడండి.
ఆయన వలన నానావిధములైన
మీ వ్రతములు స్పృశింపబడుతున్నవి.
ఆ విష్ణువు ఇంద్రునకు యోగ్యుడైన సఖుడు. ॥ 6 ॥

మంత్రము.

తద్ విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః ।
దివీఽవ చక్షురాతతమ్ ॥ 7 ॥

పదము.

తత్ । విష్ణోః । పరమమ్ । పదమ్ । సదా । పశ్యన్తి । సూరయః ।

దివీఽఇవ । చక్షుః । ఆఽతతమ్ ॥ 7 ॥

అనువాదం.

ఆ విష్ణువు పరమపదాన్ని
మేధావులు సదా సాక్షాత్కరింపజేసుకుంటున్నారు.
అది ద్యులోకంలో నేత్రం వలె విశాలమైనది. ॥ 7 ॥
(సూర్యమండలం వలె సర్వత్ర ప్రకాశస్వరూపమైన
తత్త్వాన్ని చూస్తున్నారు.)

మంత్రము

దివో విష్ణ ఉత వా పృథివ్యా
మహో విష్ణ ఉరోరన్తరిక్షాత్ ।
హస్తౌ పృణస్వ బహుభిర్వసవ్యైఽరాప్రయచ్ఛ
దక్షిణాదోత సవ్యాత్ ॥ 8 ॥

పదము.

దివః । విష్ణో ఇతి । ఉత । వా । పృథివ్యాః ।
మహః । విష్ణో ఇతి । ఉరోః । అన్తరిక్షాత్ ।
హస్తౌ । పృణస్వ । బహుఽభిః । వసవ్యైఽః ।
ఆఽప్రయచ్ఛ । దక్షిణాత్ । ఆ । ఉత । సవ్యాత్ ॥ 8 ॥

అనువాదం :

ఓ విష్ణుదేవా! ద్యులోకం నుంచి లేదా పృథివి నుంచి,
మహా దివి నుంచి ఓ విష్ణూ!

విస్తీర్ణమయమైన అంతరిక్షం నుంచి తెచ్చిన
అనేక వస్తుసమూహాములతో
నీ చేతులు రెంటిని పూరించుకొనుము.
ఆ ప్రభూత ధనరాశిని దక్షిణహస్తం నుంచి
మాకు అభిముఖుడవై ప్రసాదించుము.
మఱి వామహస్తం నుంచి కూడా
ఆ ధనాన్ని మాకు ప్రసాదించుము. ॥ 8 ॥

ఇది ఇరవై ఆరవ సూక్తం

## సూక్తం—27

ఋషి : మేధాతిథి ॥ దేవత , ఇడ ॥ ఛందస్సు : త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

మంత్రము .

ఇడైవాస్మాం అను వస్తాం వ్రతేన
యస్యాః పదే పునతే దేవయన్తః ।
ఘృతపదీ శక్వరీ సోమపృష్ఠోప
యజ్ఞమస్థిత వైశ్వదేవీ ॥ 1 ॥

పదము ,

ఇడా । ఏవ । అస్మాన్ । అను । వస్తామ్ । వ్రతేన ।
యస్యాః । పదే । పునతే । దేవఽయన్తః ।
ఘృతఽపదీ । శక్వరీ । సోమఽపృష్ఠా । ఉప ।
యజ్ఞమ్ । అస్థిత । వైశ్వఽదేవీ ॥ 1 ॥

**అనువాదం.**

ధేనురూపమైన ఇడాదేవి మమ్ములను
సర్వ కర్మల క్రమంతో సమాచ్ఛాదించు గాక!
ఇడా పాదమునందు దేవకాములైన యజమానులు
తమ్ము పవిత్రీకరించుకొంటున్నారు
ఘృతపది అయిన, ఫలదానసమర్థమైన
సోమపృష్ఠ వంటి వైశ్వదేవి అయిన ధేనువు
మా యజ్ఞాన్ని విస్తృతం చేయుగాక! ॥ 1 ॥

ఇది ఇరవై ఏడవ సూక్తం

## సూక్తం - 28

ఋషి - మేధాతిథి ॥ దేవత వేదము ॥ ఛందస్సు - త్రిష్టుప్ ॥ మంత్రము ॥1॥

వినియోగం.-దర్శపౌర్ణమాసలలో వేదాన్ని విమోచనం చేయుటలోను, ప్రాయణీయేష్టిలో స్వస్తియాగాన్ని అనుమంత్రించడంలోను దీనికి వినియోగం.

మంత్రము

వేదః స్వస్తి ర్ద్రుఘణః స్వస్తిః
పరశుర్వేదిః పరశు ర్నః స్వస్తి ।
హవిష్కృతో యజ్ఞియా యజ్ఞకామా స్తే
దేవాసో యజ్ఞ మిమం జుషన్తామ్ ॥ 1 ॥

పదము

వేదః । స్వస్తిః । ద్రుఽఘనః । స్వస్తిః ।
పరశుః । వేదిః । పరశుః । నః । స్వస్తి ।

హవిఃఽకృతః । యజ్ఞియాః । యజ్ఞఽకామాః । తే ।

దేవాసః । యజ్ఞమ్ । ఇమమ్ । జుషన్తామ్ ॥ 1 ॥

అనువాదం.

వేద మనే దర్భముష్టి మాకు అవినాశ హేతు వగుగాక!
గడ్డికోసే కొడవలి మాకు అవినాశ హేతు వగుగాక!
తృణాదిచ్ఛేదకమైన పరశువు,
హవిరాసాదన ఆధారభూతమైన వేది
వృక్షచ్ఛేదన సాధనభూతమైన పరశువు
మాకు అవినాశ హేతువు లగుగాక!
హవిస్సంపాదకులు, యజ్ఞార్హులు, యజ్ఞకాములునైన
దేవాత్మకులు మా ఈ యజ్ఞాన్ని సేవింతురు గాక! ॥ 1 ॥

ఇది ఇరవై ఎనిమిదవ సూక్తం

## సూక్తం-29

ఋషి, మేధాతిథి ॥ దేవతలు, అగ్ని, విష్ణువు ॥ ఛందస్సు: త్రిష్టుప్ ॥
మంత్రములు ॥ 2 ॥

వినియోగం:-సర్వవ్యాధి భైషజ్యార్థం మౌంజపాశములతో వ్యాధితుని శరీరాన్ని కీళ్ళతో కట్టి, శరపింజూలములతో సహా ఉదకఘటాన్ని వేసి దీనితో అభిమంత్రణం చేసి వ్యాధితుని స్నానం చేయించాలి. సర్వ సంపత్కాముడు దీనితో అగ్నిని, విష్ణువును యజించాలి లేదా ఉపతిష్ఠానం చేయాలి.

మంత్రము 1

అగ్నావిష్ణూ మహి తద్ వాం మహిత్వం

పాథో ఘృతస్య గుహస్య నామ ।

దమేదమే సప్త రత్నా దధానా ప్రతి
వాం జిహ్వా ఘృతమా చరణ్యాత్ ॥ 1 ॥

పదము.

అగ్నావిష్ణూ ఇతి । మహి । తత్ । వామ్ । మహిఽత్వమ్ ।
పాథః । ఘృతస్య । గుహ్యస్య । నామ ।
దమేఽదమే । సప్త । రత్నా । దధానా । ప్రతి ।
వామ్ । జిహ్వా । ఘృతమ్ । ఆ । చరణ్యాత్ ॥ 1 ॥

అనువాదం

ఓ అగ్నివిష్ణువులారా !
మీ మాహాత్మ్యం పూజనీయమైనది,
గోపనీయమైన ఆజ్యసాంనాయ్యాది
నామవతమైన ఘృతాన్ని పానం చేయండి
ఇంటింటా సప్తసంఖ్యాకములైన రత్నములను
(గవాశ్వాది సప్త పశురూపములను) ధరిస్తున్నారు.
అట్టి మీ ప్రత్యేకమైన జిహ్వా
హూయమానమైన అజ్యాన్ని మీకు లభింపజేయుగాక ! ॥1॥

మంత్రము.

అగ్నావిష్ణూ మహి ధామ ప్రియం వాం
వీథో ఘృతస్య గుహ్యా జుషాణౌ ।
దమేదమే సుష్టుత్యా వావృధానా ప్రతి

అథర్వ. iii 28

వాం జిహ్వా ఘృత ముచ్చరణ్యాత్ ॥ 2 ॥

పదము :

అగ్నావిష్ణూ ఇతి । మహి । ధామ । ప్రియమ్ । వామ్ ।

వీథః । ఘృతస్య । గుహ్యా । జుషాణౌ ।

దమేఽదమే । సుఽస్తుత్యా । వవృధానౌ । ప్రతి ।

వామ్ । జిహ్వా । ఘృతమ్ । ఉత్ । చరణ్యాత్ ॥ 2 ॥

అనువాదం.

ఓ అగ్నివిష్ణువులారా ! మీ స్థానం
మహనీయమైనది. సర్వులకు ప్రియమైనది
ఘృతము మొదలుకొని పురోడాశాదిరూపములైన వానిని
భక్షించండి. పరస్పరం ప్రీయమాణులై ప్రతిగృహము
నందును శోభనగుణనిష్ఠమైన స్తోత్రంతో
అత్యర్థం వర్ధమాను లగుచున్నారు.
అట్టి మీ జిహ్వ ప్రత్యేకంగా
హూయమానమైన ఆజ్యాన్ని భక్షించుగాక ! ॥ 2 ॥

ఇది ఇరవై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 30

ఋషులు : భృగ్వంగిరసులు ॥ దేవతలు, ద్యావాపృథివీ, మిత్రుడు : బ్రహ్మణస్పతి మరియు సవిత ॥ ఛందస్సు : బృహతీ ॥ మంత్రము . ॥ 1 ॥

వినియోగం :- గోదాన సంస్కార కర్మలో దీనితో అంజనాన్ని అభిమంత్రించి బ్రహ్మచారి కనులకు పెట్టాలి. పశుపును కట్టే యూపాన్ని బ్రహ్మ దీనితో అనుమంత్రించాలి.

మంత్రము

స్వాక్తం మే ద్యావాపృథివీ స్వాక్తం మిత్రో అకరయమ్ ।

స్వాక్తం మే బ్రహ్మణస్పతిః స్వాక్తం సవితా కరత్ ॥ 1 ॥

పదము

సుఽఆక్తమ్ । మే । ద్యావాపృథివీ ఇతి । సుఽఆక్తమ్ । మిత్రః

అకః । అయమ్ ।

సుఽఆక్తమ్ । మే । బ్రహ్మణః । పతిః । సుఽఆక్తమ్ । సవితా ।

కరత్ ॥ 1 ॥

**అనువాదం.**

ఓ ద్యావాపృథువులారా ! మా కనుదోయిని
అంజనంతో బాగా రంజితం చేయండి
ఈ కనబడుతున్న సూర్యుడు అలాగే చేయుగాక !
అలాగే మంత్రపాలకుడైన దేవుడు
నా అక్షియుగాన్ని, యూపాన్ని స్వాక్తం చేయుగాక !
సవిత అలాగే చేయుగాక ! ॥ 1 ॥

ఇది ముప్పైయవ సూక్తం

## సూక్తం-31

**ఋషులు : భృగ్వంగిరసులు ॥ దేవత : ఇంద్రుడు ॥ ఛందస్సు : భురిక్ త్రిష్టుప్ ॥**
మంత్రము ॥ 1 ॥

**వినియోగం :- అభిచారకర్మలో దీనితో పిడుగు పడిన చెట్టు కొమ్మను సమిధగా ఉపయోగించాలి.**

మంత్రము :

ఇన్ద్రోతిభి ర్బహులాభి ర్నో అద్య

యావచ్ఛ్రేష్ఠాభి ర్మఘవ న్ఛూర జిన్వ ।

యో నో ద్వేష్ట్యధరః స స్పదీష్ట

యము ద్విష్మస్తము ప్రాణో జహాతు ॥ 1 ॥

పదము.

ఇన్ద్ర । ఊతిఽభిః । బహులాభిః । నః । అద్య ।

యావత్ఽశ్రేష్ఠాభిః । మఘఽవన్ । శూర । జిన్వ ।

యః । నః । ద్వేష్టి । అధరః । సః । పదీష్ట ।

యమ్ । ఓంఇతి । ద్విష్మః । తమ్ । ఓంఇతి । ప్రాణః । జహాతు ॥ 1 ॥

అనువాదం :

ఓ ఇంద్రుడా! అనేకమైన రక్షలతో
ఇప్పుడు మమ్ములను పాలించు.
ఓ ఇంద్రుడా! ఓ శూరుడా! ప్రశస్తములైన
ఆ రక్షలతో పూర్తిగా మమ్ము ప్రీతి చెందించు.
మమ్ములను హింసించే శత్రువు
అధోముఖుడై పడిపోవుగాక!
ఏ శత్రువును మేము ద్వేషిస్తున్నామో,
అతడు తన ప్రాణాలను వదలివేయుగాక! ॥ 1 ॥

ఇది ముప్పై ఒకటవ సూక్తం

## సూక్తం-32

ఋషి. బ్రహ్మ॥ దేవతలు ఆయువు॥ ఛందస్సు॥ అనుష్టుప్॥ మంత్రము: ॥1॥

వినియోగం:- ఉపనయనంలో ఆయుష్కాముడైన మాణవకుని తలను దీనితో అనుమంత్రించాలి.

మంత్రము.

ఉప ప్రియం పనిప్నతం యువానమాహుతీవృధమ్।

అగన్మ బిభ్రతో నమో దీర్ఘమాయుః కృణోతు మే ॥ 1 ॥

పదము:

ఉప। ప్రియమ్। పనిప్నతమ్। యువానమ్। ఆహుతిऽవృధమ్।

అగన్మ। బిభ్రతః। నమః। దీర్ఘమ్। ఆయుః। కృణోతు। మే ॥ 1 ॥

అనువాదం:

సర్వులకు ఇష్టుడు, స్తూయమానుడు,
నిత్యతనుడు, ఆజ్యాద్యాహుతులతో వర్ధమానుడునైన
అగ్నిని గూర్చి హవిర్లక్షణమైన నమస్కారాన్ని
సమర్పించి ఉపచరిస్తున్నాము.
అందువల్ల మా మాణవకుని దీర్ఘాయుష్కుని చేయుగాక! ॥1॥

ఇది ముప్పై రెండవ సూక్తం

## సూక్తం-33

ఋషి: బ్రహ్మ॥ దేవతలు: మరుత్తులు, పూష, బృహస్పతి మరియు అగ్ని॥ ఛందస్సు: పథ్యాపంక్తి॥ మంత్రము. ॥ 1 ॥

వినియోగం:- పుష్టి కర్మలో తటాకాది సర్వజనసాధారణోదకములో మిశ్ర ధాన్యాన్ని వేసి దీనితో అభిమంత్రించి పుష్టికాముడు తినాలి.

అగ్ని కార్యంలో దీనితో మాణవకుడు అగ్నిని పర్యుక్షం చేయాలి. అగ్నిచయనంలో అభిషిచ్యమానుడైన యజమానునిచే బ్రహ్మ దీనిని పఠింపజేయాలి

మంత్రము :

సం మా సిఞ్చన్తు మరుతః సం పూషా సం బృహస్పతిః।
సం మాయమగ్నిః సిఞ్చతు ప్రజయా చ
ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే ॥ 1 ॥

పదము .

సమ్ । మా । సిఞ్చన్తు । మరుతః । సమ్ । పూషా । సమ్ ।
బృహస్పతిః ।
సమ్ । మా । అయమ్ । అగ్నిః । సిఞ్చతు । ప్రఽజయా । చ ।
ధనేన । చ । దీర్ఘమ్ । ఆయుః । కృణోతు । మే ॥ 1 ॥

అనువాదం :

మరుదాది దేవతలు ఫలార్థియైన నన్ను
సంతానంతో, ధనంతో సంయోగింపజేయుదురు గాక!
మా మాణవకుని దీర్ఘాయుష్కుని చేయుదురుగాక!
అగ్ని మా మాణవకుని దీర్ఘాయుష్కుని చేయుగాక! ॥ 1 ॥

ఇది ముప్పై మూడవ సూక్తం

## సూక్తం—34

ఋషి: అథర్వుడు ॥ దేవతలు : జాతవేదులు ॥ ఛందస్సు : జగతీ ॥ మంత్రము: ॥ 1 ॥

వినియోగం:- శత్రువునకు పురుష సంతానం లేకుండా చేయడంలో దీనికి విని యోగం. అదే కర్మలో విద్వేషిణీ సీమంతాన్ని చూడడంలో కూడ దీనికి వినియోగం అభిచారకర్మలో దీనికి వినియోగం. అగ్నిచయనంలో కూడా దీనికి వినియోగం

మంత్రము

అగ్నే జాతాన్ ప్ర ణుదా మే సపత్నాన్
ప్రత్యజాతాన్ జాతవేదో నుదస్వ ।
అధస్పదం కృణుష్వ యే పృతన్యవోఽనాగసస్తే
వయ మదితయే స్యామ ॥ 1 ॥

పదము.

అగ్నే । జాతాన్ । ప్ర । నుద । మే । సఽపత్నాన్ ।
ప్రతి । అజాతాన్ । జాతఽవేదః । నుదస్వ ।
అధఃఽపదమ్ । కృణుష్వ । యే । పృతన్యవః । అనాగసః । తే ।
వయమ్ । అదితయే । స్యామ ॥ 1 ॥

అనువాదం .

ఓ అగ్నీ ! మాకున్న శత్రువులను అతిదూరంగా త్రోసివెయ్యి.
ఓ జాతవేదా ! పుట్టబోయే శత్రుపులను వినష్టం పొందించు
ఏ శత్రువులు సంగ్రామేచ్ఛులో, వారిని మాతో పోరాటంలో
మా పాదాలకు అధస్థితులనుగా చెయ్యి.
మేము దేవమాతయైన అదితికై
ఆదిత్య ప్రసాదం వల్ల పాపరహితుల మౌతాము. ॥ 1 ॥

ఇది ముప్పై నాల్గవ సూక్తం

## సూక్తం_35

ఋషిః అథర్వుడు ॥ దేవతలు : జాతవేదులు ॥ ఛందస్సు. 1,3 త్రిష్టుప్ : 3 అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 2 ॥

వినియోగం :_ విద్వేషిణిని వంధ్యనుగా చేయడంలో దీనికి వినియోగం. అగ్ని చయనంలోను, అభిచారకర్మలోను దీనికి వినియోగం

మంత్రము :

ప్రాన్యాన్త్సపత్నాన్త్సహసా సహస్వ
ప్రత్యజాతాన్ జాతవేదో నుదస్వ ।
ఇదం రాష్ట్రం పిపృహి సౌభగాయ
విశ్వ ఏనమను మదన్తు దేవాః ॥ 1 ॥

పదము :

ప్ర । అన్యాన్ । సఽపత్నాన్ । సహసా । సహస్వ ।
ప్రతి । అజాతాన్ । జాతఽవేదః । నుదస్వ ।
ఇదమ్ । రాష్ట్రమ్ । పిపృహి । సౌభగాయ ।
విశ్వే । ఏనమ్ । అను । మదన్తు । దేవాః ॥ 1 ॥

అనువాదం :

ఓ జాతవేదుడా! ఇతర శత్రువులను
శీఘ్రంగా, బాగా అవమానించు.
ఉత్పన్నం కాని శత్రుపుత్రులను వినష్టం చెయ్యి
ఈ అనుభూయమానమైన మా జనపదాన్ని

సౌభాగ్యార్థమై పరిపూర్ణం చెయ్యి.
( పరోపద్రవ కారులు నివసించే దేశంలో
అభివృద్ధి కలుగదని ప్రసిద్ధి అందువలన
ఇచ్చట రాజ్యసౌభాగ్యానికై ప్రార్థిస్తున్నారు )
సర్వ దేవతలు ఈ శత్రుహనన కర్మకారుని
అనుమోదింతురు గాక! ॥ 1 ॥

మంత్రము

**ఇమా యాస్తే శతం హిరాః సహస్రం ధమనీరుత ।**

**తాసాం తే సర్వాసా మహ మశ్మనా బిల మప్యధామ్॥ 2 ॥**

పదము

**ఇమాః । యాః । తే । శతమ్ । హిరాః । సహస్రమ్ । ధమనీః । ఉత ।**

**తాసామ్ । తే । సర్వాసామ్ । అహమ్ । అశ్మనా । బిలమ్ । అపి । అధామ్ ॥ 2 ॥**

అనువాదం

ఓ శత్రుస్త్రీ! నీ శతసంఖ్యాకములైన నాడులు,
సహస్ర సంఖ్యాకములైన ధమనులు,
మొదలైన నాడు లన్నిటి బిలాన్ని ( ముఖాన్ని )
రాతితో మూసివేసినాను
( వన్ధ్యాకరణకర్మ ప్రయోక్తనైన నేను నిన్ను
వంధ్యనుగా చేయుచున్నానని భావము ) ॥ 2 ॥

మంత్రము.

**పరం యోనే రవరం తే కృణోమి మా**

త్వా ప్రజాభి భూన్మోత సూతుః ।
అన్వం1త్వాప్రజసం కృణోమ్యశ్మానం
తే అపిధానం కృణోమి ॥ 3 ॥

పదము ॥

పరమ్ । యోనేః । అవరమ్ । తే । కృణోమి । మా ।
త్వా । ప్రఽజా । అభి । భూత్ । మా । ఉత । సూతుః ।
అన్వఽమ్ । త్వా । అప్రజసమ్ । కృణోమి । అశ్మానమ్ ।
తే । అపిఽధానమ్ । కృణోమి ॥ 3 ॥

అనువాదం :

ఓ ప్రతికూల నారీ! నీ యోనిపై నున్న
గర్భాశయాన్ని నికృష్టంగా చేస్తున్నాను.
అందువల్ల నీకు స్త్రీ సంతానం కలుగకుండుగాక!
అంతే కాక పుత్రుడు కూడా కలుగకుండు గాక!
నిన్ను అశ్వతరినివలె సంతానహీనురాలినిగా చేస్తున్నాను
నీకు సంబంధించిన గర్భస్థానాది విశేషాలను
పాషాణంతో మూసివేస్తున్నాను ॥ 3 ॥

ఇది ముప్పై ఐదవ సూక్తం

## సూక్తం-36

ఋషి. అథర్వుడు ॥ దేవతలు ॥ అక్షి, మనస్సు ॥ ఛందస్సు ॥ అనుష్టుప్ ॥
మంత్రము : ॥ 1 ॥

**వినియోగం :- వివాహంలో నాల్గవనాడు వరవధువులు అన్యోన్యం కళ్ళకు కాటుక పెట్టుకొనుటలో దీనికి వినియోగం.**

మంత్రము

**అక్ష్యౌ నౌ మధుసంకాశే అనీకం నౌ సమఞ్జనమ్ ।**

**అన్తః కృణుష్వ మాం హృది మన ఇన్నౌ సహాసతి ॥ 1 ॥**

పదము .

**అక్ష్యౌఽ । నౌ । మధుసంకాశే । ఇతిమధుఽసంకాశే । అనీకమ్ ।**

**నౌ । సమ్ఽఅఞ్జనమ్ ।**

**అన్తః । కృణుష్వ । మామ్ । హృది । మనః । ఇత్ । నౌ । సహ ।**

**అసతి ॥ 1 ॥**

అనువాదం

దంపతులమైన మన కనులు మధు సదృశములగు గాక!
మన లోచనాగ్రం అంజనసహిత మగుగాక!
నన్ను హృదయంలో దాచుకో
( భార్య భర్తతోను, భర్త భార్యతోను అంటున్నారు. )
మన మనస్సు ఏకకార్యకారి అగుగాక! ॥ 1 ॥

ఇది ముప్పై ఆరవ సూక్తం

## సూక్తం - 37

**ఋషిః అథర్వుడు ॥ దేవత ః వాసుదు ॥ ఛందస్సు . అనుష్టుప్ ॥ మంత్రము . ॥1॥**

మంత్రము .

**అభి త్వా మనుజాతేన దధామి మమ వాససా ।**

యథాఽసో మమ కేవలో నాన్యాసాం కీర్తయాశ్చన ॥ 1 ॥

పదము

అభి । త్వా । మనుఽజాతేన । దధామి । మమ । వాససా ।

యథా । అసః । మమ । కేవలః । న । అన్యాసామ్ । కీర్తయాః। చన ॥ 1 ॥

అనువాదం :

స్వపతిని గూర్చి స్త్రీ అనుమాట :
ఓ నాథా ! నిన్ను మనువునుండి నిష్పన్నమైన
నా వస్త్రంతో బంధిస్తున్నాను.
అందుతో నాకు అసాధారణుడవగుదువు గాక !
ఇతర స్త్రీల పేర్లను ఉచ్చరింపకుందువు గాక ! ॥ 1 ॥

ఇది ముప్పై ఏడవ సూక్తం

## సూక్తం-38

ఋషిః అథర్వుడు దేవత :వనస్పతి ( ఆసురీ )॥ ఛందస్సు : 1,2,4,5 అనుష్టుప్ : 3 చతుష్పదా ఉష్ణిక్ ॥ మంత్రములు : ॥ 5 ॥

వినియోగం :- సౌభాగ్య సంవనన కర్మలో దీనికి వినియోగం. అదే కర్మలో శంఖపుష్పిపుష్పాన్ని అభిమంత్రించి స్త్రీ శిరస్సులో తురమాలి.

మంత్రము.

ఇదం ఖనామి భేషజం మాంపశ్యమభిరోరుదమ్ ।

పరాయతో నివర్తన మాయతః ప్రతినన్దనమ్ ॥ 1 ॥

పదము.

ఇదమ్ । ఖనామి । భేషజమ్ । మామ్ఽపశ్యమ్ । అభిఽరోరుదమ్ ।

పరా౽యతః । ని౽వర్తనమ్ । ఆ౽యతః । ప్రతి౽నన్దనమ్ ॥1॥

**అనువాదం**

ఈ వశీకరణకారి అయిన, సౌవర్చలాఖ్యమైన
ఓషధిని త్రవ్వి పైకి తీస్తున్నాను
అతడు నన్నే చూచుగాక!
నన్నే పతికి చూపించి, అన్యనారి
సంసర్గాన్ని పూర్తిగా నిరోధించునది,
నా నుండి పరాఙ్ముఖుడుగా వెడుతున్న
పతిని నివర్తింప జేయునది,
నాకై వస్తున్న పతిని ఆనందింప జేయునవి
అయిన ఓషధిని త్రవ్వి పైకి తీస్తున్నాను. ॥ 1 ॥

**మంత్రము.**

యేనా నిచక్ర ఆసురీన్ద్రం దేవేభ్యస్పరి ।

తేనా ని కుర్వే త్వా మహం యథా తే౽సాని సుప్రియా ॥2॥

**పదము**

యేన । ని౽చక్రే । ఆసురీ । ఇన్ద్రమ్ । దేవేభ్యః । పరి ।

తేన । ని । కుర్వే । త్వామ్ । అహమ్ । యథా । తే । అసాని ।

సు౽ప్రియా ॥ 2 ॥

**అనువాదం:**

అసురమాయ దేవతలను వదలి
ఇంద్రుని ఏ ఓషధితో యుద్ధంలో స్వాధీనం చేసుకొన్నదో,
ఆ ఓషధితో నేను ఓనాథా!

నిన్ను నా స్వాధీనం చేసుకుంటాను
ఆ విధంగా నీకు అతిప్రియురాలను అవుతాను. ॥ 2 ॥

మంత్రము.

ప్రతీచీ సోమ మసి ప్రతీచ్యుత సూర్యమ్ ।
ప్రతీచీ విశ్వా న్దేవాన్ తాం త్వాఽచ్ఛావదామసి ॥ 3 ॥

పదము

ప్రతీచీ । సోమమ్ । అసి । ప్రతీచీ । ఉత । సూర్యమ్ ।
ప్రతీచీ । విశ్వాన్ । దేవాన్ । తామ్ । త్వా । అచ్ఛఽఆవదామసి ॥ 3 ॥

అనువాదం.

ఓ ఓషధీ! ( శంఖపుష్పాఖ్యా! )
సోమునకు వశీకరణార్థమై అభిముఖురాల వయినావు.
అంతే కాక సూర్యునకు అభిముఖురాల వయినావు.
విశ్వేదేవతలకు అభిముఖురాల వయినావు.
అందువలన సర్వదేవ వశీకరణ సమర్థ వయిన నిన్ను
అభిముఖురాలినిగా చేసుకొనుటకై స్తుతిస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము.

అహం వదామి నేత్ త్వం సభాయా మహ త్వం వద ।
మమేదస్త్వం కేవలో నాన్యాసాం కీర్తయాశ్చన ॥ 4 ॥

పదము.

అహమ్ । వదామి । న । ఇత్ । త్వమ్ । సభాయామ్ । అహ ।
త్వమ్ । వద ।

మమ । ఇత్ । అసః । త్వమ్ । కేవలః । న । అన్యాసామ్ ।

కీర్తయాః । చన ॥ 4 ॥

అనువాదం .

పతి వశీకరణకై ఓషధిని ప్రార్థించి, నారి ఈ ఋల
తన భర్తతో అనేమాట :
ఓనాథా! నేనే మాటలాడెదను నీవు ఎన్నకుండు.
నీవు విద్వత్సమాజంలో మాటలాడు
ఓ పతీ! నీవు నాకే అసాధారణుడ వగుదువు గాక!
ఇతర స్త్రీల పేర్లను కూడా ఉచ్చరింపకుందువు గాక! ॥ 4 ॥

మంత్రము .

యది వాసి తిరోజనం యది వా నద్యఽస్తిరః ।

ఇయం హ మహ్యం త్వా మోషధి ర్బద్ధ్వేవ న్యానయత్ ॥ 5 ॥

పదము

యది । వా । అసి । తిరఃఽజనమ్ । యది । వా । నద్యఽః । తిరః ।

ఇయమ్ । హ । మహ్యమ్ । త్వామ్ । ఓషధిః । బద్ధ్వాఽఇవ ।

నిఽఆనయత్ ॥ 5 ॥

అనువాదం ।

ఓ నాథా! నీవు ఎప్పుడు నాకు కనిపించకుండా పోతావో,
ఎప్పుడు నదులు మనలను వేరుపరుస్తాయో,
అప్పుడీ ఓషధి, శంఖపుష్ప నాకు
నిన్ను నిగ్రహించి అభిముఖుని చేయుగాక! ॥ 5 ॥

ఇది ముప్పై ఎనిమిదవ సూక్తం

ఇది మూడవ అనువాకం

## అనువాకం - 4

### సూక్తం - 39

ఋషిః ప్రస్కణ్వుడు ॥ దేవతలు మంత్రములలో పేర్కొన్నవారు ॥ ఛందస్సు. త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం :- పుష్టికర్మలో వృషభ వపతో ఇంద్రుని యజించడంలో దీనికి వినియోగం.

మంత్రము ॥

దివ్యం సుపర్ణం పయసం బృహన్త మపాం
గర్భం వృషభ మోషధీనామ్ ।
అభీపతో వృష్ట్యా తర్పయన్తమా నో
గోష్ఠే రయిష్ఠాం స్థాపయాతి ॥ 1 ॥

పదము ।

దివ్యమ్ । సుఽపర్ణమ్ । పయసమ్ । బృహన్తమ్ । అపామ్ ।
గర్భమ్ । వృషభమ్ । ఓషధీనామ్ ।
అభీపతః । వృష్ట్యా । తర్పయన్తమ్ । ఆ । నః ।
గోఽస్థే । రయిఽస్థామ్ । స్థాపయాతి ॥ 1 ॥

**అనువాదం.**

దివ్యుని, సుపర్ణుని, పయస్వంతుని, గొప్పవానిని,
జలగర్భంలో ఉన్నవానిని, ఓషధులకు
వృద్ధికరుడైన వానిని,

అభిపతనశీలురు వృష్టికాములునైన
సర్వప్రాణులను వర్షంతో తర్పించువానిని,
ధనవంతమైన ప్రదేశంలో ఉన్నవానిని -
ఇలాంటి దేవుని మా గోష్ఠంలో ఇంద్రుడు స్థాపించుగాక ! ॥1॥

ఇది ముప్పై తొమ్మిదవ సూక్తం

## సూక్తం-40

**ఋషిః ప్రస్కణ్వుడు॥ దేవత సరస్వంతుడు॥ ఛందస్సు. 1 భురిక్ త్రిష్టుప్ః 2 త్రిష్టుప్॥ మంత్రములు ॥ 2 ॥**

**వినియోగం.-** అన్వారంభణీయేష్టిలో సారస్వత పురోడాశాన్ని అనుమంత్రణం చేయడంలో దీనికి వినియోగం

మంత్రము

యస్య వ్రతం పశవో యన్తి సర్వే
యస్య వ్రత ఉపతిష్ఠన్త ఆపః ।
యస్య వ్రతే పుష్టపతి ర్నివిష్టస్తం
సరస్వన్తమవసే హవామహే ॥ 1 ॥

పదః

యస్య । వ్రతమ్ । పశవః । యన్తి । సర్వే ।
యస్య । వ్రతే । ఉపఽతిష్ఠన్తే । ఆపః ।
యస్య । వ్రతే । పుష్టఽపతిః । నిఽవిష్టః । తమ్ ।
సరస్వన్తమ్ । అవసే । హవామహే ॥ 1 ॥

ఆశ్వ. III 29

**అనువాదం 1**

ఏ సరస్వంతుని కర్మను
సర్వ పశువులు అనుగమిస్తున్నాయో,
ఎవని కర్మలో ఉదకములు
పరస్పరం సంగమిస్తున్నాయో,
ఎవని కర్మలో పుష్టపతి నిర్దిష్టుడై ఉన్నాడో,
అలాంటి సరస్వంతుడను దేవుని
రక్షణార్థం ఆహ్వానిస్తున్నాము. ॥ 1 ॥

**మంత్రము**

ఆ ప్రత్యఞ్చం దాశుషే దాశ్వంసం
సరస్వన్తం పుష్టపతిం రయిష్ఠామ్ ।
రాయస్పోషం శ్రవస్యుం వసానా
ఇహ హువేమ సదనం రయీణామ్. ॥ 2 ॥

**పదము.**

ఆ । ప్రత్యఞ్చమ్ । దాశుషే । దాశ్వంసమ్
సరస్వన్తమ్ । పుష్టఽపతిమ్ । రయిఽస్థామ్ ।
రాయః । పోషమ్ । శ్రవస్యుమ్ । వసానాః ।
ఇహ । హువేమ । సదనమ్ । రయీణామ్ ॥ 2 ॥

**అనువాదం**

హవిస్సునిచ్చే వానిని సంతోషపెట్టుటకు
అభిముఖంగా వెడుతున్నట్టి వానిని,

హవిర్దానం చేసే యజమానికి
ఇష్టఫలం ఇచ్చే వానిని, పుష్టపతిని,
ధనస్థానంలో ఉన్న వానిని. ధనపోషకుని,
అన్నదాతను, ధనములకు నిత్యనివాసస్థానమైనవానిని,
అయిన సరస్వంత దేవుని హవిరాదులతో
పరిచరిస్తూ ఈ కర్మలో ఆహ్వానిస్తున్నాము ॥ 6 ॥

ఇది నలభై యవ సూక్తం

## సూక్తం - 41

ఋషి. ప్రస్కణ్వుడు ॥ దేవత శ్యేనుడు ॥ ఛందస్సు. 1 జగతి. 2 త్రిష్టుప్ ॥
మంత్రములు ॥ 2 ॥

వినియోగం - క్రొత్త ఇల్లు కట్టడం కోసం చేసే భూశుద్ధిలో, గృహనిర్మాణ స్థానంలో శ్యేనదేవతాకమైన చరువును హోమం చెయ్యడంలో దీనికి వినియోగం. అగ్నిష్టోమంలో, హవిర్ధానంలో పురోడాశ పిండావాపానంతరం ఆ పిండములను 'శ్యేనో నృచక్షాః' అనే మంత్రంతో అనుమంత్రించాలి.

మంత్రము

అతి ధన్వాన్యత్యప స్తతర్ద శ్యేనో
నృచక్షా అవసాన దర్శః ।
తరన్ విశ్వాన్యవరా రజాంసీన్ద్రేణ
సఖ్యా శివ ఆ జగమ్యాత్ ॥ 1 ॥

పదము:

అతి । ధన్వాని । అతి । అపః । తతర్ద ।

శ్యేనః । నృఽచక్షాః । అవసానఽదర్శః ।
తరన్ । విశ్వాని । అవరా । రజాంసి ।
ఇన్ద్రేణ । సఖ్యా । శివః । ఆ । జగమ్యాత్ ॥ 1 ॥

**అనువాదం**

మనుష్యులకు కర్మసాక్షి అయిన వాడు,
అవసానానంతరం ద్యులోకంలో కనబడే సూర్యుడు
మరు భూములను అతిక్రమించి,
ఉదకములను అతిగా వర్షింపజేయుగాక!
ద్యులోకానికి అధస్థములైన విశ్వములను
అతిక్రమించి సూర్యుడు మిత్రభూతుడైన
ఇంద్రునితో కూడా కల్యాణకారియై
నవగృహ నిర్మాణ స్థానానికి వచ్చుగాక! ॥ 1 ॥

**మంత్రము**

శ్యేనః నృచక్షా దివ్యః సుపర్ణః
సహస్రపాచ్ఛత యోనిర్వయోధాః ।
స నో ని యచ్ఛాద్ వసు యత్
పరాభృత మస్మాకమస్తు పితృషు స్వధావత్ ॥ 2 ॥

**పదము :**

శ్యేనః । నృఽచక్షాః । దివ్యః । సుఽపర్ణః ।
సహస్రఽపాత్ । శతఽయోనిః । వయఃఽధాః ।

స । నః । ని । యచ్ఛాత్ । వసు । యత్ । పరాఽభృతమ్ ।

అస్మాకమ్ । అస్తు । పితృషు । స్వధాఽవత్ ॥ 2 ॥

అనువాదం

లోకులకు కర్మసాక్షి, విభావసుడు, సుపర్ణుడు,
సహస్రకిరణుడు, అపరిమిత కార్యకారణభూతుడు,
అన్నదాత అయిన సూర్యుడు
మమ్ములను చిరకాలం జీవింపజేయుగాక!
ఇతర చోరాదులతో పరాహృతమైన ధనం
మా పితరులకు స్వాహుతమగుగాక! ॥ 2 ॥

ఇది నలభై ఒకటవ సూక్తం

## సూక్తం – 42

ఋషిః ప్రస్కణ్వుడు॥ దేవతలు సోమారుద్రులు॥ ఛందస్సు: త్రిష్టుప్॥ మంత్రములు ॥ 2 ॥

వినియోగం - సర్వవ్యాధి చికిత్సలో దీనికి వినియోగం. సర్వసంపత్కాముడు దీనితో సోమారుద్రులను యజనంచేయాలి లేదా ఉపతిష్ఠానం చేయాలి

మంత్రము

సోమారుద్రా వి వృహతం విషూచీ మమీవా

యా నో గయమావివేశ ।

బాధేథాం దూరం నిర్ ఋతిం పరాచైః

కృతం చిదేనః ప్ర ముముక్తమస్మత్ ॥ 1 ॥

పదము :

సోమారుద్రా । వి । వృహతమ్ । విషూచీమ్ ।

అమీవా । యా । నః । గయమ్ । ఆఽవివేశ ।

బాధేథామ్ । దూరమ్ । నిఃఋతిమ్ । పరాచైః ।

కృతమ్ । చిత్ । ఏనః । ప్ర । ముముక్తమ్ । అస్మత్ ॥ 1 ॥

అనువాదం

ఓ సోమారుద్రులారా !
విషూచిని వినాశం చేయండి
ఇది మా ఇంటిలో సర్వవ్యాప్తమై ఉన్నది
దానిని తొలగించండి.
రోగకారకురాలైన నిర్ ఋతిని
పరాఙ్ముఖం చేసి దూరంగా
తీసుకొనివెళ్ళి నశింప జేయండి.
మేము ఏదైనా పాపం చేసినట్లయితే
ఆ పాపాన్ని మా నుంచి తొలగించివేయండి. ॥ 1 ॥

మంత్రము

సోమారుద్రా యువమేతాన్యస్మద్

విశ్వా తనూషు భేషజాని ధత్తమ్ ।

అవ స్యతం ముఞ్చతం యన్నో అసత్

తనూషు బద్ధం కృతమేనో అస్మత్ ॥ 2 ॥

పదపా

సోమారుద్రా । యువమ్ । ఏతాని । అస్మత్ ।
విశ్వా ॥ తనూషు । భేషజాని । ధత్తమ్ ।
అవ । స్యతమ్ । ముఞ్చతమ్ । యత్ । నః । అసత్ ।
తనూషు । బద్ధమ్ । కృతమ్ । ఏనః । అస్మత్ ॥ 2 ॥

అనువాదం

ఓ సోమారుద్రులారా!
మీరు మా శరీరములలో సర్వరోగ నివారకములైన
ఔషధాలను నింపండి
మా శరీరములలో సంబద్ధమైన
మా పాపాన్ని మానుంచి తొలగించివేయుండి.
ఆ పాపములను నశింప జేయండి. ॥ 2 ॥

ఇది నలభై రెండవ సూక్తం

## సూక్తం-43

**ఋషి: ప్రస్కణ్వుడు ॥ దేవత: వాక్ ॥ ఛందస్సు. త్రిష్టుప్ ॥ మంత్రము: ॥1॥**

**వినియోగం:-మిథ్యాభిశస్తునికి లోకనిందా నివారణార్థమై అన్నాన్ని కాని, మంథాన్ని కాని దీనితో అభిమంత్రించి ఇవ్వాలి. 'ద్రుఘణ' మణినిగాని అదే ఆకారంగల పలాశ, లోహ, హిరణ్యాదులకు చెందిన ఏదో ఒక మణిని గాని అభిమంత్రించి బంధించడంలో కూడా దీనికి వినియోగం.**

మంత్రము

శివాస్త ఏకా అశివాస్త ఏకాః

సర్వా బిభర్షి సుమనస్యమానః ।
తిస్రో వాచో నిహితా అన్తరస్మిన్
తాసామేకా వి పపాతాను ఘోషమ్ ॥ 1 ॥

పదము.

శివాః । తే । ఏకాః । అశివాః । తే । ఏకాః ।
సర్వాః । బిభర్షి । సుఽమనస్యమానః ।
తిస్రః । వాచః । నిఽహితాః । అన్తః । అస్మిన్ ।
తాసామ్ । ఏకా । వి । పపాత । అను । ఘోషమ్ ॥ 1 ॥

అనువాదం

ఓ అకారణనిందిత పురుషుడా !
నీ విషయంలో స్తుతిరూపములు, కల్యాణరూపములు
అయిన కొన్ని వాక్యములు కలవు.
నీ విషయంలో నిందార్థములైన కొన్ని వాక్కులు గలవు.
ఆ ద్వివిధవాక్కులను నీవు సహృదయంతో భరించు.
*ఆ పూర్వోక్తవాక్కుల మధ్యలో మూడు వాక్కులు
ఈ శబ్దప్రయోక్త అయిన పురుషుని దేహమధ్యంలో

* సర్వవాక్కులు పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీరూపములైన చతుర వస్థారూపములైనవి. వానిలో మొదటి మూడు దేహాన్తరావస్థానంవల్ల ఇత రులకు ప్రతిపాదించుటకు శక్తివంతములు కావు. వైఖరి తాలు, ఓష్ఠాది స్థానములలో వర్ణ, పద, వాక్యరూపంతో అభివ్యజ్య మానమై పర శ్రోత్రగ్రహణయోగ్య మవుతుంది. ఆ వాక్కులు స్తుతిరూపములు, నిందా రూపములు అని రెండు విధములు.

...నస్థితియులై యున్నది
వైఖరీ రూపమైన ఒక వాక్కు
వర్ణపదాది రూపములతో ప్రవర్తిల్లుతున్నది ॥ 1 ॥

ఇది నలభై మూడవ సూక్తం

## సూక్తం – 44

ఋషిః ప్రస్కణ్వుడు॥ దేవతలు ఇంద్రుడు, విష్ణువు॥ ఛందస్సు భురిక్ త్రిష్టుప్॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం :- సాంమనస్య కర్మలో దీనితో హస్తి మొదలైన వాహానాలను అభిమంత్రించి సాంమనస్య కాములను అధిరోహింపజేసి, ఇంటికి వచ్చి, అన్నాన్ని కాని మంథాన్ని కాని అభిమంత్రించి సహభోజనం చేయాలి. దీనితో 'ఉక్థ్యము'లో అచ్ఛావాక హోమంలో బ్రహ్మ అనుమంత్రణం చేయాలి

మంత్రము.

ఉభా జిగ్యథుర్న పరా జయేథే
న పరా జిగ్యే కతరశ్చనైనయోః ।
ఇన్ద్రశ్చ విష్ణో యదపస్పృధేథాం
త్రేధా సహస్రం వి తదైరయేథామ్ ॥ 1 ॥

పదము

ఉభా । జిగ్యథుః । న । పరా । జయేథేఇతి ।
న । పరా । జిగ్యే । కతరః । చన । ఏనయోః ।
ఇన్ద్రః । చ । విష్ణోఇతి । యత్ । అపస్పృధేథామ్ ।

త్రేధా । సహస్రమ్ । వి । తత్ । ఐరయేథామ్ ॥ 1 ॥

**అనువాదం**

ఓ ఇంద్రా విష్ణువులారా!
మీరిద్దరూ సర్వదా జయిస్తూనే ఉన్నారు
ఒకప్పుడు కూడా అపజయం పొందలేదు
ఈ ఇంద్రావిష్ణువుల మధ్య ఏ ఒకరూ
ఇతరులతో పరాజితులు కాలేదు
ఓ విష్ణూ! ఇంద్రుడా! మీరు ఋషులతో
దేనికోసమై విరోధిస్తారో, ఆ వస్తువు
మూడు విధాలుగా ( లోక, వేద, వాగాత్మకంగా )
ఉండి అపరిమితంగా విక్రమించుగాక! ॥ 1 ॥

ఇది సలభై నాల్గవ సూక్తం

## సూక్తం - 45

**ఋషిః ప్రస్కణ్వుడు ॥ దేవత ఈర్ష్యాపనయనము ॥ ఛందస్సు. అనుష్టుప్ ॥**
**మంత్రములు ॥ 2 ॥**

వినియోగం :- ఈర్ష్యావినాశార్థం ఈర్ష్యాళువును చూచి మొదటి మంత్రాన్ని పఠించాలి, అలాగే దీనితో సక్తుమంథాన్ని అభిమంత్రించి ఈర్ష్యావంతునకు ఇవ్వాలి. అదే కర్మలో ఈర్ష్యావంతుని స్పృశించి దీనిని జపించాలి. ఈర్ష్యావినాశకర్మలో కాల్చిన గంధ్రగొడ్డలితో నీటిని కలియబెట్టి 'అగ్నేరివాస్య' అనే మంత్రంతో అభిమంత్రించి ఈర్ష్యాళువుచే త్రాగించాలి

మంత్రము

జనాద్ విశ్వజనీనాత్ సిన్ధుతస్పర్యాభృతమ్ ।

దూరాత్ త్వా మన్య ఉద్భృతమీర్ష్యాయా నామ భేషజమ్ ॥ 1 ॥

పదము

జనాత్ । విశ్వఽజనీనాత్ । సిన్ధుతః । పరి । ఆఽభృతమ్ ।

దూరాత్ । త్వా । మన్యే । ఉత్ఽభృతమ్ । ఈర్ష్యాయాః ।

నామ । భేషజమ్ ॥ 1 ॥

అనువాదం :

( ఈర్ష్యానివర్తనక్షమమైన ఔషధమా ! ) నీవు
విశ్వజనహితమైన జనపదం నుంచి,
సముద్రం నుంచి ఆహృతమైన దానవు
దూరదేశం నుంచి ఉద్ధృతమైన,
సక్తుమంథ లక్షణమైన నిన్ను
ఈర్ష్యను నివర్తింపజేసే ఔషధంగా భావిస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము

అగ్నేరివాస్య దహతో దావస్య దహతః పృథక్ ।

ఏతామేతస్యేర్ష్యాముద్నాగ్నిమివ శమయ ॥ 2 ॥

పదము.

అగ్నేఃఽఇవ । అస్య । దహతః । దావస్య । దహతః । పృథక్ ।

ఏతామ్ । ఏతస్య । ఈర్ష్యామ్ । ఉద్నా । అగ్నిమ్ఽఇవ ।

శమయ ॥ 2 ॥

అనువాదం

ప్రతి పదార్థాన్ని వేరువేరుగా
భస్మీకరించే దావానలం వలె దహిస్తూ

ఈ ముందు కనబడే ఈర్ష్యాళువైన పురుషుడు
నాయెడ ప్రయోగించిన ఈర్ష్యను
ఉదకంతో శమింపజేయి ॥ 2 ॥

ఇది నలభై ఐదవ సూక్తం

## సూక్తం — 46

ఋషి: అథర్వుడు ॥ దేవత. సినీవాలి ॥ ఛందస్సు: 1,3 అనుష్టుప్: 3 త్రిష్టుప్ ॥
మంత్రములు ॥ 3 ॥

వినియోగం '–సర్వవ్యాధిభైషజ్యార్థం రోగి శరీరాన్ని మౌంజపాశములతో కీళ్ళలో కట్టి 'సినీవాలి' అనే తొమ్మిది మంత్రాలతో తుంగముష్ఠులతో పాటు ఉదక ఘటాన్ని వేసి మంత్రించి రోగి మీద పోయాలి లేదా తడపాలి.

అలాగే సర్వ సంపత్కాముడు ఈ తొమ్మిది మంత్రాలతో 'సినీవాలి', 'కుహూ', 'రాకా', 'దేవపత్ని' అనే నలుగురు దేవతలను పూజించాలి, లేదా ఉపతిష్ఠానం చేయాలి.

దర్శయాగంలో 'సినీవాలి' అనే మంత్రత్రయంతో సినీవాలి దేవతను పరిగ్రహించాలి.

మంత్రము ।

సినీవాలి పృథుష్టుకే యా దేవానామసి స్వసా ।
జుషస్వ హవ్యమాహుతం ప్రజాం దేవి దిదిడ్ఢి నః ॥ 1 ॥

పదము

సినీవాలి । పృథుఽస్తుకే । యా । దేవానామ్ । అసి । స్వసా ।
జుషస్వ । హవ్యమ్ । ఆఽహుతమ్ । ప్రఽజామ్ । దేవి । దిదిడ్ఢి ।
నః । ॥ 1 ॥

అనువాదం

ఓ *సినీవాలీ! పృథుజఘున అయిన నీవు
దేవతలకు భగినివి అవుతున్నావు
నీవు నీ కిచ్చే హవిస్సును సేవించు
మఱీ ఓ దేవీ! మాకు సంతానాన్ని ప్రసాదించు ॥ 1 ॥

మంత్రము

యా సుబాహుః స్వఙ్గురిః సుషూమా బహుసూవరీ ।
తస్యై విశ్పత్న్యై హవిః సినీవాల్యై జుహోతన ॥ 2 ॥

పదము

యా । సుఽబాహుః । సుఽఅఙ్గురిః । సుఽసూమా । బహు
ఽసూవరీ ।
తస్యై । విశ్పత్న్యై । హవిః । సినీవాల్యై । జుహోతన ॥ 2 ॥

అనువాదం

ఏ సినీవాలి సుపాణియై, శోభనాంగుళియై,
సుయోనియై, బహుప్రజా సవిత్రియై ఉన్నదో,
ఆ సినీవాలికి, ప్రజాపాలయిత్రికి హవిస్సును
ఆహుతులు ఇత్తురుగాక! ॥ 2 ॥

మంత్రము

యా విశ్పత్నీన్ద్రమసి ప్రతీచీ సహస్రస్తుకాభియన్తీ దేవీ ।
విష్ణోః పత్ని తుభ్యం రాతా హవీంషి

* నెలవంక కనిపించే అమావాస్య సినీవాలి.

పతిం దేవి రాధసే చోదయస్వ ॥ 3 ॥

పదము

యా । విశ్పత్నీ । ఇన్ద్రమ్ । అసి । ప్రతీచీ । సహస్రఽస్తుకా । అభిఽయన్తీ । దేవీ ।

విష్ణోః । పత్ని । తుభ్యమ్ । రాతా । హవీంషి । పతిమ్ । దేవి ।

రాధసే । చోదయస్వ ॥ 3 ॥

అనువాదం .

ఓ సినీవాలీ! ప్రజాపాలకురాలవు
ఇంద్రునికీ ప్రతీచిగా (అభిముఖురాలవుగా) ఉన్నావు
నీవు పృథు కబరివి
యష్టవ్య దేవతలకు అభిముఖంగా వెళ్ళుదానవు.
ద్యోతనశీలవు. ఓ విష్ణుపత్నీ!
నీకు హవిస్సు నిస్తున్నాము
అందువలన ఓ దేవీ! నీవు సంతుష్టురాలవై
నీ పతి మాకు ధన మిచ్చునట్టు ప్రేరేపించు. ॥ 3 ॥

ఇది నలభై ఆరవ సూక్తం

## సూక్తం -47

ఋషిః అథర్వుడు॥ దేవత, కుహూ ॥ ఛందస్సు: 1 జగతీ ; 2 త్రిష్టుప్॥ మంత్రములు ॥ 2 ॥

వినియోగం :- దర్శయాగంలో దీనితో కుహూదేవిని పరిగ్రహించాలి.

మంత్రము :

కుహూం దేవీం సుకృతం విద్మనాపసమస్మిన్

యజ్ఞే సుహవా జోహవీమి ।

సా నో రయిం విశ్వవారం ని యచ్ఛాద్

దదాతు వీరం శతదాయ ముక్థ్యఽమ్ ॥ 1 ॥

పదము

కుహూమ్ । దేవీమ్ । సుఽకృతమ్ । విద్మనాఽఅపసమ్ । అస్మిన్

యజ్ఞే । సుఽహవా । జోహవీమి ।

సా । నః । రయిమ్ । విశ్వఽవారమ్ । ని । యచ్ఛాత్ ।

దదాతు । వీరమ్ । శతఽదాయమ్ । ఉక్థ్యఽమ్ ॥ 1 ॥

అనువాదం

*కుహూదేవిని ఈ యజ్ఞానికి రమ్మని ఆహ్వానిస్తున్నాను
సుకర్మకలది, జలకర్మకలది, శోభనాహ్వాన
అయిన కుహూదేవి సర్వవరణీయమైన
ధనాన్ని మాకు ఇచ్చుగాక!
బహుధనవంతుడు, స్తోత్రార్హుడు, వీరుడు అయిన
పుత్రుని ప్రసాదించు గాక! ॥ 1 ॥

మంత్రము

కుహూ ర్దేవానా మమృతస్య పత్నీ

హవ్యా నో అస్య హవిషో జుషేత ।

---

* నష్ట చంద్ర అయిన అమావాస్య

శృణోతు యజ్ఞ ముశతీ నో అద్య
రాయస్పోషం చికితుషీ దధాతు ॥ 2 ॥

పదము

కుహూః । దేవానామ్ । అమృతస్య । పత్నీ ।
హవ్యా । నః । అస్య । హవిషః । జుషేత ।
శృణోతు । యజ్ఞమ్ । ఉశతీ । నః । అద్య ।
రాయః । పోషమ్ । చికితుషీ । దధాతు ॥ 2 ॥

అనువాదం.

దేవతలలో కుహూదేవి
అవినాశమైన ఉదకమునకు పాలకురాలు.
హవనీయురాలవైన నీవు
మే మిచ్చే ఈ హవిస్సును సేవించు.
మఱన్ని మా యజ్ఞాన్ని కామించి
ఇప్పుడు మా ఆహ్వానాన్ని ఆకర్ణించు.
మా యజ్ఞాన్ని తెలిసినదానవై
ధనపుష్టిని మాకు కల్పించు. ॥ 2 ॥

ఇది నలభై ఏడవ సూక్తం

## సూక్తం – 48

ఋషిః అథర్వుడు ॥ దేవత : రాకా॥ ఛందస్సు . జగతీ ॥ మంత్రములు ॥ 2 ॥

వినియోగం — పూర్ణమాస యాగంలో దీనితో రాకాదేవిని పరిగ్రహించాలి.

మంత్రము

రాకామహం సుహవా సుష్టుతీ హువే

శృణోతు నః సుభగా బోధతు త్మనా ।

సీవ్యత్వపః సూచ్యాఽచ్ఛిద్యమానయా

దదాతు వీరం శతదాయముక్థ్యమ్ ॥ 1 ॥

పదము

రాకామ్ । అహమ్ । సుఽహవా । సుఽస్తుతీ । హువే ।

శృణోతు । నః । సుఽభగా । బోధతు । త్మనా ।

సీవ్యతు । అపః । సూచ్యా । అచ్ఛిద్యమానయా ।

దదాతు । వీరమ్ । శతఽదాయమ్ । ఉక్థ్యమ్ ॥ 1 ॥

**అనువాదం**

*రాకాదేవిని, శోభనాహ్వానయైన దానిని
మంగళస్తుతిచే నేను ఆహ్వానిస్తున్నాను
ఆ సుభగ నా ఆహ్వానాన్ని ఆలకించి
తనంతట తానే మా అభిప్రాయాన్ని తెలుసుకొనుగాక !
ఈ ప్రజనన లక్షణమైన కర్మను
అచ్ఛిద్యమానయైన నాడితో సంయోగింపజేయుగాక !
విక్రమం గల పుత్రుని, బహుధనం కలవానిని,
కర్మలతో స్తోత్రార్హాన ప్రసాదించుగాక ! ॥ 1 ॥

* సంపూర్ణ చంద్రుడు గల పూర్ణిమ రాకా.

మంత్రము.

యాస్తే రాకే సుమతయః సుపేశసో
యాభిర్దదాసి దాశుషే వసూని ।
తాభిర్నో అద్య సుమనా ఉపాగహి
సహస్రపోషం సుభగే రరాణా ॥ 2 ॥

పదము

యాః । తే । రాకే । సుఽమతయః । సుఽపేశసః ।
యాభిః । దదాసి । దాశుషే । వసూని ।
తాభిః । నః । అద్య । సుఽమనాః । ఉపఽఆగహి ।
సహస్రఽపోషమ్ । సుఽభగే । రరాణా ॥ 2 ॥

అనువాదం।

ఓ దేవీ! రాకా! నీ కల్యాణబుద్ధులతో
శోభనవిషయములైన సద్బుద్ధులతో
హవిర్దానం చేసి యజమానికి ధనములను ఇచ్చినావు.
వాటితో మమ్ములను ఇప్పుడు
సుమనస్కవై సమీపించు
ఓ సుభగా! బహుధన పుష్టినిమ్ము. ॥ 2 ॥

ఇది నలభై ఎనిమిదవ సూక్తం

## సూక్తం-49

ఋషి! అథర్వుడు॥ దేవతలు: దేవపత్నులు॥ ఛందస్సు: 1 ఆర్షీ జగతీ
2 చతుష్పదా పంక్తి॥ మంత్రములు ॥ 2 ॥.

వినియోగం:- దర్శపూర్ణమాసలలో, పత్నీసంయాజములలో దీనితో దేవపత్నీ యాగాన్ని అనుమంత్రించాలి

మంత్రము

దేవానాం పత్నీరుశతీరవన్తు నః

ప్రావన్తు న స్తుజయే వాజసాతయే ।

యాః పార్థివాసో యా అపామపి వ్రతే

తా నో దేవీః సుహవాః శర్మ యచ్ఛన్తు ॥ 1 ॥

పదము

దేవానామ్ । పత్నీః । ఉశతీః । అవన్తు । నః ।

ప్ర । అవన్తు । నః । తుజయే । వాజఽసాతయే ।

యాః । పార్థివాసః । యాః । అపామ్ । అపి । వ్రతే ।

తాః । నః । దేవీః । సుఽహవాః । శర్మ । యచ్ఛన్తు ॥ 1 ॥

అనువాదం:

దేవపత్నులు కామయమానలై
మనలను రక్షింతురు గాక!
అలాగే మాకు సంతానార్థమై,
అన్నలాభార్థమై రక్షణ కల్పింతురుగాక!
ఆ దేవపత్నులు పృథివీస్థానము కలవారు.
అలాగే జలకర్మలో అంతరిక్షమునందున్న వారు.
ఆ దేవతలు శోభనాహ్వానులై
మాకు సుఖాన్ని ఇత్తురు గాక! ॥ 1 ॥

మంత్రము

ఉత గ్నా వ్యన్తు దేవపత్నీరిన్ద్రాణ్యగ్నాయ్యశ్వినీ రాట్ ।
ఆ రోదసీ వరుణానీ శృణోతు వ్యన్తు
దేవీర్య ఋతుర్జనీనామ్ ॥ 2 ॥

పదము

ఉత । గ్నాః । వ్యన్తు । దేవఽపత్నీః । ఇన్ద్రాణీ । అగ్నాయీ ।
అశ్వినీ । రాట్ ।
ఆ । రోదసీ । వరుణానీ । శృణోతు । వ్యన్తు । దేవీః । యః ।
ఋతుః । జనీనామ్ ॥ 2 ॥

అనువాదం

మిగతన్ని దేవపత్నులు హవిస్సులను కామింతురుగాక !
ఇంద్రపత్ని, వరుణపత్ని, అగ్నిపత్ని,
అశ్వినీదేవతల భార్య, రుద్రుని భార్య
మాకు అభిముఖులై ఈ ఆహ్వానాన్ని వినుదురుగాక !
మేమిచ్చే హవ్యాన్ని తిందురు గాక !
భార్యల ఋతుకాలమునందు
మా హవిస్సులను భక్షింతురుగాక ! ॥ 2 ॥

ఇది నలభై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 50

ఋషి. అంగిరసుడు (కితవవధకాముడు) ॥ దేవత. ఇంద్రుడు ॥ ఛందస్సు:
1,2,5,8,9 అనుష్టుప్ ; 3, 7 త్రిష్టుప్ 4 జగతీ ; 6 భురిక్ త్రిష్టుప్ ॥
మంత్రములు : ॥ 9 ॥

వినియోగం :- ద్యూతజయ కర్మలో స్థలశుద్ధి, అక్షాధివాసం చేసి దీనితో అక్షము లను అభిమంత్రించి జూదమాడాలి. అలాగే ఉక్థ్యక్రతువులో యాజ్యహోమాన్ని బ్రహ్మ దీనితో అనుమంత్రించాలి. గ్రహ యజ్ఞంలో హవిరాజ్యాదులను దీనితో బృహస్పతికి సమర్పించాలి.

మంత్రము

యథా వృక్షమశనిర్విశ్వాహా హన్త్యప్రతి ।

ఏవాహమద్య కితవానక్షైర్బధ్యాసమప్రతి । ॥ 1 ॥

పదము

యథా । వృక్షమ్ । అశనిః । విశ్వాహా । హన్తి । అప్రతి ।

ఏవ । అహమ్ । అద్య । కితవాన్ । అక్షైః । బధ్యాసమ్ । అప్రతి ॥ 1 ॥

అనువాదం :

పిడుగు అప్రతిహతంగా సర్వదినములలో
ఏ విధంగా వృక్షమును బాధిస్తుందో,
అలాగే నేను అప్రతిహతుడనై
ఇప్పుడు జూదగాళ్ళను పాచికలతో
అప్రతిపక్షంగా ఓడిస్తాను ॥ 1 ॥

మంత్రము :

తురాణామతురాణాం విశామవర్జుషీణామ్ ।

సమైతు విశ్వతో భగో అన్తర్హస్తం కృతం మమ ॥ 2 ॥

పదము

తురాణామ్ । అతురాణామ్ । విశామ్ । అవర్జుషీణామ్ ।

సమ్ఽఐతు । విశ్వతః । భగః । అన్తఃఽహస్తమ్ । కృతమ్ ।

మమ ॥ 2 ॥

అనువాదం.

ద్యూతకర్మలో త్వరపడే వారు
త్వరపడని వారు, అపర్జనశీలురునైన
ప్రతికితవులైన ప్రజల భాగ్యం
సర్వతః నాకు అభిముఖమై వచ్చుగాక!
నాహస్త మధ్యంలో *చౌకం ఎడినది. ॥ 2 ॥

మంత్రము:

ఈడే అగ్నిం స్వావసుం నమోభిరిహ
ప్రసక్తో వి చయత్ కృతం నః ।
రథైరివ ప్ర భరే వాజయద్భిః
ప్రదక్షిణం మరుతాం స్తోమమృధ్యామ్ ॥ 3 ॥

పదము:

ఈడే । అగ్నిమ్ । స్వఽవసుమ్ । నమఃఽభిః । ఇహ ।
ప్రఽసక్తః । వి । చయత్ । కృతమ్ । నః ।
రథైఃఽఇవ । ప్ర । భరే । వాజయత్ఽభిః ।
ప్రఽదక్షిణమ్ । మరుతామ్ । స్తోమమ్ । ఋధ్యామ్ ॥ 3 ॥

---

* అక్షవిషయములైన అయములు ఒకటి మొదలు ఐదు సంఖ్యలు కలవి. వాటిలో నాలుగు సంఖ్య కలది చౌకం.

అనువాదం:

స్వకీయాధనం కల అగ్నిని స్తోత్రములతో స్తుతిస్తున్నాను.
ఈ ద్యూతకర్మలో ప్రశక్తుడైన అగ్ని
నాకు లాభహేతువైన కృతం (చౌకం) పడునట్లు చేయుగాక!
అన్నలాభకారణములైన ధనములవలె ఉన్న
పాచికలతో ఎదిరి జూదగాళ్ళను ఓడిస్తాను
తరువాత సర్వదేవతలను ప్రదక్షిణంతో అర్చిస్తాను. ॥ 3 ॥

సంహితా.

వయం జయేమ త్వయా యుజా
వృతమస్మాకమంశముదవా భరేభరే ।
అస్మభ్యమిన్ద్ర వరీయః సుగం కృధి
ప్ర శత్రూణాం మఘవన్ వృష్ణ్యా రుజ ॥ 4 ॥

పదపాఠః

వయమ్ । జయేమ । త్వయా । యుజా । వృతమ్ । అస్మాకమ్ ।
అంశమ్ । ఉత్ । అవ । భరేఽభరే ।
అస్మభ్యమ్ । ఇన్ద్ర । వరీయః । సుఽగమ్ । కృధి । ప్ర ।
శత్రూణామ్ । మఘఽవన్ । వృష్ణ్యా । రుజ ॥ 4 ॥

అనువాదం.

ఓ ఇంద్రుడా! నీ సహాయంతో మేము
ప్రతికితవులను జయిస్తాము
అలాగే ప్రతిపందెం లోను

నా జయలక్షణాన్ని ఉద్గమనం చెయ్యి.
నాకు అధిక ధనం సుగమంగా లభించునట్లు చెయ్యి.
ఓ మహేంద్రా! ప్రతికితవుల వీర్యములను నివారించు
(ప్రతికితవులు మమ్ము జయించకుందురుగాక!
మేము వారిని జయింతుము గాక!
ఆ జయంతో వారి ధనాన్ని
మేము హరింతుముగాక! - అని భావం) ॥ 4 ॥

మంత్రము

అజైషం త్వా సంలిఖితమజైషముత సంరుధమ్ ।
అవిం వృకో యథా మథదేవా మథ్నామి తే కృతమ్ ॥5॥

పదము.

అజైషమ్ । త్వా । సమ్ఽలిఖితమ్ । అజైషమ్ । ఉత । సమ్ఽరుధమ్ ।
అవిమ్ । వృకః । యథా । మథత్ । ఏవ । మథ్నామి । తే । కృతమ్ ॥ 5 ॥

అనువాదం:

ఓ జూదగాడా! పదములలో గుర్తులను బాగా
వ్రాయగలవాడవైనప్పటికీ నిన్ను నేనే జయిస్తాను
మాటిన్నీ సంరోధించే నిన్ను జయిస్తాను.
సంరుద్ధ స్థానాన్ని అభిలక్షించి నిన్ను జయిస్తాను.
అంతేకాక, తోడేలు మేకను ఏవిధంగా చంపివేస్తుందో,
అలాగే నేను లాభహేతువైన నీ కృతాన్ని
(చౌకాన్ని) నాశం చేస్తాను ॥ 5 ॥

సంహిత

ఉత ప్రహామతిదీవా జయాతి
కృతమివ శ్వఘ్నీ వి చినోతి కాలే ।
యో దేవకామో న ధనా రుణద్ధి
సమిత్ తం రాయః సృజతి స్వధాభిః ॥ ౯ ॥

పదపాఠం

ఉత । ప్రఽహామ్ । అతిఽదీవా । జయాతి ।
కృతమ్ఽఇవ । శ్వఽఘ్నీ । వి । చినోతి । కాలే ।
యః । దేవఽకామః । న । ధనా । రుణద్ధి ।
సమ్ । ఇత్ । తమ్ । రాయః । సృజతి । స్వధాభిః ॥ ౯ ॥

**అనువాదం**

మతిని అతిదీప్తిమంతుడైన పురుషుడు
పాచికలతో కొడుతున్న ప్రతికితవుని ఓడిస్తాడు.
ఎందువల్లనంటే పరధనాపహారి అయిన కితవుడు
ద్యూతకాలంలో కృతాన్ని (చౌకాన్ని) వెతుకుతాడు
ఏ దేవకాముడు ద్యూతంలో గెలిచిన ధనాన్ని
స్వార్థంగా ఉంచక, దేవతలకై వినియోగిస్తాడో,
అతనిని (ఇంద్రుడు) ధనంతో, అన్నంతో,
బలంతో సంయోగింపజేస్తాడు.
(ఇక్కడ ప్రార్థితుడైనవాడు ఇంద్రుడని సాయణ భాష్యం.)
॥ ౯ ॥

మంత్రము

గోభిష్టరేమామతిం దురేవాం యవేన

వా క్షుధం పురుహూత విశ్వే ।

వయం రాజసు ప్రథమా ధనాన్యరిష్టాసో

వృజనీభిర్జయేమ ॥ 7 ॥

పదము :

గోభిః । తరేమ । అమతిమ్ । దుఃఽఏవామ్ । యవేన ।

వా । క్షుధమ్ । పురుఽహూత । విశ్వే ।

వయమ్ । రాజఽసు । ప్రథమాః । ధనాని । అరిష్టాసః ।

వృజనీభిః । జయేమ ॥ 7 ॥

అనువాదం

ఓ ఇంద్రా! దారిద్ర్యం వల్ల వచ్చిన
దుర్బుద్ధిని పశువులతో తరింతుము గాక!
ఓ పురుహూతుడా! మేమందరము
ధాన్యంతో ఆకలిని నివారించుదుముగాక!
రాజులవద్దనున్న ప్రకృష్టతమములైన ధనములను
మేము ప్రతికితవులతో పరాజయం పొందక,
బలకారిణులైన అక్షశలాకలతో జయించుదుముగాక! ॥ 7 ॥

మంత్రము .

కృతం మే దక్షిణే హస్తే జయో మే సవ్య ఆహితః ।

గోజిద్ భూయాసమశ్వజిద్ ధనంజయో హిరణ్యజిత్ ॥ 8 ॥

పదపా॥

కృతమ్ । మే । దక్షిణే । హస్తే । జయః । మే । సవ్యే ।

ఆహితః ।

గో౽జిత్ । భూయాసమ్ । అశ్వ౽జిత్ । ధనమ్౽జయః ।

హిరణ్య౽జిత్ ॥ 8 ॥

అనువాదం

లాభహేతువైన కృతం (చౌకం) ఉన్నది
నా సవ్య హస్తంలో జయం నిహితమై ఉన్నది.
అందువలన నేను పరకీయ గోజేతను,
అశ్వజేతను, దాసీభూమ్యాది ధనజేతను,
సువర్ణజేతను అవుతున్నాను ॥ 8 ॥

మంత్రపాఠ:

అక్షాః ఫలవతీం ద్యువం దత్త గాం క్షీరిణీమివ ।

సం మా కృతస్య ధారయా ధనుః స్నావ్నేవ నహ్యత ॥ 9 ॥

పదము.

అక్షాః । ఫల౽వతీమ్ । ద్యువమ్ । దత్త । గామ్ । క్షీరిణీమ్౽ఇవ ।

సమ్ । మా । కృతస్య । ధారయా । ధనుః । స్నావ్నా౽ఇవ ।

నహ్యత ॥ 9 ॥

అనువాదం

ఓ పాచికలారా! పాలుగల గోవును వలె
ద్యూతక్రియను ఫలవంతముగునట్లు ప్రసాదించండి

ధనుస్సును అల్లె త్రాడుతో సంయోగింప జేసినట్లు
లాభహేతువైన కృతధార్తతో వరుసగా
నన్ను సంయోగింప జెయ్యండి.
(అల్లె త్రాటితో కట్టబడిన ధనుస్సు ఏ విధంగా జయకారి
అవుతుందో, ఆ విధంగా నన్ను కృతపరంపరతో
జయకారిని చేయండి ) ॥ 9 ॥

ఇది యాభైయవ సూక్తం

## సూక్తం–51

ఋషిః అంగిరసుడు॥ దేవత॥ ఇంద్రాబృహస్పతి॥ ఛందస్సు త్రిష్టుప్॥
మంత్రము. ॥ 1 ॥

వివియోగం – సర్వఫలకాముడు దీనితో బృహస్పతిని యజనం చేయాలి లేదా
ఉపతిష్ఠానం చెయ్యాలి. అలాగే బార్హస్పత్యాఖ్యమహాశాంతిలో
దీనితో ఆవపనం చెయ్యాలి.

మంత్రము।

బృహస్పతిర్నః పరి పాతు
పశ్చాదుతోత్తరస్మాదధరాదఘాయోః ।
ఇన్ద్రః పురస్తాదుత మధ్యతో నః
సఖా సఖిభ్యో వరీయః కృణోతు ॥ 1 ॥

పదము.

బృహస్పతిః । నః । పరి । పాతు । పశ్చాత్ ।
ఉత । ఉత్ఽతరస్మాత్ । అధరాత్ । అఘఽయోః ।

ఇన్ద్రః । పురస్తాత్ । ఉత । మధ్యతః । నః ।

సఖా । సఖిఽభ్యః । వరీయః । కృణోతు ॥ 1 ॥

అనువాదం,

బృహస్పతి మమ్ములను పరిరక్షించుగాక!
పడమటి దిక్కునుంచి, ఊర్ధ్వలోకం నుంచి,
అధోలోకం నుంచి మమ్ము చంపదలచిన
పురుషుని నుంచి పరిరక్షించు గాక!
ఇంద్రుడు ప్రాగ్దిక్కు నుంచి, మరియు
మధ్యప్రదేశం నుంచి మమ్ములను పరిరక్షించుగాక!
(సర్వదిక్కులనుండి మమ్ములను చంపదలచి వచ్చే
పురుషుని నుండి మమ్ములను ఇంద్రుడు, బృహస్పతి
పరిరక్షింతురుగాక!)
మిత్రభూతుడైన ఇంద్రుడు, స్తోత్రం చేస్తున్న మాకు
ఉరుతరమైన ధనమును సముపార్జించి పెట్టుగాక!

ఇది నాల్గవ అనువాకం

ఇది యాభై ఒకటవ సూక్తం

# అనువాకం: 5

## సూక్తం-52

ఋషిః అథర్వుడు ॥ దేవతలు: సాంమనస్యమ్, అశ్వినులు ॥ ఛందస్సు: కకుమ్మ
త్యనుష్టుప్ । 2 జగతీ ॥ మంత్రములు ॥ 2 ॥

వినియోగం:- ఈ సూక్తం బృహద్గణం లోనిది. శాంత్యుదకాభిమంత్రణాదులలో
దీనికి వినియోగం సాంమనస్య కర్మలో ఉదకుంభాన్ని గానీ,
సురాకుంభాన్ని గాని అభిమంత్రించి గ్రామంలో తిరిగి గ్రామ
మధ్యంలో ఉంచాలి అదే కర్మలో మూడేళ్ళ దూడ మాంసాన్ని

అభిమంత్రించి భక్షించాలి. అదే కర్మలో అన్నాన్ని, సురను, ప్రపనుగాని ఈ రెండు మంత్రాలతో అభిమంత్రించి భక్షణమో, పానమో చేయాలి

మంత్రము :

సంజ్ఞానం నః స్వేభిః సంజ్ఞానమరణేభిః ।

సంజ్ఞానమశ్వినా యువమిహాస్మాసు ని యచ్ఛతమ్ ॥ 1 ॥

పదము.

సమ్ఽజ్ఞానమ్ । నః । స్వేభిః । సమ్ఽజ్ఞానమ్ । అరణేభిః ।

సమ్ఽజ్ఞానమ్ । అశ్వినా । యువమ్ । ఇహ । అస్మాసు । ని ।
యచ్ఛతమ్ ॥ 1 ॥

అనువాదం.

స్వీయ పురుషులతో మాకు ఐకమత్యం కలుగుగాక !
అలాగే అరణులతో, అరమణులతో,
అనుకూలంగా లేని పురుషులతో
సమానజ్ఞానం కలుగుగాక !
ఓ అశ్వినీ దేవతలారా !
మీరు ఈ విషయంలో మాలో
స్వీయ పరపురుషులతో సహా ఐకమత్యాన్ని ఏర్పరచండి. ॥1॥

మంత్రము :

సం జానామహై మనసా సం చికిత్వా

మా యుష్మహి మనసా దైవ్యేన ।

మా ఘోషా ఉత్ స్థుర్బహులే వినిర్హతే
మేషుః పప్తదిన్ద్రస్యాహన్యాగతే ॥ 2 ॥

పదము.

సమ్ । జానామహై । మనసా । సమ్ । చికిత్వా ।
మా । యుష్మహి । మనసా । దైవ్యేన ।
మా । ఘోషాః । ఉత్ । స్థుః । బహులే । విఽనిర్హతే ।
మా । ఇషుః । పప్తత్ । ఇన్ద్రస్య । అహని । ఆఽగతే ॥ 2 ॥

అనువాదం:

మనస్సుతో సమానజ్ఞానుల మగుదుము గాక!
తెలుసుకొని సంగతకార్య కారిణుల మగుదుము గాక!
దైవ సంబంధమైన మనస్సుతో
వియుక్తులం కాకుందుము గాక!
(ప్రతికూలుర విక్షేపం లేకుండా మా మనస్సు
సర్వదా దేవతా విషయంగా ఉండుగాక!
అధిక కౌటిల్య నిమిత్తమైన రాత్రిలో
వైమనస్య శబ్దములు చెలరేగకుండు గాక!
అలాగే పగలు రాగా ఇంద్ర వాగ్బాణాలు
మాపై పడకుండు గాక!
(అహోరాత్రోపలక్షితములైన సర్వదినములలో
పరుల వైమనస్య శబ్దములు మాపై పడుకుండుగాక!
అనుకూలములే అగుగాక! అని భావము.) ॥ 2 ॥

ఇది యాభై రెండవ సూకం.

# సూక్తం - 53

ఋషి. బ్రహ్మ ॥ దేవతలు: ఆయువు, బృహస్పతి, అశ్వినులు ॥ ఛందస్సు
1,2 త్రిష్టుప్. 3 భురిక్ త్రిష్టుప్. ఉష్ణిగ్గర్భార్షీ పంక్తి. 5-7 అనుష్టుప్ ॥
మంత్రములు ॥ 7 ॥

వినియోగం :- ఉపనయనంలో ఆచార్యుడు వటువు నాభిని స్పృశించి 'అముత్ర భూయాత్' అనే ఆరు ఋక్కులను జపించాలి. అలాగే బార్హస్పత్య మహాశాంతిలో వీనితో అవపన్నం చేయాలి. (నాటాలి)

పుష్ట్యర్థమై చేసే ఆగ్రహాయణి కర్మలో అగ్ని సమీపం నుంచి ఉదయం మేల్కొని 'ఉద్వయం' అనే మంత్రంతో ఉత్క్రమించాలి.

అన్నప్రాశన కర్మలో భూమిపై నుంచిన బాలునికి 'ఉద్వయం' అనే మంత్రంతో ఆదిత్యుని దర్శింప జేయాలి.

అలాగే సోమయాగంలో అవభృథ స్నానానంతరం దీనితో జలం నుండి ఉత్క్రమించాలి.

మంత్రము

అముత్రభూయాదధి యద్ యమస్య
బృహస్పతే అభిశ స్తేరముఞ్చః ।
ప్రత్యౌహతామశ్వినా మృత్యుమస్మద్
దేవానామగ్నే భిషజా శచీభిః ॥ 1 ॥

పదము

అముత్ర౽భూయాత్ । అధి । యత్ । యమస్య ।
బృహస్పతే । అభి౽శ స్తేః । అముఞ్చః ।

ప్రతి । ఔహతామ్ । అశ్వినా । మృత్యుమ్ । అస్మత్ ।

దేవానామ్ । అగ్నే । భిషజా । శచీభిః ॥ 1 ॥

అనువాదం.

ఓ బృహస్పతీ! (ఈ వటుని) పరలోక భవనం నుంచి,
యముని సంబంధమైన అభిశంసనం నుంచి
విమోచనం చెందించుచున్నావు.
ఓ అగ్నీ! ఇలా చేస్తున్నందువల్ల
నీ ప్రసాదం వలన దేవతల వైద్యులైన
అశ్వినీ దేవతలు క్రియల వల్ల
మా ఈ మాణవకుని నుండి
మరణకారణాన్ని నివారింతురు గాక! ॥ 1 ॥

మంత్రము.

సం క్రామతం మా జహీతం శరీరం
ప్రాణాపానౌ తే సయుజా విహ స్తామ్ ।
శతం జీవ శరదో వర్ధమానోఽగ్నిష్టే
గోపా అధిపా వసిష్ఠః ॥ 2 ॥

పదము:

సమ్ । క్రామతమ్ । మా । జహీతమ్ । శరీరమ్ ।

ప్రాణాపానౌ । తే । సఽయుజౌ । ఇహ । స్తామ్ ।

శతమ్ । జీవ । శరదః । వర్ధమానః । అగ్నిః । తే ।

గోపాః । అధిఽపాః । వసిష్ఠః ॥ 2 ॥

**అనువాదం :**

ఓ ప్రాణాపానములారా! ఆయుష్కాముని
శరీరంలో ప్రవేశించండి.
అలాగే ఆయుష్కాముని శరీరాన్ని వదలిపెట్టకండి.
ఓ ఆయుష్కాముడా! నీ శరీరంలో
ప్రాణాపానములు కలిసి ఉండుగాక!
ఓ ఆయుష్కాముడా! నూరేళ్ళు జీవించు.
హవిరాదులతో సమృద్ధిని పొందుతూ అగ్ని
నీకు రక్షకుడగు గాక!
ఆదరాతిశయంతో అగ్ని పాలకు డగుగాక!
వసుమత్తము డగుగాక! ॥ 2 ॥

**మంత్రము :**

ఆయుర్యత్ తే అతిహితం పరాచైరపానః
ప్రాణః పునరా తావితామ్ ।
అగ్నిష్టదాహార్నిర్ఋతే రుపస్థాత్
తదాత్మని పునరా వేశయామి తే ॥ 3 ॥

**పదము :**

ఆయుః । యత్ । తే । అతిఽహితమ్ । పరాచైః । అపానః ।
ప్రాణః । పునః । ఆ । తౌ । ఇతామ్ ।
అగ్నిః । తత్ । ఆ । అహాః । నిఃఽఋతేః । ఉపఽస్థాత్ ।

**తత్ । ఆత్మని । పునః । ఆ । వేశయామి । తే ॥ 3 ॥**

**అనువాదం**

ఓ ఆయుష్కాముడా! నీ ఆయుస్సును (ప్రాణాపానములను)
మృత్యువు పరాఙ్ముఖంగా మఱొకచోటికి కొనిపోయినది.
ఆ దేహధారకములైన ప్రాణాపానములు తిరిగివచ్చుగాక!
అగ్ని నికృష్టగమనుడైన మృత్యువు సమీపం నుంచి
ఆ ఆయుస్సును ఆకర్షించుగాక! (కొనివచ్చుగాక!)
ఆ అగ్ని కొనివచ్చిన ఆయుస్సును
ఓ ఆయుష్కాముడా! నీ శరీరంలో
మంత్ర సామర్థ్యంతో తిరిగి ప్రవేశింప జేస్తున్నాను. ॥ 3 ॥

**మంత్రము .**

**మేమం ప్రాణో హాసీన్మో అపానోఽవహాయ పరా గాత్ ।**
**సప్తర్షిభ్య ఏనం పరి దదామి త ఏనం స్వస్తి జరసే**
**వహన్తు ॥ 4 ॥**

**పదము .**

**మా । ఇమమ్ । ప్రాణః । హాసీత్ । మోఇతి । అపానః । అవ**
**ఽహాయ । పరా । గాత్ ।**
**సప్తర్షిఽభ్యః । ఏనమ్ । పరి । దదామి । తే । ఏనమ్ । స్వస్తి ।**
**జరసే । వహన్తు ॥ 4 ॥**

**అనువాదం :**

ఈ ఆయుష్కాని ప్రాణము వదలిపెట్టకుండుగాక!
అపానము ఈ శరీరం నుంచి బయల్వెడలి పోకుండుగాక!

సప్తర్షులకు ( సప్తసంఖ్యాకములైన ప్రాణములకు )
ఈ ఆయుష్కాముని రక్షణార్థం సమర్పిస్తున్నాను.
ఆ సప్తప్రాణాలు ఈ ఆయుష్కాముని
వృద్ధాప్యం వఱకు క్షేమంగా ఉంచుగాక ! ॥ 4 ॥

మంత్రము :

ప్ర విశతం ప్రాణాపానా వనడ్వాహావివ వ్రజమ్ ।

అయం జరిమ్ణః శేవధి రరిష్ట ఇహ వర్ధతామ్ ॥ 5 ॥

పదము :

ప్ర । విశతమ్ । ప్రాణాపానౌ । అనడ్వాహౌఽఇవ । వ్రజమ్ ।

అయమ్ । జరిమ్ణః । శేవఽధిః । అరిష్టః । ఇహ । వర్ధతామ్ ॥ 5 ॥

అనువాదం :

ఓ ప్రాణాపానములారా !
వృషభములు గోష్ఠంలో ప్రవేశించినట్టు
ఈ ఆయుష్కాముని శరీరంలో ప్రవేశించండి.
ఈ ఆయుష్కాముడు జరాశేవధి అగుగాక !
మఱీన్ని మృత్యుబాధారహితుడై,
సర్వేంద్రియ సహితుడై ఈ లోకంలో వృద్ధిపొందుగాక ! ॥ 5 ॥

మంత్రము :

ఆ తే ప్రాణం సువామసి పరా యక్ష్మం సువామి తే ।

ఆయు ర్నో విశ్వతో దధ దయ మగ్ని ర్వరేణ్యః ॥ 6 ॥

పదము :

ఆ । తే । ప్రాణమ్ । సువామసి । పరా । యక్ష్మమ్ । సువామి । తే ।

ఆయుః । నః । విశ్వతః । దధత్ । అయమ్ । అగ్నిః । వరేణ్యః ॥ 6 ॥

**అనువాదం :**

ఓ ఆయుష్కాముడా! నీ ప్రాణము వచ్చునట్లు చేస్తున్నాను.
నీ ఆయుః ప్రతిబంధకమైన రోగాన్ని పరాఙ్ముఖం చేస్తున్నాను.
మఱిన్ని వరణీయుడైన, ఆహూతుడౌతున్న ఈ అగ్ని
మన ఆయుష్కాముని ఆయుస్సును
సర్వతః శతసంవత్సర పరిమితం చేయుగాక! ॥ 6 ॥

**మంత్రము.**

ఉద్వయం తమసస్పరి రోహన్తో నాకముత్తమమ్ ।
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్ । ॥ 7 ॥

**పదము :**

ఉత్ । వయమ్ । తమసః । పరి । రోహన్తః । నాకమ్ । ఉత్ఽతమమ్ ।
దేవమ్ । దేవఽత్రా । సూర్యమ్ । అగన్మ । జ్యోతిః । ఉత్ఽతమమ్ ॥ 7 ॥

**అనువాదం:**

పాపాన్ని మేము ఉత్క్రమిస్తున్నాము.
ఉత్తమమైన స్వర్గాన్ని ఆరోహిస్తున్న వారమై,
దేవతలలో ఉత్తముడు, జ్యోతీరూపుడునైన
సూర్యదేవుని సమీపిస్తున్నాము. ॥ 7 ॥

ఇది యాభై మూడవ సూక్తం

## సూక్తం_54

ఋషులు : 1 బ్రహ్మ, 2 భృగువు ॥ దేవతలు : 1 ఋక్సామసీ, 2 ఇంద్రుడు ॥
ఛందస్సు అనుష్టుప్ ॥ మంత్రములు : ॥ 2 ॥

వినియోగం :- అధ్యాపకుల అర్థార్జన విఘ్నశమనార్థం దీనితో అజ్యహోమం చేయ్యాలి.

మంత్రము.

ఋచం సామ యజామహే యాభ్యాం కర్మాణి కుర్వతే ।
ఏతే సదసి రాజతో యజ్ఞం దేవేషు యచ్ఛతః ॥ 1 ॥

పదము :

ఋచమ్ । సామ । యజామహే । యాభ్యామ్ । కర్మాణి । కుర్వతే
ఏతేఇతి । సదసి । రాజతః । యజ్ఞమ్ । దేవేషు । యచ్ఛతః ॥ 1 ॥

అనువాదం :

ఋగ్వేదాన్ని, సామవేదాన్ని హవిస్సుతో పూజిస్తున్నాము.
ఋత్విగ్యజమానులు ఋక్సామములతో
యజ్ఞరూపకర్మలను చేస్తున్నారు
ఈ ఋక్సామములు సదస్సులో దీప్యమానములవుతున్నవి.
అలాగే దేవతలకు యజ్ఞాన్ని సమర్పిస్తున్నవి. ॥ 1 ॥

మంత్రము :

ఋచం సామ యదప్రాక్షం హవిరోజో యజుర్బలమ్ ।
ఏష మా తస్మాన్మా హింసీ ద్వేదః పృష్టః శచీపతే ॥ 2 ॥

పదము :

ఋచమ్ । సామ । యత్ । అప్రాక్షమ్ । హవిః । ఓజః । యజుః ।
బలమ్ ।

ఏషః । మా । తస్మాత్ । మా । హింసీత్ । వేదః । పృష్టః ।
శచీ౽పతే ॥ 2 ॥

అనువాదం :

ఋగ్వేదాన్ని హవిస్సు నడిగినాను.
సామవేదాన్ని ఓజస్సు నడిగినాను.
యజుర్వేదాన్ని బలము నడిగినాను.
ఎందువలన ఋగాదులను వీటికై ప్రశ్నించితినో
అందువల్ల ఓ శచీపతీ! ఈ విధంగా ప్రశ్నింపగా,
నేను బాగుగా అధ్యయనం చేసిన
ఋక్సామ యజురాత్మకమైన వేదం
అధ్యాపకుడనైన నన్ను హింసింపకుండుగాక! ॥ 2 ॥

ఇది యాభై నాల్గవ సూక్తం

## సూక్తం-55

ఋషిః భృగువు ॥ దేవత : ఇంద్రుడు ॥ ఛందస్సు : విరాట్‌పరోష్ణిక్ ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం .- మార్గస్వస్త్యయన కర్మలో దీనిని జపిస్తూ మొదట కుడికాలుపెట్టి నడవాలి. అలాగే సర్వస్వస్త్యయన కర్మలో అసంఖ్యాకములైన చక్కెర ముక్కలను గాని, తృణములను గాని దీనితో అభి మంత్రించి గృహక్షేత్రాదులలో చల్లాలి. లేదా ఇంద్రుని ఉప తిష్ఠానం చేయాలి.

మంత్రము :

యే తే పన్థానో౭వ దివో యేభి ర్విశ్వ మైరయః ।
తేభిః సుమ్నయా దేహి నో వసో ॥ 1 ॥

పదము .

యే । తే । పన్థానః । అవ । దివః । యేభిః । విశ్వమ్ । ఐరయః ।
తేభిః । సుమ్న౭యా । ఆ । ధేహి । నః । వసో౭ఇతి ॥ 1 ॥

అనువాదం :

ఓ వసూ! (ఇంద్రా!) నీ ఏ మార్గములు
ద్యులోకమునకు అధోదేశంలో ఉన్నవో,
ఏ మార్గములతో జగత్తును తమ తమ
పనుల యందు ప్రేరేపిస్తున్నావో,
ఆ విశ్వప్రేరణసాధన మార్గములతో
మమ్ములను సుఖస్థితిలో ఉంచు. ॥ 1 ॥

ఇది యాభై ఐదవ సూక్తం

## సూక్తం_56

ఋషి: అథర్వుడు : దేవతలు : వృశ్చికాదులు : 2 వనస్పతి : 4 బ్రహ్మణస్పతి (విషభైషజ్యమ్)॥ ఛందస్సు : 1-3,5-8 అనుష్టుప్. 4 విరాట్ ప్రస్తార పంక్తి॥ మంత్రములు . ॥ 8 ॥

వినియోగం :- వృశ్చిక, మశక, పిపీలికా, కర్కోటకాది విషభైషజ్యార్థం ఈ ఎనిమిది మంత్రాలతో మధుకాన్ని అభిమంత్రించి వృశ్చికాది దష్టునిచే త్రాగించాలి.

అదే కర్మలో చేలో మట్టిని గాని, పుట్ట మట్టినిగాని త్రవ్వి సజీవ పశుచర్మావేష్టితంగా చేసి ఈ మంత్రాష్టకంతో అభిమంత్రించి కట్టు కట్టాలి. ఒట్టిమట్టిని అభిమంత్రించి నీటిలోకలిపి త్రాపించాలి.

అదే కర్మలో దీనితోనే ఉదకపాత్రనో, లేదా పసుపుతో కలిపిన నేతినో అభిమంత్రించి త్రాపించాలి.

ఉపాకర్మలో 'అరసస్య శర్కోటస్య' అనే మంత్రంతో ఆజ్యహోమం చెయ్యాలి.

మంత్రము.

తిరశ్చిరాజే రసితాత్ పృదాకోః పరి సంభృతమ్ ।
తత్ కఙ్కపర్వణో విషమియం వీరు దనీనశత్ ॥ 1 ॥

పదము.

తిరశ్చిఽరాజేః । అసితాత్ । పృదాకోః । పరి । సమ్ఽభృతమ్ ।
తత్ । కఙ్కఽపర్వణః । విషమ్ । ఇయమ్ । వీరుత్ । అనీనశత్ ॥ 1 ॥

అనువాదం.

తిర్యగ్వ్యాతములైన రేఖలు గల
'తిరశ్చిరాజి' అనే సర్పవిశేషం నుంచి,
తెల్లని, నల్లని కాలోరగం నుంచి,
పృదాకువు నుంచి సంపాదితమైన విషాన్ని,
'కంకపర్వం' (ఆ పేరుతోనున్న దంశకం) నుంచి
సంపాదితమైన విషాన్ని
ఈ ప్రయుజ్యమానమైన మధుకలత నాశం చేయుగాక! ॥1॥

మంత్రము.

ఇయం వీరు న్మధుజాతా మధుశ్చు న్మధులా మధూః ।
సా విహ్రుతస్య భేషజ్యథో మశకజమ్భనీ ॥ 2 ॥

పదము .

ఇయమ్ । వీరుత్ । మధుఽజాతా । మధుఽశ్చుత్ । మధులా
మధూః ।

సా । విఽహ్రుతస్య । భేషజీ । అథో ఇతి । మశకఽజమ్భనీ ॥ 2 ॥

అనువాదం .

ఈ ప్రయుజ్యమానమైన ఓషధి మధుజనితమైనది.
అందువల్లనే మధురస స్రావి యైనది.
మధుమతి అయినది. మధువను పేరుగలది
ఈ గుణవిశేషాదులు గల ఓషధి
విశేషంగా కౌటిల్యకారియైన విషానికి విరుగుడు.
మఱియు మశకాదులను హింసించునది. ॥ 2 ॥

మంత్రము

యతో దష్టం యతో ధీతం తత స్తే నిర్హ్వయామసి ।
అర్భస్య తృప్రదంశినో మశకస్యారసం విషమ్ ॥ 3 ॥

పదము :

యతః । దష్టమ్ । యతః । ధీతమ్ । తతః । తే । నిః ।
హ్వయామసి ।

అర్భస్య । తృప్రఽదంశినః । మశకస్య । అరసమ్ । విషమ్ ॥3॥

అనువాదం :

ఓ విషదష్టుడా! ఏ ప్రదేశంలో సర్పాది దష్టుడవైనావో,
ఏ ప్రదేశంలో సర్పాదుల పాల బడినావో,

అలాంటి సర్పదష్టుడా!
నీలో అందువల్ల ప్రవేశించిన విషాన్ని
బయటికి లాగివేస్తున్నాము
వీటిలో ముఖ,పుచ్ఛపాదరూపములైన
అంగములతో కలిచిన అర్భకుని
మశక విషాన్ని నిర్వీర్యం చేస్తున్నాము ॥ 3 ॥

మంత్రము :

అయం యో వక్రో విపరు ర్వ్యఙ్గో
ముఖాని వక్రా వృజినా కృణోషి ।
తాని త్వం బ్రహ్మణస్పత ఇషీకామివ సం నమః ॥ 4 ॥

పదము ,

అయమ్ । యః । వక్రః । విఽపరుః । విఽఅఙ్గః ।
ముఖాని । వక్రా । వృజినా । కృణోషి ।
తాని । త్వమ్ । బ్రహ్మణః । పతే । ఇషీకామ్ఽఇవ । సమ్ । నమః
॥ 4 ॥

అనువాదం .

ఈ సర్పాది దష్టపురుషుడు వక్రుడై,
విగతసంధియై, వివశావయవుడై,
ముఖాద్యంగములను వక్రములుగా చేసుకొన్నాడు.
అందువల్లనే పాపములు అనవర్తితములైనవి.
అలాంటి వానిని అనవస్థితములను చేస్తున్నాడు.
ఓ బ్రహ్మణస్పతీ! నీవు వానిని
తుంగవలె (జంబువలె) చక్కబఱచు ॥ 4 ॥

మంత్రము :

అరసస్య శర్కోటస్య నీచీన స్యోపసర్పతః ।

విషం హ్యస్యాదిష్యథో ఏన మజీజభమ్ ॥ 5 ॥

పదము :

అరసస్య । శర్కోటస్య । నీచీనస్య । ఉపఽసర్పతః ।

విషమ్ । హి । అస్య । ఆఽఅదిషి । అథో ఇతి । ఏనమ్ । అజీజభమ్ ॥ 5 ॥

అనువాదం :

నిర్వీర్యమైన, అవాఙ్ముఖమైన,
ప్రాకిపోయే ఈ శర్కోటకమనే సర్పవిశేషాన్ని ఖండించివేసినాను.
మఱిన్ని ఈ విషయుతమైన శర్కోటాన్ని చంపివేసినాను. ॥ 5 ॥

మంత్రము :

న తే బాహ్వో ర్బల మస్తి న శీర్షే నోత మధ్యతః ।

అథ కిం పాపయాఽముయా పుచ్ఛే బిభ ర్ష్యర్భకమ్ ॥ 6 ॥

పదము :

న । తే । బాహ్వోః । బలమ్ । అస్తి । న । శీర్షే । న । ఉత । మధ్యతః ।

అథ । కిమ్ । పాపయా । అముయా । పుచ్ఛే । బిభర్షి । అర్భకమ్ ॥ 6 ॥

**అనువాదం.**

ఓ వృశ్చికమా! నీకు చేతులలో పరపీడన శక్తి లేదు.
అలాగే తలలో లేదు.
మధ్యభాగంలో కూడా లేదు.
ఈ పాపిష్ఠి బుద్ధితో ఈ అల్పమైన విషాన్ని
పుచ్ఛంలో ఎందుకు ఉంచుకున్నావు. ॥ 6 ॥

**మంత్రము.**

అదన్తి త్వా పిపీలికా వి వృశ్చన్తి మయూర్యః ।
సర్వే భల బ్రవాథ శార్కోట మరసం విషమ్ ॥ 7 ॥

**పదము**

అదన్తి । త్వా । పిపీలికాః । వి । వృశ్చన్తి । మయూర్యః ।
సర్వే । భల । బ్రవాథ । శార్కోటమ్ । అరసమ్ । విషమ్ ॥ 7 ॥

**అనువాదం.**

ఓ సర్పమా! నిన్ను పిపీలికలు తినివేస్తాయి.
నెమళ్ళు చీల్చి పారవేస్తాయి.
ఓ సర్పవిష నిర్హరణక్షములారా!
మీరు శర్కోటువిషాన్ని నిర్వీర్యంగా చేయండి. ॥ 7 ॥

**మంత్రము:**

య ఉభాభ్యాం ప్రహరసి పుచ్ఛేన చాస్యేన చ ।
ఆస్యేన న తే విషం కిము తే పుచ్ఛధావసత్ ॥ 8 ॥

పదము :

యః । ఉభాభ్యామ్ । ప్రఽహరసి । పుచ్ఛేన । చ । ఆస్యేఽన । చ ।

ఆస్యేఽ । న । తే । విషమ్ । కిమ్ । ఉంఇతి । తే । పుచ్ఛఽధౌ । అసత్ ॥ 8 ॥

అనువాదం :

ఓ వృశ్చికమా! నీవు పుచ్ఛంతో, ముఖంతో
ఇతరులను బాధిస్తావు.
అయినా అన్యపుచ్ఛమధ్యంలో, ముఖంలో నీకు విషం లేదు.
నీ పుచ్ఛంలో మాత్రం విషమేముంటుంది? ॥ 8 ॥

ఇది యాభై ఆరవ సూక్తం

## సూక్తం–57

ఋషి:వామదేవుడు ॥ దేవత : సరస్వతి ॥ ఛందస్సు. జగతి ॥ మంత్రములు ॥2॥

వినియోగం :– యాచకుల కోరిక తీరుటకు దీనితో సరూపవత్సగల ఆవు పాలతో చేసిన పాయసాన్ని అభిమంత్రించి భక్షించాలి.

మంత్రము

యదాశసా వదతో మే విచుక్షుభే యద్
యాచమానస్య చరతో జనాం అను ।
యద్ ఆత్మని తన్వోఽ మే విరిష్టం
సరస్వతి తదా పృణద్ ఘృతేన ॥ 1 ॥

పదము

యత్ । ఆ౨శసా । వదతః । మే । వి౨చుక్షుభే । యత్ ।

యాచమానస్య । చరతః । జనాన్ । అను ।

యత్ । ఆత్మని । తన్వ౨ః । మే । వి౨రిష్టమ్ ।

సరస్వతీ । తత్ । ఆ । పృణత్ । ఘృతేన ॥ 1 ॥

అనువాదం :

యాచించుటకై దాతలతో మాట్లాడుతున్న నా అంగం
వారి అదిలింపులతో సంక్షుభితమైనది (బాధితమైనది.)
యాచన కారణంగా దాతలను అనులక్షించి
ఒకరి నుండి ఒకరి వద్దకు వెడుతున్న
నా అంగం పరివ్యాకులమైనది.
నా శరీరం సంక్లిష్టమైనది
సరస్వతి దానిని పూర్వం వలె
బాధారహితంగా చేయుగాక !
అంతే గాక ఘృతం వంటి సారభూతమైన
వస్తువులతో నింపుగాక ! ॥ 1 ॥

మంత్రము :

సప్త క్షరన్తి శిశవే మరుత్వతే
పిత్రే పుత్రాసో అప్యవీవృతన్నృతాని ।
ఉభే ఇదస్యోభే అస్య రాజత
ఉభే యతేతే ఉభే అస్య పుష్యతః ॥ 2 ॥

పదము.

సప్త । క్షరన్తి । శిశవే । మరుత్వతే ।
పిత్రే । పుత్రాసః । అపి । అవీవృతన్ । ఋతాని ।
ఉభేఇతి । ఇత్ । అస్య । ఉభేఇతి । అస్య । రాజతః ।
ఉభేఇతి । యతేతే ఇతి । ఉభేఇతి । అస్య । పుష్యతః ॥ 2 ॥

అనువాదం.

మరుత్తులతో కూడిన, జలపుత్రరూపుడైన
వరుణునికై సప్తనదులు ప్రవహిస్తున్నవి.
మఱి తండ్రియైన ద్యులోకస్థితుడైన
ఇంద్రునకై హవిః ప్రదానాదులతో
పుత్రభూతులైన మనుష్యులు సత్యభూతములైన
యజ్ఞాది రూప కర్మలను చేస్తున్నారు.
ద్యావాపృథువులు ఇరువురూ దేవమనుష్య
సంఘములకు ఈశ్వరులగుదురుగాక!
ద్యావాపృథువులు దేవమనుష్యార్థమై కృషి చేయుదురుగాక!
అలాగే ద్యావాపృథువులు దేవమనుష్య సంఘాన్ని
అన్నోదకములతో పోషించుగాక! ॥ 2 ॥

ఇది యాభై ఏడవ సూక్తం

## సూక్తం-58

ఋషిః కౌరుపథి ॥ దేవతః ఇంద్రావరుణులు ॥ ఛందస్సు: 1 జగతి, 2 త్రిష్టుప్
మంత్రములు : ॥ 2 ॥

వినియోగం:- ఉక్థ్య క్రతువులో మైత్రావరుణ యాజ్యాహోమాను మంత్రణంలో దీనికి వినియోగం.

మంత్రము ।

ఇన్ద్రా౨వరుణా సుతపావిమం సుతం
సోమం పిబతం మద్యం ధృతవ్రతా ।
యువో రథో అధ్వరో దేవవీతయే
ప్రతి స్వసరముప యాతు పీతయే ॥ 1 ॥

పదము ·

ఇన్ద్రా౨వరుణా । సుత౨పౌ । ఇమమ్ । సుతమ్ ।
సోమమ్ । పిబతమ్ । మద్యమ్ । ధృత౨వ్రతా ।
యువోః । రథః । అధ్వరః । దేవ౨వీతయే ।
ప్రతి । స్వసరమ్ । ఉప । యాతు । పీతయే ॥ 1 ॥

అనువాదం.

సోమపాయులు, విధృతకర్ములునైన ఓ ఇంద్రావరుణులారా!
మదకరము, తృప్తికరమునైన
మా యీ సోమరసం త్రాగుదురు గాక!
అందుకై మీ హింసారహితమైన రథం
సోమపానమునకై దేవకాముడైన యజమానుని
భగిని గృహానమీాపానికి వచ్చుగాక! ॥ 1 ॥

మంత్రము.

ఇన్ద్రా౨వరుణా మధుమత్తమస్య
వృష్ణః సోమస్య వృషణా వృషేథామ్ ।

ఇదం వామన్ధః పరిషిక్తమాసద్యాస్మిన్

బర్హిషి మాదయేథామ్ ॥ 2 ॥

పదము :

ఇన్ద్రావరుణా । మధుమత్ఽతమస్య ।

వృష్ణః । సోమస్య । వృషణా । ఆ । వృషేథామ్ ।

ఇదమ్ । వామ్ । అన్ధః । పరిఽసిక్తమ్ । ఆఽసద్య । అస్మిన్ ।

బర్హిషి । మాదయేథామ్ ॥ 2 ॥

**అనువాదం .**

అభిమతఫల వర్షకులైన ఓ ఇంద్రావరుణులారా !
మీరు మాధుర్యోపేతమైన
అభిమత సోమరసం త్రాగుదురుగాక !
మీ కొఱకై ఈ సోమరసరూపమైన అహోరాన్ని
గ్రహచమస పాత్రములలో మేము అంతటా చల్లినాము
అందువల్ల ఈ అస్తరణంపై కూర్చొని
సోమపానంతో తృప్తు లగుదురు గాక ! ॥ 2 ॥

ఇది యాభై ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 59

**ఋషిః బాదరాయణిః ॥ దేవత అరినాశనమ్ ॥ ఛందస్సు. అనుష్టుప్ ॥ మంత్రము :**
॥ 1 ॥

**వినియోగం :- అభిచార కర్మలో దీనితో పిడుగుపడిన చెట్టు సమిధను హోమం చెయ్యాలి.**

మంత్రము

యో నః శపా దశపతః శపతో యశ్చ నః శపాత్ ।

వృక్ష ఇవ విద్యుతా హత ఆ మూలా దను శుష్యతు ॥ 1 ॥

పదము

యః । నః । శపాత్ । అశపతః । శపతః । యః । చ । నః ।
శపాత్ ।

వృక్షః౽ఇవ । వి౽ద్యుతా । హతః । ఆ । మూలాత్ । అను ।
శుష్యతు ॥ 1 ॥

అనువాదం

ఏమీ అనని మమ్ము నిందావాక్యములతో
ఏ శత్రువు నిందిస్తాడో,
ఏ శత్రువు పరుషవాక్య ప్రయోక్తలైన
మమ్ములను తిరిగి నిందిస్తాడో,
ఆ శత్రువు పిడుగుపాటుతో భస్మమయ్యే
వృక్షము వలె పితృపుత్రాదులతోసహా క్రమంగా నశించుగాక!
॥ 1 ॥

ఇది ఐదవ అనువాకం

ఇది యాభై తొమ్మిదవ సూక్తం.

## అనువాకం - 6

### సూక్తం - 60

ఋషిః బ్రహ్మ॥ దేవతలు: గృహములు, వాస్తోష్పతి॥ ఛందస్సు: 1 పరానుష్టుప్॥ త్రిష్టుప్. 2-7 అనుష్టుప్॥ మంత్రములు ॥ 7 ॥

వినియోగం:- దేశాంతరం నుండి వచ్చినవాడు తన ఇంటిని చూచి, సమిధలను తీసుకొని మొదటి ఆరు మంత్రాలను జపిస్తూ ఇంటికి వచ్చి, చేతిలోని సమిధలను ఎడమచేతితో పట్టుకొని, వలీకతృణములను (రెల్లు) కుడిచేతితో స్పృశించి, ఈ ఆరు మంత్రాలను జపించి గృహంలో ప్రవేశించి, ఆహితాగ్నిలో ఈ ఆరు మంత్రాలతో సమిధలను పుష్ట్యర్థమై వేయవలెను.

ఇంటిలోని వారి ఐకమత్యం కోసం సమిధలను తెచ్చి ఈ సూక్తాన్ని జపించి వాటిని ఒకేసారి ఆధానం చెయ్యాలి.

క్రవ్యాద్విసర్జనానంతరం అందరూ ఈ సూక్తాన్ని జపిస్తూ యజమాన గృహంలోనికి ప్రవేశించాలి.

అంత్యేష్టిలో శవదహనానంతరం సంస్కర్త వీనిని జపిస్తూ తనవారిని తన ఇంటిలో ప్రవేశింపజేయాలి.

'ఇహైవ స్త' అనే మంత్రంతో ప్రవాసార్థం వెళ్ళేవాడు తన గృహములను, పుత్రాదులను చూడాలి.

మంత్రము

ఊర్జం బిభ్రద్ వసువనిః సుమేధా

అఘోరేణ చక్షుషా మిత్రియేణ ।

గృహానైమి సుమనా వన్దమానో

రమధ్వం మా బిభీత మత్ ॥ 1 ॥

పదము:

ఊర్జమ్ । బిభ్రత్ । వసుఽవనిః । సుఽమేధాః ।

అఘోరేణ । చక్షుషా । మిత్రియేణ ।

గృహాన్ । ఆ । ఏమి । సుఽమనాః । వన్దమానః ।

**రమధ్వమ్ । మా । బిభీత । మత్ ॥ 1 ॥**

**అనువాదం.**

అహోరాన్ని ధరిస్తూ, అన్నాది సాధనమైన
వసు సంభోక్తనై, శోభనమేధా సంయుక్తుడనై,
అభయంకరుడు, అప్రతికూలుడు, మిత్రుడు
ఆనందంతో చూస్తుండగా
శోభన మనస్కుడనై స్తోత్రం చేస్తూ స్వగృహానికి వస్తున్నాను.
ఓ గృహములారా! మీరు సుఖంగా ఉండండి.
దేశాంతరం నుండి వస్తున్న నావలన
మీరేమీ భయపడకండి ॥ 1 ॥
(ఇతరు డెవరో గృహాయజమానియై మాలో
ప్రవేశిస్తున్నాడని భయపడవద్దు-అని భావము)

**మంత్రము**

**ఇమే గృహా మయోభువ ఊర్జస్వన్తః పయస్వన్తః ।**
**పూర్ణా వామేన తిష్ఠన్తస్తే నో జానన్త్వాయతః ॥ 2 ॥**

**పదము :**

**ఇమే । గృహాః । మయఃఽభువః । ఊర్జస్వన్తః । పయస్వన్తః ।**
**పూర్ణాః । వామేన । తిష్ఠన్తః । తే । నః । జానన్తు । ఆఽయతః ॥2॥**

**అనువాదం :**

హితభావనయుతములు, ఊర్జస్వంతములు,
క్షీరాదులతో సమృద్ధములు, ధనసంపూర్ణములునై
మా ఎడ ఉన్న ఈ గృహములు

ప్రవాసం నుంచి వస్తున్న మమ్మ
యజమానులుగా గ్రహించుగాక! ॥ 2 ॥

మంత్రము :

యేషా మధ్యేతి ప్రవసన్ యేషు సౌమనసో బహుః ।
గృహా నుప హ్వయామహే తే నో జానన్త్వాయతః ॥ 3 ॥

పదము :

యేషామ్ । అధి౨ఏతి । ప్ర౨వసన్ । యేషు । సౌమనసః । బహుః
గృహాన్ । ఉప । హ్వయామహే । తే । నః । జానన్తు । ఆ౨యతః
॥ 3 ॥

అనువాదం :

ప్రవాసం చేస్తూ ఏ ఇళ్ళను జ్ఞాపకం చేసుకుంటున్నాడో,
ఏ ఇళ్ళలో సుమనస్కుడై ఉంటాడో,
ఎక్కడ అధిక పదార్థము లున్నవో,
అ గృహములను పొందుటకై ప్రార్థిస్తున్నాము.
మా ఎదుట నున్న ఈ గృహములు
ప్రవాసం నుంచి వస్తున్న మమ్ము
యజమానులుగా గ్రహించుగాక! ॥ 3 ॥

మంత్రము

ఉపహూతా భూరిధనాః సఖాయః స్వాదుసం ముదః ।
అక్షుధ్యా అతృష్యా స్త గృహా మాస్మద్ బిభీతన ॥ 4 ॥

పదము :

ఉప౨హూతాః । భూరి౨ధనాః । సఖాయః । స్వాదు౨సంముదః ।

అక్షుధ్యాః । అతృష్యాః । స్త । గృహాః । మా । అస్మత్ । బిభీతన
॥ 4 ॥

అనువాదం

ఓ గృహములారా ! అనుగ్రహార్థమై ప్రార్థితులైన మీరు
భూరి ధనోపేతులై ఉండండి.
మిత్ర భూతులై ఉండండి.
మధుర పదార్థములతో సంమోదమానులు కండి
క్షుత్పిపాసార్త జనరహితులుగా ఉండండి.
ధనాది సమృద్ధితో ఎల్లప్పుడూ
సంతృప్త జనులతో నిండి ఉండండి
ఓ గృహములారా ! దేశాంతరం నుండి వచ్చిన
మా వలన భయపడకండి. ॥ 4 ॥

మంత్రము

ఉపహూతా ఇహ గావ ఉపహూతా అజావయః ।
అథో అన్నస్య కీలాల ఉపహూతో గృహేషు నః ॥ 5 ॥

పదము.

ఉపఽహూతాః । ఇహ । గావః । ఉపఽహూతాః । అజఽఅవయః ।
అథో ఇతి । అన్నస్య । కీలాలః । ఉపఽహూతః । గృహేషు । నః
॥ 5 ॥

అనువాదం,

ఈ మా గృహములలో ధేనువులు
అనుజ్ఞార్థం ప్రార్థిత లగుగాక !
మేకలు, గొఱ్ఱెలు అనుజ్ఞార్థం ప్రార్థిత లగుగాక !

మఱినీ మా ఇళ్ళలో అన్నసారం
అనుజ్ఞార్థం ప్రార్థిత మగుగాక! ॥ 5 ॥

మంత్రము.

సూనృతావన్తః సుభగా ఇరావన్తో హసాముదాః ।
అతృష్యా అక్షుధ్యా స్త గృహా మాఽస్మద్ బిభీతన ॥ 6 ॥

పదము.

సూనృతాఽవన్తః । సుఽభగాః । ఇరాఽవన్తః । హసాముదాః ।
అతృష్యాః । అక్షుధ్యాః । స్త । గృహాః । మా । అస్మత్ । బిభీతన
॥ 6 ॥

అనువాదం.

ఓ గృహములారా! సూనృత వాక్పూర్ణలు కండి
(అరిష్టాది నిమిత్త వాగ్రహితలుగా
పుత్రమిత్రాది సంపత్తి నిమిత్త వాక్సహితలుగా కండి.)
ఆహార సమృద్ధి కలవారు కండి.
సంతోష ప్రపూర్ణలు కండి
క్షుత్పిపాసార్త జన రహితలుగా ఉండండి
ధనసమృద్ధితో, ఎల్లప్పుడు
సంతృప్త జనులతో నిండి ఉండండి.
ఓ గృహములారా! దేశాంతరం నుండి
వచ్చిన మా వలన భయపడకండి ॥ 6 ॥

మంత్రము:

ఇహైవ స్త మాను గాత విశ్వా రూపాణి పుష్యత ।
ఐష్యామి భద్రేణా సహ భూయాంసో భవతా మయా ॥ 7 ॥

పదము.

ఇహ । ఏవ । స్త । మా । అను । గాత । విశ్వా । రూపాణి । పుష్యత ।

ఆ । ఏష్యామి । భద్రేణ । సహ । భూయాంసః । భవత । మయా ॥ 7 ॥

అనువాదం :

ఓ గృహములారా! ఇప్పుడు మీరున్న
స్థలములోనే ఉండండి.
ప్రవాసానికి వెడుతున్న నావెంట రాకండి.
సర్వరూపములైన వస్తుసంజాతాన్ని సమృద్ధి చెందించండి.
నేను ధనంతో సహా తిరిగి వస్తాను.
దేశాంతరం నుండి ధనంతో తిరిగివచ్చిన
నాచే మీరు మరింత సమృద్ధులు కండు. ॥ 7 ॥

ఇది అరవై సూక్తం

## సూక్తం-61

ఋషి. అథర్వుడు ॥ దేవత అగ్ని ॥ ఛందస్సు.-అనుష్టుప్ ॥ మంత్రములు : ॥2।

వినియోగం - అగ్రహాయణిలో (మార్గశిరంలో) దీనితో క్షీరౌదన పురోడాశ రసములలో ఏదో ఒకదానిని అభిమంత్రించి మేధాకాముడు భుజింపవలెను. లేదా అగ్నిని ఆరాధించవలెను. అలాగే ఉపనయనంలో, అగ్నికార్యంలో దీనితో అగ్నిని ఒకచోట చేర్చాలి.

మంత్రము.

యదగ్నే తపసా తప ఉపతప్యామహే తపః ।

ప్రియాః శ్రుతస్య భూయాస్మాయుష్మన్తః సుమేధసః ॥ 1 ॥

పదము

యత్ । అగ్నే । తపసా । తపః । ఉప౽తప్యామహే । తపః ।
ప్రియాః । శ్రుతస్య । భూయాస్మ । ఆయుష్మన్తః । సు౽మేధసః
॥ 1 ॥

అనువాదం.

ఓ అగ్నీ ! నీకు సంబంధించిన,
సమిదాధానాది రూపమైన కర్మతో
నిర్వర్తింప వలసిన తపస్సును
నీ సమీపంలో అర్జిస్తున్నాము.
ఆ తపస్సును నీ పరిచర్యతో అర్జిస్తున్నాము
దానితో అధీతమైన వేదశాస్త్రార్థిగులకు
ప్రియతములమై, ఆయుష్మంతులము,
సుమేధస్సులము అగుదుము గాక ! ॥ 1 ॥

మంత్రము:

అగ్నే తపస్తప్యామహ ఉప తప్యామహే తపః ।
శ్రుతాని శృణ్వన్తో వయ మాయుష్మన్తః సుమేధసః ॥ 2 ॥

పదము,

అగ్నే । తపః । తప్యామహే । ఉప । తప్యామహే । తపః ।
శ్రుతాని । శృణ్వన్తః । వయమ్ । ఆయుష్మన్తః । సు౽మేధసః
॥ 2 ॥

అనువాదం

ఓ అగ్నీ ! శరీర శోషణరూపమైన తపస్సు చేస్తున్నాము
నీ సమీపంలోనే ఆ విధమైన తపస్సును ఆచరిస్తున్నాము

ఆ తపస్సుచే అధీతములైన
వేదశాస్త్రాదులను వింటున్నాము.
అందువల్ల ఆయుష్మంతులమై
సుమేధస్సుల మవుతున్నాము. ॥ 2 ॥

ఇది అరవై ఒకటవ సూక్తం.

## సూక్తం - 62

ఋషిః మరీచి, కాశ్యపుడు ॥ దేవత : అగ్ని ॥ ఛందస్సు: జగతీ ॥ మంత్రము :
॥ 1 ॥

వినియోగం :- అవసథ్యాధానంలో దీనితో మహాశాంతి గణంలో శాంత్యుదకావ్ని అవపనం చెయ్యాలి. అగ్నిచయనంలో అతిచ్ఛన్దసీష్టకాను మంత్రణానంతరం దీనితో గార్హపత్యాగ్నిలో ఇటుకను బ్రహ్మ అను మంత్రణం చెయ్యాలి.

మంత్రము :

అయ మగ్నిః సత్పతి ర్వృద్ధవృష్ణో
రథీవ పత్తీ నజయత్ పురోహితః ।
నాభా పృథివ్యాం నిహితో దవిద్యుత-
దధస్పదం కృణుతాం యే పృతన్యవః ॥ 1 ॥

పదము.

అయమ్ । అగ్నిః । సత్ఽపతిః । వృద్ధఽవృష్ణః ।
రథీఽఇవ । పత్తీన్ । అజయత్ । పురఃఽహితః ।
నాభా । పృథివ్యామ్ । నిఽహితః । దవిద్యుతత్ ।

అధఃఽపదమ్ । కృణుతామ్ । యే । పృతన్యవః ॥ 1 ॥

**అనువాదం.**

రథముగల పురుషుడు పత్నిని స్వాధీనం చేసుకున్నట్లు,
సత్పతి, ప్రవృద్ధబలుడు, పురోహితుడునై
మా ముందున్న ఈ గార్హపత్యాగ్ని
పత్నీభూతమైన ప్రజను స్వాధీనం చేసుకుంటున్నాడు.
భూమి నాభీస్థానంలో స్థాపితమైన,
అతి దీప్యమానమైన అగ్ని సంగ్రామేచ్ఛగల శత్రువులను
నా పాద అధోదేశంలో పడవేయుగాక! ॥ 1 ॥

ఇది అరవై రెండవ సూక్తం

## సూక్తం–63

**ఋషులు : మరీచి, కశ్యపుడు ॥ దేవతలు ॥ జాతవేదులు ॥ ఛందస్సు : జగతి ॥**
మంత్రము : ॥ 1 ॥

**వినియోగం :– గార్హస్పత్యాగ్ని ఆధానంలో మథనార్థం యజమానుడు దీనితో అరణ్యాగ్నిని ఆహ్వానించాలి.**

మంత్రము .

పృతనాజితం సహమానమగ్నిముక్థైర్హవామహే
పరమాత్ సధస్థాత్ ।
స నః పర్షదతి దుర్గాణి విశ్వా
క్షామద్ దేవోఽతి దురితాన్యగ్నిః ॥ 1 ॥

పదము

పృతనాఽజితమ్ । సహమానమ్ । అగ్నిమ్ ।

ఉక్థైః । హవామహే । పరమాత్ । సధఽస్థాత్ ।

సః । నః । పర్షత్ । అతి । దుఃఽగాని । విశ్వా ।

క్షామత్ । దేవః । అతి । దుఃఽఇతాని । అగ్నిః ॥ 1 ॥

**అనువాదం :**

యుద్ధంలో గెలిచిన వానిని అభిభవించే అగ్నిని
ఉత్కృష్టమైన సదస్థానం నుంచి
(అరణిలక్షణమైన సర్వోత్కృష్ట లోకం నుంచి)
వక్తవ్యములైన స్తోత్రములతో ఆహ్వానిస్తున్నాము.
ఆహూతుడైన ఆ అగ్ని మమ్ములను
విశ్వదుర్గమములైన వాటిని దాటించు గాక!
దీప్యమానుడైన అగ్ని మథ్యమానుడై
మా దురితములను పూర్తిగా దగ్ధం చేయుగాక! ॥ 1 ॥

ఇది అరవై మూడవ సూక్తం

## సూక్తం - 64

ఋషిః యముడు ॥ దేవతలు. 1 అపస్సు: 2 అగ్నిః ఛందస్సు. 1 భురిగనుష్టుప్
2 న్యఙ్కుసారిణీ బృహతీ ॥ మంత్రములు : ॥ 2 ॥

వినియోగం :- శరీరంలో కాకాభిఘాత దోషనివారణార్థం చేసే శాంతిలో నీటితో ఉదక మభిమంత్రించి, ఆ నీటితో శరీరాన్ని ప్రక్షాళనం చెయ్యాలి. అట్లే కాకి పొడిచిన దోషనివారణార్థం నీటితో ఉల్మకాన్ని అభిమంత్రించి కాకావమృష్టమైన శరీరం చుట్టూ త్రిప్పాలి.

మంత్రము :

ఇదం యత్ కృష్ణః శకుని రభినిష్పత న్నపీపతత్

ఆపో మా తస్మాత్ సర్వస్మాద్ దురితాత్ పాన్త్వంహసః ॥1॥

పదము .

ఇదమ్ । యత్ । కృష్ణః । శకునిః । అభిఽనిష్పతన్ । అపీపతత్ ।

అపః । మా । తస్మాత్ । సర్వస్మాత్ । దుఃఽఇతాత్ । పాన్తు ।

అంహసః ॥ 1 ॥

అనువాదం .

కృష్ణవర్ణముగల పక్షి (కాకి)
పైన పడి నా శరీరాన్ని కొట్టినది.
అందువల్ల కలిగిన సర్వదురితముల నుంచి
నన్ను అభిమంత్రిత జలం రక్షించుగాక! ॥ 1 ॥

మంత్రము

ఇదం యత్ కృష్ణః శకునీ రవామృక్ష న్నిర్ ఋతే తే ముఖేన।

అగ్నిర్మా తస్మా దేనసో గార్హపత్యః ప్ర ముఞ్చతు ॥ 2 ॥

పదము

ఇదమ్ । యత్ । కృష్ణః । శకునిః । అవఽఅమృక్షత్ । నిఃఽఋతే।

తే । ముఖేన ।

అగ్నిః । మా । తస్మాత్ । ఏనసః । గార్హఽపత్యః । ప్ర ।

ముఞ్చతు ॥ 2 ॥

అనువాదం

ఓ నిర్ ఋతీ! నీ ముఖంగా కాకం
ఈ నా శరీరాన్ని తగిలినది.

ఆ పాపం నుంచి గార్హపత్యాగ్ని
నన్ను విమోచనం చెందించు గాక! ॥ 2 ॥

ఇది అరవై నాల్గవ సూక్తం.

## సూక్తం-65

ఋషి. శుక్రుడు॥ దేవత. అపామార్గము॥ ఛందస్సు. అనుష్టుప్॥ మంత్రములు. ॥ 3 ॥

వినియోగం:- కాకిత గిలిన దోషశాంతి కోసం చేసే కర్మలోను, నల్లని దంతములు, వక్రనఖములు, నపుంసకత్వము మొదలగు దోష నివారణార్థం ఈ మూడు మంత్రాలతో అపామార్గ (ఉత్తరేణి) సమిధను అగ్నిలో వేయాలి. వివాహంలో కుమారీ స్నానానంతరం 'యద్ దుష్కృతమ్' అనే రెండు ఋక్కులతో ఒంటివి బట్టతో తుడవాలి.

మంత్రము

ప్రతీచీనఫలో హి త్వ మపామార్గ రురోహిథ।
సర్వాన్ మచ్ఛపథాం అధి వరీయో యావయా ఇతః॥ 1 ॥

పదము

ప్రతీచీనఽఫలః। హి। త్వమ్। అపామార్గ। రురోహిథ।
సర్వాన్। మత్। శపథాన్। అధి। వరీయః। యవయాః। ఇతః
॥ 1 ॥

అనువాదం:

ఓ అపామార్గమా! (ఉత్తరేణా!)
నీవు ప్రతీచీన ఫలములు కలదానవుగా మొలిచినావు.
కావున సర్వదోషములను నా నుండి పూర్తిగా తొలగచెయ్యి.

( ఈ కాకాభిహత అవయవం నుంచి
సర్వ దోషములను వేరుచెయ్యి ) ॥ 1 ॥

మంత్రము .

యద్ దుష్కృతం యచ్ఛమలం యద్ వా చేరిమ
పాపయా ।
త్వయా తద్ విశ్వతోముఖాపామార్గాప మృజ్మహే ॥ 2 ॥

పదము

యత్ । దుఃఽకృతమ్ । యత్ । శమలమ్ । యత్ । వా । చేరిమ
పాపయా ।
త్వయా । తత్ । విశ్వతఃఽముఖ । అపామార్గ । అప । మృజ్మహే
॥ 2 ॥

అనువాదం :

దుష్కృతము, మలినము అయిన
ఏ పాపాన్ని ఆచరించితిమో,
ఆ పాపాన్ని సర్వత్ర శాఖలు వ్యాపించిన
ఓ అపామార్గమా ! నీతో ( నీవు సాధనంగా )
అపమార్జనం చేస్తున్నాము. ॥ 2 ॥

మంత్రము :

శ్యావదతా కునఖినా బణ్డేన యత్సహాసిమ ।
అపామార్గ త్వయా వయం సర్వం తదప మృజ్మహే ॥3॥

పదము.

**శ్యావఽదతా । కునఖినా । బణ్డేన । యత్ । సహ । ఆసిమ ।**

**అపామార్గ । త్వయా । వయమ్ । సర్వమ్ । తత్ । అవ ।**

**మృజ్మహే ॥ 3 ॥**

**అనువాదం.**

నల్లని దంతములు, వక్ర నఖములు గల
నపుంసకునితో కలిసి భుజించినాము.
ఓ అపామార్గమా! నీవు సాధనంగా
ఆ పాపాన్నంతటిని మేము అపమార్జనం చేస్తున్నాము. ॥ 3 ॥

ఇది అరవై ఐదవ సూక్తం

## సూక్తం - 66

**ఋషి బ్రహ్మ ॥ దేవత . బ్రాహ్మణమ్ ॥ ఛందస్సు. త్రిష్టుప్ ॥ మంత్రము ॥ ॥ 1 ॥**

**వినియోగం.— బృహద్గణంలో దీనిని పఠించుట వలన శాంత్యుదకాది మంత్రణా దులలో దీనికి వినియోగం.**

మంత్రము,

**యద్యన్తరిక్షే యది వాత ఆస**

**యది వృక్షేషు యది వోలపేషు ।**

**యదశ్రవన్ పశవ ఉద్యమానం**

**తద్ బ్రాహ్మణం పునరస్మానుపైతు ॥ 1 ॥**

పదము

**యది । అన్తరిక్షే । యది । వాతే । ఆస ।**

**యది । వృక్షేషు । యది । వా । ఉలపేషు ।**

**యత్ । అశ్రవన్ । పశవః । ఉద్యమానమ్ ।**

**తత్ । బ్రాహ్మణమ్ । పునః । అస్మాన్ । ఉపఽఏతు ॥ 1 ॥**

**అనువాదం.**

అంతరిక్షం మేఘాచ్ఛిన్నమైనప్పుడు,
మంత్రబ్రాహ్మణాత్మకమైన వేదాన్ని అధ్యయనం చేసినాము.
గాలిలో, చెట్లనీడలో, సస్యములలో
బ్రాహ్మణాన్ని అధ్యయనం చేసినాము
గ్రామ్య, అరణ్యపశువులు ఆ బ్రాహ్మణాన్ని విన్నవి.
తాదృశ కారణములలో అధీతమైన బ్రాహ్మణం,
నిషిద్ధకాల స్థలాదులలో అధ్యయనం చేయుటచే
మా నుండి నిష్క్రాంతమైన బ్రాహ్మణం
ఫలప్రదమై తిరిగి మా వద్దకు వచ్చుగాక! ॥ 1 ॥

ఇది అరవై అరవ సూక్తం

## సూక్తం - 67

**ఋషిః బ్రహ్మ॥ దేవత: ఆత్మ॥ ఛందస్సు: పురఃపరోష్ణిగ్ బృహతీ॥ మంత్రము. ॥ 1 ॥**

**వినియోగం:- బృహద్గణం దీనిని పఠించడం వలన, శాంత్యుదకాభి మంత్రణాదులలో దీనికి వినియోగం.**

**ప్రతిగ్రహదోషశాంతికై దీనితో ప్రతిగ్రాహ్యవస్తువును అభిమంత్రించి తీసుకొనాలి.**

నిత్యనైమిత్తిక కామ్యకర్మలలో, పాకయజ్ఞ తంత్రంలో కర్మ సమాప్తి తరువాత జరిగిన హెచ్చుతగ్గుల దోషనివారణార్థం దీనితో తమ్ము అనుమంత్రణం చేసుకోవాలి. (క ర్త).

గోదాన సంస్కార కర్మలో వపనార్థం దీనితో కత్తిని సమ్మార్జించి నాపితునకు (మంగలికి) ఇవ్వాలి.

నవయజ్ఞాలలో దీనితో ఇంద్రియములను అభిమర్శించి అనుమంత్రణం చెయ్యాలి

బ్రహ్మచారి దండభంగలో దీనితో ఇంకొక దండాన్ని అభిమంత్రించి బ్రహ్మచారి గ్రహించాలి.

అగ్నిష్టోమలో, తృతీయసవనంలో హోత్రాదులలో విహరించే అగ్నులను బ్రహ్మ ఈ ఋక్కుతో అనుమంత్రించాలి.

మంత్రము

పునర్మైత్విన్ద్రియం పునరాత్మా ద్రవిణం బ్రాహ్మణం చ

పునరగ్నయో ధిష్ణ్యా యథాస్థామ కల్పయన్తామిహైవ ॥ 1 ॥

పదము

పునః । మా । ఆ । ఏతు । ఇన్ద్రియం । పునః । ఆత్మా । ద్రవిణమ్

బ్రాహ్మణమ్ । చ ।

పునః । అగ్నయః । ధిష్ణ్యాః । యథాऽస్థామ । కల్పయన్తామ్ ।

ఇహ । ఏవ ॥ 1 ॥

అనువాదం

చక్షురాదీంద్రియములు నాకు తిరిగి వచ్చుగాక!

ఆత్మ తిరిగి వచ్చుగాక!

ద్రవ్యం తిరిగి వచ్చుగాక!

మంత్ర బ్రాహ్మణాత్మకమైన
వేదం కూడా తిరిగి వచ్చుగాక!
హోత్రాదులలో విహరించే అగ్నులు
ఇక్కడే యథాస్థానంలో ప్రవృద్ధములగుగాక! ॥ 1 ॥

ఇది అరవై ఏడవ సూక్తం

## సూక్తం - 68

**ఋషిః శన్తాతి ॥ దేవత, సరస్వతి. ఛందస్సు: 1 అనుష్టుప్. 2 త్రిష్టుప్ 3 గాయత్రీ ॥ మంత్రములు ॥ 2 ॥**

**వినియోగం :-** ఆహితాగ్ని ప్రేతసంస్కారంలో 'ఓ చిత్ సఖాయమ్' (18 వ కాండ, 1) అనే కాండను జపించిన తరువాత సారస్వత హోమాలలో ఈ మొదట రెండు ఋక్కులలో ఆజ్యాని హోమం చేయాలి. చాతుర్మాస్యంలో, వైశ్వదేవ పర్వంలో సారస్వత యాగాన్ని దీనితో బ్రహ్మ అనుమంత్రించాలి. అన్వారంభణీ యేష్టిలో సారస్వత చరుయాగాన్ని దీనితో అనుమంత్రించాలి.

మంత్రము.

**సరస్వతి వ్రతేషు తే దివ్యేషు దేవి ధామసు ।**

**జుషస్వ హవ్యమాహుతం ప్రజాం దేవి రరాస్వ నః ॥ 1 ॥**

పదము.

**సరస్వతి । వ్రతేషు । తే । దివ్యేషు । దేవి । ధామఽసు ।**

**జుషస్వ । హవ్యమ్ । ఆఽహుతమ్ । ప్రఽజామ్ । దేవి । రరాస్వ । నః ॥ 1 ॥**

**అనువాదం.**

ఓ సరస్వతీ! నీ సంబంధమైన వ్రతములలో,
దేవస్థానములలో ఆహుతమైన హవిస్సును సేవించు.

ఓ దేవీ! మాకు పుత్రరూపాదులైన సంతానాన్ని ప్రసాదించు.
॥ 1 ॥

మంత్రము :

**ఇదం తే హవ్యం ఘృతవత్ సరస్వతీదం**

**పితౄణాం హవిరాస్యం1 యత్ ।**

**ఇమాని త ఉదితా శంతమాని**

**తేభిర్వయం మధుమన్తః స్యామ ॥ 2 ॥**

పదము .

**ఇదమ్ । తే । హవ్యమ్ । ఘృతఽవత్ । సరస్వతి ।**

**ఇదమ్ । పితౄణామ్ । హవిః । ఆస్యఽమ్ । యత్ ।**

**ఇమాని । తే । ఉదితా । శమ్ఽతమాని ।**

**తేభిః । వయమ్ । మధుఽమన్తః । స్యామ ॥ 2 ॥**

అనువాదం :

ఓ సరస్వతీ! నీ కొఱకై వేల్చిన
ఘృతోపేతమైన ఈ హవిస్సు,
పితరులకు క్షేపణీయమైన ఈ హవిస్సు,
మాకు మిక్కిలి సుఖకరములైన ఈ హవిస్సులు
నీకై ఉక్తములైనవి
నీకై హుతం చేసిన హవిస్సుల వల్ల
మేము మధుర రసోపేతాన్నవంతుల మగుదుముగాక! ॥ 2 ॥

మంత్రము

శివా నః శంతమా భవ సుమృడీకా సరస్వతి ।

మా తే యుయోమ సందృశః ॥ 3 ॥

పదము.

శివా । నః । శమ్ఽతమా । భవ । సుఽమృడీకా । సరస్వతి ।

మా । తే । యుయోమ । సమ్ఽదృశః ॥ 3 ॥

అనువాదం.

ఓ సరస్వతీ! సర్వసుఖరూపా!
నీవు మాకు అత్యంతం
రోగనివారణక్షమవు కమ్ము. శోభన సుఖప్రదవు కమ్ము.
ఓ సరస్వతీ! నీదర్శనానికి మేము
దూరం కాకుందుము గాక! ॥ 3 ॥

ఇది అరవై ఎనిమిదవ సూక్తం

## సూక్తం-69

ఋషిః శన్తాతి॥ దేవత : సుఖమ్॥ ఛందస్సు : పథ్యాపంక్తి॥ మంత్రము : ॥1॥

వినియోగం,- 'శివా నః' 'శం నో వాతో వాతు' అనే ఈ రెండు మంత్రాలు బృహద్గణంలోనివి గనుక శాంత్యుదకాభి మంత్రణాదులలో వీటికి వినియోగం.

మంత్రము

శంనో వాతో వాతు శం నస్తపతు సూర్యః ।

అహాని శం భవన్తు నః శం రాత్రీ

ప్రతి ధీయతాం శముషా నో వ్యుఒచ్ఛతు ॥ 1 ॥

పదము

శమ్ । నః । వాతః । వాతు । శమ్ । నః । తపతు । సూర్యః ।

అహాని । శమ్ । భవన్తు । నః । శమ్ । రాత్రీ ।

ప్రతి । ధీయతామ్ । శమ్ । ఉషాః । నః । వి । ఉచ్ఛతు ॥ 1 ॥

అనువాదం.

బయట సంచరించే గాలి
మాకు సుఖకరమై వీచుగాక!
సూర్యుడు మాకు సుఖాన్ని ఇచ్చుగాక!
దినములు మాకు సుఖకరములగుగాక!
రాత్రులు సుఖాన్ని సమకూర్చుగాక!
ఉషఃకాలములు మాకు
సుఖప్రదము లగునట్లు వెలుగొందుగాక! ॥ 1 ॥

ఇది అరవై తొమ్మిదవ సూక్తం

## సూక్తం—70

ఋషిః అథర్వుడు॥ దేవతలు. మంత్రములలో పేర్కొన్న శ్యేనాదులు॥
ఛందస్సు: 1 త్రిష్టుప్, 2 అతిజగతీగర్భా జగతీ; 3 పురఃకకుమ్మ
త్యనుష్టుప్, 4,5 అనుష్టుప్॥ మంత్రములు ॥ 5 ॥

వినియోగం - అభిచార కర్మలో ఈ ఐదు ఋక్కులతో మధ్యమపలాశంతో పరి
కరణములను హోమం చెయ్యాలి.

మంత్రము

యత్ కిం చాసౌ మనసా యచ్చ వాచా

యజ్ఞైర్జుహోతి హవిషా యజుషా ।
తన్మృత్యునా నిర్ ఋతిః సంవిదానా
పురా సత్యాదాహుతిం హన్త్వస్య ॥ 1 ॥

పదము :

యత్ । కిమ్ । చ । అసౌ । మనసా । యత్ । చ । వాచా ।
యజ్ఞైః । జుహోతి । హవిషా । యజుషా ।
తత్ । మృత్యునా । నిః౽ఋతిః । సమ్౽విదానా ।
పురా సత్యాత్ । ఆ౽హుతిమ్ । హన్తు । అస్య ॥ 1 ॥

అనువాదం.

దూరస్థుడైన ఏ శత్రువు శత్రుహనన రూపమైన కర్మను
మనసా సంకల్పిస్తాడో, వాగ్రూపంలో వ్యక్తీకరిస్తాడో
అలాగే యజ్ఞములతో, హవిస్సుతో,
మంత్రంతో హోమం చేస్తాడో,
ఆ శత్రువు కర్మ వాస్తవరూపం దాల్చకముందే
పాపదేవత అయిన నిర్ ఋతి
మృత్యువుతో కలిసి వినాశం చెందించు గాక ! ॥ 1 ॥

మంత్రము

యాతుధానా నిర్ ఋతిరాదు రక్షస్తే
అస్య ఘ్నన్త్వనృతేన సత్యమ్ ।
ఇన్ద్రేషితా దేవా ఆజ్యమస్య మథ్నన్తు

మా తత్ సం పాది యదసౌ జుహోతి ॥ 2 ॥

పదము:

యాతుఽధానాః । నిఃఽఋతిః । ఆత్ । ఉంఇతి । రక్షః । తే ।
అస్య । ఘ్నన్తు । అనృతేన । సత్యమ్ ।
ఇన్ద్రఽఇషితాః । దేవాః । ఆజ్యమ్ । అస్య । మథ్నన్తు ।
మా । తత్ । సమ్ । పాది । యత్ । అసౌ । జుహోతి ॥ 2 ॥

అనువాదం

పరపీడాకారిణీ, అయిన నిర్ ఋుతి, రాక్షసులు
శత్రువు యొక్క యథార్థ కర్మఫలాన్ని
అసత్యఫలంతో వినష్టం పొందించుదురు గాక!
ఇంద్రప్రేరితులైన దేవతలు ఈ శత్రువు యొక్క
ఆజ్యసాధనమైన హోమకర్మను వినాశం చేతురుగాక!
ఈ శత్రువు మమ్ములను చంపుటకై చేస్తున్న హోమం
ఫలప్రదం కాకుండు గాక! ॥ 2 ॥

మంత్రము:

అజిరాధిరాజౌ శ్యేనౌ సంపాతినావివ ।
ఆజ్యం పృతన్యతో హతాం యో నః
కశ్చాభ్యఘాయతి ॥ 3 ॥

పదము.

అజిరఽఅధిరాజౌ । శ్యేనౌ । సంపాతినౌఽఇవ ।

ఆజ్యమ్ । వృతన్యతః । హతామ్ । యః । నః ।

కః । చ । అభిఽఅఘాయతి ॥ 3 ॥

అనువాదం·

అజిరుడు, అధిరాజు అనే మృత్యుదూతలిద్దరు
ఆకాశ మార్గంలో ద్వేషిపై పడే డేగల వలె
సంగ్రామేచ్ఛుడైన పురుషుని ఘృతసాధనకమైన
హోమకర్మను చెడగొట్టుదురు గాక!
ఏ శత్రువైనను మాకు హింసారూపమైన
పాపాన్ని చేయదలచినట్లైన
అతని హోమకర్మను చెడగొట్టుదురు గాక! ॥ 3 ॥

మంత్రము.

అపాఞ్చౌ త ఉభౌ బాహూ అపి నహ్యామ్యాస్యఽమ్ ।

అగ్నేర్దేవస్య మన్యునా తేన తేఽవధిషం హవిః ॥ 4 ॥

పదము

అపాఞ్చౌ । తే । ఉభౌ । బాహూఇతి । అపి । నహ్యామి ।
ఆస్యఽమ్ ।

అగ్నేః । దేవస్య । మన్యునా । తేన । తే । అవధిషమ్ । హవిః
॥ 4 ॥

అనువాదం

ఓరీ! అభిచారకర్తవైన నీ రెండు చేతులను
హోమ కర్మలో వ్యాపృతములైన వాటిని

పృష్ఠభాగ సంబద్ధములనుగా కట్టివేస్తాను
( నీ రెండు చేతులను విరిచి కట్టివేస్తాను. )
అలాగే నీ నోటి నుండి మంత్రములు వెలువడకుండా
నీ ముఖాన్ని కట్టివేస్తాను
గానితో దేవుడైన అగ్ని తేజస్సుతో
నీ హవిస్సును, దానికి సంబంధించిన
కర్మను ధ్వంసం చేస్తాను ॥ 4 ॥

మంత్రము

**అపి నహ్యామి తే బాహూ అపి నహ్యామ్యాస్యఒమ్ ।**
**అగ్నేర్ఘోరస్య మన్యునా తేన తేఒవధిషం హవిః ॥ 5 ॥**

పదము ।

**అపి । నహ్యామి । తే । బాహూ ఇతి । అపి । నహ్యామి । ఆస్యఒమ్**
**అగ్నేః । ఘోరస్య । మన్యునా । తేన । తే । అవధిషమ్ । హవిః**
**॥ 5 ॥**

అనువాదం :

ఓరీ! అభిచార కర్తవైన నీ రెండు చేతులను
హోమ కర్మలో వ్యాపృతములైన వాటిని
పృష్ఠభాగ సంబద్ధములనుగా కట్టివేస్తాను
నీ నోటి నుండి మంత్రములు వెలువడకుండా
నీ ముఖాన్ని మూసివేస్తాను.
భయంకరుడైన అగ్నికి సంబంధించిన తేజస్సుతో
నీ హవిస్సును, దానికి సాధనమైన కర్మను
ధ్వంసం చేస్తాను. ॥ 5 ॥

ఇది డెబ్బైయవ సూక్తం

## సూక్తం-71

ఋషి. అథర్వుడు॥ దేవత అగ్ని॥ ఛందస్సు: అనుష్టుప్॥ మంత్రము: ॥ 1 ॥

వినియోగం:- దర్శపూర్ణమాసలలో దీనితో తండులములను (బియ్యమును) అగ్ని చుట్టూ మూడుసార్లు త్రిపాలి. సోమయాగంలో, మాధ్యందిం సవనంలో ధిష్ణ్యాగ్ని చూస్తూ బ్రహ్మ, యజమానికూడా దీనిని జపించాలి. అగ్నిచయనంలో ఉఖార్థం పరిలిఖ్య మానమైన మృత్పిండాన్ని బ్రహ్మ దీనితో అను మంత్రించాలి.

మంత్రము

పరి త్వాఽగ్నే పురం వయం విప్రం సహస్య ధీమహి ।
ధృషద్వర్ణం దివే దివే హన్తారం భఙ్గురావతః ॥ 1 ॥

పదము

పరి । త్వా । అగ్నే । పురమ్ । వయమ్ । విప్రమ్ । సహస్య । ధీమహి ।
ధృషత్ఽవర్ణమ్ । దివేఽదివే । హన్తారమ్ । భఙ్గురఽవతః ॥ 1 ॥

అనువాదం:

మథన జనితుడవైన ఓ అగ్నీ!
కర్మఫలములకు మేధావి అయిన నిన్ను
మేము రక్షోపహననార్థం పరిధిగా చేసుకుంటున్నాము.
భయంకరమైన, భంగశీల కర్మచేసే రాక్షసులను
నీవు ప్రతిదినము వినష్టం చేస్తావు ॥ 1 ॥

ఇది డెబ్బై ఒకటవ సూక్తం

# సూ క్తం-72

ఋషిః అథర్వుడు॥ దేవత ఇంద్రుడు॥ ఛందస్సు: 1 అనుష్టుప్, 2,3 త్రిష్టుప్, మంత్రములు · ॥ 3 ॥

వినియోగం :- సోమయాగంలో ప్రవర్గ్యంలో ధర్మదుగ్ధోహార్థం నిలబడిన అధ్వర్యాద్యుదులను బ్రహ్మ దీనితో అనుమంత్రించాలి. అగ్నిష్టోమంలో ప్రవర్గ్యంలో హూయమానమైన ఆజ్యాన్ని బ్రహ్మ 'శ్రాతం మన్యే' అనే మంత్రంతో అనుమంత్రించాలి. అగ్నిష్టోమంలో మాధ్యందిననవనంలో దధిఘర్మహోమాన్ని బ్రహ్మ 'శ్రాతం మన్యే' అనే మంత్రంతో అనుమంత్రించాలి.

మంత్రము ।

ఉత్ తిష్ఠతాఽవ, పశ్యతేన్ద్రస్య భాగమృత్వియమ్ ।

యది శ్రాతం జుహోతన యద్యశ్రాతం మమత్తన ॥ 1 ॥

పదము

ఉత్ । తిష్ఠత । అవ । పశ్యత । ఇన్ద్రస్య । భాగమ్ । ఋత్వియమ్

యది । శ్రాతమ్ । జుహోతన । యది । అశ్రాతమ్ । మమత్తన ॥ 1 ॥

అనువాదం.

ఓ ఋత్విక్కులారా ! లేవండి.
ఋత్విజమైన ఇంద్రుని భాగాన్ని నిరీక్షించండి
ఆ భాగం పక్వమైతే ఇంద్రునికై అగ్నిలో వ్రేల్చండి.
పక్వం కాకపోతే పక్వమగునట్లు చేయండి ॥ 1 ॥

మంత్రము,

శ్రాతం హవిరో ష్విన్ద్ర ప్ర యాహి జగామ

సూరో అధ్వనో వి మధ్యమ్ ।
పరి త్వాసతే నిధిభిః సఖాయః
కులపా న వ్రాజపతిం చరన్తమ్ ॥ 2 ॥

పదము

శ్రాతమ్ । హవిః । ఓఇతి । సు । ఇన్ద్ర । ప్ర । యాహి ।
జగామ । సూరః । అధ్వనః । వి । మధ్యమ్ ।
పరి । త్వా । ఆసతే । నిధిఽభిః । సఖాయః ।
కులఽపాః । న । వ్రాజఽపతిమ్ । చరన్తమ్ ॥ 2 ॥

అనువాదం .

ఓ ఇంద్రా! నీ దధి ధర్మాఖ్యమైన
హవిస్సు బాగా పక్వమైనది,
నీవు త్వరగా రా!
సూర్యుడు గంతవ్య మార్గంలో
మధ్యభాగాన్ని దాటి వెళ్ళినాడు.
సమానఖ్యానులైన ఋత్విక్కులు
నిహితములైన సోమములతో
నిన్ను పర్యుపాసిస్తున్నారు.
కులరక్షకులైన పుత్రులు
చరించే గృహపతిని ఉపాసించినట్లు ఉపాసిస్తున్నారు. ॥ 2 ॥

మంత్రము :

శ్రాతం మన్య ఊధని శ్రాతమగ్నౌ

సుశృతం మన్యే తదృతం నవీయః ।
మాధ్యన్దినస్య సవనస్య దధ్నః
పిబేన్ద్ర వజ్రిన్ పురుకృజ్జుషాణః ॥ 3 ॥

పదము,

శ్రాతమ్ । మన్యే । ఊధని । శ్రాతమ్ । అగ్నౌ ।
సుఽశృతమ్ । మన్యే । తత్ । ఋతమ్ । నవీయః ।
మాధ్యన్దినస్య । సవనస్య । దధ్నః । పిబ ।
ఇన్ద్ర । వజ్రిన్ । పురుఽకృత్ । జుషాణః ॥ 3 ॥

అనువాదం.

దధిధర్మాఖ్యమైన హవిస్సు
పయోరూపంతో పక్వమైనదిగా భావిస్తున్నాను.
మరిన్ని పాలు అగ్నిలో కూడా పక్వమైనవి
కాబట్టి బాగా పక్వమైనదిగా భావిస్తున్నాను.
ఇందువల్లనే ఆ హవిస్సు సత్యభూతమై,
నవతరము అవుతున్నది.
ఓ వజ్రీ! బహుకర్మకరుడా!
ప్రీయమాణుడవై నీవు
మాధ్యందిన సవన సంబంధియైన
దధిధర్మాఖ్యమైన హవిస్సును పానం చెయ్యి. ॥ 3 ॥

ఇది డెబ్బై రెండవ సూక్తం

## సూక్తం – 73

ఋషి. అథర్వుడు॥ దేవతలు. ధర్మము, అశ్వినులు ప్రత్యృచం, లేక మంత్రాలలో పేర్కొన్నవారు॥ ఛందస్సు: 1,4,6 జగతీ: 2 పథ్యాబృహతీ . 3,5,7–11 త్రిష్టుప్ మంత్రములు: ॥ 11 ॥

వినియోగం.– ప్రవర్గ్యంలో హోతృకర్తృకమైన వషట్కారాన్ని, అను వషట్కారాన్ని కూడా బ్రహ్మ 'స్వాహాకృతిః, అనే రెండు మంత్రాలతో అను మంత్రించాలి. ప్రవర్గ్యంలో దుహ్యమానమైన ఘర్మదుఘాన్ని 'ఉప హ్వాయే' అనే మంత్రంతో బ్రహ్మ అనుమంత్రించాలి. ప్రవాసానికి వెళ్ళేవాడు 'సూయవసాద్' అనే మంత్రంతో తన పశువులను అభిమంత్రించాలి. మధుపర్కంలో ఉత్సృష్టమైన గోవును అభ్యాగతుడు 'సూయవసాద్' అనే మంత్రంతో అను మంత్రించాలి.

మంత్రము:

సమిద్ధో అగ్నిర్వృషణా రథీ
దివ స్తప్తో ఘర్మో దుహ్యతే వామిషే మధు ।
వయం హి వాం పురుదమాసో అశ్వినా
హవామహే సధమాదేషు కారవః ॥ 1 ॥

పదము

సమ్ఽఇద్ధః । అగ్నిః । వృషణా । రథీ ।
దివః । తప్తః । ఘర్మః । దుహ్యతే । వామ్ । ఇషే । మధు ।
వయమ్ । హి । వామ్ । పురుఽదమాసః । అశ్వినా ।
హవామహే । సధఽమాదేషు । కారవః ॥ 1 ॥

**అనువాదం,**

అభిమతఫల వర్షులైన అశ్వినులారా!
ద్యులోకమునన్నున్న దేవగణమునకు
రథికుడైన అగ్ని సందీప్తుడైనాడు
ఆ అగ్నితో మహావీరపాత్రస్థమైన ఆజ్యం
బాగా తప్తమై మీకు అన్నమునకై
మధుర రసోపేతమైన పాలను పిండుతున్నది.
ఓ అశ్వినీ దేవతలారా! మిమ్ములను
పూర్ణ గృహములలో (బహుగృహములలో)
స్తుతికర్తలము, హోతలము అయిన మేము
యజ్ఞములలో ఆహ్వానిస్తున్నాము ॥ 1 ॥

**మంత్రము,**

సమిద్ధో అగ్నిరశ్వినా తప్తో వాం ఘర్మ ఆ గతమ్ ।
దుహ్యన్తే నూనం వృషణేహ ధేనవో దస్రా మదన్తి వేధసః ॥ 2 ॥

**పదము**

సమ్ఽఇద్ధః । అగ్నిః । అశ్వినా । తప్తః । వామ్ । ఘర్మః । ఆ । గతమ్ ।
దుహ్యన్తే । నూనమ్ । వృషణా । ఇహ । ధేనవః । దస్రా ।
మదన్తి । వేధసః ॥ 2 ॥

**అనువాదం:**

ఓ అశ్వినీ దేవతలారా! అగ్ని సందీప్త మైనది.
మీకై ఆజ్యము తప్త మైనది

కాబట్టి హవిస్సును భుజించుటకు రండి.
అభిమతఫల దాతలైన మీకై
ఈ ప్రవర్గ్యాఖ్యమైన కర్మలో
ధేనువులు సమృద్ధిగా పాలనిస్తాయి
శత్రునిర్మూలకులైన అశ్వినులను
స్తుతితో పరిచరిస్తూ హోతలు సంతోషిస్తున్నారు ॥ 2 ॥

మంత్రము.

స్వాహాకృతః శుచిర్దేవేషు యజ్ఞో
యో అశ్వినోశ్చమసో దేవపానః ।
తము విశ్వే అమృతాసో జుషాణా
గన్ధర్వస్య ప్రత్యాస్నా రిహన్తి ॥ 3 ॥

పదము :

స్వాహాఽకృతః । శుచిః । దేవేషు । యజ్ఞః ।
యః । అశ్వినోః । చమసః । దేవఽపానః ।
తమ్ । ఊంఇతి । విశ్వే । అమృతాసః । జుషాణాః ।
గన్ధర్వస్య । ప్రతి । ఆస్నా । రిహన్తి ॥ 3 ॥

అనువాదం

దీప్తమైన ప్రవర్గ్యమనే యజ్ఞం దేవతలకు దత్తమైనది.
దేవతలైన అశ్వినులు పానం చేసే
చమసమును సర్వదేవతలు

ప్రీయమాణులై అగ్ని ముఖంగా
ప్రత్యేకంగా ఆస్వాదిస్తున్నారు. ॥ 3 ॥

**మంత్రము.**

యదుస్రియాస్వాహుతం ఘృతం పయోఽయం
స వామశ్వినా భాగ ఆ గతమ్ ।
మాధ్వీ ధర్తారా విదథస్య సత్పతీ
తప్తం ఘర్మం పిబతం రోచనే దివః ॥ 4 ॥

**పదము:**

యత్ । ఉస్రియాసు । ఆఽహుతమ్ । ఘృతమ్ । పయః ।
అయమ్ ।
సః । వామ్ । అశ్వినా । భాగః । ఆ । గతమ్ ।
మాధ్వీఇతి । ధర్తారా । విదథస్య । సత్పతీఇతి సత్ఽపతీ ।
తప్తమ్ । ఘర్మమ్ । పిబతమ్ । రోచనే । దివః ॥ 4 ॥

**అనువాదం:**

గోవులలోనున్న ఘృతోత్పాదకమైన
క్షీరాన్ని ఆహుతి చేసినాను.
ఓ అశ్వినీ దేవతలారా! ఈ ప్రక్షిప్తమైన క్షీరం
మీకు భాగమై యున్నది. అందువల్ల రండి.
ఓ అశ్వినులారా! (మధు విద్యా వేదితులారా!)
యజ్ఞస్వరూప నిర్వర్తకులు, దేవపాలకులు

అయిన మీరు ద్యులోక ప్రకాశకుడైన అగ్నిలో
తప్తమైన ఆజ్యమును పానం చేయండి. ॥ 4 ॥

మంత్రము

తప్తో వాం ఘర్మో నక్షతు స్వహోతా
ప్ర వామధ్వర్యుశ్చరతు పయస్వాన్ ।
మధోర్దుగ్ధస్యాశ్వినా తనాయా వీతం
పాతం పయస ఉస్రియాయాః ॥ 5 ॥

పదము :

తప్తః । వామ్ । ఘర్మః । నక్షతు । స్వఽహోతా ।
ప్ర । వామ్ । అధ్వర్యుః । చరతు । పయస్వాన్ ।
మధోః । దుగ్ధస్య । అశ్వినా । తనాయాః । వీతమ్ ।
పాతమ్ । పయసః । ఉస్రియాయాః ॥ 5 ॥

అనువాదం .

ఓ అశ్వినీ దేవతలారా ! మిమ్ములను హోత స్తుతించుగాక !
బాగాతప్తమైన మహావీర పాత్రస్థమైన ఆజ్యం వ్యాపించుగాక!
మీకై అధ్వర్యుడు ప్రీతికారి అయిన
పయోయుక్తుడై యజించుగాక !
అనంతరం ఓ అశ్వినులారా ! యజ్ఞాన్ని
విస్తరింపజేసే గోవుల దుగ్ధమును,
మధురరసోపేతమైన పాలను భక్షించండి
పానం చేయండి. ॥ 5 ॥

మంత్రము

ఉప ద్రవ పయసా గోధుగోషమా

ఘర్మే సిఞ్చ పయ ఉస్రియాయాః ।

వి నాకమఖ్యత్ సవితా వరేణ్యో౽

నుప్రయాణముషసో వి రాజతి ॥ 6 ॥

పదము.

ఉప । ద్రవ । పయసా । గో౽ధుక్ । ఓషమ్ । ఆ ।

ఘర్మే । సిఞ్చ । పయః । ఉస్రియాయాః ।

వి । నాకమ్ । అఖ్యత్ । సవితా । వరేణ్యః ।

అను౽ప్రయానమ్ । ఉషసః । వి । రాజతి ॥ 6 ॥

అనువాదం

ఓ గోదోహకుడా! నీవు తప్త ఘర్మమును
దుగ్ధంతో పాటు మాదగ్గరకు తీసుకురా!
గోక్షీరాన్ని తప్తాజ్యంలో సేచనం చెయ్యి
వరణీయుడైన సవిత స్వర్గాన్ని ప్రకాశింప జేయుగాక!
ఆదిత్యుడు ఉషః ప్రయాణాన్ని అనుసరించి విరాజిల్లుతున్నాడు
॥ 6 ॥

మంత్రము

ఉప హ్వయే సుదుఘాం ధేనుమేతాం

సుహస్తో గోధుగుత దోహదేనామ్ ।

శ్రేష్ఠం సవం సవితా సావిషన్నోఽభీఽద్ధో
ఘర్మస్తదు షు ప్ర వోచత్ ॥ 7 ॥

పదము

ఉప । హ్వయే । సుఽదుఘామ్ । ధేనుమ్ । ఏతామ్ ।
సుఽహస్తః । గోఽధుక్ । ఉత । దోహత్ । ఏనామ్ ।
శ్రేష్ఠమ్ । సవమ్ । సవితా । సావిషత్ । నః । అభిఽఇద్ధః ।
ఘర్మః । తత్ । ఓంఇతి । సు । ప్ర । వోచత్ ॥ 7 ॥

అనువాదం.

పయోదోహనానికి ఈ ముందున్న ధేనువును
ఉపాహ్వానిస్తున్నాను.
మరిన్ని ఈ ఆహూతయైన ధేనువును
సుహస్తుడైన గోదోగ్ధ దోహనం చేయుగాక!
శ్రేష్ఠమైన క్షీరాన్ని సర్వప్రేరకుడైన దేవుడు
మాకై ప్రేరేపించుగాక!
ఘర్మం అభిదీప్తమై బాగా ప్రస్తుతిస్తుంది. ॥ 7 ॥

మంత్రము.

హింకృణ్వతీ వసుపత్నీ వసూనాం
వత్సమిచ్ఛన్తీ మనసా న్యాగన్ ।
దుహామశ్విభ్యాం పయో అఘ్న్యేయం
సా వర్ధతాం మహతే సౌభగాయ ॥ 8 ॥

పదము

హిఙ్ఽకృణ్వతీ । వసుఽపత్నీ । వసూనామ్ ।

వత్సమ్ । ఇచ్ఛన్తీ । మనసా । నిఽఆగన్ ।

దుహామ్ । అశ్విఽభ్యామ్ । పయః । అఘ్న్యా । ఇయమ్ ।

సా । వర్ధతామ్ । మహతే । సౌభగాయ ॥ 8 ॥

అనువాదం.

దూడకోసమై అంభారవం చేసే
వసుపాలకురాలైన ఈ ధేనువు
మనస్సుతో దూడను ఆకాంక్షిస్తూ తప్పక వచ్చుగాక!
ఈ అహంతవ్యమైన గోవు
అశ్వినీదేవతలకై క్షీరము నిచ్చుగాక!
ఆ ధేనువు మా గొప్పసౌభాగ్యానికై వర్ధిల్లుగాక! ॥ 8 ॥

మంత్రము

జుష్టో దమూనా అతిథిర్దురోణ

ఇమం నో యజ్ఞముప యాహి విద్వాన్ ।

విశ్వా అగ్నే అభియుజో విహత్య

శత్రూయతామా భరా భోజనాని ॥ 9 ॥

పదము

జుష్టః । దమూనాః । అతిథిః । దురోణే ।

ఇమమ్ । నః । యజ్ఞమ్ । ఉప । యాహి । విద్వాన్ ।

విశ్వాః । అగ్నే । అభిఽయుజః । విఽహత్య ।

శత్రుఽయతామ్ । ఆ । భర । భోజనాని ॥ 9 ॥

అనువాదం :

ఓ అగ్నీ ! ప్రీతుడవు, అతిథివలె పూజ్యుడవు,
విద్వాంసుడవు అయిన నీవు నా భక్తి నెరిగి
మా ఈ యజ్ఞానికి రమ్ము.
ఓ అగ్నీ ! పరసేనను హననం చేసి
శత్రువులు కోరే ధనాన్ని కొనిరా.
( పరభోజ్య ధనములను కొనిరా ) ॥ 9 ॥

మంత్రము :

అగ్నే శర్ధ మహతే సౌభగాయ

తవ ద్యుమ్నాన్యుత్తమాని సన్తు ।

సం జాస్పత్యం సుయమ మా కృణుష్వ

శత్రూయతామభి తిష్ఠా మహాంసి ॥ 10 ॥

పదము :

అగ్నే । శర్ధ । మహతే । సౌభగాయ ।

తవ । ద్యుమ్నాని । ఉత్ఽతమాని । సన్తు ।

సమ్ । జాఃఽపత్యమ్ । సుఽయమమ్ । ఆ । కృణుష్వ ।

శత్రుఽయతామ్ । అభి । తిష్ఠ । మహాంసి ॥ 10 ॥

అనువాదం

ఓ అగ్నీ! నీవు మా సౌభాగ్యానికై
అర్ధిహ్లాదంగుడవు కమ్ము
గోత్రమాసములైన నీ తేజస్సులు,
ఉద్గత తమము లగుగాక!
దాంపత్యాన్ని అనన్యశ్లిష్టంగా, చక్కగా చెయ్యి.
శత్రువులను కోరే పరుల తేజస్సులను అభిభవించు ॥ 10 ॥

మంత్రము

**సూయవసాద్ భగవతీ హి భూయా**
**అథా వయం భగవన్తః స్యామ ।**
**అద్ధి తృణమఘ్న్యే విశ్వదానీం**
**పిబ శుద్ధముదకమాచరన్తీ ॥ 11 ॥**

పదము

**సుయవసఽఅత్ । భగఽవతీ । హి । భూయాః ।**
**అథ । వయమ్ । భగఽవన్తః । స్యామ ।**
**అద్ధి । తృణమ్ । అఘ్న్యే । విశ్వఽదానీమ్ ।**
**పిబ । శుద్ధమ్ । ఉదకమ్ । ఆఽచరన్తీ ॥ 11 ॥**

అనువాదం

ఓ ధర్మదుఘా! శోభన తృణములను భక్షిస్తూ
నీవు భాగ్యవతివి కమ్ము
అనంతరం మేము భాగ్యవంతుల మవుతాము

అహింస్రియైన ఓ ధేనూ!
సర్వదా తృణములను భక్షించు.
సర్వత్ర చరిస్తూ నిర్మలమైన ఉదకమును పానం చెయ్యి. ॥11॥

ఇది ఆరవ అనువాకం

ఇది డెబ్బై మూడవ సూక్తం

## అనువాకం: 7

### సూక్తం – 74

ఋషులు అథర్వాంగిరసులు॥ దేవతలు; మంత్రములలో పేర్కొన్నవారు! 4 జాతవేదులు॥ ఛందస్సు! 1–3 అనుష్టుప్ 4 త్రిష్టుప్॥ మంత్రములు: ॥ 4 ॥

వినియోగం:– గండమాలా భైషజ్యార్థం మొదటి రెండు ఋక్కులతో సూత్రోక్త ప్రకారంగా ధనుస్సుతోను, శరంతోను గండమాలను పగుల గొట్టాలి. అదే కర్మలో నల్లనిమేక రోమములను వేసి కాచిన ఉదకమును ఈ రెండు మంత్రములతో అభిమంత్రించి ఉషః కాలంలో వ్యాధితుని తడపాలి. ఈర్ష్యావినాశ కర్మలో 'జ్యాష్టే జాహమ్' అనే మంత్రాన్ని ఈర్ష్యావంతునిచూసి జపించాలి అట్లే దీనితో సక్తుమంథాన్ని (పేలపిండితో చేసిన గంజిని) అభి మంత్రించి ఈర్ష్యావంతునకు ఇవ్వాలి లేదా అతనిని స్పృశించి జపించాలి. దర్శపూర్ణమాసల యందలి వ్రతోపాయనంలో 'వ్రతేన త్వం వ్రతపతే' అనే మంత్రానికి వినియోగం.

మంత్రము

అపచితాం లోహినీనాం కృష్ణా మాతేతి శుశ్రుమ ।
మునేర్దేవస్య మూలేన సర్వా విధ్యామి తా అహమ్ ॥ 1 ॥

పదము

అపఽచితామ్ । లోహినీనామ్ । కృష్ణా । మాతా । ఇతి । శుశ్రుమ।

మునేః । దేవస్య । మూలేన । సర్వా । విధ్యామి । తాః । అహమ్
॥ 1 ॥

**అనువాదం.**

లోహితవర్ణములైన గండమాలలకు
కృష్ణవర్ణమైన రోగనిదాన పిశాచి జనని అని వింటున్నాము.
మననీయుడు, దేవుడునైన అథర్వణుని శరంతో (మూలంతో)
వాటి నన్నింటిని నేను విదారింపజేస్తున్నాను.
దేవముని మూలంతో వాటి నన్నిటిని
విచ్ఛేదం చేస్తున్నాను. ॥ 1 ॥

మంత్రము।

విధ్యామ్యాసాం ప్రథమాం విధ్యామ్యుత మధ్యమామ్ ।
ఇదం జఘన్యాऽమాసామా చ్ఛినద్మి స్తుకామివ ॥ 2 ॥

పదము

విధ్యామి । ఆసామ్ । ప్రథమామ్ । విధ్యామి । ఉత । మధ్యమామ్
ఇదమ్ । జఘన్యాऽమ్ । ఆసామ్ । ఆ । ఛినద్మి । స్తుకామ్ऽఇవ
॥ 2 ॥

**అనువాదం.**

ఈ గండమాలలలో ప్రధానమైన దానిని,
చికిత్స చేయుటకు సాధ్యముకానిదైనప్పటికీ
దేవముని మూలంతో విదారిస్తున్నాను.
మరిన్నీ మధ్యరకమైన గండమాలను కూడా
శరంతో విదారింప జేస్తున్నాను

ఇప్పుడు వాటిలో అల్పమైన దానిని కూడా
శిఖను వలె సులభముగా భేదిస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము :

త్వాష్ట్రేణాహం వచసా వి త ఈర్ష్యామమీమదమ్ ।
అథో యో మన్యుష్టే పతే తము తే శమయామసి ॥ 3 ॥

పదము :

త్వాష్ట్రేణ । అహమ్ । వచసా । వి । తే । ఈర్ష్యామ్ । అమీమదమ్ ।
అథో ఇతి । యః । మన్యుః । తే । పతే । తమ్ । ఓం ఇతి । తే ।
శమయామసి ॥ 3 ॥

అనువాదం :

ఓ ఈర్ష్యాశాలీ ! నీ ఈర్ష్యను
త్వష్ట మంత్రంతో నేను విగతమదం చేస్తున్నాను.
అంతేకాక ఓ వల్లభుడా !
మా విషయంలో ఉన్న నీ క్రోధాన్ని శమింపజేస్తున్నాము.
॥ 3 ॥

మంత్రము

వ్రతేన త్వం వ్రతపతే సమక్తో
విశ్వాహా సుమనా దీదిహీహ ।
తం త్వా వయం జాతవేదః సమిద్ధం
ప్రజావన్త ఉప సదేమ సర్వే ॥ 4 ॥

పదము :

వ్రతేన । త్వమ్ । వ్రత౽పతే । సమ్౽అక్తః ।

విశ్వాహా । సు౽మనాః । దీదిహి । ఇహ ।

తమ్ । త్వా । వయమ్ । జాత౽వేదః ।

సమ్౽ఇద్ధమ్ । ప్రజా౽వన్తః । ఉప । సదేమ । సర్వే ॥ 4 ॥

అనువాదం

ఓ వ్రతపతీ! వ్రతంతో సంస్కృతుడవైన నీవు
విశ్వములలో, అహస్సులలో సర్వదా శోభనమనస్కుడవై,
మావిషయంలో అనుగ్రహబుద్ధిగలవాడవై
ఇక్కడ మా ఇంటిలో వెలుగొందు.
ఓ జాతవేదా! బాగా వెలుగుతున్న నిన్ను
ప్రజావంతులమై మే మందరము సేవిస్తున్నాము ॥ 4 ॥

ఇది డెబ్బై నాల్గవ సూక్తం

## సూక్తం—75

ఋషిః ఉపరి బభ్రవుడు ॥ దేవతలు అఘ్న్యలు ॥ ఛందస్సు : 1 త్రిష్టుప్ ; 2 వణ్యపదా భురిక్ పథ్యాపంక్తి ॥ మంత్రములు ॥ 2 ॥

వినియోగం,— గోపుష్టి కర్మలో ఈ రెండు మంత్రములకు వినియోగం.

మంత్రము

ప్రజావతీః సూయవసే రుశన్తీః

శుద్ధా అపః సుప్రపాణే పిబన్తీః ।

మా వ స్తేన ఈశత మాఘశంసః
పరి వో రుద్రస్య హేతిర్వృణక్తు ॥ 1 ॥

పదము

ప్రజాఽవతీః । సుఽయవసే । రుశన్తీః ।
శుద్ధాః । అపః । సుఽప్రపానే । పిబన్తీః ।
మా । వః । స్తేనః । ఈశత । మా । అఘఽశంసః ।
పరి । వః । రుద్రస్య । హేతిః । వృణక్తు ॥ 1 ॥

అనువాదం

గోవులు మా వైపు వచ్చుగాక!
భద్రంకరము లగు గాక!
మా గోష్ఠంలో ఉండుగాక!
మమ్ము క్షీరాదులతో ఆనంద పఱచుగాక!
సంతానవతులై, బహురూపలై
ఈ యజమాన గృహంలో సమృద్ధము లగుగాక!
అనేక ఉషః కాలాలు ఇంద్రునకు
పయోధారల నిచ్చుగాక! ॥ 1 ॥

మంత్రము

పదజ్ఞా స్థ రమతయః సంహితా విశ్వనామ్నీః ।
ఉప మా దేవీర్దేవేభిరేత ।
ఇమం గోష్ఠమిదం సదో ఘృతేనాస్మాన్త్సముక్షత ॥ 2 ॥

పదము

పద౽జ్ఞాః । స్థ । రమతయః । సమ్౽హితాః । విశ్వ౽నామ్నీః ।

ఉప । మా । దేవీః । దేవేభిః । ఆ । ఇత ।

ఇమమ్ । గో౽స్థమ్ । ఇదమ్ । సదః । ఘృతేన । అస్మాన్ । సమ్ ।

ఉక్షత ॥ 2 ॥

అనువాదం

రమతులనే పేరుగల గోవులారా।
తోడి ఆవుల అడుగుజాడల నెరిగి ఉండండి
వత్సనహితలు, వ్యాప్తనామధేయలు నైన
ఓ గోదేవతలారా! మీరు దేవతలతో,
స్వకీయ వత్సాదులతో కలిసి
పుష్టికాముడనైన నా వద్దకు రండి.
వచ్చి మా ఈ గోశాలను, ఈ సదస్సును (గృహమును),
మమ్ములను నేతికి కారణభూతమైన పాలతో
బాగుగా సేచనం చేయండి ॥ 2 ॥

ఇది డెబ్బై ఐదవ సూక్తం

## సూక్తం – 76

ఋషి: అథర్వుడు ॥ దేవతలు : 1,2 అపచిద్ భైషజ్యమ్. 3–5 జాయాన్యలు. 6 ఇంద్రుడు ॥ ఛందస్సు 1 విరాడనుష్టుప్, 2 పరోష్ణిక్, 3,4 అనుష్టుప్, 5 భురిగనుష్టుప్. 6 త్రిష్టుప్ ॥ మంత్రములు ॥ 6 ॥

వినియోగం :– గండమాలా చికిత్సలో శంఖాన్ని చూర్ణం చేసి ఈ మొదటి రెండు మంత్రాలతో అభిమంత్రించి కానీ లేదా జనకలాలా జలాన్ని అభిమంత్రించి కానీ గండమాలకు పూయాలి. అదే కర్మలో ఈ

రెండు మంత్రాలతో జలగను కానీ బల్లిని కానీ అభిమంత్రించి రక్తంబయటకు వచ్చుటకు గండమాల ఉన్నచోట కట్టివేయాలి అదే కర్మలో సైంధవలవణాన్ని చూర్ణం చేసి ఈ రెండు మంత్రాలతో అభిమంత్రించి గండమాల ఉన్నచోట జల్లి ఊరకే ఉమ్మివేయాలి 74 వ సూక్తంలో పలెనే వీటికి కూడా వినియోగం 'యః కీకాసాః' అనే మంత్రత్రయంతో రాజయక్ష్మ చికిత్సలో వీణాతంత్రీఖండాన్ని కానీ, వాద్యఖండాన్ని కానీ అభిమంత్రించి కట్టాలి. సోమయాగంలో, మాధ్యందిన సవనంలో 'ధృషత్ పిబ' అనే మంత్రంతో ద్రోణకలశస్థమైన సోమాన్ని బ్రహ్మ అనుమంత్రించాలి

మంత్రము :

ఆ సుస్రసః సుస్రసో అసతీభ్యో అసత్తరాః ।
సేహోరరసతరా లవణాద్ విక్లేదీయసీః ॥ 1 ॥

పదము

ఆ । సుఽస్రసః । సుఽస్రసః । అసతీభ్యః । అసత్ఽతరాః ।
సేహోః । అరసఽతరాః । లవణాత్ । విఽక్లేదీయసీః ॥ 1 ॥

అనువాదం

సదా స్రవణశీలములు, బాధకములైన రోగములన్నింటికంటె
మిక్కిలి బాధకములునైన గండమాలలు
నిరవశేషంగా స్రవించుగాక!
అత్యంతం నిస్సారమైన పదార్థం కంటె కూడా
నిస్సార తరములు, లవణం కంటె కూడా
స్రవణశీలములై అనేక విధములుగా
బాధాకరములైన గండమాలలు
నిరవశేషంగా స్రవించుగాక! ॥ 1 ॥

మంత్రము

యా గ్రైవ్యా అపచితోఽథో యా ఉపపక్ష్యాః ।

విజామ్ని యా అపచితః స్వయంస్రసః ॥ 2 ॥

పదము

యాః । గ్రైవ్యాః । అపఽచితః । అథో ఇతి । యాః ।

ఉపఽపక్ష్యాః ।

విఽజామ్ని । యాః । అపఽచితః । స్వయమ్ఽస్రసః ॥ 2 ॥

అనువాదం

గళ ప్రదేశంలో ఉత్పన్నమైనవి, కక్ష్యలలో పుట్టినవి,
గుహ్యప్రదేశంలో పుట్టేవి ఏవైతే ఉన్నవో
ఆ గండమాలలన్నీ స్వయం స్రవణశీలములు.
అవి మంత్రౌషధి ప్రయోగంతో నిరవశేషంగా స్రవించుగాక!
॥ 2 ॥

మంత్రము.

యః కీకసాః ప్రశృణాతి తలీద్యఽమవతిష్ఠతి ।

నిర్హాస్తం సర్వం జాయాన్యం యః కశ్చ కకుది శ్రితః ॥3॥

పదము.

యః । కీకసాః । ప్రఽశృణాతి । తలీద్యఽమ్ । అవఽతిష్ఠతి ।

నిః । హాః । తమ్ । సర్వమ్ । జాయాన్యమ్ । యః । కః । చ ।

కకుది । శ్రితః ॥ 3 ॥

**అనువాదం.**

రాజయక్ష్మ అనే రోగం ఎముకలకు వ్యాపిస్తుంది.
అది అస్థి సమీపంలోని మాంసాన్ని శోషింపజేస్తుంది
ఏ దుస్సాధ్యమైన 'రాజయక్ష్మ' అనే రోగం
మెడవెనుక నున్న స్థానాన్ని ఆక్రమించి
దానిని సంకోచింప జేస్తుందో,
ఆ సర్వధాతు శోషకమైన,
నిరంతర జాయా సంభోగంతో కలిగిన
క్షయరోగాన్ని ఈ మంత్ర సంస్కృతిమైన
ఔషధం పరిహరించు గాక! ॥ 3 ॥

**మంత్రము.**

పక్షీ జాయాన్యః పతతి స ఆ విశతి పూరుషమ్ ।
తదక్షితస్య భేషజ ముభయోః సుక్షతస్య చ ॥ 4 ॥

**పదము :**

పక్షీ । జాయాన్యః । పతతి । సః । ఆ । విశతి । పురుషమ్ ।
తత్ । అక్షితస్య । భేషజమ్ । ఉభయోః । సుఽక్షతస్య । చ ॥4॥

**అనువాదం :**

క్షయరోగం పక్షం కలదై అన్నిచోట్లా సంచరిస్తుంది.
ఆ రోగం పురుషునిలో సర్వత్ర ప్రవేశిస్తుంది
శరీరంలో చాలాకాలంగా లేని,
చిరకాలంగా ఉన్న ఉభయ విధ
క్షయరోగములకు ప్రసిద్ధమైన,
మంత్రాభిమంత్రితమైన, పీణాతంత్రి
ఖండాది రూపమైన ఔషధం నివర్తకమౌతుంది. ॥ 4

మంత్రము,

విద్మ వై తే జాయాన్య జానం యతో జాయాన్య జాయసే।

కథం హ తత్ర త్వం హనో యస్య కృణ్మో హవి ర్గృహే

॥ 5 ॥

పదము

విద్మ । వై । తే । జాయాన్య । జానమ్ । యతః । జాయాన్య ।

జాయసే ।

కథమ్ । హ । తత్ర । త్వమ్ । హనః । యస్య । కృణ్మః । హవిః

గృహే ॥ 5 ॥

అనువాదం॥

జాయాజనితమైన ఓ రాజయక్ష్మా!
నీ జన్మకు కారణం మాకు తెలుసు.
ఏ యజమానుని గృహంలో హవిస్సును వ్రేలుస్తున్నామో
అక్కడ నీవు ఏ విధంగా బాధించగలవు? ॥ 5 ॥

మంత్రము

ధృషత్ పిబ కలశే సోమ మిన్ద్ర
వృత్రహా శూర సమరే వసూనామ్।
మాధ్యన్దినే సవన ఆ వృషస్వ
రయిష్ఠానో రయి మస్మాసు ధేహి ॥ 6 ॥

**పదము**

ధృషత్ । పిబ । కలశే । సోమమ్ । ఇన్ద్ర ।

వృత్ర౽హా । శూర । సమ్౽అరే । వసూనామ్ ।

మాధ్యన్దినే । సవనే । ఆ । వృషస్వ ।

రయి౽స్థానః । రయిమ్ । అస్మాసు । ధేహి ॥ 6 ॥

**అనువాదం**

ఓ ఇంద్ర ధర్షకుడా! కలశంలోనున్న
సోమరసాన్ని పానం చెయ్యి.
ఓ శూరా! వృత్ర హంతా! నీవు
సంగ్రామ నిమిత్తమై మాకు
కావలసిన ధనాన్ని సమకూర్చు
మాధ్యందిన సవనంలో అన్నిచోట్లా
జఠరంలో సోమరసాన్ని వ్యాపింపజెయ్యి
ధనస్థానమైన నీవు ధనాన్ని మాయందు నిక్షేపించు. ॥ 6 ॥

ఇది డెబ్బై ఆఱవ సూక్తం

## సూక్తం – 77

**ఋషి: అంగిరసుడు ॥ దేవతలు. మరుత్తులు॥ ఛందస్సు: 1 త్రిపదా గాయత్రీ 2 త్రిష్టుప్ . 3 జగతీ ॥ మంత్రములు ॥ 3 ॥**

**వినియోగం:– అభిచార కర్మలో ఈమూడు మంత్రాలతో మెఱపుతో కాలిన వృక్ష సమిధను తేవాలి. అట్లే చాతుర్మాస్యాలలో సాకమేధ పర్వంలో మధ్యందిన కాలంలో సాంతపన మరుద్యాగాన్ని బ్రహ్మ వీటితో అను మంత్రించాలి,**

మంత్రము

సాంతపనా ఇదం హవి ర్మరుత స్త జ్జుజుష్టన ।

అస్మాకోతీ రిశాదసః ॥ 1 ॥

పదము

సామ్ఽతపనాః । ఇదమ్ । హవిః । మరుతః । తత్ । జుజుష్టన ।

అస్మాక । ఊతీ । రిశాదసః ॥ 1 ॥

అనువాదం

ఓ సంతాపనులారా! సూర్య సంబంధులైన
ఓ మరుత్తులారా! ఈ హవిస్సును సేవించండి.
మా రక్షణార్థం హింసోపక్షేపకులైన
మీరు హవిస్సును సేవించండి. ॥ 1 ॥

మంత్రము:

యో నో మర్తో మరుతో దుర్హృణాయు-

స్తిరశ్చిత్తాని వసవో జిఘాంసతి ।

ద్రుహః పాశాన్ ప్రతి ముఞ్చతాం

స స్తపిష్ఠేన తపసా హ న్తనా తమ్ ॥ 2 ॥

పదము,

యః । నః । మ ర్తః । మరుతః । దుఃఽహృణాయుః ।

తిరః । చిత్తాని । వసవః । జిఘాంసతి ।

ద్రుహః । పాశాన్ । ప్రతి । ముఞ్చతామ్ । సః ।
తపిష్ఠేన । తపసా । హన్తన । తమ్ ॥ 2 ॥

**అనువాదం**

ధనాన్నిచ్చే ఓ మరుత్తులారా !
మరణ ధర్ముడైన ఏ మనుష్యుడు
దుష్టమైన క్రోధంతో, అంతర్హితుడై
మా మనస్సులను క్షోభపెట్టుచున్నాడో,
ఆ శత్రువు పాపదోగ్ధయైన వరుణుని
పాశములతో బద్ధుడగుగాక !
ఓ మరుత్తులారా ! అతనిని
తాపకమైన ఆయుధంతో హింసించండి ॥ 2 ॥

**మంత్రము**

సంవత్సరీణా మరుతః స్వర్కా
ఉరుక్షయాః సగణా మానుషాసః ।
తే అస్మత్ పాశాన్ ప్ర ముఞ్చన్త్వేనసః ।
సాంతపనా మత్సరా మాదయిష్ణవః ॥ 3 ॥

**పదము :**

సమ్ఽవత్సరీణాః । మరుతః । సుఽఅర్కాః ।
ఉరుఽక్షయాః । సఽగణాః । మానుషాసః ।
తే । అస్మత్ । పాశాన్ । ప్ర । ముఞ్చన్తు । ఏనసః ।

సామ్ఽతపనాః । మత్సరాః । మాదయిష్ణవః ॥ 3 ॥

**అనువాదం :**

ప్రతి సంవత్సరం ప్రాదుర్భవించే వారు,
మంత్రములతో బాగా స్తుతించబడేవారు,
విస్తీర్ణమైన అంతరిక్షమే నివాసముగా గలవారు,
తమ తమ సంఘములతో (గణములతో) కూడినవారు,
వృష్టి నిమిత్తమై మనుష్యహితకారులు,
శత్రు సంతాపకారులు, మదించిన వారు,
సర్వులను సంతోషపెట్టేవారు అయిన
మరుత్తులు మా నుంచి పాపకారులైన
బాధకపాశములను విడిపింతురుగాక ! ॥ 3 ॥

ఇది డెబ్భై ఏడవ సూక్తం

## సూక్తం-78

ఋషి. అథర్వుడు ॥ దేవత అగ్ని ॥ ఛందస్సు 1 పరోష్ణిక్, 2 త్రిష్టుప్ ॥
మంత్రములు ॥ 2 ॥

వినియోగం :- సర్వవ్యాధి భైషజ్య కర్మలో మొదటి మంత్రంతో ఉదకఘటాన్ని అభిమంత్రించి సూత్రోక్త ప్రకారంగా వ్యాధితుని తడపాలి. దర్శ పూర్ణమాసలలో బంధవిముక్తురాలయ్యే పత్నిని బ్రహ్మ దీనితో అనుమంత్రించాలి. దర్శపూర్ణమాసలలో రెండవ మంత్రంతో హవిరాసాదనానంతరం అజ్యాన్ని హోమంచేయాలి.

మంత్రము

వి తే ముఞ్చామి రశనాం వి యోక్త్రం వి నియోజనమ్।
ఇహైవ త్వమజస్ర ఏధ్యగ్నే ॥ 1 ॥

పదము

వి। తే। ముఞ్చామి। రశనామ్। వి। యోక్త్రమ్। వి।

నిఽయోజనమ్।

ఇహ। ఏవ। త్వమ్। అజస్రః। ఏధి। అగ్నే ॥ 1 ॥

అనువాదం.

ఓ అగ్నీ! నీ కర్తృకమైన వ్యాపికరజ్జువును విడిపిస్తున్నాను.
యోజనోపయుక్తమైన రజ్జువిశేషమును విడిపిస్తున్నాను
సర్వావయవ బంధనసాధనమైన రజ్జువిశేషాన్ని విడిపిస్తున్నాను
అందువల్ల ఓ అగ్నీ! నీవు ఈ రోగార్తుని యందే
ఎల్లప్పుడు అబాధనశీలుడవుకా! ॥ 1 ॥

మంత్రము:

అస్మై క్షత్రాణి ధారయన్త మగ్నే
యునజ్మి త్వా బ్రహ్మణా దైవ్యేన।
దీదిహ్యఽస్మభ్యం ద్రవిణేహ భద్రం
ప్రేమం వోచో హవిర్దాం దేవతాసు ॥ 2 ॥

పదము

అస్మై। క్షత్రాణి। ధారయన్తమ్। అగ్నే।
యునజ్మి। త్వా। బ్రహ్మణా। దైవ్యేన।
దీదిహి। అస్మభ్యమ్। ద్రవిణా। ఇహ। భద్రమ్।

ప్ర । ఇమమ్ । వోచః । హవిఃఽదామ్ । దేవతాసు ॥ 2 ॥

**అనువాదం**

ఓ అగ్నీ ! ఈ యజమానునికి బలగాన్ని ప్రసాదిస్తున్న నిన్ను
దేవసంబంధమైన మంత్రంతో
హవిర్వహనార్థం యోజనం చేస్తున్నాను
మాకు ధనములను, సుఖాన్ని ఇప్పుడు ప్రసాదించు
చరు పురోడాశాది రూపమైన హవిస్సును
అర్పిస్తున్న ఈ యజమానుని గూర్చి
అగ్నీంద్రాది దేవతలకు ఒక మాట చెప్పు ॥ 2 ॥

ఇది డెబ్బై ఎనిమిదవ సూక్తం

## సూక్తం-79

**ఋషి అథర్వుడు॥ దేవతలు: అమావస్యా॥ ఛందస్సు: 1 జగతీ॥ 2-4 త్రిష్టుప్॥ మంత్రములు ॥ 4 ॥**

వినియోగం - ఈ నాలుగు మంత్రాలతో ప్యాభిలషిత కాముడు అమావాస్యా దేవతను యజనం చేయాలి. లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి. దర్శ యాగంలో పార్వణహోమాన్ని మొదటి మంత్రంతో చెయ్యాలి, శ్రౌతదర్శయాగంలో దీనితో కుహూ దేవతను పరిగ్రహించాలి.

మంత్రము

యత్ తే దేవా అకృణ్వన్ భాగధేయ-
మమావాస్యే సంవసన్తో మహిత్వా ।
తేనా నో యజ్ఞం పిపృహి విశ్వవారే
రయిం నో ధేహి సుభగే సువీరమ్ ॥ 1 ॥

పదము ।

యత్ । తే । దేవాః । అకృణ్వన్ । భాగ౨ధేయమ్ ।

అమా౨వాస్యే । సమ్౨వసన్తః । మహి౨త్వా ।

తేన । నః । యజ్ఞమ్ । పిపృహి । విశ్వ౨వారే ।

రయిమ్ । నః । ధేహి । సు౨భగే । సు౨వీరమ్ ॥ 1 ॥

అనువాదం.

ఓ అమావాస్యా! నీ మహత్త్వంచేత
వేచియున్న దేవతలు అగ్నీంద్రసోమాదులు
హవిర్భాగాన్ని స్వీకరించినారు
దానితో మా యజ్ఞాన్ని పూరించు
ఓ సర్వవర్ధనీయమైన, సుభగమైన అమావాస్యా!
మాకు సువీరులైన పుత్రాదులను, ధనాన్ని ప్రసాదించు ॥1॥

మంత్రము

అహమేవా స్మ్యమావాస్యా౩

మామా వసన్తి సుకృతో మయీమే ।

మయి దేవా ఉభయే సాధ్యా-

శ్చేన్ద్రజ్యేష్ఠాః సమగచ్ఛన్త సర్వే ॥ ౭ ॥

పదము

అహమ్ । ఏవ । అస్మి । అమా౨వాస్యా౨ ।

మామ్ । ఆ । వసన్తి । సు౨కృతః । మయి । ఇమే ।

మయి । దేవాః । ఉభయే । సాధ్యాః । చ ।

ఇన్ద్ర౨జ్యేష్ఠాః । సమ్ । అగచ్ఛన్త । సర్వే ॥ 2 ॥

**అనువాదం :**

నేనే అమావాస్య దేవతను.
సుకృతులైన దేవతలు నాయందు నివసిస్తున్నారు.
ఈ దేవతలు సిద్ధసాధ్యనామకులైన ఉభయులు,
ఇంద్రప్రముఖులు, సర్వదేవతలు
నాయందు సమాగతులౌతున్నారు. ॥ 2 ॥

మంత్రము

ఆగన్ రాత్రీ సఙ్గమనీ వసూనా-
మూర్జం పుష్టం వస్వావేశయన్తీ ।
అమా౨వాస్యా౨యై హవిషా విధేమోర్జం
దుహానా పయసా న ఆగన్ ॥ 3 ॥

పదము

ఆ । అగన్ । రాత్రీ । సమ్౨గమనీ । వసూనామ్ ।

ఊర్జమ్ । పుష్టమ్ । వసు । ఆ౨వేశయన్తీ ।

అమా౨వాస్యా౨యై । హవిషా । విధేమ । ఊర్జమ్ ।

దుహానా । పయసా । నః । ఆ । అగన్ ॥ 3 ॥

**అనువాదం:**

అమావాస్య రాత్రి ధనసంయోగయిత్రి.
మాకు ధనాన్ని సమకూర్చుటకై వచ్చుగాక!
అలాగే అన్నరసాన్ని, పుష్టిని, ధనాన్ని
మాకు ప్రసాదిస్తూ వచ్చుగాక!
మాకు అన్నరసాన్ని క్షీరంతో కూడా
దోహనం చేస్తూ వచ్చుగాక!
అలాంటి అమావాస్య దేవతను
హవిస్సుతో పరిచరిస్తున్నాము. ॥ 3 ॥

**మంత్రము.**

**అమావాస్యే న త్వదేతాన్యన్యో**
**విశ్వా రూపాణి పరిభూర్జజాన ।**
**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు**
**వయం స్యామ పతయో రయీణామ్ ॥ 4 ॥**

**పదము**

**అమాऽవాస్యే । న । త్వత్ । ఏతాని । అన్యః ।**
**విశ్వా । రూపాణి । పరిऽభూః । జజాన ।**
**యత్ऽకామాః । తే । జుహుమః । తత్ । నః । అస్తు ।**
**వయమ్ । స్యామ । పతయః । రయీణామ్ ॥ 4 ॥**

**అనువాదం**

ఓ అమావాస్యదేవతా! నీకంటె వేరొక దేవుడు
ఈ వర్తమానములైన సర్వ విశ్వములను, రూపములను

పరిగ్రహించుటకై వ్యాపకుడై ఉత్పన్నుడు కాలేదు.
నీవే వీనిని పరిగ్రహించినావు
మేము ఏ ఫలాన్ని ఆశించి నీకు
హవిస్సును సమర్పిస్తున్నామో
ఆ ఫలం మాకు దక్కుగాక!
మేము కూడా ధనపతుల మగుదుము గాక! ॥ 1

ఇది డెబ్భై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 80

ఋషిః అథర్వుడు॥ దేవతలు 1,2,4 పౌర్ణమాసీ. 3 ప్రజాపతి॥ ఛందస్సు 1,3,4 త్రిష్టుప్॥ 2 అనుష్టుప్॥ మంత్రములు ॥ 4 ॥

వినియోగం - సర్వఫల కాముడు 1,2,4 మంత్రాలతో పౌర్ణమాసీ దేవతను యజనం చెయ్యాలి లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి. అదే కర్మలో 3 వ మంత్రంతో ప్రజాపతిని యజనం చెయ్యాలి లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి. పూర్ణమాస యాగంలో మొదటి మంత్రంతో పూర్ణమాసీ దేవతను పరిగ్రహించాలి. అదే కర్మలో పార్వణ హోమాన్ని దీనితో చెయ్యాలి దర్శపూర్ణమాసలలో సంసతి హోమానంతరం 3 వ మంత్రంతో ఆజ్యాన్ని హోమం చెయ్యాలి సర్వ శ్రౌతకర్మలలో అనుమంత్రణ మంత్రములను చదువుతూ 3 వ మంత్రంతో అనుమంత్రణం చెయ్యాలి. దర్శపూర్ణమాసలలో ప్రాజాపత్య అఘారాన్ని (ధారగాహోమం చేసే ఆజ్యాన్ని) దీనితో బ్రహ్మ అనుమంత్రించాలి మారుద్గణీ మహాశాంతిలో దీనిని ఆవపనం చెయ్యాలి.

మంత్రము.

పూర్ణా పశ్చాదుత పూర్ణా పురస్తా దున్మధ్యతః
పౌర్ణమాసీ జిగాయ।

తస్యాం దేవైః సంవసన్తో మహిత్వా
నాకస్య పృష్ఠే సమిషా మదేమ ॥ 1 ॥

పదము.

పూర్ణా । పశ్చాత్ । ఉత । పూర్ణా । పురస్తాత్ ।
ఉత్ । మధ్యతః । పౌర్ణఽమాసీ । జిగాయ ।
తస్యామ్ । దేవైః । సమ్ఽవసన్తః । మహిఽత్వా ।
నాకస్య । పృష్ఠే । సమ్ । ఇషా । మదేమ ॥ 1 ॥

అనువాదం

పౌర్ణమాసి పడమటి వేపు సర్వోత్కర్షతో వెలుగొందుతున్నది.
అలాగే పూర్ణిమ పూర్వదిశలో వెలుగొందుతున్నది
అలాగే ప్రాక్పశ్చిమదిశల మధ్యలో నున్న
ఆకాశ మధ్యంలో వెలుగొందుచున్నది
ఆ పౌర్ణమాసిలో యష్టవ్యులైన దేవతలతో సహ
మహత్త్వంతోకలిసి నివసిస్తున్న మేము
దుఃఖరహితమైన స్వర్గోపరిభాగంలో
అన్నంతో సంమాద్యులమౌతున్నాము ॥ 1 ॥

మంత్రము

వృషభం వాజినం వయం పౌర్ణమాసం యజామహే ।
స నో దదా త్వక్షితాం రయి మనుపదస్వతీమ్ ॥ 2 ॥

పదము ।

వృషభమ్ । వాజినమ్ । వయమ్ । పౌర్ణ౽మాసమ్ । యజామహే

సః । నః । దదాతు । అక్షితామ్ । రయిమ్ । అనుప౽దస్వతీమ్

॥ 2 ॥

అనువాదం

అభిమతఫలప్రదాత, హవిర్యుక్తుడు,
పౌర్ణమాసలో పూర్ణుడు నైన చంద్రుని గూర్చి
మేము యజ్ఞం చేస్తున్నాము.
ఆయన మాకు అవినాశకమైన,
ఉపభోగంలో కూడా క్షయరహితమైన
ధనాన్ని ఇచ్చుగాక! ॥ 2 ॥

మంత్రము

ప్రజాపతే న త్వదేతాన్యన్యో
విశ్వారూపాణి పరిభూర్జజాన ।
యత్కామాస్తే జుహుమస్తన్నో
అస్తు వయం స్యామ పతయో రయీణామ్ ॥ 3 ॥

పదము

ప్రజా౽పతే । న । త్వత్ । ఏతాని । అన్యః ।

విశ్వా । రూపాణి । పరి౽భూః । జజాన ।

యత్౽కామాః । తే । జుహుమః । తత్ । నః ।

అస్తు । వయమ్ । స్యామ । పతయః । రయీణామ్ ॥ 3 ॥

**అనువాదం**

ఓ ప్రజాపతీ! నీ కంటె వేరొక దేవుడు
ఈ వర్తమానములైన విశ్వములను, రూపములను
పరిగ్రహించుటకై వ్యాపకుడై ఉత్పన్నుడు కాలేదు
నీవే వీనిని పరిగ్రహించినావు.
మేము ఏ ఫలాన్ని ఆశించి నీకు
హవిస్సును సమర్పిస్తున్నామో
ఆ ఫలం మాకు దక్కుగాక!
మేము కూడా ధనపతుల మగుదుముగాక! ॥ 3 ॥

మంత్రము

పౌర్ణమాసీ ప్రథమా యజ్ఞియాసీదహ్నాం
రాత్రీణామతి శర్వరేషు ।
యే త్వాం యజ్ఞైర్యజ్ఞియే అర్ధయన్త్యమీ
తే నాకే సుకృతః ప్రవిష్టాః ॥ 4 ॥

పదము

పౌర్ణ౽మాసీ । ప్రథమా । యజ్ఞియా । ఆసీత్ ।
అహ్నామ్ । రాత్రీణామ్ । అతి౽శర్వరేషు ।
యే । త్వామ్ । యజ్ఞైః । యజ్ఞియే । అర్ధయన్తి ।
అమీఇతి । తే । నాకే । సు౽కృతః । ప్ర౽విష్టాః ॥ 4 ॥

అనువాదం :

పౌర్ణమాసి అహోరాత్రులమధ్య ముఖ్యమైనది.
తృతీయ సవనవ్యాప్తములైన సోమాది
హవిస్సులలో యజ్ఞార్హమైనది.
ఓ పౌర్ణమాసీ! నిన్నుఏ ఋత్విగ్యజమానులు
దర్శపూర్ణమాసాది యజ్ఞములతో
అభిమత ఫలాన్ని యాచిస్తున్నారో,
ఆ సుకృతులు స్వర్గంలో ప్రవేశించి నివసిస్తారు ॥ 4 ॥

ఇది ఎనబైయవ సూక్తం

## సూక్తం-81

ఋషి: అథర్వుడు ॥ దేవతలు : సావిత్రి, సూర్యుడు, చంద్రుడు ॥ ఛందస్సు : 1,2,6 త్రిష్టుప్. 3 అనుష్టుప్. 4 అస్తార పంక్తి. 5 స్వరాడాస్తార పంక్తి ॥ మంత్రములు : ॥ 6 ॥

వినియోగం.- మొదటి రెండు ఋక్కులతో వివాహంలో ఆజ్యసమిత్పురోడాశాదులను హోమంచెయ్యాలి. చివరినాలుగుమంత్రాలతో మహాశాంతిలో, గ్రహయజ్ఞంలో హవిరాజ్యహోమ సమిదాధానోపస్థానములను పండితునికై చెయ్యాలి.

మంత్రము :

పూర్వాపరం చరతో మాయయైతౌ శిశూ
క్రీడన్తౌ పరి యాతోఽర్ణవమ్ ।
విశ్వాన్యో భువనా విచష్ట ఋతూం-
రన్యో విదధజ్జాయసే నవః ॥ 1 ॥

పదము .

పూర్వ౽అపరమ్ । చరతః । మాయయా । ఏతౌ । శిశూ ఇతి ।
క్రీడన్తౌ । పరి । యాతః । అర్ణవమ్ ।
విశ్వా । అన్యః । భువనా । వి౽చష్టే । ఋతూన్ ।
అన్యః । వి౽దధత్ । జాయసే । నవః ॥ 1 ॥

అనువాదం :

సూర్యచంద్రులు ఒకరి వెనుక ఒకరు సంచరిస్తూ
మాయతో పాటు ద్యులోకంలో తిరుగుతుంటారు.
వారు పిల్లలవలె విహరిస్తూ అంతరిక్షంలో సంచరిస్తారు.
వారిలో ఒకడైన ఆదిత్యుడు
సర్వ భువనములను చూస్తున్నాడు.
మరొకడైన చంద్రుడు ఋతువులకు
కారణభూతు డవుతూ నూతనుడై ఉత్పన్నుడౌతున్నాడు ॥ 1 ॥

మంత్రము .

నవోనవో భవసి జాయమానో౽హ్నాం
కేతురుషసామేష్యగ్రమ్ ।
భాగం దేవేభ్యో వి దధాస్యాయన్
ప్ర చన్ద్రమస్తిరసే దీర్ఘమాయుః ॥ 2 ॥

పదము :

నవః౽నవః । భవసి । జాయమానః । అహ్నామ్ ।

కేతుః । ఉషసామ్ । ఏషి । అగ్రమ్ ।

భాగమ్ । దేవేభ్యః । వి । దధాసి । ఆ౨యన్ ।

ప్ర । చన్ద్రమః । తిరసే । దీర్ఘమ్ । ఆయుః ॥ 2 ॥

అనువాదం.

ఓ చంద్రమా! నీవు ఉదయిస్తూ
ప్రతి దినము నూతనుడ వవుతున్నావు.
తిథులకు కేతువు వలె నీవు
రాత్రులకు అగ్రణి వవుతున్నావు.
ఈ విధంగా ప్రతిదినమూ వస్తూ ఓ చంద్రమా!
నీవు దేవతలకు హవిర్భాగాన్ని ఇస్తున్నావు.
ఓ చంద్రమా! నీవు దీర్ఘాయుస్సును ప్రసాదిస్తున్నావు. ॥ 2 ॥

మంత్రము

సోమస్యాంశో యుధాం పతే౨నూనో నామ వా అసి ।

అనూనం దర్శ మా కృధి ప్రజయా చ ధనేన చ ॥ 3 ॥

పదము.

సోమస్య । అంశో ఇతి । యుధామ్ । పతే । అనూనః । నామ ।
వై । అసి ।

అనూనమ్ । దర్శ । మా । కృధి । ప్ర౨జయా । చ । ధనేన । చ
॥ 3 ॥

అనువాదం :

చంద్రుని అంశభూతుడవైన ( సోమపుత్రుడవైన )
ఓ బుధుడా! ఓ యోధ పాలకుడా!

నీవు సంపూర్ణనాముడ వవుతున్నావు.
అందువల్ల ద్రష్టవ్యుడవైన ఓ బుధుడా!
హవిరాదులతో ప్రీతి చెందిస్తున్న నన్ను
పుత్రాదులతో, ధనంతో సమృద్ధుని చెయ్యి. ॥ 3 ॥

మంత్రము

దర్శోఽసి దర్శతోఽసి సమగ్రోఽసి సమన్తః।
సమగ్రః సమన్తో భూయాసం గోభిరశ్వైః
ప్రజయా పశుభిర్గృహై ర్ధనేన ॥ 4 ॥

పదము

దర్శః। అసి। దర్శతః। అసి। సమ్ఽఅగ్రః। అసి। సమ్ఽఅన్తః।
సమ్ఽఅగ్రః। సమ్ఽఅన్తః। భూయాసమ్। గోభిః। అశ్వైః।
ప్రఽజయా। పశుఽభిః। గృహైః। ధనేన ॥ 4 ॥

అనువాదం.

ఓ సోముడా! నీవు సూర్యునితో పాటు
ద్రష్టవ్యుడ వవుతున్నావు.
అనంతరం తృతీయాదులలో మరింత
స్పష్టంగా కనబడతావు
అష్టమ్యాదులలో స్ఫుటతరకళాసమృద్ధుడ వౌతావు.
అనంతరం పౌర్ణమాసి యందు కళాపూర్ణ మండలుడ వౌతావు.
అలాగే నేను కూడా గోధనాదులతో
సమృద్ధుడను, సంపూర్ణుడను అగుదును గాక! ॥ 4 ॥

మంత్రము :

యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మ-

స్తస్య త్వం ప్రాణేనా ప్యాయస్వ ।

ఆ వయం ప్యాసిషీమహి గోభిరశ్వైః

ప్రజయా పశుభి ర్గృహై ర్ధనేన ॥ 5 ॥

పదము.

యః । అస్మాన్ । ద్వేష్టి । యమ్ । వయమ్ । ద్విష్మః ।

తస్య । త్వమ్ । ప్రాణేన । ఆ । ప్యాయస్వ ।

ఆ । వయమ్ । ప్యాసిషీమహి । గోభిః । అశ్వైః ।

ప్రఽజయా । పశుఽభిః । గృహైః । ధనేన ॥ 5 ॥

అనువాదం :

ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తాడో,
ఏ శత్రువును మేము ద్వేషిస్తామో,
అతని ప్రాణంతో ఓ సోమా! నీవు
అప్యాయితుడవు కమ్ము.
( శత్రువు ప్రాణాన్ని అపహరించు )
మేము కూడా గోవులతో, గృహములతో,
పశువులతో, ప్రజలతో, ధనముతో, అశ్వములతో
వర్ధిల్లుదుము గాక! ॥ 5 ॥

మంత్రము :

యం దేవా అంశు మాప్యాయ యన్తి

యమక్షితమక్షితా భక్షయన్తి ।
తేనాస్మా నిన్ద్రో వరుణో బృహస్పతి-
రా ప్యాయయన్తు భువనస్య గోపాః ॥ 6 ॥

పదము :

యమ్ । దేవాః । అంశుమ్ । ఆఽప్యాయయన్తి ।
యమ్ । అక్షితమ్ । అక్షితాః । భక్షయన్తి ।
తేన । అస్మాన్ । ఇన్ద్రః । వరుణః । బృహస్పతిః ।
ఆ । ప్యాయయన్తు । భువనస్య । గోపాః ॥ 6 ॥

అనువాదం :

ఏకకళాత్మకుడైన ఏ సోముని
దేవతలు శుక్ల పక్షంలో ప్రతిదినము
ఒక్కొక్క కళనిచ్చి వృద్ధిపొందిస్తున్నారో,
ఏ సోముని, అవిచ్ఛిన్నుని అక్షీణులైన పిత్రాదులు
భక్షిస్తున్నారో (పానము చేస్తున్నారో),
ఆ సోమునితో పాటు ఇంద్రుడు, వరుణుడు,
బృహస్పతి, భూతజాతమునకు పరిరక్షకులైన
ఇంద్రాదులు, ఇతర దేవతలు మమ్ములను
వృద్ధిపొందింతురు గాక! ॥ 6 ॥

ఇది ఏడవ అనువాకం

ఇది ఎనభై ఒకటవ సూక్తం

## అనువాకం - 8

### సూక్తం - 82

ఋషి, శౌనకుడు ( సంపత్కాముడు ) ॥ దేవతలు - అగ్ని ॥ ఛందస్సు ॥ 1,4-6 త్రిష్టుప్, 2 కకుమ్మతీ బృహతీ ॥ 3 జగతీ ॥ మంత్రములు. ॥ 6 ॥

వినియోగం .- దీనితో సర్వఫలకాముడు లేదా సంపత్కాముడు అగ్నిని యజిం చాలి. లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి అగ్ని చయనంలో సమిదాధానా నంతరం 'అభ్యర్చత' అనే మంత్రాన్ని బ్రహ్మ జపించాలి అల్లే మహాశాంతిలో 'అభ్యర్చత' అనే మంత్రంతో అవసనం చెయ్యాలి వాస్తోష్పత్యమనే మహాశాంతిలో 'అభ్యర్చత' అనే మంత్రంతో * ఔదుమ్బర మణిని కట్టాలి. బ్రహ్మచారికి స్వాగ్ని నాశ ప్రాయశ్చిత్తార్థం 'మయ్యగ్రే' అనే ఐదు ఋక్కులతో ఐదు సమిధలను ఆధానం చెయ్యాలి. అల్లే ఆధానంలో మథించిన అగ్నిని 'మయ్యగ్రే' అనే మంత్రంతో ఆజ్యంతో తడపాలి. దర్శపూర్ణమాసలలో 'ఘృతం తే అగ్నే' అనే మంత్రంతో ఆజ్య నిర్వాపకాలంలో అగ్నిని బ్రహ్మ అనుమంత్రించాలి.

మంత్రము.

అభ్యఽర్చత సుష్టుతిం గవ్యమాజి-

మస్మాసు భద్రా ద్రవిణాని ధత్త ।

ఇమం యజ్ఞం నయత దేవతా నో

ఘృతస్య ధారా మధుమత్ పవన్తామ్ ॥ 1 ॥

పదము.

అభి । అర్చత । సుఽస్తుతిమ్ । గవ్యమ్ । ఆజిమ్ ।

అస్మాసు । భద్రా । ద్రవిణాని । ధత్త ।

ఇమమ్ । యజ్ఞమ్ । నయత । దేవతా । నః ।

ఘృతస్య । ధారాః । మధు౽మత్ । పవన్తామ్ ॥ 1 ॥

**అనువాదం :**

గోసంబంధియైన సంఘాన్ని అభిలక్షించి
సంస్తుతి పాత్రుడైన అగ్నిని అభ్యర్చించండి.
ఛందనీయములైన ధనములను మాలో నిక్షేపించండి.
మా ఈ యజ్ఞాన్ని దేవతలు పొందుదురుగాక!
ఘృతధారలు మధుర రసోపేతములై ప్రవహించుగాక! ॥ 1 ॥

**మంత్రము :**

మయ్యగ్రే అగ్నిం గృహ్ణామి సహ క్షత్రేణ వర్చసా బలేన ।
మయి ప్రజాం మయ్యాయుర్దధామి స్వాహా మయ్యగ్నిమ్ ॥ 2 ॥

**పదము :**

మయి । అగ్రే । అగ్నిమ్ । గృహ్ణామి । సహ । క్షత్రేణ । వర్చసా । బలేన ।

మయి । ప్ర౽జామ్ । మయి । ఆయుః । దధామి । స్వాహా ।
మయి । అగ్నిమ్ ॥ 2 ॥

**అనువాదం :**

తొలుత అగ్నిని చిలికి నా అధీనం చేసుకుంటున్నాను.
క్షత్రంతో, బలంతో, వర్చస్సుతో కూడిన అగ్నిని
నేను స్వాధీనం చేసుకుంటున్నాను.

పుత్రాది లక్షణమైన సంతానాన్ని
లభింపజేసుకుంటున్నాను.
ఆయుష్మంతుడ నవుతున్నాను.
జరరాగ్నిని నాలో ధరిస్తున్నాను.
అగ్నిలో ఈ సమిదాదులు స్వాహుత మగుగాక! ॥ 2 ॥

మంత్రము :

ఇహైవాగ్నే అధి ధారయా రయిం మా త్వా
ని క్రన్ పూర్వచిత్తా నికారిణః ।
క్షత్రేణాగ్నే సుయమమస్తు తుభ్య-
ముపసత్తా వర్ధతాం తే అనిష్టృతః ॥ 3 ॥

పదము

ఇహ । ఏవ । అగ్నే । అధి । ధారయ । రయిమ్ । మా । త్వా ।
ని । క్రన్ । పూర్వ౽చిత్తాః । ని౽కారిణః ।
క్షత్రేణ । అగ్నే । సు౽యమమ్ । అస్తు । తుభ్యమ్ ।
ఉప౽సత్తా వర్ధతామ్ । తే । అని౽స్తృతః ॥ 3 ॥

అనువాదం :

ఓ అగ్నీ! మాకే ధనాన్ని అధికంగా ప్రసాదించు.
మా కంటె ముందు నీయెడ మనసుంచి
మాకు అపకారం చేసే వారు నిన్ను
స్వాధీనం చేసుకొనకుందురు గాక!
ఓ అగ్నీ! నీకు బలంతో సహాస్వరూపం సుస్థిత మగుగాక!

నీకు ఉపసదనశీలుడైన (పరిచారకుడైన)
ఈ యజమానుడు కామితార్థ సిద్ధినందుగాక!
ఎవరిచేతను తిరస్కృత ప్రభావుడు కాకుండుగాక! ॥ 3 ॥

మంత్రము.

అన్వగ్నిరుషసామగ్రమఖ్యదన్వహాని ప్రథమో జాతవేదాః।
అను సూర్య ఉషసో అను రశ్మీనను
ద్యావాపృథివీ ఆ వివేశ ॥ 4 ॥

పదము:

అను। అగ్నిః। ఉషసామ్। అగ్రమ్। అఖ్యత్।
అను। అహాని। ప్రథమః। జాతఽవేదాః।
అను। సూర్యః। ఉషసః। అను। రశ్మీన్।
అను। ద్యావాపృథివీఇతి। ఆ। వివేశ ॥ 4 ॥

అనువాదం.

మొదట ఉషో ముఖంలో అగ్ని ప్రకాశిస్తున్నాడు.
పగలు కూడా అలాగే ప్రకాశిస్తున్నాడు.
ప్రథముడు (ముఖ్యుడు), జాతవేదుడునై ప్రకాశిస్తాడు.
సూర్యాత్మకుడై అగ్ని ఉషస్సులతో ప్రకాశిస్తాడు.
వ్యాపనశీలములైన కిరణములతో ప్రకాశిస్తాడు
ఈ విధంగా సర్వత్ర ద్యావాపృథ్వులలో
ఆవిష్టుడై ప్రకాశిస్తాడు ॥ 4 ॥

మంత్రము

ప్రత్యగ్నిరుషసా మగ్ర మఖ్యత్

ప్రత్యహాని ప్రథమో జాతవేదాః ।

ప్రతి సూర్యస్య పురుధా చ రశ్మీన్

ప్రతి ద్యావాపృథివీ ఆ తతాన ॥ 5 ॥

పదము

ప్రతి । అగ్నిః । ఉషసామ్ । అగ్రమ్ । అఖ్యత్ ।

ప్రతి । అహాని । ప్రథమః । జాతఽవేదాః ।

ప్రతి । సూర్యస్య । పురుఽధా । చ । రశ్మీన్ ।

ప్రతి । ద్యావాపృథివీ ఇతి । ఆ । తతాన ॥ 5 ॥

అనువాదం :

మొదటి ఉషోముఖంలో అగ్ని ప్రకాశిస్తున్నాడు.
పగలు కూడా అలాగే ప్రకాశిస్తున్నాడు
ప్రథముడు, జాతవేదుడునై ప్రకాశిస్తున్నాడు.
బహుధా ప్రవృత్తములైన సూర్యరశ్ములతో ప్రకాశిస్తున్నాడు.
ఈ విధంగా ద్యావాపృథ్వులలో సర్వత్రా వ్యాపిస్తున్నాడు.
॥ 5 ॥

మంత్రము ।

ఘృతం తే అగ్నే దివ్యే సధస్థే

ఘృతేన త్వాం మనురద్యా సమిన్ధే ।

ఘృతం తే దేవీ ర్నప్త్య1ఆ వహన్తు
ఘృతం తుభ్యం దుహ్రతాం గావో అగ్నే ॥ 6 ॥

పదము.

ఘృతమ్ । తే । అగ్నే । దివ్యే । సధఽస్థే ।
ఘృతేన । త్వామ్ । మనుః । అద్య । సమ్ । ఇన్ధే ।
ఘృతమ్ । తే । దేవీః । నప్త్యఽః । ఆ । వహన్తు ।
ఘృతమ్ । తుభ్యమ్ । దుహ్రతామ్ । గావః । అగ్నే ॥ 6 ॥

అనువాదం।

ఓ అగ్నీ ! నీకు సంబంధించిన ఆజ్యం
దివ్యమైన సధస్థానంలో ఉన్నది.
ఇప్పుడు మనువు నిన్ను ఆజ్యంతో
సముద్దీపనం చేస్తున్నాడు.
ఓ అగ్నీ ! నీకు ద్యోతమానములు,
సంతానరూపములు అయిన జలాలు
ఘృతాన్ని అభిముఖంగా కొనిపోవుగాక !
ఓ అగ్నీ ! నీకై ధేనువులు ఘృతాన్ని సమర్పించుగాక ! ॥6॥

ఇది ఎనబై రెండవ సూక్తం

## సూక్తం – 83

ఋషి శునశ్శేపుడు ॥ దేవత, వరుణుడు ॥ ఛందస్సు 1 అనుష్టుప్ ॥ 2 పథ్యా పంక్తి; 3 త్రిష్టుప్. 4 బృహతీగర్భా త్రిష్టుప్ ॥ మంత్రములు. ॥ 4 ॥

వినియోగం — జలోదర చికిత్సలో నదుల సంగమస్థలంలో మండపాన్ని నిర్మించి ఈ నాలుగు మంత్రాలతో ఉష్ణోదకాన్ని అభిమంత్రించి

దోసిళ్ళతో ఆ మండపంలో వ్యాధితుని తడపాలి అట్లే ఈ నాలుగు ఋక్కులతో అభిమంత్రించిన చల్లని నీళ్ళతో ఆ మండపంలో వ్యాధితుని దోసిళ్ళతో తడపాలి. ధూమకేతు దర్శన లక్షణాద్భుత ప్రాయశ్చిత్తార్థం • వారుణ పశువుయొక్క హృదయాంగములను ఈ నాలుగు మంత్రాలతో హోమం చెయ్యాలి. పశుతంత్రంలో హృదయ శూలోద్వాసనానంతరం మొదటి మంత్రానికి జపంలో వినియోగం. అద్భుత మహాశాంతిలో మొదటి మంత్రంతో వరుణుని యజించాలి శవసంస్కారానంతరం ఉదక సమీపంలో బ్రహ్మ 'ఉదుత్తమమ్' అనే మంత్రాన్ని జపించాలి. అంత్యేష్ట్యాదులలో స్వస్త్యయనార్థం 'ప్రాస్మత్ పాశాన్' అనే మంత్రాన్ని జపించాలి,

మంత్రము.

అప్సు తే రాజన్ వరుణ గృహో హిరణ్యయో మిథః ।
తతో ధృతవ్రతో రాజా సర్వా ధామాని ముఞ్చతు ॥ 1 ॥

పదము.

అప్ఽసు । తే । రాజన్ । వరుణ । గృహః । హిరణ్యయః । మిథః
తతః । ధృతఽవ్రతః । రాజా । సర్వా । ధామాని । ముఞ్చతు॥1॥

అనువాదం:

ఓ రాజా! వరుణా! నీకు ఉదకమధ్యంలో
అనన్య సాధారణమైన, హిరణ్మయమైన
నివాస భూమి కలదు.
అందువలన ధృతవ్రతుడైన రాజు వరుణుడు
మా సర్వ స్థానములను పరిత్యజించుగాక! ॥ 1 ॥

మంత్రము.

ధామ్నోధామ్నో రాజన్నితో వరుణ ముఞ్చ నః

యదాపో అఘ్న్యా ఇతి వరుణేతి
యదూచిమ తతో వరుణ ముఞ్చ నః ॥ 2 ॥

పదము

ధామ్నఃఽధామ్నః । రాజన్ । ఇతః । వరుణ । ముఞ్చ । నః ।
యత్ । ఆపః । అఘ్న్యాః । ఇతి । వరుణ । ఇతి ।
యత్ । ఊచిమ । తతః । వరుణ । ముఞ్చ । నః ॥ 2 ॥

అనువాదం.

ఓ రాజా! వరుణా! సర్వరోగస్థానముల నుంచి
మమ్ములను విమోచనం చెందించు.
అంతేకాక సర్వపాపములనుంచి
మమ్ములను విడిపించు.
ఓ ఉదకములారా! మీరు మా
సత్యా సత్య విషయములలో సాక్షిభూతులు కండి.
మీ పై ప్రమాణం చేస్తున్నాను.
ఆ పాపం నుంచి మమ్ములను
విమోచనం చెందించు. ॥ 2 ॥

మంత్రము :

ఉదుత్తమం వరుణ పాశమస్మదవాధమం
వి మధ్యమం శ్రథాయ ।
అథా వయ మాదిత్య వ్రతే తవానాగసో అదితయే స్యామ
॥ 3 ॥

పదము

ఉత్ । ఉత్౽తమమ్ । వరుణ । పాశమ్ । అస్మత్ ।

అవ । అధమమ్ । వి । మధ్యమమ్ । శ్రథయ ।

అధ । వయమ్ । ఆదిత్య । వ్రతే । తవ ।

అనాగసః । అదితయే । స్యామ ॥ 3 ॥

అనువాదం :

ఓ వరుణా! ఊర్ధ్వకాయస్థితమైన
పాశమును ఖండించి వేయి.
అధః కాయస్థిత పాశమును అవకుంఠనం చేసి నశింపజెయ్యి.
మధ్య దేహస్థితమైన పాశమును పిడిపించు.
తర్వాత ఓ ఆదిత్యా! ఓ వరుణా!
నీ వ్రత కర్మలో యోగ్యతా సిద్ధికై మేము
సర్వపాశములనుండి విముక్తులమై అఖండితుల మగుదుముగాక
॥ 3 ॥

మంత్రము

ప్రాస్మత్ పాశాన్ వరుణ ముఞ్చ సర్వాన్

య ఉత్తమా అధమా వారుణా యే ।

దుష్వప్న్యం దురితం ని ష్వాస్మదథ

గచ్ఛేమ సుకృతస్య లోకమ్ ॥ 4 ॥

పదము :

ప్ర । అస్మత్ । పాశాన్ । వరుణ । ముఞ్చ । సర్వాన్ ।

మే । ఉత్ఽతమాః । అధమాః । వారుణాః । యే ।

దుఃఽస్వప్న్యమ్ । దుఃఽఇతమ్ । నిః । స్వ । అస్మత్ । అథ ।

గచ్ఛేమ । సుఽకృతస్య । లోకమ్ ॥ 4 ॥

**అనువాదం**

ఓ వరుణా! మా నుంచి సర్వపాశములను విడిపించు.
నీకు సంబంధించిన ఉత్తమాధమ పాశములను,
దుష్ట స్వప్నములవలన కలిగిన అరిష్టములను
మా నుంచి నిర్గమింప జెయ్యి.
ఆ తరువాత మేము పుణ్యలోకములను పొందుదుముగాక!
॥ 4 ॥

ఇది ఎనభై మూడవ సూక్తం

## సూక్తం - 84

ఋషి: భృగువు ॥ దేవతలు, అగ్ని: 2,3 ఇంద్రుడు ॥ ఛందస్సు: 1 జగతీ, 2,3 త్రిష్టుప్ ॥ మంత్రములు: ॥ 3 ॥

వినియోగం.- మొదటి మంత్రానికి అగ్న్యుపస్థానంలో వినియోగం. ఇంద్ర మహాఖ్యమనే ఉత్సవంలో రెండవ మంత్రంతో హవిస్సును హోమం చెయ్యాలి అగ్ని చయనంలో పురీషాచ్ఛన్నమైన చితిని మూడవ మంత్రంతో బ్రహ్మ అనుమంత్రించాలి.

మంత్రము.

అనాధృష్యో జాతవేదా అమర్త్యో

విరాడగ్నే క్షత్రభృద్ దీదిహీహ ।

విశ్వా అమీవాః ప్రముఞ్చన్ మానుషీభిః

శివాభి రద్య పరి పాహి నో గయమ్ ॥ 1 ॥

పదము

అనాధృష్యః । జాతఽవేదాః । అమర్త్యః ।

విఽరాట్ । అగ్నే । క్షత్రఽభృత్ । దీదిహి । ఇహ ।

విశ్వాః । అమీవాః । ప్రఽముఞ్చన్ । మానుషీభిః ।

శివాభిః । అద్య । పరి । పాహి । నః । గయమ్ ॥ 1 ॥

అనువాదం.

ఓ అగ్నీ ! నీవు ఏమాత్రం జయింప సాధ్యం కాని వాడవు.
జాతవేదుడవు అమరుడవు.
వివిధరూపాలతో ప్రకాశించువాడవు. బలభర్తవు.
ఇలాంటి నీవు ఈ కర్మలో దీప్తిమంతుడవు కా.
సర్వ రోగములను నశింపజేస్తూ (విడిపిస్తూ)
మనుష్యులకు హితమును కల్పించే
కల్యాణకారిణులైన కాంతులతో మా గృహమును పరిరక్షించు. ॥ 1 ॥

మంత్రము ॥

ఇన్ద్ర క్షత్రమభి వామమోజోఽజాయథా వృషభ చర్షణీనామ్।

అపానుదో జనమమిత్రాయన్తమురుం

దేవేభ్యో అకృణోరు లోకమ్ ॥ 2 ॥

పదము

ఇన్ద్ర । క్షత్రమ్ । అభి । వామమ్ । ఓజః । అజాయథాః ।

వృషభ । చర్షణీనామ్ ।

అప । అనుదః । జనమ్ । అమిత్రఽయన్తమ్ । ఉరుమ్ ।
దేవేభ్యః । అకృణోః । ఓంఇతి । లోకమ్ ॥ 2 ॥

**అనువాదం :**

ఓ ఇంద్రా! క్షతినుంచి రక్షించునది, వననీయమైనది
అయిన తేజస్సును అభిలక్షించి ఉత్పన్నుడవైనావు.
ఓ కామిత ఫలదాయకా! మనుష్యులమైన మాకు
శత్రువువలె ప్రవర్తిస్తున్న జనుని అపనోదనం చెయ్యి.
దేవతలకై విశాలమైన స్వర్గమనే లోకాన్ని
సుఖనివాసానికై ఏర్పరచు. ॥ 2 ॥

**మంత్రము :**

మృగో న భీమః కుచరో గిరిష్ఠాః
పరావత ఆ జగమ్యాత్ పరస్యాః ।
సృకం సంశాయ పవిమిన్ద్ర తిగ్మం
వి శత్రూన్తాఢి వి మృధో నుదస్వ ॥ 3 ॥

**పదము .**

మృగః । న । భీమః । కుచరః । గిరిఽస్థాః ।
పరాఽవతః । ఆ । జగమ్యాత్ । పరస్యాః ।
సృకమ్ । సమ్ఽశాయ । పవిమ్ । ఇన్ద్ర । తిగ్మమ్ ।
వి । శత్రూన్ । తాఢి । వి । మృధః । నుదస్వ ॥ 3 ॥

అనువాదం :

కుత్సిత చరణుడు, పర్వత నివాసి,
సింహమువలె భయంకరుడు నైన ఇంద్రుడు
సుదూరములోని ద్యులోకము నుండి వచ్చుగాక!
వచ్చి; సరణశీలము, తీక్ష్ణమునైన వజ్రాయుధాన్ని
మరింత పదును బెట్టి, ఓ ఇంద్రా! దానితో
మా శత్రువులను పరిమార్చు.
సంగ్రామోద్యుక్తులైన ఇతర శత్రువులను కూడా తిరస్కరించు
॥ 3 ॥

ఇది ఎనబై నాల్గవ సూక్తం

## సూక్తం-85

ఋషి : అథర్వుడు ॥ (స్వస్త్యయన కాముడు) ॥ దేవత తార్క్ష్యుడు ॥ ఛందస్సు ॥
త్రిష్టుప్ ॥ మంత్రములు : ॥ 2 ॥

వినియోగం – స్వస్త్యయనార్థం దీనితో ఇంద్రుని యజనం చేయాలి లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి. స్వస్త్యయన గణంలో దీనిని పఠించుట వలన ఉపాకర్మలో, ఆజ్యహోమంలో దీనికి వినియోగం, అంత్యేష్ట్యాదులలో స్వస్త్యయనార్థం దీనిని జపించాలి.

మంత్రము :

త్యమూ షు వాజినం దేవజూతం
సహోవానం తరుతారం రథానామ్ ।
అరిష్టనేమిం పృతనాజిమాశుం
స్వస్తయే తార్క్ష్యమిహా హువేమ ॥ 1 ॥

పదము :

త్యమ్ । ఊంఇతి । సు । వాజినమ్ । దేవఽజూతమ్ ।

సహఃఽవానమ్ । తరుతారమ్ । రథానామ్ ।

అరిష్టఽనేమిమ్ । పృతనాఽజిమ్ । ఆశుమ్ ।

స్వస్తయే । తార్క్ష్యమ్ । ఇహ । ఆ । హువేమ ॥ 1 ॥

అనువాదం :

ప్రసిద్ధుడైన సుపర్ణుని క్షేమార్థమై ఆహ్వానిస్తున్నాము.
బలవంతుడు, దేవతలచేత ప్రేరితుడు,
సహస్వంతుడు ( అభిభవన శక్తిమంతుడు ),
కనుకనే ఇతరుల సంగ్రామంలో అరిష్టనేమి,
శత్రుసేనల విజేత, శీఘ్రగామి, రక్షకుడు
అయిన ఇంద్రుని ఆహ్వానిస్తున్నాను. ॥ 1 ॥

ఇది ఎనబై ఐదవ సూక్తం

## సూక్తం - 86

ఋషి అథర్వుడు ॥ ( స్వస్త్యయన కాముడు ) దేవత : ఇంద్రుడు ॥ ఛందస్సు : త్రిష్టుప్ ॥ మంత్రము : ॥ 1 ॥

వినియోగం :- స్వస్త్యయనార్థం దీనితో ఇంద్రుని యజించాలి లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి. దీనిని స్వస్త్యయన గణంలో పఠించుట వలన ఉపాకర్మలో ఆజ్యహోమంలో దీనికివి నియోగం. అంత్యేష్ట్యాదులలో స్వస్త్యయనార్థం దీనిని జపించాలి. ఇంద్రమహాఖ్యమనే ఉత్సవంలో దీనితోఆజ్యాన్ని హోమం చెయ్యాలి.

మంత్రము :

త్రాతారమిన్ద్రమవితారమిన్ద్రం హవేహవే సుహవం శూర

మిన్ద్రమ్ ।

హువే ను శక్రం పురుహూతమిన్ద్రం
స్వస్తి న ఇన్ద్రో మఘవాన్ కృణోతు ॥ 1 ॥

పదము.

త్రాతారమ్ । ఇన్ద్రమ్ । అవితారమ్ । ఇన్ద్రమ్ । హవేఽహవే ।
సుఽహవమ్ । శూరమ్ । ఇన్ద్రమ్ ।
హువే । ను । శక్రమ్ । పురుఽహూతమ్ । ఇన్ద్రమ్ ।
స్వస్తి । నః । ఇన్ద్రః । మఘఽవాన్ । కృణోతు ॥ 1 ॥

అనువాదం॥

సర్వహావనములలో ఉత్తముడైన, శూరుడైన
ఇంద్రుని ఆహ్వానిస్తున్నాము.
అలాగే శక్రుని, పురుహూతుని, ఇంద్రుని
త్వరగా రావలసినదిగా ఆహ్వానిస్తున్నాను.
ధనవంతుడైన ఇంద్రుడు అవినాశమైన
ఉపకారాన్ని మాకు చేయుగాక! ॥ 1 ॥

ఇది ఎనబై ఆరవ సూక్తం

## సూక్తం–87

ఋషి. అథర్వుడు ॥ దేవత : రుద్రుడు ॥ ఛందస్సు. జగతీ ॥ మంత్రము ॥ ॥1॥

వినియోగం:– స్వస్త్యయనకాముడు దీనితో రుద్రులను యజించాలి, లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి. అంత్యేష్ట్యాదులలో స్వస్త్యయనార్థం దీనిని జపించాలి దర్శపూర్ణ మాసలలో దీనితో అగ్నీద్రుడు సమ్మార్జనాన్ని అగ్నిలో పడవేయాలి. అట్లే చాతుర్మాస్యములలో సాకమేధ

పర్వంలో త్రైయమ్బక కర్మలో దీనికి వినియోగం. అగ్నిష్టోమంలో కాలాదహనానంతరం దీనితో అగ్నికి నమస్కారం చెయ్యాలి.

**మంత్రము :**

యో అగ్నౌ రుద్రో యో అప్స్వ౧ న్తర్య
ఓషధీర్వీరుధ ఆవివేశ ।
య ఇమా విశ్వా భువనాని చాక్లృపే
తస్మై రుద్రాయ నమో అస్త్వగ్నయే ॥ 1 ॥

**పదము :**

యః । అగ్నౌ । రుద్రః । యః । అప్ఽసు । అన్తః ।
యః । ఓషధీః । వీరుధః । ఆఽవివేశ ।
యః । ఇమా । విశ్వా । భువనాని । చాక్లృపే ।
తస్మై । రుద్రాయ । నమః । అస్తు । అగ్నయే ॥ 1 ॥

**అనువాదం:**

అగ్ని అంతంలో యష్టవ్యుడైన రుద్రుని,
ఉదకములలో వరుణాత్మకుడై ప్రవేశించిన వానిని,
మొలకలలో, ఓషధులలో సోమాత్మకుడై ఆవేశించిన వానిని,
ఇంతెందుకు – ఏ రుద్రుడైతే ఈ కనిపించే
సర్వభువనములను భరిస్తున్నాడో,
ఆ రుద్రునకు, అగ్నికి నమస్కరిస్తున్నాను. ॥ 1 ॥

ఇది ఎనబై ఏడవ సూక్తం.

# సూక్తం-88

ఋషిః గరుత్మంతుడు ॥ దేవత . సర్వవిషాపాకరణమ్ ॥ ఛందస్సుః బృహతీ ॥
మంత్రము . ॥ 1 ॥

వినియోగం :- సర్వవిషభైషజ్యార్థం దీనితో తృణములను ప్రజ్వలింపజేసి సర్పాభిముఖంగా పడవేయాలి, లేదా పాము కరచినచోట పడవేయాలి.

మంత్రము॥

అపేహ్యరిరస్యరిర్వా అసి ।

విషే విషమపృక్థా విషమిద్ వా అపృక్థాః ।

అహిమేవాభ్యపేహి తం జహి ॥ 1 ॥

పదము :

అప । ఇహి । అరిః । అసి । అరిః । వై । అసి ।

విషే । విషమ్ । అపృక్థాః । విషమ్ । ఇత్ । వై । అపృక్థాః ।

అహిమ్ । ఏవ । అభిఽఅపేహి । తమ్ । జహి ॥ 1 ॥

అనువాదం .

ఓ విషమా ! తొలగిపో.
సర్పదష్టుడైన వానికి విరోధివి.
అంతేకాక నీవు సర్పాలకు శత్రువవు.
కాబట్టి విషవంతమైన సర్పమునందు సంయోగించు.
విషాన్నే సంయోగించు.
నీ వెవరివల్ల వచ్చిన దానవో,
ఆ సర్పం వద్దకే వెళ్ళి దానిని నశింపజెయ్యి. ॥ 1 ॥

ఇది ఎనబై ఎనిమిదవ సూక్తం

# సూక్తం - 89

ఋషిః సింధుద్వీపుడు॥ దేవత అగ్ని॥ ఛందస్సు. 1-3 అనుష్టుప్॥ 4 త్రిపదా నిచృత్పరోష్ణిక్॥ మంత్రములు: ॥ 4 ॥

వినియోగం:- పరిమోక్ష విధియందు ఈ నాలుగు మంత్రాలతో శాంత్యుదకాన్ని అభిమంత్రించాలి. వేదవ్రతాదులలో మొదటిరెండు మంత్రాలతోను, నాల్గవ మంత్రంతోను మూడు సమిధలను ఆధానం చెయ్యాలి, ఆచార్యుడు మరణించినప్పుడు, అతని సంస్కారానంతరం ఈ మంత్రాలతో బ్రహ్మచారి స్నానం చెయ్యాలి. దర్శపూర్ణమాసలలో ఇడాభాగ ప్రాశనానంతరం మొదటి మూడు మంత్రాలతో ప్రస్తరంలో మార్జనం చెయ్యాలి. అట్లే అగ్నిష్టోమంలో అవభృథస్నానానంతరం మొదటి మంత్రంతో ఆహవనీయాగ్నిని ఉపతిష్ఠానం చెయ్యాలి. అగ్ని కార్యంలో బ్రహ్మచారి మూడవ మంత్రంతో చేతులు కడుగుకోవాలి. చాతుర్మాస్యంలో వరుణ ప్రఘాస పర్వంలో దీనితో మార్జనం చేయాలి. దర్శపూర్ణమాసలలో దక్షిణాప్రతి గ్రహానంతరం నాల్గవ మంత్రంతో అగ్నీధ్రుడు సమిధను ఆధానం చెయ్యాలి స్మార్త దర్శపూర్ణమాసలలో సంస్రావహోమానంతరం దీనితో సమిదాధానం చెయ్యాలి. దీనితో ముఖంకడుగుకొనాలి. అగ్ని కార్యంలో బ్రహ్మచారి దీనితో చేతిని అగ్నియందు వేడిచేసుకొని అవిరిని సేవించాలి.

మంత్రము

అపో దివ్యా అచాయిషం రసేన సమపృక్ష్మహి ।

పయస్వానగ్న ఆగమం తం మా సం సృజ వర్చసా ॥1॥

పదము:

అపః । దివ్యాః । అచాయిషమ్ । రసేన । సమ్ । అపృక్ష్మహి ।

పయస్వాన్ । అగ్నే । ఆ । అగమమ్ । తమ్ । మా । సమ్ ।

సృజ । వర్చసా ॥ 1 ॥

అనువాదం.

దివ్యములైన ఉదకములను పూజిస్తున్నాను.
వానిని రసముతో సంగతం చేస్తున్నాను.
ఓ అగ్నీ! నేను అన్నవంతుడవైన నిన్ను చేరినాను.
అలాంటి నన్ను వర్చస్సుతో సంయోగింప జెయ్యి. ॥ 1 ॥

మంత్రము।

సం మాగ్నే వర్చసా సృజ సం ప్రజయా సమాయుషా ।
విద్యుర్మే అస్య దేవా ఇన్ద్రో విద్యాత్ సహ ఋషిభిః ॥2॥

పదము

సమ్ । మా । అగ్నే । వర్చసా । సృజ । సమ్ । ప్రఽజయా ।
సమ్ । ఆయుషా ।
విద్యుః । మే । అస్య । దేవాః । ఇన్ద్రః । విద్యాత్ । సహ ।
ఋషిఽభిః ॥ 2 ॥

అనువాదం:

ఓ అగ్నీ! నన్ను తేజోవంతునిగా చెయ్యి.
సంతాన వంతుని చెయ్యి. ఆయుష్మంతుని చెయ్యి.
ఇలాంటి నన్ను దేవత లెరుగుదురు.
అలాగే అతీంద్రియ దృష్టిగల మునులతో పాటు
నన్ను పవిత్రునిగా భావింతురు గాక! ॥ 2 ॥

మంత్రము.

ఇదమాపః ప్ర వహతావద్యం చ మలం చ యత్ ।
యచ్చాభిదుద్రోహానృతం యచ్చ శేపే అభీరుణమ్ ॥ ? ॥

పదము :

ఇదమ్ । ఆపః । ప్ర । వహత । అవద్యమ్ । చ । మలమ్ । చ । యత్ ।
యత్ । చ । అభిఽదుద్రోహ । అనృతమ్ । యత్ । చ । శేపే । అభీరుణమ్ ॥ 3 ॥

అనువాదం .

ఓ ఉదకములారా! పాపాన్ని క్షాళనం చెయ్యండి
నిందారూపమైన ఈ దురితాన్ని,
అసత్యమైన పాపాన్ని,
నేనే ద్రోహమైతే చేసినానో,
దాని వలన జనించిన పాపాన్ని తొలగించండి. ॥ 3 ॥

మంత్రము

ఏధోఽస్యేధిషీయ సమిదసి సమేధిషీయ ।
తేజోఽసి తేజో మయి ధేహి ॥ 4 ॥

పదము ,

ఏధః । అసి । ఏధిషీయ । సమ్ఽఇత్ । అసి । సమ్ । ఏధిషీయ ।
తేజః । అసి । తేజః । మయి । ధేహి ॥ 4 ॥

అనువాదం :

ఓ అగ్ని! నీవు దీప్తిమంతుడవు.
హవిస్సుతో నిన్ను మరింత సమృద్ధుని చేస్తున్నాను.
ఓ అగ్ని! సమిత్సంబంధమైన

సందీపన శక్తి రూపుడవు.
కాబట్టి నీవు ఫలములతో సంపూర్ణుడవు కమ్ము.
ఓ అగ్నీ! నీవు తేజో రూపుడవు.
ఆ తేజస్సును నాలో సంక్రమింప జెయ్యి. ॥ 4 ॥

ఇది ఎనభై తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 90

ఋషి: అంగిరసుడు॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్నవారు॥ ఛందస్సు:
1 గాయత్రీ, 2 విరాట్ పురస్తాద్బృహతీ, 3 షట్పదా భురిగ్జగతీ॥
మంత్రములు: ॥ 3 ॥

వినియోగం:- జారోచ్చాటనార్థం ఈ మూడు మంత్రాలను జారుని చూచి చెప్పాలి
అల్లే దీనితో రాతిని అభిమంత్రించి జారసంగమ స్థానంలో ప్రక్షే
పించాలి. (పూడ్చి పెట్టాలి.)

మంత్రము.

అపి వృశ్చ పురాణవద్ వ్రతతేరివ గుష్పితమ్ ।
ఓజో దాసస్య దమ్భయ ॥ 1 ॥

పదము.

అపి । వృశ్చ । పురాణఽవత్ । వ్రతతేఃఽఇవ । గుష్పితమ్ ।
ఓజః । దాసస్య । దమ్భయ ॥ 1 ॥

అనువాదం:

ఓ అగ్నీ! నీవు పురాణముల నెరిగినవాడవు.
అలాగే క్రొత్త శత్రువులను ఛేదించు.
లతా కుంజము నుండి ఏ విధంగా

శాఖా సమూహాన్ని ఛేదిస్తారో
అలాగే పగవాని ఓజస్సును నశింపజెయ్యి. ॥ 1 ॥

మంత్రము.

వయం తదస్య సమ్భృతం వస్విన్ద్రేణ వి భజామహై ।
మ్లాపయామి భ్రజః శిభ్రం వరుణస్య వ్రతేన తే ॥ 2 ॥

పదము :

వయమ్ । తత్ । అస్య । సమ్ఽభృతమ్ । వసు । ఇన్ద్రేణ । వి । భజామహై ।
మ్లాపయామి । భ్రజః । శిభ్రమ్ । వరుణస్య । వ్రతేన । తే ॥ 2 ॥

అనువాదం

మా ముందున్న శత్రువు కొని వచ్చిన
ఆ ధనాన్ని సహాయభూతుడైన ఇంద్రునితో
మేము అపగతం చేస్తున్నాము
ఓ జారా! నీ శ్వేతవర్ణమైన దీప్తిని,
వీర్యమును వరుణవ్రతంతో
క్షీణింప జేస్తున్నాను. ॥ 2 ॥

మంత్రము.

యథా శేపో అపాయాతై స్త్రీషు చాసదనావయాః ।
అవస్థస్య క్నదీవతః శాఙ్కురస్య నితోదినః
యదాతతమవ తత్తను యదుత్తతం ని తత్తను ॥ 3 ॥

పదము :

యథా । శేపః । అప౽అయాతై । స్త్రిషు । చ । అసత్ । అనావయాః ।
అవస్థస్య । క్నదిఽవతః । శాఙ్కురస్య । నిఽతోదినః ।
యత్ । ఆఽతతమ్ । అవ । తత్ । తను । యత్ । ఉత్ఽతతమ్ ।
ని । తత్ । తను ॥ 3 ॥

అనువాదం.

జారుని శేపము అపావృత మగునట్లు;
భోగ్యస్త్రీలను చేరకుండునట్లు,
స్త్రీ సంసర్గం కాకుండు గాక!
స్త్రీ సమీపంలో ఉన్న, అధఃప్రదేశంలో నున్న అతని,
సంభోగార్థమై పిలుస్తున్నవాని,
అతి సంభోగంతో స్త్రీని వ్యథపెడుతున్న
వాని శేపమును, దీర్ఘమైన దానిని సంకుచితం చెయ్యి.
ఊర్ధ్వవిస్తృతమైన దానిని అధఃకరించు. ॥ 3 ॥

ఇది ఎనిమిదవ అనువాకం

ఇది తొంభైయవ సూక్తం

# అనువాకం: 9

## సూక్తం - 91

ఋషిః అథర్వుడు॥ దేవత - చంద్రుడు (ఇంద్రుడు)॥ ఛందస్సుః త్రిష్టుప్॥
మంత్రము : ॥ 1 ॥

వినియోగం - గ్రామకాముడు దీనితో ఇంద్రుని యజించాలి, లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి. అదే కర్మలో ఉదుంబర, పలాశ, కర్కన్ధు (మేడి, మోదుగు, అడవిరేగు) సమిదాధాన, సతోపస్తరణ హోమాదు

అను దీనితో చెయాలి. ఇంద్రమహాఖ్యమనే ఉత్సవంలో దీనితో ఆజ్యాన్ని హోమం చెయ్యాలి.

మంత్రము.

ఇన్ద్రః సుత్రామా స్వవాం అవోభిః
సుమృడీకో భవతు విశ్వవేదాః ।
బాధతాం ద్వేషో అభయం నః కృణోతు
సువీర్యస్య పతయః స్యామ ॥ 1 ॥

పదము.

ఇన్ద్రః । సుఽత్రామా । స్వఽవాన్ । అవఃఽభిః ।
సుఽమృడీకః । భవతు । విశ్వఽవేదాః ।
బాధతామ్ । ద్వేషః । అభయమ్ । నః । కృణోతు ।
సుఽవీర్యస్య । పతయః । స్యామ ॥ 1 ॥

**అనువాదం.**

ఉత్తమ రక్షకుడు, ధనవంతుడు అయిన ఇంద్రుడు
రక్షణలతో ఉత్తమ సుఖవంతు డగుగాక !
విశ్వవేత్త అయిన అతడు ద్వేషులను బాధించు గాక !
మాకు అభయ మిచ్చుగాక !
మేము సువీర్యులమై యజమానుల మగుదుము గాక ! ॥ 1 ॥

ఇది తొంబై ఒకటవ సూక్తం

# సూక్తం - 92

ఋషి: అథర్వుడు॥ దేవత. చంద్రుడు (? ఇంద్రుడు)॥ ఛందస్సు త్రిష్టుప్॥
మంత్రము : ॥ 1 ॥

వినియోగం.- పూర్వ సూక్తం వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము

స సుత్రామా స్వవాం ఇన్ద్రో అస్మ-

దారాచ్చిద్ ద్వేషః సనుతర్యుయోతు ।

తస్య వయం సుమతౌ యజ్ఞియస్యాపి

భద్రే సౌమనసే స్యామ ॥ 1 ॥

పదము :

సః । సుఽత్రామా । స్వఽవాన్ । ఇన్ద్రః । అస్మత్ ।

ఆరాత్ । చిత్ । ద్వేషః । సనుతః । యుయోతు ।

తస్య । వయమ్ । సుఽమతౌ । యజ్ఞియస్య । అపి ।

భద్రే । సౌమనసే । స్యామ ॥ 1 ॥

అనువాదం ।

ఉత్తమ రక్షకుడు, ధనవంతుడు,
ప్రసిద్ధుడునైన ఆ ఇంద్రుడు
మా నుండి దూరం నుంచే ద్వేషులను వేర్పరచు గాక!
యజ్ఞార్హుడైన ఇంద్రుని యెడ సుమతులమైన మేము
కల్యాణకారియైన సౌమనస్యంతో ఉందుము గాక! ॥ 1 ॥

ఇది తొంబై రెండవ సూక్తం.

## సూక్తం - 93

ఋషులు : భృగువు, అంగిరసుడు ॥ దేవత : ఇంద్రుడు ॥ ఛందస్సు : గాయత్రి ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం :- పూర్వ సూక్తంలో వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము

ఇన్ద్రే॑ణ మ॒న్యునా॑ వ॒యమ॒భి ష్యా॑మ పృత॒న్యతః॑ ।
ఘ్నన్తో॑ వృ॒త్రాణ్య॑ప్ర॒తి ॥ 1 ॥

పదము :

ఇన్ద్రే॑ణ । మ॒న్యునా॑ । వ॒యమ్ । అ॒భి । స్యా॒మ॒ । పృ॒త॒న్యతః॑ ।
ఘ్నన్తః॑ । వృ॒త్రాణి॑ । అ॒ప్ర॒తి ॥ 1 ॥

అనువాదం :

ఇంద్రునితో, ఆయన క్రోధంతో మేము
సంగ్రామోత్సుకులైన మా పగతురను అభిభవింతుముగాక !
విరోధులను అప్రతిపక్షంగా ( ప్రతిపక్ష శూన్యంగా ),
నిశ్శేషంగా వధింతుము గాక ! ॥ 1 ॥

ఇది తొంబై మూడవ సూక్తం

## సూక్తం - 94

ఋషి : అథర్వుడు . దేవత : సోముడు ॥ ఛందస్సు : అనుష్టుప్ ॥ మంత్రము : ॥1॥

వినియోగం .- అగ్నిష్టోమంలో దీనితో సోమరాజమును అనుమంత్రించాలి, అగ్నిష్టోమంలో అగ్నిమారుత శస్త్రావసానంలో దించబడే ధ్రువ పాత్రలో ఉండే సోమాన్ని బ్రహ్మాదీనితో అనుమంత్రించాలి

మంత్రము

ధ్రువం ధ్రువేణ హవిషాఽవ సోమం నయామసి ।

యథా న ఇన్ద్రః కేవలీర్విశః సంమనసస్కరత్ ॥ 1 ॥

పదము

ధ్రువమ్ । ధ్రువేణ । హవిషా । అవ । సోమమ్ । నయామసి ।

యథా । నః । ఇన్ద్రః । కేవలీః । విశః । సమ్ऽమనసః । కరత్ ॥ 1 ॥

అనువాదం.

స్థిరమైన, పురోడాశాది యుక్తమైన,
ధ్రువగ్రహస్థమైన సోమాన్ని అవాఙ్ముఖం చేస్తున్నాము.
ఇంద్రుడు మాకు అసాధారణమైన ప్రజలను
సంగత మనస్కులను చేయుగాక! ॥ 1 ॥

ఇది తొంబై నాల్గవ సూక్తం

## సూక్తం-95

ఋషిః కపింజలుడు ॥ దేవతలు గృధ్రములు ॥ ఛందస్సు: 1 అనుష్టుప్, 2,3 భురిగనుష్టుప్ ॥ మంత్రములు ॥ 3 ॥

వినియోగం - అభిచార కర్మలో ఈ మూడు మంత్రాలతో ఆజ్యాన్ని హోమం చేయాలి అదేకర్మలో సూత్రోక్తరీత్యా ఈ మూడు మంత్రాలతో మండూక ముఖాన్ని అపనోదనం చెయ్యాలి.

మంత్రము:

ఉదస్య శ్యావౌ విథురౌ గృధ్రౌ ద్యామివ పేతతుః ।

ఉచ్ఛోచనప్రశోచనావస్యోచ్ఛోచనౌ హృదః ॥ 1 ॥

అథర్వ. 111 38

పదము :

ఉత్ । అస్య । శ్యావౌ । విథురౌ । గృధ్రౌ । ద్యామ్ఽఇవ ।
పేతతుః ।

ఉచ్ఛోచనఽప్రశోచనౌ । అస్య । ఉత్ఽశోచనౌ । హృదః ॥ 1 ॥

అనువాదం.

మండూక రూపంలో మేము శత్రువును భావిస్తున్నాము.
వానికి సంబంధించిన నిరంతర చలన శీలములైన,
శ్యామవర్ణములైన ఓష్ఠములతో వారు
ఎగిరి గంతులు వేయుదురు గాక!
ఉచ్ఛోచన ప్రశోచను లనే మృత్యుదూతలు
ఈ పురోవర్తియైన, మండూకరూపియైన
విద్వేషి హృదయాన్ని శోకింప జేయుదురు గాక! ॥ 1 ॥

మంత్రము :

అహమేనా వుదతిష్ఠపం గావౌ శ్రాన్తసదావివ ।
కుర్కురావివ కూజన్తా వుదవన్తౌ వృకావివ ॥ 2 ॥

పదము :

అహమ్ । ఏనౌ । ఉత్ । అతిష్ఠిపమ్ । గావౌ । శ్రాన్తసదౌఽఇవ ।
కుర్కురౌఽఇవ । కూజన్తౌ । ఉత్ఽఅవన్తౌ । వృకౌఽఇవ ॥ 2 ॥

అనువాదం :

పూర్వ మంత్రోక్తములైన శత్రువుల ఓష్ఠములను
ఉత్థాపనం చేస్తున్నాను.
శ్రమించి గోష్ఠంలో విశ్రమిస్తున్న గోవులను

ఉత్థాపనం చేసినట్లు చేస్తాను.
అరుస్తున్న కుక్కలను కొట్టి తరిమివేయునట్లుగా,
అరుస్తున్న తోడేళ్ళను, గోయూధ మధ్యం నుంచి
దూడల నెత్తుకొని పారిపోతున్నవానిని
తరిమి వేసినట్లు నేను పై మంత్రోక్తములైన
ఓషధములను ఉత్థాపనం చేస్తున్నాను ॥ 2 ॥

మంత్రము

ఆతోదినౌ నితోదినా వథో సంతోదినా వుత ।
అపి నహ్యామ్యస్య మేఢ్రం య ఇతః
స్త్రీ పుమాన్ జభార ॥ 3 ॥

పదము

ఆఽతోదినౌ । నిఽతోదినౌ । అథో ఇతి । సమ్ఽతోదినౌ । ఉత ।
అపి । నహ్యామి । అస్య । మేఢ్రమ్ । యః । ఇతః । స్త్రీ ।
పుమాన్ । జభార ॥ 3 ॥

అనువాదం,

సర్వతః వ్యథన శీలములైన
శత్రు సర్వావయవ సంక్లేశకారిణులనుగా
వానిని ఉత్థాపనం చేస్తున్నాను.
అలాగే అతికష్ట కారులైన వానిని ఉత్థాపనం చేస్తున్నాను.
తరువాత సంతాపకారులైన వానిని ఉద్గమింప జేస్తున్నాను.
శత్రు స్త్రీయో, పురుషుడో
ఈ ప్రదేశం నుంచి మన ధనాన్ని కొనిపోయిరో
వారి మర్మస్థానాన్ని పిసికి వేస్తున్నాను. ॥ 3 ॥

ఇది తొంభై ఐదవ సూక్తం

# సూక్తం-96

ఋషి కపింజలుడు॥ దేవత॥ వయస్సు॥ ఛందస్సు. అనుష్టుప్॥ మంత్రము॥
॥ 1 ॥

వినియోగం:- అభిచార కర్మలో దీనితో ఎఱ్ఱధాన్యపుబియ్యంతో క్షీరౌదనాన్ని చేసి అభిమంత్రించి ద్వేషికి ఇవ్వాలి.

మంత్రము:

అసదన్ గావః సదనేఽపప్తద్ వసతిం వయః।

ఆస్థానే పర్వతా అస్థుః స్థామ్ని వృక్కావతిష్ఠిపమ్ ॥ 1 ॥

పదము:

అసదన్ । గావః । సదనే । అపప్తత్ । వసతిమ్ । వయః ।

ఆఽస్థానే । పర్వతాః । అస్థుః । స్థామ్ని । వృక్కౌ । అతిష్ఠిపమ్
॥ 1 ॥

అనువాదం.

సదనంలో గోవులు గోష్ఠంలో ఉంది,
పక్షులు తమ గూటికి ఎగిరిపోయినట్లుగా
పర్వతములు స్వస్థానంలో ఉన్నవి
గవాదికములు ఆయాస్థానములలో సుఖంగా ఉన్నవి.
శత్రు గృహంలో తోడేళ్ళను జతగా నిలుపుతున్నాను.
(శత్రు గృహాన్ని తోడేళ్ళతో నింపుతున్నాను.) ॥ 1 ॥

ఇది తొంబై అరవ సూక్తం

# సూక్తం-97

ఋషి. అథర్వుడు॥ దేవతలు ఇంద్రుడు, అగ్ని॥ ఛందస్సు: 1-4 త్రిష్టుప్: 5 త్రిపదాఽఽర్షీ (?, త్రిపదాఽఽర్ఫీ) భురిగ్గాయత్రీ. 6 త్రిపదాప్రజా

పత్యాబృహతీ. 7 త్రిపదాసామ్నీ భురిగ్ జగతీ; 8 ఉపరిష్టాద్ బృహతీ॥ మంత్రములు; ॥ 8 ॥

వినియోగం - దర్శపూర్ణమాసలలో ఈ ఎనిమిది మంత్రాలతో సంస్థితహోమాలను చేయాలి. ఉపనయన కర్మలో బ్రహ్మచారికి, 'సమిన్ద్రనః' అనే ఋక్కుతో ఈ ఎనిమిది ఋక్కులతో అభిమంత్రితమైన ఉద పాత్రను చూపించాలి. అట్లే శ్రౌత దర్శపూర్ణ మాసలలో 'యాన్ అవహః' అను ఆరు మంత్రాలతో సంస్థితహోమాలను చేయాలి.

మంత్రము

యదద్య త్వా ప్రయతి యజ్ఞే అస్మిన్
హోతశ్చికిత్వన్నవృణీమహీహ ।
ధ్రువమయో ధ్రువముతా శవిష్ఠ
ప్రవిద్వాన్ యజ్ఞముప యాహి సోమమ్ ॥ 1 ॥

పదము

యత్ । అద్య । త్వా । ప్రఽయతి । యజ్ఞే । అస్మిన్ ।
హోతః । చికిత్వన్ । అవృణీమహి । ఇహ ।
ధ్రువమ్ । అయః । ధ్రువమ్ । ఉత । శవిష్ఠ ।
ప్రఽవిద్వాన్ । యజ్ఞమ్ । ఉప । యాహి । సోమమ్ ॥ 1 ॥

అనువాదం

ఓ హోతా! జ్ఞానవంతుడా! ఓ అగ్నీ!
నిన్నిప్పు డిట ప్రవర్తిల్లుతున్న ఈ యజ్ఞంలో
హోతగా చేస్తున్నందువల్ల సర్వదా యష్టవ్యుడవు కా!

మరిస్నీ వారిని శమింప జెయ్యి.
వేత్తవై సోమవంతమైన యజ్ఞాన్ని సమీపించు
వచ్చి మే మిచ్చే ఈ హవిస్సును కొనిపో ॥ 1 ॥

మంత్రము ।

స మిన్ద్ర నో మనసా నేష గోభిః
సం సూరిభి ర్హరివ స్త్సం స్వస్త్యా ।
సం బ్రహ్మణా దేవహితం యదస్తి
సం దేవానాం సుమతౌ యజ్ఞియానామ్ ॥ 2 ॥

పదము ;

సమ్ । ఇన్ద్ర । నః । మనసా । నేష । గోభిః ।
సమ్ । సూరిఽభిః । హరిఽవన్ । సమ్ । స్వస్త్యా ।
సమ్ । బ్రహ్మణా । దేవఽహితమ్ । యత్ । అస్తి ।
సమ్ । దేవానామ్ । సుఽమతౌ । యజ్ఞియానామ్ ॥ 2 ॥

అనువాదం.

ఓ ఇంద్రుడా! మమ్ములను స్థితి లక్షణములైన
మంత్రములతో సంయోగింప జెయ్యి
ఓ ఇంద్రుడా! విద్వాంసులతో స్వస్థులను చెయ్యి.
వేదార్థజ్ఞానియైన వానిగా చెయ్యి
దేవతల హితమునకై చేసే
అగ్నిహోత్రాది కర్మలతో అతనిని సంయోగింప జెయ్యి.
యజ్ఞార్హులైన దేవతలకు శోభన బుద్ధిని కల్పించు. ॥ 2 ॥

మంత్రము:

యానావహ ఉశతో దేవ దేవాం స్తాన్

ప్రేరయ స్వే అగ్నే సధస్థే ।

జక్షివాంసః పపివాంసో మధూ న్యస్మై

ధత్త వసవో వసూని ॥ 3 ॥

పదము

యాన్ । ఆऽఅవహః । ఉశతః । దేవ । దేవాన్ । తాన్ ।

ప్ర । ఈరయ । స్వే । అగ్నే । సధऽస్థే ।

జక్షిऽవాంసః । పపిऽవాంసః । మధూని । అస్మై ।

ధత్త । వసవః । వసూని ॥ 3 ॥

అనువాదం:

దీప్యమానుడవైన ఓ అగ్నీ! నీవు
హవిస్సు నాశించే ఏ దేవతలను ఆహ్వానించినావో,
వారిని స్వకీయమైన సదస్థానంలో ఉండునట్లు చెయ్యి.
ఆ దేవతలు పురోడాశాదులను భక్షించి,
మధుర రసోపేతములైన ఆజ్యాదులను పానం చేసి,
మా యజమానికి ధనాన్ని ప్రసాదింతురు గాక! ॥ 3 ॥

మంత్రము:

సుగా వో దేవాః సదనా అకర్మ

య ఆజగ్మ సవనే మా జుషాణాః ।

వహమానా భరమాణాః స్వా వసూని
వసుం ఘర్మం దివ మా రోహతాను ॥ 4 ॥

పదము.

సుఽగా । వః । దేవాః । సదనా । అకర్మ ।
యే । ఆఽజగ్మ । సవనే । మా । జుషాణాః ।
వహమానాః । భరమాణాః । స్వా । వసూని ।
వసుమ్ । ఘర్మమ్ । దివమ్ । ఆ । రోహత । అను ॥ 4 ॥

అనువాదం

ఓ దేవతలారా! మీ స్థానములను
సులభ గమ్యములుగా చేస్తున్నాము
హవిస్సులను సేవించి ప్రసన్నులైన మీరు
ఈ సవనములకు వచ్చినారు.
మీరు స్వకీయ ధనములను బహుధా ప్రసాదించి,
పోషించి మాకై సర్వలోక వాసయిత అయిన
ఆదిత్యుని ఆరోహింప జేయండి
ఆ తరువాత ద్యులోకానికి ఎగిరి పొండి. ॥ 4 ॥

మంత్రము :

యజ్ఞ యజ్ఞం గచ్ఛ యజ్ఞపతిం గచ్ఛ ।
స్వాం యోనిం గచ్ఛ స్వాహా ॥ 5 ॥

పదము :

యజ్ఞ । యజ్ఞమ్ । గచ్ఛ । యజ్ఞఽపతిమ్ । గచ్ఛ ।

స్వామ్ । యోనిమ్ । గచ్ఛ । స్వాహా ॥ 5 ॥

అనువాదం.

ఓ యజ్ఞమా! నీవు యష్టవ్యుడైన పరమాత్ముని చేరుకో.
యజ్ఞపతియైన యజమానునకు ఫలప్రదాతవు కా!
పిదప నీవు సర్వజగత్కారణభూత అయిన
పరాశక్తిని చేరుకో
నీకీ ఆజ్యం స్వాహుత మగుగాక! ॥ 5 ॥

మంత్రము.

ఏష తే యజ్ఞో యజ్ఞపతే సహసూక్తవాకః ।
సువీర్యః స్వాహా ॥ 6 ॥

పదము

ఏషః । తే । యజ్ఞః । యజ్ఞఽపతే । సహఽసూక్తవాకః ।
సుఽవీర్యః । స్వాహా ॥ 6 ॥

అనువాదం.

ఓ యజ్ఞపతీ! యష్టవ్య దేవతా సంకీర్తన పరమైన
ఈ యజ్ఞం శోభన పుత్రపౌత్రాది కర్మయుక్తమై
నీకు శ్రేయస్సును సమకూర్చు గాక!
నీకీ ఆజ్యం స్వాహుత మగుగాక! ॥ 6 ॥

మంత్రము.

వషడ్ఢుతేభ్యో వషడహుతేభ్యః ।
దేవా గాతువిదో గాతుం విత్త్వా గాతుమిత ॥ 7 ॥

పదము

వషట్ । హుతేభ్యః । వషట్ । అహుతేభ్యః ।

దేవాః । గాతుఽవిదః । గాతుమ్ । విత్త్వా । గాతుమ్ । ఇత ॥ 7 ॥

అనువాదం ।

ఇష్టదేవతలకు ఈ ఆజ్యం హుత మగుగాక!
ఆహూతులైన, ఇంతకుముందు ఆహుతి మే మివ్వని
దేవతలకు ఈ ఆజ్యం ఆహుతి యగుగాక!
ఓ మార్గవేదులైన దేవతలారా! మీరు
మార్గాన్ని పట్టుకొని మా యజ్ఞానికి రండి ॥ 7 ॥

మంత్రము.

మనస స్పత ఇమం నో దివి దేవేషు యజ్ఞమ్ ।

స్వాహా దివి స్వాహా పృథివ్యాం

స్వాహాఽన్తరిక్షే స్వాహా వాతే ధాం స్వాహా ॥ 8 ॥

పదము ।

మనసః । పతే । ఇమమ్ । నః । దివి । దేవేషు । యజ్ఞమ్ ।

స్వాహా । దివి । స్వాహా । పృథివ్యామ్ । స్వాహా ।

అన్తరిక్షే । స్వాహా । వాతే । ధామ్ । స్వాహా ॥ 8 ॥

అనువాదం.

మనసస్పతియైన ఓ దేవా!
మా ఈ యజ్ఞాన్ని దేవలోకంలో నున్న

అగ్న్యాదుల యందు స్వాహుత మగునట్లు చెయ్యి.
అట్లే ద్యులోకంలో నున్న వారికి,
పృథివిలో నున్న వారికి, అంతరిక్షంలో నున్నవారికి,
వాయువులో నున్న వారికి
స్వాహుత మగునట్లు సరస్వతీ వాక్యం. ॥ 8 ॥

ఇది తొంబై ఏడవ సూక్తం

## సూక్తం-98

ఋషి: అథర్వుడు ॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్నవారు॥ ఛందస్సు: విరాట్ ॥ మంత్రము. ॥ 1 ॥

వినియోగం.- దర్శపూర్ణమాసలలో ఆహవనీయమైన దర్భముష్టిని దీనితో బ్రహ్మ అనుమంత్రించాలి. స్మార్త దర్శపూర్ణమాసలలో దీనితో దర్భ ముష్టిని అగ్నిలో వేయాలి.

మంత్రము:

సం బర్హిరక్తం హవిషా ఘృతేన
సమిన్ద్రేణ వసునా సం మరుద్భిః ।
సం దేవైర్విశ్వదేవేభిరక్తమిన్ద్రం
గచ్ఛతు హవిః స్వాహా ॥ 1 ॥

పదము

సమ్ । బర్హిః । అక్తమ్ । హవిషా । ఘృతేన ।
సమ్ । ఇన్ద్రేణ । వసునా । సమ్ । మరుత్ఽభిః ।
సమ్ । దేవైః । విశ్వఽదేవేభిః । అక్తమ్ । ఇన్ద్రమ్ ।

గచ్ఛతు । హవిః । స్వాహా ॥ 1 ॥

అనువాదం.

బర్హిరూపమైన హవిస్సుతో, ఆజ్యంతో
అభ్యక్తమైనట్టి, ఇంద్ర సదృశ మైనట్టి,
వసువులతో, సమాక్త మైనట్టి
మరుత్తులతో కూడినట్టి ఈ హవిస్సు
విశ్వేదేవతలతో సమాక్త మగుగాక!
సర్వదేవాధిష్ఠితమైన బర్హి
ఇంద్రునకు చెందుగాక!
ఈ హవిస్సు స్వాహుత మగుగాక! ॥ 1 ॥

ఇది తొంభై ఎనిమిదవ సూక్తం

## సూక్తం-99

ఋషి. అథర్వుడు॥ దేవత : వేది॥ ఛందస్సు: భురిక్ త్రిష్టుప్॥ మంత్రము. ॥ 1 ॥

వినియోగం.- శ్రౌతదర్శ పూర్ణమాసలలో వేది చుట్టూ దర్భలను పరచే అధ్వ ర్యుని బ్రహ్మ దీనితో అనుమంత్రించాలి.

మంత్రము.

పరి స్తృణీహి పరి ధేహి వేదిం
మా జామిం మోషీరముయా శయానామ్ ।
హోతృషదనం హరితం హిరణ్యయం
నిష్కా ఏతే యజమానస్య లోకే ॥ 1 ॥

పదము

పరి । స్తృణీహి । పరి । ధేహి । వేదిమ్ ।

మా । జామిమ్ । మోషీః । అముయా । శయానామ్ ।

హోతృఽసదనమ్ । హరితమ్ । హిరణ్యయమ్ ।

నిష్కాః । ఏతే । యజమానస్య । లోకే ॥ 1 ॥

అనువాదం.

ఆస్తీర్యమాణమైన ఓ దర్భస్తంభమా!
వేదికను అచ్ఛాదించు. వేదికను పూర్తిగా అచ్ఛాదించు.
ఈ వేదికతో పాటు పడుకొని ఉన్న ప్రజను
పురుహూత అయిన దానిని హింసింపకు.
హోతృసదనం హరిద్వర్ణము, హిరణ్మయము,
అయిన ఓ దర్భ రూప వస్తువా!
ఈ వేదిక నలంకరించు.
ఈ ఆస్తీర్యమాణములైన దర్భలు యజమానునకు
పుణ్యభోగస్థానంలో సువర్ణమయ భూష లగుగాక! ॥ 1 ॥

ఇది తొంబై తొమ్మిదవ సూక్తం

## సూక్తం—100

ఋషి. యముడు ॥ దేవత : దుఃష్వప్ననాశనమ్ ॥ ఛందస్సు : అనుష్టుప్ ॥
మంత్రము : ॥ 1 ॥

వినియోగం :- దుఃస్వప్న దర్శన నిమిత్తదోష పరిహారార్థం ఈ ఋక్కును
జపిస్తూ ప్రదక్షిణం చేయాలి.

మంత్రము :

పర్యావర్తే దుష్వప్న్యాత్ పాపాత్ స్వప్న్యాదభూత్యాః ।

బ్రహ్మాహమన్తరం కృణ్వే పరా స్వప్నముఖాః శుచః ॥ 1 ॥

పదము,

పరి౨ఆవర్తే । దుః౨స్వప్న్యాత్ । పాపాత్ । స్వప్న్యాత్ ।
అభూత్యాః ।
బ్రహ్మ । అహమ్ । అన్తరమ్ । కృణ్వే । పరా । స్వప్న౨ముఖాః
శుచః ॥ 1 ॥

అనువాదం.

దుష్ట స్వప్న ప్రభావం వల్ల
ప్రతి నివృత్తుడ నవుతున్నాను.
ఆ దుష్టస్వప్నం నుండి కలిగిన
అమంగళకరములైనవి పర్యావర్తము లగుగాక!
నేను మంత్రాన్ని దుస్స్వప్న నివారకమైన
దానినిగా చేస్తున్నాను.
స్వప్నముఖములైన శోకములు పరావృతము లగుగాక! ॥ 1 ॥

ఇది నూఅవ సూక్తం.

## సూక్తం-101

ఋషిః యముడు ॥ దేవత దుఃష్వప్ననాశనమ్ ॥ ఛందస్సు· అనుష్టుప్ ॥
మంత్రము : ॥ 1 ॥

వినియోగం :- స్వప్నంలో అన్నభిక్షణ నిమిత్త దోషపరిహారార్థం ఈ ఋక్కును జపించాలి.

మంత్రము

యత్ స్వప్నే అన్నమశ్నామి న ప్రాతరధిగమ్యతే ।

సర్వం తదస్తు మే శివం నహి తద్ దృశ్యతే దివా ॥ 1 ॥

పదము

యత్ । స్వప్నే । అన్నమ్ । అశ్నామి । న । ప్రాతః । అధి ఽగమ్యతే ।

సర్వమ్ । తత్ । అస్తు । మే । శివమ్ । నహి । తత్ । దృశ్యతే । దివా ॥ 1 ॥

అనువాదం

నేను ఏ అన్నాన్ని స్వప్నంలో తింటున్నానో,
ఆ అన్నం ఉదయం కనుపించదు.
ఆ అన్నం పగలు కనుపించదు
స్వప్నంలో అన్నభోజనం సర్వమూ
నాకు మంగళకారి అగుగాక! ॥ 1 ॥

ఇది నూట ఒకటవ సూక్తం

## సూక్తం-102

ఋషి: ప్రజాపతి॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్న ద్యావా పృథివ్యాదులు॥ ఛందస్సు: విరాట్ పురస్తాద్ బృహతీ॥ మంత్రము: ॥ 1 ॥

వినియోగం - స్వస్త్యయనార్థం మాన్త్రివర్ణికి దేవతలకు నమస్కారం కానీ, ఉపస్థానం కానీ దీనితో చెయ్యాలి.

మంత్రము,

నమస్కృత్య ద్యావాపృథివీభ్యా మన్తరిక్షాయ మృత్యవే ।
మేక్షా మ్యూర్ధ్వస్తిష్ఠన్ మా మా హింసిషు రీశ్వరాః ॥ 1 ॥

పదము :

నమః ఽ కృత్య । ద్యావాపృథివీభ్యామ్ । అన్తరిక్షాయ । మృత్యవే।
మేక్షామి । ఊర్ధ్వః । తిష్ఠన్ । మా । మా । హింసిషుః । ఈశ్వరాః
॥ 1 ॥

అనువాదం.

ద్యావా పృథ్వులకు నమస్కరించి,
ఆసీనుడనై, ఊర్ధ్వముఖుడనై
ఊర్ధ్వలోకాలకు వెళ్ళను.
ప్రభువులు, ద్యావాపృథువులు,
అంతరిక్షదేవతలు, అగ్ని, వాయు, సూర్యులు,
మృత్యువు నన్ను హింసింప కుందురుగాక! ॥ 1 ॥

ఇది నూట రెండవ సూక్తం

ఇది తొమ్మిదవ అనువాకం

# అనువాకం: 10

## సూక్తం-103

ఋషి బ్రహ్మ॥ దేవత. ఆత్మ : ఛందస్సు · 1 త్రిష్టుప్॥ మంత్రము : ॥ 1 ॥
వినియోగం,- సర్వఫలకాముడు దీనితో ప్రజాపతిని యజించాలి, లేదా ఉపతిష్ఠానం చేయాలి.

మంత్రము.

కో అస్యా నో ద్రుహోఽవద్యవత్యా
ఉన్నేష్యతి క్షత్రియో వస్య ఇచ్ఛన్ ।
కో యజ్ఞకామః క ఉ పూర్తికామః

కో దేవేషు వనుతే దీర్ఘమాయుః ॥ 1 ॥

పదము .

కః । అస్యాః । నః । ద్రుహః ః అవద్య౨వత్యాః ।

ఉత్ । నేష్యతి । క్షత్రియః । వస్యః । ఇచ్ఛన్ ।

కః । యజ్ఞ౨కామః । కః । ఓంఇతి । పూర్తి౨కామః ।

కః । దేవేషు । వనుతే । దీర్ఘమ్ । ఆయుః ॥ 1 ॥

అనువాదం :

ప్రశస్త ఫలాన్ని మాకిచ్చుటకు
అభిలషిస్తున్న క్షత్రియాభిమాని
గర్హ్యమైన, అహితకారిణియైన
పిశాచి సమ్ముఖము నుండి
మమ్ములను ఉద్ధరిస్తున్నాడు.
ఏ యజ్ఞకాముడు మాకు
ధనాదులను ఇవ్వవలెనని అభిలషిస్తున్నాడో,
ఎవడు దేవతలలో చిరకాల భోగ్యమైన
ఆయుస్సును ప్రసాదిస్తున్నాడో,
ఆతడు నా యజ్ఞం పూర్తికావాలని
కూడా కోరుతున్నాడు. ॥ 1 ॥

ఇది నూట మూడవ సూక్తం

## సూక్తం–104

ఋషిః బ్రహ్మ ॥ దేవత . ఆత్మ ॥ ఛందస్సు . త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

వినియోగం :– సర్వఫలకాముడు దీనితో ప్రజాపతిని యజించాలి, లేదా ఉపతిష్ఠానం చెయ్యాలి ఉర్వరాఖ్యమనే సవయజ్ఞంలో దీనికి వినియోగం.

**మంత్రము ,**

కః పృశ్నిం ధేనుం వరుణేన దత్తా-

మథర్వణే సుదుఘాం నిత్యవత్సామ్ ।

బృహస్పతినా సఖ్యంఽ జుషాణో

యథావశం తన్వఽః కల్పయాతి ॥ 1 ॥

**పదము**

కః । పృశ్నిమ్ । ధేనుమ్ । వరుణేన । దత్తామ్ ।

అథర్వణే । సుఽదుఘామ్ । నిత్యఽవత్సామ్ ।

బృహస్పతినా । సఖ్యఽమ్ । జుషాణః ।

యథాఽవశమ్ । తన్వఽః । కల్పయాతి ॥ 1 ॥

**అనువాదం :**

లోహితాది వర్ణోపేతమైనది, బాగా పాలిచ్చునది,
ఎప్పుడూ దూడతో నుండునది,
అధర్వణునికి వరుణుడు అర్పించినది అయిన ధేనువును
ప్రకృత దేవతల పాలకుడైన దైవంతో
సేవ్యమానుడై ఉన్న దేవుడు
యథేచ్ఛగా 'తనువులను సమర్థములుగా కల్పిస్తున్నాడు. ॥1॥

ఇది నూట నాల్గవ సూక్తం

## సూక్తం - 105

**ఋషి: అథర్వుడు ॥ దేవతలు మంత్రములలో పేర్కొన్నవారు ॥ ఛందస్సు,**
**అనుష్టుప్ ॥ మంత్రము :** ॥ 1 ॥

**వినియోగం - ఉపనయనంలో సూర్యుని చూచిన తరువాత బ్రహ్మచారిని ఈ మంత్రంతో తూర్పు ముఖంగా కూర్చొన బెట్టాలి.**

**మంత్రము**

**అపక్రామన్ పౌరుషేయాద్ వృణానో దైవ్యం వచః ।**

**ప్రణీతీ రభ్యావర్తస్వ విశ్వేభిః సఖిభిః సహ ॥ 1 ॥**

**పదము.**

**అప౨క్రామన్ । పౌరుషేయాత్ । వృణానః । దైవ్యమ్ । వచః ।**

**ప్ర౨నీతిః । అభి౨ఆవర్తస్వ । విశ్వేభిః । సఖి౨భిః । సహ ॥ 1 ॥**

**అనువాదం**

ఓమాణవకుడా! నీవు పురుషులకు హితమైన
వర్తమానాన్ని అందిస్తున్నావు
అలౌకిక కర్మ నుండి తొలగి
దైవ సంబంధమైన వాక్యాన్ని పలుకుతూ
ఉత్కృష్టములైన బ్రహ్మచర్యాది
నియతులను గూర్చి వెళ్ళు
సర్వ సహచరులతో తిరిగిరా ॥ 1 ॥

ఇది నూట ఐదవ సూక్తం

## సూక్తం-106

**ఋషిః అథర్వుడు ॥ దేవతలు జాతవేదులు ! వరుణుడు ॥ ఛందస్సు . బృహతీ** గర్భా త్రిష్టుప్ ॥ మంత్రము ॥ 1 ॥

**వినియోగం :-** గ్రామ గృహాదులలో ఇతరులు చెప్పిన సందేశమును తిరిగి చెప్ప నందులకు ప్రాయశ్చిత్తార్థం దీనితో అగ్నిని ఉపతిష్ఠానం చేయాలి. దర్శపూర్ణమాసలలో కర్మవిస్మరణ ప్రాయశ్చిత్తార్థం దీనితో

హోమం చెయాలి. అగ్నిష్టోమంలో దీక్షానియమలోప ప్రాయశ్చిత్తార్థం దీనితో అగ్నిని ఉపతిష్ఠానం చెయ్యాలి.

మంత్రము.

యదస్మృతి చకృమ కిం చిదగ్న
ఉపారిమ చరణే జాతవేదః ।
తతః పాహి త్వం నః ప్రచేతః ।
శుభే సఖిభ్యో అమృతత్వమస్తు నః ॥ 1 ॥

పదము.

యత్ । అస్మృతి । చకృమ । కిమ్ । చిత్ । అగ్నే ।
ఉప౽ఆరిమ । చరణే । జాత౽వేదః ।
తతః । పాహి । త్వమ్ । నః । ప్ర౽చేతః ।
శుభే । సఖి౽భ్యః । అమృత౽త్వమ్ । అస్తు । నః ॥ 1 ॥

అనువాదం:

ఓ అగ్నీ! మేము స్మరణహీరతమైన కర్మను చేసినాము
ఓ జాతవేదా! మా అనుష్ఠానంలో కర్మ లోపించినది.
ప్రకృష్టజ్ఞాన వంతుడవైన ఓ అగ్నీ! నీవు
ఆ విస్మరణ నిబద్ధమైన పాపం నుండి
మమ్ములను రక్షించు.
సమాన ప్రియులమైన మాకు నీ అనుగ్రహంవల్ల
శోభిస్తున్న సాంగకర్మలో అవినాశిత్వం కలుగుగాక! ॥ 1 ॥

ఇది నూట ఆఱవ సూక్తం

## సూక్తం - 107

ఋషి, భృగువు॥ దేవత • సూర్యుడు, అపోదేవత॥ ఛందస్సు: అనుష్టుప్॥
మంత్రము: ॥ 1 ॥

వినియోగం:- కాసశ్లేష్మ చికిత్సలో అన్నాన్ని కానీ పేలపిండి గంజినికానీ ఈ మంత్రంతో అభిమంత్రించి భక్షించాలి. లేదా నీటిని అభిమంత్రించి ఆచమించాలి. లేదా సూర్యోపస్థానం చెయ్యాలి.

మంత్రము:

అవ దివస్తారయన్తి సప్త సూర్యస్య రశ్మయః।
అపః సముద్రియా ధారాస్తాస్తే శల్యమసిస్రసన్ ॥ 1 ॥

పదము.

అవ। దివః। తారయన్తి। సప్త। సూర్యస్య। రశ్మయః।
అపః। సముద్రియాః। ధారాః। తాః। తే। శల్యమ్।
అసిస్రసన్ ॥ 1 ॥

అనువాదం

సప్తసూర్యులలో ప్రధాన భూతుడైనట్టి,
కశ్యపసంజ్ఞుడైనట్టి సూర్యుడు
మహా మేరువు నందుంటున్నాడు.
మిగతా అంశభూతులైన, ఆరోగాది నామకులైన
ఇతరులు ప్రకాశమాను లవుతున్నారు.
కశ్యపనాముని నుంచే సప్తసంఖ్యాకులైన
వ్యాపకులైన సూర్యులు సముద్భవించినారు
సూర్యునకు సప్తసంఖ్యాకములైన కిరణములు గలవు.
అంతరిక్షభవములైన, ధారారూపములైన జలములను

ద్యులోకమునుంచి అవతరింప జేస్తున్నారు.
ఆ జలములు పీడాకారియైన
కాసశ్లేష్మాది రోగములను నశింప జేయుగాక! ॥ 1 ॥

ఇది నూట ఏడవ సూక్తం

## సూక్తం - 108

ఋషి: భృగువు॥ దేవత: అగ్ని॥ ఛందస్సు. 1 బృహతీగర్భా త్రిష్టుప్
2 త్రిష్టుప్॥ మంత్రములు ॥ 2 ॥

వినియోగం :- అభిచార కర్మలో ఈ రెండు మంత్రాలతో పిడుగుపడిన చెట్టు సమిధను ఆధానం చెయ్యాలి

మంత్రము

యో న స్తాయద్ దిప్సతి యో న ఆవిః
స్వో విద్వానరణో వా నో అగ్నే ।
ప్రతీచ్యేత్వరణీ దత్వతీ తాన్
మైషామగ్నే వాస్తు భూన్మో అపత్యమ్ ॥ 1 ॥

పదము

యః । నః । స్తాయత్ । దిప్సతి । యః । నః । ఆవిః ।
స్వః । విద్వాన్ । అరణః । వా । నః । అగ్నే ।
ప్రతీచీ । ఏతు । అరణీ । దత్వతీ । తాన్ ।
మా । ఏషామ్ । అగ్నే । వాస్తు । భూత్ । మోఇతి । అపత్యమ్॥1॥

అనువాదం .

ఓ అగ్నీ ! ఏ శత్రువైతే మమ్ములను అంతర్హితంగా
ఉండి హింసింప దలచు కుంటాడో,
ఏ శత్రువైతే మమ్ములను బాహాటంగా
హింసింప దలచుకుంటాడో, విద్వాంసుడై
స్వీయబంధువులైన మమ్ములను హింసింపదలచుకుంటాడో.
ఏ శత్రువు మమ్ములను వధింప దలచు కుంటాడో,
వారి నెల్లా ఆర్తికారిణి అయిన రాక్షసి,
ప్రతీచి పట్టుకొనుగాక !
ఓ అగ్నీ ! పూర్వోక్తులైన శత్రువులకు
స్థానం చిక్కకుండుగాక !
సంతానం లేకుండు గాక ! ॥ 1 ॥

మంత్రము :

యో నః సుప్తాన్ జాగ్రతో వాభిదాసాత్

తిష్ఠతో వా చరతో జాతవేదః ।

వైశ్వానరేణ సయుజా సజోషా స్తాన్

ప్రతీచో నిర్దహ జాతవేదః ॥ 2 ॥

పదము .

యః । నః । సుప్తాన్ । జాగ్రతః । వా । అభి౽దాసాత్ ।

తిష్ఠతః । వా । చరతః । జాత౽వేదః ।

వైశ్వానరేణ । స౽యుజా । స౽జోషాః । తాన్ ।

ప్రతీచః । నిః । దహ । జాత౽వేదః ॥ 2 ॥

**అనువాదం**

ఏ శత్రువైతే నిద్రిస్తున్న మమ్ములను
ఎదురు వచ్చి హింసించునో,
ఏ శత్రువు మేల్కొని ఉండగా
మమ్ములను హింసించునో,
ఓ అగ్నీ! జాతవేదా! సుఖంగా ఒకచోట కూర్చొన్న
మమ్ములను ఏ శత్రువు హింసింప దలచునో,
ఓ జాతవేదా! కార్యప్రవణులమైన మమ్ములను
ఏ శత్రువు హింసింప దలచునో, ఓ జాతవేదా!
నీవు వైశ్వానరునితో సహాయుక్తుడవై,
సమాన ప్రీతిమంతుడవై, మమ్ముల నెదుర్కొనుటకై
వస్తున్న ఆ శత్రువుల నెల్లా నిశ్శేషంగా దహింప జెయ్యి ॥2॥

ఇది నూట ఎనిమిదవ సూక్తం

## సూక్తం - 109

**ఋషి. బాదరాయణి, దేవతలు.** మంత్రపాఠంలలో పేర్కొన్న అగ్ని మొదలగు వారు ॥ ఛందస్సు: 1 విరాట్ పురస్తాద్ బృహతీ, 2,3,5,6 త్రిష్టుప్ ॥ 4,7 **అనుష్టుప్** ॥ మంత్రములు ॥ 7 ॥

**వినియోగం:-** ద్యూతజయ కర్మలో ఈ ఏడు మంత్రాలలో పెరుగు, తేనెలో మూడు రాత్రులు నానబెట్టిన పాచికలను అభిమంత్రించి జూద మాడాలి. అగ్న్యాధానంలో మొదటి మంత్రంతో ఘృతంతో తడి పిన పాచికలను అధ్వర్యుని కివ్వాలి. చివరినాలుగు మంత్రాలతో కూడా అట్లే చేయాలి

మంత్రము

ఇద ముగ్రాయ బభ్రవే నమో యో అక్షేషు తనూవశీ ।
ఘృతేన కలిం శిక్షామి స నో మృడాతీదృశే ॥ 1 ॥

పదము

ఇదమ్ । ఉ॒గ్రాయ॑ । బ॒భ్రవే॑ । నమః॑ । యః । అ॒క్షేషు॑ ।
తనూ౭వశీ ।

ఘృతేన॑ । కలి॑మ్ । శిక్షా॑మి । సః । నః॑ । మృ॒డా॒తి॒ । ఈదృశే॑ ॥1॥

అనువాదం

ఉగ్రుడు, బభ్రువర్ణుడు ద్యూతజయకారి అయి,
పాచికలను తనకు స్వేచ్ఛానువర్తులుగా చేసికొన్న
దేవునకు ఇదే నమస్కారం
మంత్రాభిమంత్రితమైన ఘృతంతో కలిని
(పరాజయ హేతువైన పంచసంఖ్యాయుక్తమైన
అక్షపతన విశేషమైన అయమును) తాడనం చేస్తున్నాను
నేను పరాజితుడను కాను.
ఇతరులను పరాజితులను చేస్తాను
నా నమస్కారానికి పాత్రుడైన
అక్షద్యూత దేవత అయిన బభ్రువు
మాకు సుఖము చేకూర్చు గాక! ॥ 1 ॥

మంత్రము :

ఘృ॒తమ॑ప్సరాభ్యో వహ॒ త్వమ॑గ్నే
పాం॒సూన॒క్షేభ్యః॒ సిక॑తా అ॒పశ్చ॑ ।
య॒థా॒భా॒గం హ॒వ్యదా॑తిం జుషా॒ణా
మద॑న్తి దే॒వా ఉ॒భయా॑ని హ॒వ్యా ॥ 2 ॥

పదము

ఘృతమ్ । అప్సరాభ్యః । వహ । త్వమ్ । అగ్నే ।

పాంసూన్ । అక్షేభ్యః । సికతాః । అపః । చ ।

యథా౽భాగమ్ । హవ్య౽దాతిమ్ । జుషాణాః ।

మదన్తి । దేవాః । ఉభయాని । హవ్యా ॥ 2 ॥

అనువాదం

ఓ అగ్నీ ! అప్సరసలకై అక్షాభ్యంజన
సాధనమైన ఆజ్యాన్ని కొనిపో
జూదంలో మాకు ప్రతిపక్షంలో నున్న వారిపై
సూక్ష్మములైన బూడిద కణములు,
ఇసుక, ఉదకముల పడునట్లు చెయ్యి
ఆయా భాగానుసారంగా హవ్యాన్ని సేవిస్తున్న ఇంద్రాదులు
శ్రౌతస్మార్త కర్మలనే రెండు విధాలైన
హవ్యములతో తృప్తు లగుదురు గాక!
ఆ దేవతలు కూడా జూదంలో మాకు జయము నిత్తురుగాక!
॥ 2 ॥

మంత్రము

అప్సరసః సధమాదం మదన్తి

హవిర్ధానమన్తరా సూర్యం చ ।

తా మే హస్తౌ సం సృజన్తు ఘృతేన

సపత్నం మే కితవం రన్ధయన్తు ॥ 3 ॥

పదము

అప్సరసః । సధ౽మాదమ్ ॥ మద న్తి ।

హవిః౽ధానమ్ । అ న్తరా । సూర్యమ్ । చ ।

తాః । మే । హస్తౌ । సమ్ । సృజన్తు । ఘృతేన ।

స౽పత్నమ్ । మే । కితవమ్ । రన్ధయన్తు ॥ 3 ॥

అనువాదం.

ద్యూతక్రియా దేవతలు కలిసి మాదకతను కల్పిస్తున్నారు.
హవిస్సును సహమదనంగా చేస్తున్నారు
హవిర్ధానమైన భూలోకమును, సూర్యుని
ద్యులోకాన్ని, వాటి మధ్యనున్న అంతరిక్షలోకాన్ని
మాదకతతో నింపు తున్నారు.
ఆ అప్సరసలు పాచికలాడే మా చేతులను
ఘృతం వలె సారభూతమైన ఫలంతో
సంయోగింప జేతురుగాక!
ప్రతిదీవ్య మానుడైన కితవుని నాకు వశం చేయుదురుగాక! ॥3॥

మంత్రము.

ఆదినవం ప్రతిదీవ్నే ఘృతేనాస్మాం అభి క్షర ।

వృక్షమివాశన్యా జహి యో అస్మాన్ ప్రతిదీవ్యతి ॥ 4 ॥

పదము

ఆదినవమ్ । ప్రతి౽దీవ్నే । ఘృతేన । అస్మాన్ । అభి । క్షర ।

వృక్షమ్౽ఇవ । అశన్యా । జహి । యః । అస్మాన్ ।

ప్రతి౽దీవ్యతి ॥ 4 ॥

**అనువాదం.**

ప్రతి కితవుని జయించుటకు
పాచికలతో ఆదేవనం చేస్తున్నాను.
మమ్ములను ఘృతంతో సంయోగింప జెయ్యి
ఏ కితవుడైతే మమ్ములను జయించుటకు
జూదమాడుచున్నాడో, అతనిని ఎండిన చెట్టును
పిడుగు వలె తిరస్కరించు. ॥ 4 ॥

**మంత్రము**

యో నో ద్యువే ధనమిదం చకార
యో అక్షాణాం గ్లహనం శేషణం చ ।
స నో దేవో హవిరిదం జుషాణో
గన్ధర్వేభిః సధమాదం మదేమ ॥ 5 ॥

**పదము.**

యః । నః । ద్యువే । ధనమ్ । ఇదమ్ । చకార ।
యః । అక్షాణామ్ । గ్లహనమ్ । శేషణమ్ । చ ।
సః । నః । దేవః । హవిః । ఇదమ్ । జుషాణః ।
గన్ధర్వేభిః । సధఽమాదమ్ । మదేమ ॥ 5 ॥

**అనువాదం:**

ఏ దేవుడు మాకు జూదానికై
ప్రతి కితవుని ధనాన్ని సంపాదించి పెట్టినాడో,
ఏ దేవుడు పరకీయములైన పాచికలను

తన పాచికలతో స్వాధీనం చేసుకుంటున్నాడో,
ఆ దేవుడు మా ఈ హవిస్సును సేవించుగాక!
మేము కూడా గంధర్వులతో కలిసి
హవిస్సును అనుభవిస్తున్నవారమై మత్తిల్లుతున్నాము. ॥ 5 ॥

మంత్రము

సంవసవ ఇతి వో నామధేయ-
ముగ్రంపశ్యా రాష్ట్రభృతో హ్యక్షాః ।
తేభ్యో వ ఇన్దవో హవిషా విధేమ
వయం స్యామ పతయో రయీణామ్ ॥ 6 ॥

పదము :

సమ్ఽవసవః । ఇతి । వః । నామఽధేయమ్ ।
ఉగ్రమ్ఽపశ్యాః । రాష్ట్రఽభృతః । హి । అక్షాః ।
తేభ్యః । వః । ఇన్దవః । హవిషా । విధేమ ।
వయమ్ । స్యామ । పతయః । రయీణామ్ ॥ 6 ॥

అనువాదం :

ఓ గంధర్వులారా! మీరు సంప్రాప్తధను లగుట వలన
మీకు సంవసువులనే పేరున్నది
ఉగ్రం పశ్యలు, రాష్ట్రభృతులు అను పేర్లు గల
గంధర్వాప్సరసలకై మేము
సోమోపలక్షిత హవిర్యుక్తులమై పరిచరిస్తున్నాము

ఆ తరువాత మేము దీప్యమానులమై
ధనములకు స్వాములమవుతున్నాము ॥ 6 ॥

మంత్రము

దేవాన్ యన్నాధితో హువే బ్రహ్మచర్యం యదూషిమ ।
అక్షాన్ యద్ బభ్రూనాలభే తే నో మృడన్త్వీదృశే ॥ 7 ॥

పదము 1

దేవాన్ । యత్ । నాథితః । హువే । బ్రహ్మఽచర్యమ్ । యత్ ।
ఊషిమ ।
అక్షాన్ । యత్ । బభ్రూన్ । ఆఽలభే । తే । నః । మృడన్తు ।
ఈదృశే ॥ 7 ॥

అనువాదం

ఉపతప్తుడనై దేవతలను ధనలాభార్థం ఆహ్వానిస్తున్నాను.
బ్రహ్మచర్యవ్రతాన్ని పాలిస్తున్నాను.
బభ్రువర్ణములైన పాచికలను
సేవించుటకై స్పృశిస్తున్నాను
అందువలన దేవాదులు ద్యూతజయఫలం
చేకూర్చి మమ్ము సుఖపెట్టుదురు గాక! ॥ 7 ॥

ఇది నూట తొమ్మిదవ సూక్తం

## సూక్తం - 110

ఋషి. భృగువు ॥ దేవతలు, ఇంద్రాగ్నులు ॥ ఛందస్సు 1 గాయత్రీ ; 2 త్రిష్టుప్
3 అనుష్టుప్ ; మంత్రములు ॥ 3 ॥

వినియోగం .- పరసేనా జయార్థం మొదటి రెండు మంత్రాలతో నూతన రథాన్ని అభిమంత్రించి సారథితోపాటు రాజును ఆరోహింప జేయాలి. సర్వఫలకాముడు ఈ మూడు మంత్రాలతో ఇంద్రాగ్నులను యజించాలి. లేదా ఉపతిష్ఠానం చేయాలి. ఆగ్రయణేష్టిలో మొదటి మంత్రంతో అగ్నేన్ద్రపురోడాశయాగాన్ని అనుమంత్రిస్తారు.

మంత్రము

అగ్న ఇన్ద్రశ్చ దాశుషే హతో వృత్రాణ్యప్రతి ।
ఉభా హి వృత్రహన్తమా ॥ 1 ॥

పదము

అగ్నే । ఇన్ద్రః । దాశుషే । హతః । వృత్రాణి । అప్రతి ।
ఉభా । హి । వృత్రహన్ऽతమా ॥ 1 ॥

అనువాదం

ఓ అగ్నీ! ఇంద్రా! మీరు హవిర్దానం చేస్తున్న యజమానికి శత్రురూపములైన దురితాలు నిశ్శేషా లగుగాక!
అగ్నీంద్రులు ఉభయులు వృత్రహంతకులై అతిశయిస్తున్నారు ॥ 1 ॥

మంత్రము

యాభ్యా మజయ న్త్స్వ1రగ్ర ఏవ
యా వా త స్థ తు ర్భువనాని విశ్వా ।
ప్ర చర్షణీ వృషణా వజ్రబాహూ
అగ్నిమిన్ద్రం వృత్రహణా హువేऽహమ్ ॥ 2 ॥

పదము.

యాభ్యామ్ । అజయన్ । స్వ౨ః । అగ్రే । ఏవ ।

యౌ । ఆ౨తస్థతుః । భువనాని । విశ్వా ।

ప్ర । చర్షణీఇతి । వృషణా । వజ్రబాహూఇతి । వజ్ర౨బాహూ ।

అగ్నిమ్ । ఇన్ద్రమ్ । వృత్ర౨హనా । హువే । అహమ్ ॥ 2 ॥

**అనువాదం :**

పూర్వం ఏ అగ్నీంద్రాదుల వలన
దేవతలు స్వర్గాన్ని స్వాధీనం చేసుకొన్నారో,
ఏ అగ్నీంద్రులు విశ్వభువనాలను స్వమహిమతో
ఆక్రమించినారో, ఎవరు ప్రకృష్ట ద్రష్టలై
అభిమత ఫలములను వర్షిస్తున్నారో,
వజ్రపాణులు, వృత్రహంతలు అయిన అట్టి
అగ్నీంద్రులను జయకాముడనైన నేను ఆహ్వానిస్తున్నాను.
॥ 2 ॥

మంత్రము.

ఉప త్వా దేవో అగ్రభీచ్చమసేన బృహస్పతిః ।

ఇన్ద్ర గిర్భిర్న ఆ విశ యజమానాయ సున్వతే ॥ 3 ॥

పదము.

ఉప । త్వా । దేవః । అగ్రభీత్ । చమసేన । బృహస్పతిః ।

ఇన్ద్ర । గిః౨భిః । నః । ఆ । విశ । యజమానాయ । సున్వతే ॥ 3 ॥

అనువాదం

ఓ ఇంద్రా! నిన్ను బృహస్పతి అనే దేవుడు
సోమ పాత్రతో గ్రహించినాడు (స్వాధీనం చేసుకున్నాడు.)
అందువలన ఓ ఇంద్రా! సోమప్రదాత అయిన యజమానికై
ప్రయోక్తలమైన మా స్తోత్రపారాలు వింటూ రమ్ము ॥ 3 ॥

ఇది నూట పదవ సూక్తం

## సూక్తం-111

ఋషి బ్రహ్మ॥ దేవత: వృషభము॥ ఛందస్సు పరాబృహతీ త్రిష్టుప్॥
మంత్రము: ॥ 3 ॥

వినియోగం - వృషోత్సర్గంలో దీనితో వృషభాన్ని అభిమంత్రించి వదలి పెట్టాలి. అగ్నిష్టోమంలో, ప్రాతః సవనంలో సోమసహితమైన పూతభృత్పాత్రను దీనితో బ్రహ్మ అనుమంత్రించాలి.

మంత్రము

ఇన్ద్రస్య కుక్షిరసి సోమధాన ఆత్మా
దేవానా ముత మానుషాణామ్ ।
ఇహ ప్రజా జనయ యాస్త ఆసు
యా అన్యత్రేహ తాస్తే రమన్తామ్ ॥ 1 ॥

పదము

ఇన్ద్రస్య । కుక్షిః । అసి । సోమఽధానః ।
ఆత్మా । దేవానామ్ । ఉత । మానుషాణామ్ ।
ఇహ । ప్రఽజాః । జనయ । యాః । తే । ఆసు ।

యాః । అన్యత్ర । ఇహ । తాః । తే । రమన్తామ్ ॥ 1 ॥

**అనువాదం**

ఓ వృషభా! నీవు సోమధానుడవై
ఇంద్రునకు ఉదరభూతుడ వవుతున్నావు
దేవతలకు, మానవులకు ఆత్మవవుతున్నావు.
ఈ లోకంలో పుత్రాదులను ఉత్పాదింప జెయ్యి
పురోవర్తులైన ఈ గోవులలో నీకై ఏవైతే ఉన్నవో,
వేరొకచోట ఏవైతే ఉన్నవో, అవన్నీ
ఈ లోకంలో నీకై సుఖంగా విహరించు గాక! ॥ 1 ॥

ఇది నూట పదకొండవ సూక్తం

## సూక్తం - 112

**ఋషిః** బ్రహ్మ ॥ దేవత . అపస్సు ॥ ఛందస్సు : 1 భురిగనుష్టుప్ . 2 అనుష్టుప్ . మంత్రములు ॥ 2 ॥

**వినియోగం** -- సర్వవ్యాధి చికిత్సలో ఈ రెండు మంత్రాలతో ఉదకఘటాన్ని అభిమంత్రించి, వ్యాధితుని కీళ్ళలో ముంజపాశములతో బంధించి దర్భముష్టులతో తడపాలి మొదటి మంత్రం అంహోలింగ గణంలోనిది గనుక దీనికి అగణప్రయుక్త వినియోగం. వివాహంలో దీనితో అజ్యాన్ని హోమంచేసి వరవధువుల శిరస్సులపై సంపాతములను వేయాలి. అదే కర్మలో దీనితో వరవధువుల అంజలులను ఉదపాత్రోదకంతో నింపాలి

**మంత్రము .**

శుమ్భనీ ద్యావాపృథివీ అన్తిసుమ్నే మహివ్రతే ।

ఆపః సప్త సుస్రువుర్దేవీస్తా నో ముఞ్చన్త్వంహసః ॥ 1 ॥

పదము

శుమ్భునీ ఇతి। ద్యావాపృథివీఇతి । అన్తిసుమ్నేఇత్యన్తిఽసుమ్నే మహివ్రతేఇతి మహిఽవ్రతే । అపః । సప్త । సుస్రువుః । దేవీః । తాః । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 1 ॥

మంత్రము

సర్వశోభాకారులైన ద్యావాపృథువులు
తమ మధ్యంలో అజ్ఞానావృతులైన జనులను,
చేతనాచేతనములను ధరిస్తూ
మహా వ్రతమును పాటిస్తున్నవి.
సప్త సంఖ్యాకులైన, దేవీరూపులైన
ఉదకములు స్రవిస్తున్నవి.
ఆ ద్యావాపృథువులు, ఉదకములు
మమ్ములను పాపంనుంచి విమోచనం చెందితురుగాక! ॥ 1 ॥

మంత్రము.

ముఞ్చన్తు మా శపథ్యాదథో వరుణ్యాఽదుత ।
అథో యమస్య షడ్వీశాద్ విశ్వస్మాద్ దేవకిల్బిషాత్ ॥ 2 ॥

పదము :

ముఞ్చన్తు । మా । శపథ్యాఽత్ । అథోఇతి । వరుణ్యాత్ । ఉత । అథోఇతి । యమస్య । షడ్వీశాత్ । విశ్వస్మాత్ । దేవఽకిల్బిషాత్ ॥ 2 ॥

**అనువాదం :**

నన్ను బ్రాహ్మణశాపం నుంచి
ఓషధులు విమోచనం చెందించు గాక!
మజీన్ని అబద్ధమాడినందు వల్ల కలిగే
పాపం నుంచి విమోచనం చేయుగాక!
అంతక సంబంధి అయిన పాదబంధన
పాశం నుంచి విడిపించు గాక!
ఇంతెందుకు? సర్వదేవకృత పాపం నుంచి
నన్ను విముక్తుని చేయుగాక! ॥ 2 ॥

ఇది నూట పన్నెండవ సూక్తం

## సూక్తం – 113

**ఋషి. భార్గవుడు ॥ దేవత, తృష్టికా ॥ ఛందస్సు 1 విరాడనుష్టుప్. 2 శంకుమతీ చతుష్పదా భురిగుష్ణిక్ ॥ మంత్రములు ॥ 2 ॥**

**వినియోగం – స్త్రీ పురుషుల పరస్పర విద్వేషణార్థం బాణావర్ణ్యమనే ఓషధి చూర్ణమును ఎఱ్ఱని (లోహితవర్ణముగల) మేక పాలబిందువుతో కలిపి ఈ రెండు మంత్రాలతో అభిమంత్రించి శయ్యపై చల్లాలి.**

**మంత్రము :**

**తృష్టికే తృష్టవన్దన ఉదమూం ఛిన్ధి తృష్టికే ।**
**యథా కృతద్విష్టాఽసోఽముష్మై శేప్యావతే ॥ 1 ॥**

**పదము**

**తృష్టికే । తృష్టఽవన్దనే । ఉత్ । అమూమ్ । ఛిన్ధి । తృష్టికే ।**
**యథా । కృతఽద్విష్టా । అసః । అముష్మై । శేప్యాఽవతే ॥ 1 ॥**

అనువాదం

ఓ దాహజనకమైన *బాణపర్ణీ! ఓషధీ!
వందన నామకమైన బదనికా! నీవు
ఈ స్త్రీని పురుషుని నుంచి బలాత్కారంగా వేరుచెయ్యి
ఓ తృష్టికా! బాణపర్ణీ! కోపజనకమైన ఓ ఓషధీ!
ఈ పురుషునిలో ద్వేషాన్ని రగుల్చు ॥ 1 ॥

మంత్రము।

తృష్టాసి తృష్టికా విషా విషాతక్యఽసి ।
పరివృక్తా యథాసస్యృషభస్య వశేవ ॥ 2 ॥

పదము

తృష్టా । అసి । తృషికా । విషా । విషాతకీ । అసి ।
పరిఽవృక్తా । యథా । అససి । ఋషభస్య । వశాఽఇవ ॥ 2 ॥

అనువాదం

ఓ ఓషధీ! తృష్టికా నివు
దాహజనక స్వభావం కలదానవు.
అలాగే విషస్వరూపమైన దానవు.
పరిత్యక్తవైన నీవు తగుల గూడని దానవు.
వృషభమునకు గొడ్డుగోవు వలె పరివర్జనీయవు ॥ 2 ॥

ఇది పదమూడవ సూక్తం

---

* బాణపర్ణి, బాణాపర్ణి అని రూపాంతరం. ఇది ఒక ఓషధి అని మాత్రమే సాయణాదులు వ్రాశారు ఏమిటో గుర్తించలేదు. తెలుగులో తెలియదు.

# సూక్తం - 114

ఋషిః భార్గవుడు॥ దేవతలు, అగ్నీ సోములు॥ ఛందస్సు: అనుష్టుప్॥
మంత్రములు ॥ 2 ॥

వినియోగం:- దౌర్భాగ్య కరణార్థం మొదటి మంత్రంతో మంత్రోక్త అవయవములను స్పృశిస్తూ అభిమంత్రించాలి లేదా విద్వేషిని చూచి జపించాలి. రక్షోగ్రహాదుల చికిత్సలో రెండవ మంత్రంతో అజ్య సమిత్పురోడాశాది శమ్యాల్యంతముదైన పదమూడు ద్రవ్యములలో ఏదో ఒకదానివి హోమంచేయాలి.

మంత్రము

ఆ తే దదే వక్షణాభ్య ఆ తేఽహం హృదయాద్ దదే ।
ఆ తే ముఖస్య సఙ్కాశాత్ సర్వం తే వర్చ ఆ దదే ॥1॥

పదము.

ఆ । తే । దదే । వక్షణాభ్యః । ఆ । తే । అహమ్ । హృదయాత్ । దదే ।
ఆ । తే । ముఖస్య । సమ్ఽకాశాత్ । సర్వమ్ । తే । వర్చః । ఆ । దదే ॥ 1 ॥

అనువాదం

ఓ స్త్రీ! నీ అంగములనుంచి వర్చస్సు నపహరిస్తున్నాను.
అలాగే ఓ స్త్రీ! నీ హృదయంనుంచి తేజస్సునపహరిస్తున్నాను
అలాగే నీ ముఖం నుంచి వర్చస్సు నపహరిస్తున్నాను
నీ సర్వావయవముల నుండి వర్చస్సు నపహరిస్తున్నాను. ॥1॥

మంత్రము.

ప్రేతో యన్తు వ్యాఽధ్యః ప్రానుధ్యాః ప్రో · అశస్తయః ।
అగ్నీ రక్షస్వినీర్హన్తు సోమో హన్తు దురస్యతీః ॥ 2 ॥

పదము

ప్ర । ఇతః । యన్తు । విఽఅధ్యః । ప్ర । అనుఽధ్యాః । ప్రోఇతి।
అశస్తయః ।
అగ్నిః । రక్షస్వినీః । హన్తు । సోమః । హన్తు । దురస్యతీః ॥ 2 ॥

అనువాదం

వివిధ మనోవ్యథలు ఈ పురుషుని వదలి వెడలిపోవుగాక!
అలాగే రక్షోగ్రహాది విషయములు అనుగతములగు గాక!
పర నిందలు దూరమగుగాక!
అగ్ని దేవుడు రక్షోవతులైన పిశాచులను వినాశం చేయుగాక!
సోముడు పరహింసన కాములను హింసించుగాక! ॥ 2 ॥

ఇది నూట పదునాల్గవ సూక్తం

## సూక్తం - 115

ఋషులు: అథర్వాంగిరసులు॥ దేవతలు: సవిత, జాతవేదులు॥ ఛందస్సు: 1,4 అనుష్టుప్, 2,3 త్రిష్టుప్: మంత్రములు: ॥ 4 ॥

వినియోగం.- నైరృతి కర్మలలో నాల్గవ కర్మలో కాకి కాలికి పురోడాశంతో పాటు లోహకంటకాన్ని కట్టి మొదటి మంత్రంతో ఆ కాకిని వదలి పెట్టాలి. ఐదవ నైరృతి కర్మలో సూత్రోక్త లక్షణములు గల వస్త్రములతో పరిధానాచ్ఛాదన శిరోవేష్టనములను చేసి కర్త రెండవ మంత్రంతో లోహఖండంతో సహా తలపాగను నీటిలో వదలవలెను. మూడవ మంత్రంతో ఆచ్ఛాదనవస్త్రాన్ని లోహ

ఖండంతోబాటు వంచను నీటిలో వదలవలెను. నాల్గవ మంత్రంతో లోహంతో బాటు నీటిలో వదలవలెను కామ్య కర్మలలో విఘ్నరూపమైన దుఃస్వప్నదర్శన దోషపరిహారార్థం ఈ నాలుగు మంత్రాలతో దుస్స్వప్న దర్శనాన్ని అభిషేకించాలి

మంత్రము :

ప్ర పతేతః పాపి లక్ష్మి నశ్యేతః ప్రాముతః పత
అయస్మయేనాఙ్కేన ద్విషతే త్వా సజామసి ॥ 1 ॥

పదము

ప్ర । పత । ఇతః । పాపి । లక్ష్మి । నశ్య । ఇతః । ప్ర । అముతః పత ।
అయస్మయేన । అఙ్కేన । ద్విషతే । త్వా । అ । సజామసి ॥ 1 ॥

అనువాదం

ఓ దౌర్భాగ్యమా! ఇక్కడ నుంచి వెళ్ళిపో
ఈ ప్రదేశంలో కనుపించకు.
అతి దూరదేశం నుంచి కూడా వెళ్ళిపో.
ఓ అలక్ష్మి! అతిదూరదేశం వెళ్ళిన నిన్ను
మా విరోధికై అయోమయమైన కంటకంతో బంధిస్తున్నాము. ॥ 1 ॥

మంత్రము,

యా మా లక్ష్మీః పతయాలూరజుష్టాఽభిచస్కన్ద వన్దనేవ వృక్షమ్ ।
అన్యత్రాస్మత్ సవితస్తామితో ధా

హిరణ్యహస్తో వసు నో రరాణః ॥ 2 ॥

పదము

యా । మా । లక్ష్మీః । పతయాలూః । అజుష్టా ।

అభిఽచస్కన్ద । వన్దనాఽఇవ । వృక్షమ్ ।

అన్యత్ర । అస్మత్ । సవితః । తామ్ । ఇతః । ధాః ।

హిరణ్యఽహస్తః । వసు । నః । రరాణః ॥ 2 ॥

అనువాదం

పతనం చెందించే దౌర్భాగ్యం అంతటా వ్యాపించి ఉన్నది.
బదనిక వృక్షమంతటినీ అల్లుకొన్నట్లు
ఆ దురదృష్టదేవత నన్ను శోషింపజేసినది
ఓ సర్వప్రేరకుడవైన దేవా!
ఆ దౌర్భాగ్యాన్ని మా నుంచి
ఇంకొక చోటికి కొనిపో
హిరణ్యహస్తుడు మాకు ధనమును ఇచ్చుగాక! ॥ 2 ॥

మంత్రము

ఏకశతం లక్ష్మ్యో౩ మర్త్యస్య సాకం

తన్వాఽ జనుషోఽధి జాతాః ।

తాసాం పాపిష్ఠా నిరితః ప్ర హిణ్మః ।

శివాః అస్మభ్యం జాతవేదో ని యచ్ఛ ॥ 3 ॥

పదము :

ఏక౽శతమ్ । లక్ష్మ్య౽ః । మర్త్యస్య । సాకమ్ ।

తన్వా౽ । జనుషః । అధి । జాతాః ।

తాసామ్ । పాపిష్ఠాః । నిః । ఇతః । ప్ర । హిణ్మః ।

శివాః । అస్మభ్యమ్ । జాత౽వేదః । ని । యచ్ఛ ॥ 3 ॥

అనువాదం

నూటొక్క లక్ష్ములు మర్త్యశరీరంతో పాటు
పుట్టుకతోనే ఉత్పన్నములైనవి
వానిమధ్యలో పాపిష్ఠులైన
దౌర్భాగ్య లక్ష్ములను ఇక్కడ నుంచి
నిశ్శేషంగా తొలగిస్తున్నాము
ఓ జాతవేదా! మంగళకారిణులైన వానినే
మాకు ప్రదానం చెయ్యి ॥ 3 ॥

మంత్రము

ఏతా ఏనా వ్యాకరం ఖిలే గా విష్ఠితా ఇవ ।

రమన్తాం పుణ్యా లక్ష్మీర్యాః పాపీస్తా అనీనశమ్ ॥ 4 ॥

పదము

ఏతాః । ఏనాః । వి౽అకరమ్ । ఖిలే । గాః । విస్థితాః౽ఇవ ।

రమన్తామ్ । పుణ్యాః । లక్ష్మీః । యాః । పాపీః । తాః ।

అనీనశమ్ ॥ 4 ॥

**అనువాదం.**

ఈ సిరిష్టములైన నూటొక్క లక్ష్ములను
రెండుగా విభజిస్తున్నాను.
గోవులన్నీ ఒక చోట నిలిచినట్టుగా
కల్యాణ లక్ష్ములు నాయందు హాయిగా నివసించుగాక!
వారిలో పాపకారిణులైన దుర్లక్ష్ములు నశించు గాక! ॥ 4 ॥

ఇది నూట పదునైదవ సూక్తం

## సూక్తం-116

**ఋషులు**· అథర్వాంగిరసులు॥ దేవత చంద్రుడు (?జ్వరము)॥ ఛందస్సు. 1 పరోష్ణిక్, 2 ద్విపదాఽఽర్చ్యనుష్టుప్ (?ఆర్చ్యుష్ణిక్) ఏకావసానా॥ మంత్రములు: ॥ 2 ॥

**వినియోగం** - సర్వజ్వర చికిత్సలో సూత్రోక్త ప్రకారంగా మండూకాన్ని బంధించిరోగి మంచము క్రింద ఉంచి ఆ పైనఉన్న వ్యాధితుని ఈ రెండు మంత్రములతో అభిమంత్రించిన ఉదకంతో తడపాలి.

మంత్రము

నమో రూరాయ చ్యవనాయ నోదనాయ ధృష్ణవే।
నమః శీతాయ పూర్వకామకృత్వనే ॥ 1 ॥

పదము.

నమః। రూరాయ। చ్యవనాయ। నోదనాయ। ధృష్ణవే।
నమః। శీతాయ। పూర్వకామఽకృత్వనే ॥ 1 ॥

అనువాదం.

ఒంటికి చెమట పట్టించి
వణికించే ఉష్ణజ్వరమునకు నమస్కారం

అలాగే పూర్వాభిలాషలను ఛేదించే
శీత జ్వరానికి నమస్కారం ॥ 1 ॥

మంత్రము:

**యో అన్యేద్యురుభయద్యురభ్యేతీమం**

**మణ్డూకమభ్యేఽత్వవ్రతః ॥ 2 ॥**

పదము.

**యః । అన్యేద్యుః । ఉభయఽద్యుః । అభిఽఏతి । ఇమమ్ ।**

**మణ్డూకమ్ । అభి । ఏతు । అవ్రతః ॥ 2 ॥**

అనువాదం:

ఏ జ్వరం రోజు విడిచి రోజు ఈ పురుషుని పీడిస్తుందో,
ఏ జ్వరం రెండు రోజులు విడిచి
వచ్చి ఈ పురుషుని బాధిస్తుందో,
అనియత కాలంలో వచ్చి బాధించే
ఆ జ్వరం మండూకాన్ని ఆవహించు గాక! ॥ 2 ॥

ఇది నూట పదునారవ సూక్తం

## సూక్తం - 117

ఋషులు, అథర్వాంగిరసులు॥ దేవత, ఇంద్రుడు॥ ఛందస్సు: పథ్యాబృహతీ॥
మంత్రము. ॥ 1 ॥

వినియోగం:- స్వస్త్యయనకాముడు ఈ రెండు మంత్రాలతో ఇంద్రుని యాగం కానీ లేదా ఉపస్థానం కానీ చెయ్యాలి. శవసంస్కారానంతరం కర్త ప్రతిరోజు స్వస్త్యయనార్థం 'ఆ మన్ద్రైః' అనే మంత్రాన్ని జపించాలి అగ్నిష్టోమంలో దీనితో హారియోజన గ్రహహోమాను మంత్రణం చెయ్యాలి.

మంత్రము

ఆ మన్ద్రైరిన్ద్ర హరిభిర్యాహి మయూర రోమభిః ।
మా త్వా కేచిద్ వి యమన్ విం న
పాశినోఽతి ధన్వేవ తాం ఇహి ॥ 1 ॥

పదము

ఆ । మన్ద్రైః । ఇన్ద్ర । హరిఽభిః । యాహి । మయూరరోమఽభిః
మా । త్వా । కే । చిత్ । వి । యమన్ । విమ్ । న ।
పాశినః । అతి । ధన్వఽఇవ । తాన్ । ఇహి ॥ 1 ॥

అనువాదం

ఓ ఇంద్రా! మదశీలములైన మయూర రోమములతో
శ్యామ వర్ణములైన అశ్వములతో రమ్ము
ఓ ఇంద్రా! నిన్ను కొందరు స్తోతలు
స్తుతులతో లోగొనకుందురు గాక!
వ్యాధులు పాశములతో వలె
స్తోత్రములతో వారు నిన్ను బంధింపకుందురు గాక!
ఇతర స్తోతలను అతిక్రమించి ఇక్కడకురా
ఎడారిలోని బాటసారులు ఏ విధంగా
త్వర త్వరగా వెళ్ళిపోతారో,
అలా నాకు వ్యతిరిక్తులైన
శత్రువులను వదలి నా వద్దకురా. ॥ 1 ॥

ఇది నూట పదునేడవ సూక్తం

## సూక్తం-118

ఋషులు : అథర్వాంగిరసులు ॥ దేవతలు సోముడు మొదలగువారు ॥ ఛందస్సు. త్రిష్టుప్ ॥ మంత్రము : ॥ 1 ॥

వినియోగం :- పరసేనను భయపెట్టుటకై దీనితో కవచాన్ని అభిమంత్రించి దానిని ధరించుటకై రాజుకు ఇవ్వాలి. మహావ్రతంలో దుందుభి హననానంతరం దీనితో రాజును యుద్ధసన్నద్ధుని చెయ్యాలి.

మంత్రము

మర్మాణి తే వర్మణా ఛాదయామి
సోమస్త్వా రాజాఽమృతేనాను వస్తామ్ ।
ఉరోర్వరీయో వరుణస్తే కృణోతు
జయన్తం త్వాఽను దేవా మదన్తు ॥ 1 ॥

పదము.

మర్మాణి । తే । వర్మణా । ఛాదయామి । సోమః ।
త్వా । రాజా । అమృతేన । అను । వస్తామ్ ।
ఉరోః । వరీయః । వరుణః । తే । కృణోతు ।
జయన్తమ్ । త్వా । అను । దేవాః । మదన్తు ॥ 1 ॥

అనువాదం :

జయకాముడవైన ఓ రాజా !
నీ ఆయువు పట్టులను కవచంతో కప్పివేస్తున్నాను.
రాజైన సోముడు నిన్ను

అవినాశమైన తేజస్సుతో ఆచ్ఛాదింప జేయుగాక!
అలాగే వరుణుడు నీకు
ఉరుతరమైన సుఖాన్ని కల్పించుగాక!
ఇంద్రాది దేవతలందరూ పరసేనను
భయపెట్టే నిన్ను ప్రోత్సహింతురు గాక! ॥ 1 ॥

ఇది పదవ అనువాకం

ఇది ఏడవ కాండ

